సునీత 290

# పరిచయం

'సునీత' ను అనువదించి ఆంధ్రపాఠకలోకానికి అందించ గలుగు ...దుకు మిక్కిలి ఆనందిస్తున్నాం. ఇది హిందీలో విఖ్యాత నవలా ...యిత శ్రీ జైనేంద్ర కుమార్ కృతి. ఒక ఉత్తమ కళాఖండంగా పేరొం... నవల. జైనేంద్రుని రచన లన్నిటిలోనూ ఒక అపూర్వత, క్రొత్త ...సు, విశిష్టకళాకుశలత ప్రస్ఫుటమౌతూ ఉంటాయి. 'సునీత' చదువుతూ ...టే — రచయిత తనకుతానై కథ చెపుతున్నట్టు అనిపించదు. ఒక ...శ్యకావ్యం తెరమీద చూస్తున్నట్టుగా ఉంటుంది. పాత్రల గుణగణాల్ని ...ంచిగాని, వారి మనః ప్రవృత్తులను గురించిగాని, జైనేంద్రుడు తనకు ...నై ఎక్కడా ఏమీ చెప్పడు. కాని అవి వారివారి మాటలద్వారా, ...తలద్వారా పాఠకుని మనస్సులో విస్ఫురితములౌతూ ఉంటాయి.

చెప్పదలచిన దంతా వాచ్యం చెయ్యకుండా, ముప్పాతిక మువ్వీసం వరకూ సూచ్యార్థంగా రచన సాగించడం ఒక గొప్ప నేర్పు. దీన్నే రచనా సంయమం అంటారు. ఇది సుప్రసిద్ధ బెంగాలీ రచయిత శరత్ బాబులో కనిపిస్తుంది. జైనేంద్రునిలోకూడా ఇది ఇంకొకపాలు ఎక్కువగానే ఉన్నట్టు అతని రచనలు చదివినమీదట గ్రహించగలుగుతాం. ఇంత రచనాసంయమంతో, ఒకవంక పాఠకుని మనస్సుకు పని కల్పిస్తూ, కథలో అభిరుచి అతనికి తగ్గిపోకుండా ఎప్పటికప్పుడు ఇకముందు ఏమిజరుగ నున్నది?— అనే ఉత్సుకత కల్పిస్తూ రచన సాగించటంలో జైనేంద్రునిది అందెవేసిన చెయ్యి. నవలారచనలో అతడు సిద్ధహస్తుడు.

ముఖ్యంగా ఉదాత్తమైన కథావస్తువును ఎన్నుకొనటంలోనే అతని ...భ సూచిత మౌతుంది. 'కథచెప్పటమే నా ప్రధానోద్దేశంకాదు' అని ...స్తావనలోనే చెప్పుకున్నాడు. 1920 లోనూ, 1930 లోనూ లేచిన స్వాతంత్ర్యోద్యమాలలో పాల్గొని కారాగారవాసంచేసిన దేశభక్తుడీయన. ...గా ...శ పరిస్థితులు, సామాజిక స్వరూపం ప్రత్యక్షంగా దర్శించి, వాటిని ...లో సంపూర్ణంగా జీర్ణించుకున్నాడు. మానవజాతి అభ్యుదయ ...ఎంతో హృదయావలోడన జరిగి, కొన్ని స్థిరనిర్ణయాలకు ... కూడాను. అందుచేత ఈయన లేఖిని ప్రసాదించే ...న జాతీయ సమస్య అంతర్వాహినిగా ఉండితీరుతుంది.

తె.సా 313
జైనేం-సు
1220

'సునీత' కేవలం ఒక నవల మాత్రమే కాదు. ఒక విధంగా అది మానవ చరిత్రే. ఒక్క 'సునీత' అన్నమాటేమిటి! ఆయన ఇతర రచనలు 'సుఖద' 'కల్యాణి' 'త్యాగపత్ర' మొదలైన వన్నీ కూడా అంతే.

రాజకీయరంగంలో గాంధీజీ ప్రతిపాదించిన అహింసాతత్వ విజయానికి జైనేంద్రుడు 'సునీత' లో ఒక కళాత్మకమైన సాహిత్యరూపం కల్పించాడు.

'సునీత' లో పాఠకునికి ఎన్నో మనోవైజ్ఞానికపు లోతులు దొరుకుతాయి. మొదటినుంచీ దేశసేవా నిమగ్నుడై, మృత్యు భయం ఏకోశానా లేని హరిప్రసన్నుడిలోని దమిత కామం, ఏవిధంగా - ఎన్ని వెల్లువలుగా - ఎంత తీవ్రంగా ఉబికి పైకి త్రోసికొనివచ్చిందో రచయిత చక్కగా చూపించాడు. ఒకవంక ఇల్లు, భర్త, సంసారం; మరోవంక దేశం, సమాజం; ఇదా? అదా? ఇటా? అటా? — కర్తవ్యం ఏమిటి? — అని ఒక తీవ్ర హృదయసంఘర్షణకు లోనై, నిరంతరాందోళితయైన సునీతపాత్ర ఎంతో హృదయంగమంగా చిత్రితమైంది.

ఈ నవల ఆంధ్రపాఠకులకు ఆదరపాత్రము కాగలదని మా విశ్వాసం. త్వరలోనే 'సుఖద' 'కల్యాణి' మొదలైన జైనేంద్రుని యితర రచనలను కూడా తమకు అందించగలమని ఆశిస్తున్నాము.

—ప్రకాశకులు



## ర చ యి త

జననం : 1905. ప్రారంభికవిద్యాప్రాప్తి, బ్రహ్మచర్యాశ్రమం—హస్తినాపురంలో (1911–18). ప్రైవేటు మెట్రిక్ 1919. కాశీవిశ్వ విద్యాలయంలో—1919–1920. సహాయనిరాకరణోద్యమంలో కాలేజీ పరిత్యాగం—1921. ప్రథమ కారాగారవాసం–1924. పునః కారాగారవాసాలు–1930–1932. ఆ తరువాత నిరుద్యోగం. తనను తాను శాశ్వత నిరుద్యోగినని చెప్పుకొనేవారు.

మొదటి కథలసంపుటి 'ఫాంసీ' (ఉరి) తో 1929 లో సాహిత్యరంగంలో అడుగు పెట్టారు. మొదటి నవల 'పరఖ్' ప్రచురణ—1930. మొదటి తాత్వికగ్రంథం 'జైనేంద్రుని అభిప్రాయాలు'—ప్రచురణ : 1937. సాహిత్యరంగంలో ఈయన ప్రవేశమువల్ల ఉద్భవించిన కలకలాన్ని గురించి కతిపయ విజ్ఞుల ఈ ఉద్ఘాటనలవల్ల ఊహించవచ్చు—

"నువు గోర్కీ...కోరుతున్నావా? భారత దేశంలో గోర్కీ కాగలిగినవారూ-అయినవారూ ఎవరైనా ఉన్నారా అంటే ఒక్క జైనేంద్రుడు మాత్రమే."

—ప్రేమ్‌చంద్.

"'జైనేంద్రుని అభిప్రాయాలు' చదువుతూ టాల్‌స్టాయ్ రచనలు చదువుతున్నంత—కాదు, ఇంకా చాల అధికంగా ఆనందానుభూతిని పొందాను నేను..."

—కిశోర్‌లాల్ మశ్రూవాలా.

"...హిందీ కథాసాహిత్య క్షేత్రంలో, ఇప్పుడు మనం రవీంద్రనాథ్ శరత్‌బాబులను జైనేంద్రునిలో ఒకే సారిగా పొందగలిగాము—తిరిగి పొందగలిగాము."

—మైథిలీ శరణ గుప్త.

# ప్రస్తావన

ఈ పుస్తకం పాఠకుని చేతిలో ఉండనేఉంది, అయినా పాఠకునితో నేరుగా నేను కొన్నివిషయాలు ప్రసంగించాలనుకున్నాను. ఎందుచేతనంటే, పాఠకునికి పుస్తకంలో నేను కనిపించనుగా మరి. అంటే దీనర్థం పుస్తకంలోని యే శబ్దంలోనూ నేను లేనేలేనని కాదు సుమీ. మొత్తం మీద పుస్తకంలోని ఏ యే పాత్రలద్వారా నేను పాఠకునికి లభ్యమాతూ ఉంటానో, ఆ యా స్థానలలో, ఆ యా పాత్రలకు అనురూపంగా నా రూపం వికృతమైపోతూ ఉంటుంది. వాటిని ముందుంచుకుని నేను మరుగైపోతూ ఉంటాను.

సృష్టి స్రష్టను మరుగుపరుస్తుంది. నేనుకూడా నాయీ పాత్రల వెనుకనే ఉన్నట్టు భావించండి; కాని సృష్టిమాత్రం స్రష్టనే వ్యక్తంచేస్తూ ఉంటుంది. మరి ఈ పుస్తకంకూడా నన్ను వ్యక్తం చేయడానికే తయారయింది. అయినప్పటికీ సృష్టే కనిపిస్తూ ఉంటుంది, స్రష్ట ఎక్కడ కనిపిస్తాడు?

కాని విధాతలో ఉన్నంత నిరపేక్ష నాలో ఎక్కడుంది? ఈపుస్తకంలోని వివిధపాత్రల ద్వారా నేనే మాట్లాడుతున్నా, నేరుగా పాఠకుని హృదయాన్ని చూరగొనాలనే అభిలాష నా మనసులో ఎలాగూ ఉంటుంది. పుస్తకంలో లీనమైఉన్న నన్ను పాఠకులు ఎలా భావించినా సరే. ఏ పాత్రలోనూ నేను లేకనూపోలేదు, ప్రతి పాత్ర ఒకదానికొకటి భిన్నమైనది కూడాను. వాళ్ళమాటలన్నీ నావే. అయినప్పటికీ యేమాటా నాదికాదు; ఎందుచేతనంటే—అవి నావెందుకవుతాయి—వాళ్ళవే.

పుస్తకం పూర్తయిన తర్వాత నిర్గుణ తత్వాన్ని గురించి పాఠకునితో కొంతసేపు తప్పకుండా ప్రసంగించాలనుకున్నాను. వాస్తవం చెప్పాలంటే చాలసేపు చర్చించాలనుకున్నాను. కాని మనస్సులోని ఉద్రేకం ఇప్పుడు శాంతించింది; ఇంక అధికంగా వ్రాయాలనే ఉత్సాహం కూడా చల్లబడింది.

పుస్తకంలో కథ నేను అధికంగా పెంచలేదు. అసలు కథ చెప్పడం నా ఉద్దేశ్యమే కాదు. అందుచేత ముగ్గురు నలుగురు వ్యక్తులతోనే నాపని గడిచిపోయింది. ఈ పెద్ద ప్రపంచంలోని ఒక చిన్నప్రదేశంలో మనం మన చిత్రాన్ని నిర్మించుకోనూవచ్చు; అందులో మనం సత్యసందర్శనం పొందనూవచ్చు; దానిద్వారానే సత్యాన్ని ప్రదర్శించనూ వచ్చుకూడా. బ్రహ్మాండంలో ఉన్నదే పిండాండంలో కూడా ఉంది. అందుచేత నా చిత్రానికి పెద్ద కాన్వాసు అవసరం నాకు కనిపించలేదు. కొద్దిలోనే సమగ్రంగా ఎందుకు ప్రదర్శించలేము ?

7, దరియాగంజ్
ఢిల్లీ 16–6–'35

మీ,
—జైనేంద్ర కుమార్.

# మ నీ త్ర

C. P. BROWN
MEMORIAL LIBRARY
Acc. No ........
Date .. 1920 ...
CUDDAPAH.

## 1

శ్రీకాంతుడు బి. ఏ. ప్యాసైనాడు. ఎల్. ఎల్. బి. పూర్తిచేశాడు. వివాహం చేసుకొన్నాడు. బల్లకట్టి ప్రాక్టీసు ఆరంభించాడు. కిందామీదాపడుతూ ప్రాక్టీసు సాగుతూనే ఉంది. కాని హరిప్రసన్న బాబు తరుచు జ్ఞాపకంవస్తూఉంటాడు. అతని స్మృతి తన ప్రాక్టీసుకు కాస్త భంగకారిగానే ఉంది.

హరిప్రసన్నుడు ఇప్పుడెక్కడున్నదీ తెలియదు. కాలేజిలో చదువుకుంటోన్నప్పుడు పరిచయమైనాడు. పరిచయమైందోలేదో శ్రీకాంతునికి చాల సన్నిహితుడైనాడు. మంచి చతురుడు, కర్మణ్యుడు, చలాకిమనిషి, వాదంలో అజేయుడు. ఏ పనైనాసరే ఇట్టేచేసేస్తాడు. క్షణంసేపు కూడా ఊరికే ఉండడు. కాని అతని ఆంతర్యం మాత్రం ఎవరికీ దబ్బున అంతుపట్టదు.

స్నేహంలో అయే ఖర్చులన్ని శ్రీకాంతుడే భరించేవాడు. హరిప్రసన్నుడు తన పనిపాటలద్వారా పరిచయాలద్వారా బాగానే సంపాదించేవాడు. కాని తనకుమాత్రం దమ్మిడీ ఖర్చులేదు. కాబట్టి అందరితోనూ పరిచయంగా ఉండేవాడు. పరిచయాధిక్యం వల్ల అతనికి న్యూనత ఏమీ రాలేదు. పైగా అందరూ అతనంటే ఆప్యాయంగానే ఉండేవాళ్ళు.

శ్రీకాంతుడు వకీలు. కొంచెం బెట్టుసరిగా ఉండాల్సిన అవసరం ఉంది. అతనికి మిత్రబృదం పరిమితంగానే ఉంది.

హరిప్రసన్నుడు నవనవస్ఫూర్తికల మనిషి. నిత్యప్రసన్నుడు. ఉషారుగా ఉంటాడు. కొత్తకొత్త ఎత్తుగడలు తెలిసినబుర్ర. ఎప్పుడూ ఏదోఒకపనిలో నిమగ్నుడయ్యేఉంటాడు. ఎవరి సహాయాన్నీ తానుకోరడు. తన సహాయాన్ని ఇతరులు కోరాలని అనుకోడు. కలుపుగోలు మనిషి. అన్ని పనులూ తెలుసు.

శ్రీకాంతునికి ఆత్మవిచారం ఎక్కువ. 'కర్తవ్యం' ఏ క్షణాన కనుమరుగున పడిపోతుందోనని బహుజాగరూకుడై ఉంటాడు. "ధర్మం" అనేది అతని దృష్టిలో ఒక తార్కిక విషయంకాదు. అందుచేత అతడు మితభాషి, పరిచయాలు తక్కువ. తనకోసమై ఇతర్లకైనా ఏ సందర్భంలోనైనా ఎంత స్వల్పం అయినా ఖర్చుపెడితే, అది జ్ఞాపకం పెట్టుకుంటాడు. ఇతర్లతో కలహం పెట్టుకోవటం అతనికి చేతకాదు. మొత్తం మీద ఖరాఖండి మనిషి.

శ్రీకాంతుడు ప్రజ్ఞావంతుడే. అయినా, ప్రతిభావంతుడైన హరిప్రసన్నుని సలహాఅడిగి ఆప్రకారమే చేస్తూఉంటాడు. హరిప్రసన్నుడికి బుద్ధిసూక్ష్మత మెండు. "ధర్మం" అనేది ఒక ఉపయుక్తమైన,వినోదకరమైన వస్తువు అని అతనంటాడు. ఆ మాటవిని శ్రీకాంతుడు విచారసూచకంగా మందహాసం చేస్తాడు. అంతేగాని తర్కానికి దిగడు.

శ్రీకాంతునిది విశాలమైన హృదయం. పరిపుష్టమైన దేహం. సంపన్న పరిస్థితి. ధార్మికవృత్తి. అందమైన మేని చాయ.

హరిప్రసన్నుడు బక్కపలచగా పొట్టిగా ఉంటాడు. చిన్నప్పుడే తల్లిదండ్రులను విడిచి వచ్చేసిన బాపతు. ఇల్లు లేదే, వాకిలిలేదే, ఇవాళ ఎక్కడ భోజనంచెయ్యాలి, ఎక్కడ పడుకోవాలి అనేదిగుల్లు అతనికి ఎప్పుడూ ఏకోశానా ఉండవు. కొంచెం అనుమానపు మనిషి. చతురుడు, కర్మకుశలుడు, తీక్ష్ణ బుద్ధికలవాడు. ధనవంతుడు కాడు. మిక్కిలి పరార్థతత్పరుడు. ద్వైధీభావంలో పడిపోయి అటూ, ఇటూ అని ఊగులాడే పరిస్థితి అతని కెప్పుడూ రాదు. అప్పటికప్పుడు ఏదో ఒక నిర్ణయం చేసుకుని ముందుకుపోతూనే ఉంటాడు. తనకోసం ఇతర్లేమైన ఖర్చుచేసినా, తాను ఇతర్ల కోసం ఏమైనా ఖర్చుచేసినా అతనేమీ మరచిపోడు. కాని ఆ సంగతి మాత్రం నోరు విప్పి ఎవరితోనూ ఎప్పుడూ చెప్పడు. అందరితోనూ సాయలా సాయలాగా ఉంటాడు. ఎవరితోనూ ఏవిధమైన తగాదా పెట్టుకోడు. అతడు ఇదమిద్ధమని నిర్ణయించుకున్న సిద్ధాంతాలూ ఏమీ లేవు; అందుచేత ఇతర్లతో అభిప్రాయభేదం వచ్చి వివాదపడటమూ ఎన్నడు లేదు.

## 2

వకీలువృత్తి బాగానే సాగుతున్నది. శ్రీకాంత్ గృహస్థుడైనాడు. అప్పుడప్పు డనుకుంటూ ఉంటాడు: "హరిప్రసన్నుడు ఎక్కడున్నాడో కదా! నాకుమల్లే అతడు వకీలు

వృత్తిలోకి రాకపోవటమే మంచిది. అవివాహితుడుగా ఉండటమే మేలు. అతడు పూర్వంలాగే ఈనాటికికూడా జీవిత సమస్యల్ని తీక్షణంగా పరిశీలిస్తూనే ఉన్నాడా? నేను ఈ నాగరిక రంగంలో ఒక బాధ్యతగల వ్యక్తినై ఉన్నాను. పరిశీలన మాకు అనవసరం. న్యాయచట్టానికి సంబంధించి నడచుకోవటమే మా నాగరకత."

ఇలా కాసేపు ఆలోచిస్తూ కుర్చీలో కూచుంటాడు. చివరకు ఈ ఆలోచన లన్నింటినీ చెయిబెట్టి శూన్యప్రపంచంలోకి దూరంగా నెట్టివేస్తాడు.

అతనిభార్య సునీత తక్కువ చదివిన మనిషేమీ కాదు. గార్హస్థ్య నిర్వహణ మానవ జీవితానికి అత్యవసరమైనదిగా ఆ దంపతుల అభిప్రాయం. న్యాయ సమ్మతంగా నడచుకోకపోతే, కేవలం జీవనసమస్యల్ని పరిశీలించటమే పని పెట్టుకుంటే సమాజం, సభ్యత ఏమైపోవాలి? వివాహం ద్వారా కుటుంబం ఏర్పడుతుంది. కుటుంబ నిర్వహణం ద్వారా మానవత్వం నెలకొంటుంది. ఔనుకదూ!

'ఔనుకదూ!' అని శ్రీకాంత్ తన్ను తాను ప్రశ్నించుకుంటాడు. "ఔనౌను. కాకపోవటంఏమిటి?" అని దానికి జవాబు అతని హృదయాంతరాళంలోనించి ధ్వనిస్తుంది. వెంటనే అతడు కుర్చీలోనించి లేచి ఆ గదిలోనే గబగబా పచార్లు చేస్తాడు.

సునీత సుశిక్షితురాలు. ఆమె ప్రవర్తన చూస్తే సుశిక్షితురాలు కాదని ఎవరూ అనుకోరు. ఉన్ననౌకర్లను తీసివేసింది; ఇంటిపనులన్నీ తానే చేసుకుంటుంది. చెంబులు,

తప్పేలాలు తానే తోముకుంటుంది. హార్మోనియం, వయొలిన్ దుమ్ముదులిపి శుభ్రంగా ఉంచుతుంది, పుస్తకాలన్నీ అలమారలో చక్కగా సర్ది పెడుతుంది; కాని ఆమెకు వీటిని ఉపయోగించే తీరికమాత్రం ఉండదు.

సునీత చక్కని చుక్క, ఇంటిపనులలో బహునేర్పరి. శ్రీకాంత్ పనేమీలేకుండా గదిలో కూచున్నసమయంలో ఆమెఏదో ఒక పనిలో నిమగ్నమై ఉంటుంది. శ్రీకాంత్ గోడవైపుచూచి నిట్టూర్పు విడిచి, మంచంమీదినించి లేచి వచ్చి పచార్లుచేస్తూ ఉంటాడు.

సునీత చక్కని యౌవనవతి, సుశీల. ఇంటిపనులన్నీ చక్కగా నిర్వర్తించి కాసేపు గదిలోకివెళ్ళి పడుకుంటుంది. కాని వెంటనే గోడవైపు చూచి, ఒకపెద్ద నిట్టూర్పు విడిచి, లేచివెళ్ళి ఏదో ఒక కొత్తపని కల్పించుకుని అందులో మునిగిపోతుంది.

వివాహమైమూడేళ్ళయింది; అంతే. ఇటువంటి భార్య అందరికీ దొరుకుతుందా? ఊహుఁ దొరకదు. ఆ సంగతి శ్రీకాంత్‌కు తెలియదా? తెలుసు, కాని... ...

అప్పుడప్పుడు సాయంసమయాల్లో మెల్ల మెల్లగా చీకట్లు కమ్ముకొస్తూన్నప్పుడు లోపటినుంచి సునీత చెంబు తప్పేలాలు తోముతోన్న చప్పుడు వినిపిస్తూన్న వేళల్లో శ్రీకాంత్‌కు ఎప్పటెప్పటి విషయాలో అనేకం కడుపులో తెములుతూ ఉంటాయి. అనేకం ఏమిటి? అన్నీ జ్ఞాపకం వస్తాయి. ఒకప్పుడు తాను, హరిప్రసన్నుడూ చదువుకుంటూన్న రోజుల్లో... ఇద్దరూ ఎంతో సన్నిహితులుగా ఉండేవాళ్ళు...

ఒకసారి హరిప్రసన్నుడు అడిగాడు: "ఇకముందు నే నేమై పోతానో నువు చెప్పగలవా?"

"ఎవరు చెప్పగలరు? నీ భవిష్యత్తు ఉజ్వలంగానే ఉండచ్చు."

"ఉజ్వలమా? బహుశా......" తన యెదుటనే ఒక భయంకరమైన దృశ్యం చూస్తున్నవానికివలె హరిప్రసన్నుని ముఖంలో చీకట్లు క్రమ్మినవి.

"చూడు హరీ! నీ భవిష్యత్తు విషయమై ఏమి చెప్ప టానికీ నాకు శక్యంకాదు. కాని మనం ఈ చదువు అయి పోగానే ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోతాం. మళ్ళీ ఎప్పుడు కలుసుకుంటామో చెప్పలేం. నేనొకచోట స్థిరంగా కుదురు కుంటాను. నువుమాత్రం ఒకచోటనక తిరుగుతూ ఉంటావు. అందువల్ల నీ పేరు ప్రతిష్ఠలు పెరుగుతాయో యేమో చెప్ప లేను" అన్నాడు శ్రీకాంత్.

తరువాత కాసేపటివరకూ ఎవరూమాటాడలేదు. చివ రకు హరిప్రసన్నుడు హఠాత్తుగా అసందర్భంగా ఇలా అన్నాడు:

"కొంతమంది లక్షలు ఆర్జిస్తారు. మరి కొంతమంది చిన్న వయసులోనే ఉరికంబం ఎక్కుతారు. వారు లోకానికి ఒక కొత్తప్రాణిని సృష్టించియిచ్చిన వారేమీకాదు; ఒక గ్రంథం రచించినవారూ కాదు; ఒక వస్తువును ఉత్పత్తిచేసిన వారూ కాదు. వారిని స్మరించుకోవలసిన అవసరమేమీ లేదు. కాని సాహసించి ముందడుగువేసి వారు కావిలించుకున్న మృత్యువు నిరుపయోగమైనదే నంటావా—చెప్పు?"

వెంటనే శ్రీకాంత్ అందుకొని "ముందడుగు వేసి కావిలించుకోదగిన వస్తువుకాదు మృత్యువు. అది ఎంత ఆకర్షణీయంగా కనిపిస్తుందో అంత భయంకరమైనది. దాని పని దాన్ని చేసుకోనిమ్మని ఊరుకుంటే చాలు. పోయి కావిలించుకో నక్కర్లేదు" అన్నాడు గంభీరంగా.

హరిప్రసన్నుడు మరి మాటాడలేదు.

హరిప్రసన్నుడు మృత్యువును గురించే ఆలోచిస్తూ మృత్యువుతోనే సావాసం పెంచుకోవాలని చూస్తున్నాడు కామాలు... అనుకున్నాడు శ్రీకాంత్.

ఆ సంవత్సరమే ఒక రహస్య విప్లవసన్నాహం బయట పడిపోయింది. హరిప్రసన్నుడు పట్టుబడ్డాడు. ఇంకా చాల మంది వ్యక్తులుకూడా పట్టుబడ్డారు. కొంతమందిని ఉరిదీశారు. కొందరికి జైలుశిక్ష వేశారు. హరిప్రసన్నుడికి కూడా రెండేళ్లు జైలుశిక్ష పడింది. ఆతరువాత సహాయ నిరాకరణోద్యమం వచ్చింది. హరిప్రసన్నుడు అందులోనూ దూకాడు. జైలు శిక్షమీద జైలుశిక్ష అనుభవించాడు. రెండేళ్ళక్రితం వరకూ ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు. కాని ఇప్పుడు?

ఈ విషయమంతా శ్రీకాంత్‌కు తరచు జ్ఞాపకం వస్తూ ఉంటుంది: "ఇప్పుడతను ఎక్కడున్నాడు—ఎలా ఉన్నాడు? నేను మాత్రం ఒక ఇంటివాడినైనాను. ప్రాక్టీసు క్రమేణా వృద్ధిచెందుతూనే ఉంది. అన్నివిధాలా బాగానే ఉంది నాకు. రక్షణఉంది, సేవకులున్నారు; కాని ఆ అభాగ్యుడు మాత్రం ఉన్నచోటఉండకుండా, ఇల్లువాకిలి లేకుండా తిరుగుతున్నాడు.

బ్రతికి ఉన్నాడో లేదో కూడా తెలియకుండా ఉంది..." ఇలా అనుకుంటూ ఉంటాడు శ్రీకాంత్.

ఆ సమయంలో సునీత వచ్చి "పాలు చల్లారి పోతు న్నాయి. తీసుకురమ్మంటారా?" అని అడిగింది.

"పాలా? ఆగు. హరిప్రసన్నుడు రాసిన ఆఖరి ఉత్త రం నీ డైరీలో ఉండాలి కదూ! తీసుకురా చూడాలి. అతని పాత చిరునామాకే ఉత్తరం రాద్దాం. నీ ఫొటో కూడా తీసు కురా. పెళ్ళికిముందు చక్కని పోజులో తీయించుకున్నావే, ఆ ఫొటో, (సునీతకు సంతోషం కలిగింది. మందహాసం చేసింది) తెలిసిందా? ఆ పెద్దమనిషి ఎందుకలాగ ఊరూరూ తిరగటం? జైళ్ళలో పడటం? అవస్థలు కొని తెచ్చుకోటం? ప్రపం చంలో అందగత్తెలైన స్త్రీలు, ముద్దువచ్చే పిల్లలూ ఉన్నా రని అతనికి తెలియాలి. వీళ్ళను విడిచిపెట్టి ఆయన స్వరా జ్యం తెస్తాడూ?... నీ ఫొటో తప్పకుండా పట్టుకురా!"

"అయితే పాలు పట్టుకు రమ్మంటారా?"

"పాలా! ఊఁ పట్టుకురా!"

## 3

రాత్రి సునీత నిద్రపోయినతరువాత శ్రీకాంత్ ఉత్తరం రాయటం ఆరంభించాడు.

"ప్రియమిత్రుడు హరిప్రసన్ను నికి:-నీ వద్దనుంచి ఉత్తర మనేది రాక మూడుసంవత్సరాలైంది. నీవు ఆఖరుసారి రాసిన ఉత్తరాన్ని నిన్న మేము మళ్లీ చదివాం. 'మేము' అని రాశాను. ఔను. నేను ఇప్పుడు ఒకడినే కాదు. నాకు వివాహం అయింది.

నాతోపాటు నా భార్యకూడా నీకు ఇప్పుడు మిత్రురాలన్న మాటే. నీ ఉత్తరాల్ని ఆమెకూడా చదువుతున్నది. ఇప్పుడు నేనురాసే ఈ ఉత్తరం నీకు చేరితే, వెంటనే నీ క్షేమసమాచారాలు తెలుపుతూ జవాబురాయి. కాని ఈ ఉత్తరం నీకు అందుతుందన్న ఆశ నాకు లేదు.

"పైన రాశాను. నేను ఇప్పుడు ఒక్కడినికాదు, ఇద్దరమూ అని. మానవుడు సవ్యంగా నడుచుకుంటూ ఉంటే ఎప్పుడో ఒకప్పుడు తాను ఒక్కడూ ఇద్దరుగా అయే సమయం వచ్చితీరుతుంది. వివాహం అనేది సంఘం అంగీకరించిన ఒక ఏర్పాటు. ఒకడు ఇద్దరుగా కావాలన్న అపేక్ష, ఆవశ్యకత మానవ ప్రకృతిలో కనిపిస్తూనే ఉంది. 'వివాహం' అనే పదం మానేసి 'ప్రేమ' అనే పదం వాడినా వాడవచ్చు. మొత్తంమీద వ్యక్తి తనంతట తాను పరిపూర్ణుడు కాదు. సహచారిణికోసం అపేక్షిస్తూనే ఉంటాడు. అది సహజం.

"ప్రస్తుతం నీ అవస్థ ఎటువంటిదో, అనుభవాలు ఎలాంటివో నాకు తెలియదు. దేశదేశాలు తిరిగావు. చాల వింతలు చూచేఉంటావు. ఇప్పటికీ నువు అవివాహితుడుగానే ఉన్నావనుకుంటాను. అలా ఒక్కడివే శుష్కజీవితం గడుపుతూ ఎలా ఉన్నావబ్బా! నీకు విసుగు కలగటంలేదూ? విసుగెత్తి నప్పుడైనా పెళ్ళిపెడాకులు చేసుకుందామని ఏమైనా ఆలోచిస్తున్నావా? ఒక్కడివిగానే ఉంటూ ఆ శుష్క జీవితం గడపటమే నీ ధర్మంగా భావిస్తున్నావా?

"ఈ ఉత్తరంతోపాటు మీ ఒదిన ఫొటోకూడా పంపిస్తున్నాను. ఇందువల్ల ప్రపంచంలో స్త్రీ అనే వ్యక్తి

ఒకటి ఉన్నట్లు నువు గుర్తించగలుగుతావు. కాని చెట్టు, పువ్వు, నదిలాగ స్త్రీకూడ ఒక పదార్థంలాగ భావిస్తావేమో నని నా భయం. స్త్రీని ఒక పదార్థంగా ఊహించటం తప్పు సుమా! అటువంటి ఊహతో పురుషుడు స్త్రీనించి విడుదల పొందలేడు-పొందడు. తల్లి అనో, సోదరిఅనో, భార్యఅనో, ఉపపత్నిఅనో, ప్రేమికఅనో ......... ఏదో సంబంధం కల్పించుకోకుండా స్త్రీ నించి విముక్తిలేదు. స్త్రీని 'స్త్రీ' అన్న నామంతోనే చూడలేం.

"మీా ఒదినె ఫోటో చూడు. చూచి ... స్త్రీ వ్యక్తితో నీకు సంబంధం అనవసరమేమో ఆలోచించి నిర్ణయించు. ఆమె కళ్ళు నన్ను తలక్రిందుచేస్తాయి. నీకు తెలుసు కదా. నేను తేలిగ్గా పరవశంచెందే స్వభావంకలవాణ్ణి కాదు. కాని ఆమె అందంముందు నేను పరవశుణ్ణికాక తప్పటంలేదు. నిజానికి పరవశంచెందటంలో సుఖంలేదు. కాని ఏకాకిగా-స్వేచ్ఛగాఉంటూ గడిపే జీవితంలోమాత్రం సుఖం ఏముంది? మానవుడు తన్నుతాను మరొకరికి సమర్పణం చేసుకోవలసిందే. తాడిచెట్టులా పొడుగ్గా ఎదిగి ఏకాంతంగా తన్నిపట్టి నిల్చున్నంతమాత్రాన సిద్ధుడౌతాడన్నమాట నేను ఒప్పుకోను.

"మీాలాంటివాళ్ళ నడకంతా ఎటువైపు? మాట మాటాడితే జైలుకు వెడతారు! అదేనా ధర్మం? అదేనా మోక్షం? ఇల్లులేదు, వాకిలిలేదు; ఎప్పుడూ ఇటూ అటూ సంచారం. మీా ఒంటిమీాద సరైనగుడ్డ లేకపోయినాసరే, ప్రజాసేవకు దిగుతారు. మీా మీాద ఆశలు పెట్టుకున్న

వాళ్ళంతా ఆకలిచిచ్చుతో మాడుతూ ఉంటారు. మీరు నిరంతరం సంచారాలు చేస్తారు. ఇదంతా ఏమిటి?

"నేను నీతో వాదించను. వాదనలో ఎప్పుడూ నీదే పై చెయ్యి, నాకు తెలుసు. ఇంతకూ నేనుకోరేది ఏమంటే... నీకు అవకాశం ఉంటే ఇక్కడికి ఒకసారి తప్పకుండా రా. రావటానికి డబ్బు కావలిస్తే పంపిస్తాను. నీకు ఇంకా ఏమైనా అవసరాలుంటే తెలియజెయ్యి. నువు తప్పకుండా రావాలి సుమీ! వచ్చి ఇక్కడ కొన్నాళ్ళు ఉందువుగాని. ఇష్టం లేకపోతే అయిదారు రోజుల్లోనే వెళ్ళిపోదువుగాని. నాకన్నా ఎక్కువగా మీ వదినె బ్రతిమాలుతున్నది. ఆమె ప్రార్థన తోసివెయ్యరానిది సుమా! భారతీయ సంస్కృతి నీ వెరుగుదువు. స్త్రీ పూజ్యురాలు. ఆ సంస్కృతిని ఉద్ధరించవలసిన వాడివి - నువే ఆమెమాట తోసేస్తావా? నామాట తోసేస్తే తోసెయ్యి. కాని మీ వదిన మాటైనా మన్నించు.

"హరీ! తప్పకుండా రా. నువ్వెప్పుడువచ్చేదీ ఉత్తరం రాయి. మీ వదిన ఫొటోగురించి నీ ఉద్దేశం ఏమిటి? ఇచ్చకాలు కాకుండా నిజంమాట చెప్పు. నువు ఎంత దేశభక్తుడివైనా అభిరుచులు ఎక్కడికి పోతాయి? అదీగాక నువు అబద్ధం చెప్పలేవు, నాకు తెలుసు.

"నేను ప్లీడరీవృత్తి చేస్తూఉన్నాను. ఆవిడకూడా నాకు కొంతపనిలో సాయపడుతూనే ఉంది పాపం. కాని మాయిద్దరికీ ఆంతరిక సాన్నిహిత్యం తక్కువ. ఆమెను నేను ప్రసన్నురాలినిగా చేసుకోలేనేమో ననిపిస్తుంది.

"నీ ఉత్తరంకోసం ఎదురుచూస్తూ ఉంటాను. జీవితంలో మధ్యమధ్య కాస్త కొత్తదనమంటూ గుచితగులుతూ ఉండాలి. నువు నీతోపాటు మా యింటికి కొత్తవాయువులు తీసుకొస్తావని ఆశిస్తున్నాను. నీ

"శ్రీకాంత్"

ఉత్తరం సునీతఫొటోతోపాటు కవరులో పెట్టి బిళ్ళలు అతికించి పోస్టులోవేశాడు. కాని అది అక్కడా అక్కడా తిరిగితిరిగి Dead Letter Office నించి తనకే తిరిగివచ్చింది.

# 4

తిరిగివచ్చిన ఆ ఉత్తరంకేసి చాలసేపు తదేకంగా చూస్తూకూచుని చివరకు శ్రీకాంత్ దాన్ని డ్రాయరులో పెట్టాడు.

ఇంట్లో కొంచెం వాతావరణం మారాలని శ్రీకాంతుని కోరిక. చాలరోజులనించీ జీవితం మందంగా, నిరానందంగా ఉంటోంది: ఇద్దరూ ఒకగదిలోనే ఉంటారు. కాని చాలసేపటి వరకూ సునీతను ఎలా పలుకరించాలోకూడా శ్రీకాంతునికి స్ఫురించదు. సునీతకూడా అలాగే మౌనంగా బెల్లంకొట్టిన రాయిలా కూచుని ఉంటుంది. ఇలా చాలసార్లు జరిగింది. గుండె దడదడ కొట్టుకుంటుంది., ఇటువంటి పరిస్థితి ఎందుకేర్పడుతుందో అతనికి తోచటంలేదు.

కచేరీకి వెడుతూఉండగా.........హరిప్రసన్నుడికి రాసిన ఉత్తరం తిరిగివచ్చినసంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే లోనికి వెళ్ళి "చూచావా, సునీతా! మనం హరి

ప్రసన్నుడికి రాసినఉత్తరం తిరిగి వచ్చేసింది. అతనిజాడ యేమీ తెలియలేదు" అన్నాడు.

సునీత అప్పుడు వంటింట్లో పని చేసుకుంటోంది. ఆ మాట విన్నది. 'సరే' అని మాత్రం క్లుప్తంగా జవాబు పలికింది. 'సరే, విన్నాను. ఆ మాట అయింది. ఇంకేమైనా చెప్పవలసిఉందా ?'... ...ఇన్నిమాటలు ఆ ఒక్క 'సరే' అన్న పదంలో ధ్వనిస్తున్నట్లు ఉంది.

పుల్ల విరిచినట్టుగాఉన్న ఆ ఒక్క 'సరే' అన్నపదం జవాబుగా విని శ్రీకాంత్... తన ఉత్సాహమంతా దిగజారిపోగా ఇలా అన్నాడు. "ఇదిగో, సునీతా! నేను చెబుతూన్నమాట...నీ కేమీ సంబంధంలేనట్టు... అలా నిర్లక్ష్యంగా వింటావేం ? నాకేం బాగులేదుసుమీ !"

"మీకు ఇవాళ కచేరీకి ఆలస్యమైపోయేట్టుంది."

"ఆలస్యం ఏంకాదు. పోనీ అయితే అయింది. నా మాట వినిపించుకుంటావా లేదా ?"

"అలా కోపం తెచ్చుకుంటా రెందుకూ ? ఊఁ కానీండి. ఇంతకూ మీరు చెప్పేదేమిటీ ?"

"ఉహుఁ, ఏమీలేదు, ఆలస్యం ఔతుంది, కచేరీకి వెళ్ళాలి." మెల్లిగా అడుగులు వేసుకుంటూ శ్రీకాంత్ కచేరీకి వెళ్ళాడు.

సునీత తన పనులన్నీ పూర్తిచేసుకుని గదిలోకివెళ్ళి పడుకుంది. "ఎందుకూ, వారు నామీద అలాగ అస్తమానం కోపం తెచ్చుకుంటూ ఉంటారు ? ఆయన్ను నా హృదయంలో బంధించి ఉంచుకోలేకపోతున్నానా ? ఇన్నాళ్ళ

నించీ నేనేదో వస్తువు పోగొట్టుకుని దానికోసం వెదుక్కుం టూన్నదానిమల్లే ఉన్నాను. ఆయనముందు నేను పువ్వులా వికసించలేకపోతున్నానేమిటి ?"... ఇలా ఆలోచించుకుంటూ ఉంటుంది.

ఇంతకూ అసలు విషయం ఏమిటంటే... జీవనధార ప్రవహించి ప్రవహించి ఎక్కడో అడ్డుతగిలి ఆగిపోయింది. ఇంట్లో గడుపుకుండే జీవితానికీ, బాహ్య ప్రపంచానికీ ఎక్కువ సంసర్గం, సంఘర్షణ చేకూరినప్పుడే రసస్పృష్టి కలిగి, చైతన్యం జాగృతమౌతుంది. ఎప్పుడూ ఒకేరకమైన పాతగాడిలోనే పడివుంటే నూతన సమస్యలు ఎక్కడనించి వస్తాయి? ఎప్పటి కప్పుడు నూతన పరిస్థితులు ఏర్పడకపోతే, నూతన సమస్యలు ఉత్పన్నం కాకపోతే మన ఆకాంక్షలలో చేసేపనుల్లో నూతనత్వం ఎలా వస్తుంది? ప్రాణానికి నూతనస్ఫూర్తి ఎలా చేకూరుతుంది?

ఇంట్లో ఇటువంటి నిరానందజీవితానికే అలవాటుపడి తృప్తిపడి ఉన్నది చాలకాలం సునీత. క్రమేణా ఈ నిరా నందస్థితి ఎలా తొలగుతుందా? అని ఆలోచించ సాగింది. అందుకు సమాధానంగా: "కిటికీలు దరవాజాలు బాగా తెరి చెయ్యాలి. గాలిని విరివిగా లోనికి రానివ్వాలి. అప్పుడుగాని వ్యవహారం చక్కబడదు. వచ్చేగాలిలో అపరిశుద్ధమైన పదార్థముంటే దాన్ని పరిశుద్ధం చెయ్యాలి. పరిశుద్ధమైన పదార్థముంటే దాన్ని స్వీకరించాలి. కాని గాలిని మాత్రం ఇంట్లోకి బాగా రానిస్తుండాలి, పోనిస్తుండాలి. త్యజించటానికి గాని, స్వీకరించటానికిగాని ఆ యోగ్యత మనలో జాగృతమై

పెంపొందాలి. ఈ విధంగా మనల్ని, మనగృహాల్ని పరిపుష్టం -పరిపూతం చేసుకుంటూ పోవాలి" అని ఆమెకు అస్పష్టంగా స్ఫురిస్తూ ఉంటుంది.

ఇంకా కొద్ది రోజుల్లోనే దసరాసెలవులు ఇస్తారు. ఎక్కడికైనా వెడదాం అని ఆయన్నుకోరతాను. ఈ సారి ప్రయాగలో జరిగే కుంభమేళకు తప్పకుండా వెళ్ళితీరాలి. అటువంటి గొప్ప 'మేళ' ప్రపంచంలో ఎక్కడా జరగదు. చాల పవిత్రమైనది కూడాను. తిరిగితిరిగివస్తే కాస్త హృదయం విశాలమౌతుంది; ఈ నిరానందంకూడా చాలవరకు తగ్గుతుంది—అని అనుకుంది సునీత.

సాయంత్రం శ్రీకాంత్ కచేరీనించి రాగానే సునీత అన్నది : "ఏమండీ! మనం ఈ దసరాసెలవుల్లో ఎక్కడికన్నా వెడదాం?"

"తప్పకుండా వెడదాం. ఎక్కడికిపోదాం? తీర్థయాత్రలు పోదామా?"

"ఎక్కడికైనా సరే, పోనీ తీర్థయాత్రకే పోదాం."

సెలవులుఇచ్చారు. ఆ దంపతులు బయలుదేరి వెళ్ళారు. చాల ప్రదేశాలు తిరిగారు. అందువల్ల వారి దాంపత్య జీవితానికి పరిపూర్ణత వచ్చింది. కలసిమెలసి నిస్సంకోచంగా ప్రసంగించుకోటమూ, నవ్వుతూ పేలుతూ కాలం గడపటమూ బాగా అలవాటైపోయింది. ఒకచోట కూచుని మంచి చెడ్డలు ఆలోచించుకో గలుగుతున్నారు. పరస్పరం పరామర్శించుకో గలుగుతున్నారు. ఇల్లు విడిచి బైట తిరుగుతూ... ...ఒకరికి మరియొకరి ఆవశ్యకత బాగా తెలిసి

వచ్చింది. ఇంట్లో ఒకరికెదురుగా ఒకరు ఎప్పుడూ కనిపిస్తూ ఉన్నంతకాలం, ఒకరులేని బాధ ఒకరికి క్షణంసేపయినా అనుభవంలోకి రానంతకాలం దంపతులకు పరస్పరాకర్షణ, మనోరంజన పుష్కలంగా ఉండనేరదు. ఇప్పుడు విశాల ప్రపంచంలోకి వచ్చేసి క్షణక్షణమూ తామిద్దరూ ఏకమై పోతున్నట్టు ఒక విచిత్రానుభూతికి లోనౌతున్నారు.

## 5

చివరకు కుంభమేళ చూడ్డానికి ప్రయాగ వెళ్ళారు. అక్కడ ఒక మిత్రునియింట్లో బసచేశారు.

ఒకనాటి ఉదయం త్రివేణీ సంగమంలో స్నానంచేసి వద్దామని పడవఎక్కి బయలుదేరారు. యాత్రికు లంతా ఎక్కినతరువాత పడవ బయలుదేరింది. 'జై గంగమ్మతల్లికీ' అని పడవలోనివారంతా నినాదాలు చేశారు.

క్రమేణా పడవ ఒడ్డుకు దూరమౌతోంది. ఒడ్డున చాలమంది జనం గుంపుగూడి చూస్తున్నారు. శ్రీకాంతునికి ఆ గుంపులో హరిప్రసన్నుడు కనిపించాడు. నిజంగా హరి ప్రసన్నుడే. తనవైపే చూస్తున్నట్టున్నాడు. 'హరీ! హరీ!' అని కేకవేసి పిలుద్దామనుకున్నాడు. కాని, పడవ సాగి పోతున్నది; తాను కేకలువేస్తే అంతా నవ్వుతారు. అంతే గాని ఏమీ లాభం ఉండదు. అందుచేత కళ్ళు అప్పగించి అలా చూస్తూ ఉండిపోయాడు. ఇన్నాళ్ళ తరువాత ప్రియ మిత్రుని చూచికూడా హృదయం విప్పి మాటాడుకునే అవ కాశం దొరక్కపోయెకదా! హరిప్రసన్నుని ముఖం ఉల్లా

సంగానే ఉంది. వెంట్రుకలు బాగా పెరిగి ఉన్నాయి. ఖద్దరు చొక్కా...పొడుగ్గాఉంది ... తొడుక్కున్నాడు. కాళ్ళకు చెప్పులున్నాయో లేదో కనిపించలేదు. 'అదేమిటి ? హరి ప్రసన్నుడు బైరాగుల్లో చేరాడా?' అనుకున్నాడు శ్రీకాంత్.

పడవ చాల దూరం పోయింది. ఒడ్డుమీది హరిప్రసన్నుని విగ్రహం దృష్టికి అందీ అందకుండా ఉంది. ఆ మనుష్యుల గుంపుకూడా... పడుతూలేస్తూ ఉండే అలలతోటి నదిలాగా విచలితమై కనిపిస్తోంది. శ్రీకాంత్ దిగులుపడినవాడులా చూస్తూ నిల్చున్నాడు. "ఏమిటి? అలా చూస్తున్నారేం?" అని అడిగింది పక్కనేఉన్న సునీత.

"ఆ ఒడ్డునఉన్న గుంపులో హరిప్రసన్నుడున్నాడు!"

"హరిప్రసన్నుడా ?"

"ఔను అతనే. గుంపులో నిల్చుని ఉన్నాడు. బైరాగుల్లో కలిసిపోయాడేమో నని భయంగా ఉంది."

కాసేపు ఆగి శ్రీకాంత్ మళ్ళీ ఇలా అన్నాడు : "సునీతా! అతడు సన్యాసం పుచ్చుకునే తత్వంగల మనిషి కాడు. విధివైపరీత్యం ఎలా ఉంటుందో చూడు. పధ్నాలుగు సంవత్సరాల తరువాత మేము ఒకరినొకరు చూచుకున్నాం. కాని కలసి మాటాడుకోలేకపోయాం. ఒకరి మనస్సు ఒకరికి విప్పిచెప్పుకోలేకపోయాం. చివరకు ఎలాగో కలిశాం, కాని ఈ కలవటం ఎలాఉందో చూచావుగా! నువ్వు అతన్ని చూచావా సునీతా? చూడలేదు. కాని నిన్నతడు తప్పకుండా చూచేఉంటాడు. చూస్తేమాత్రం, నువ్వు ఎవరో

అతనికేం తెలుసు? ఇంతకూ అతడు బైరాగుల్లో కలిశా డనుకోను. అటువంటి పని అతడు చెయ్యలేడు."

"మనం తిరిగివచ్చాక కలుస్తాడేమోలెండి" అన్నది సునీత అన్యమనస్కురాలై.

"ఔను, మళ్ళీ కలుసుకోవల్సిందే, తప్పదు. కాని అంతగుంపులో అతడు మనకెక్కడ దొరుకుతాడూ?"

నిరంతరం ఏవో ఆపదలనే ఎదుర్కొంటూ, విశ్రాంతి యన్నది లేక, ఒకచోటనక తిరుగుతూ కాలక్షేపం చేసే హరిప్రసన్నుడన్న ఈ వ్యక్తి ఎలాఉంటాడు? అతని రూప లక్షణాల్ని విస్పష్టంగా ఊహించుకోటానికి ప్రయత్నించింది సునీత. హరిప్రసన్నుని విషయమై ఆమెకు కుతూహలం లేక పోలేదు. కొన్ని సంవత్సరాలనించీ అతన్నిగురించి భర్తవలన వింటూనే ఉంది. అటువంటి వ్యక్తిమీద ఆమెకు కరుణకూడా ఉత్పన్నమైంది. కాని ఆ కరుణను పైకి ఎప్పుడూ కనిపింప నీయలేదు.

"తాను ఎవరికీ ముఖం చూపించకుండా తనబాగే తాను చూచుకోకుండా ఉన్నాడాయెను. అటువంటి వ్యక్తి కోసం మీ రెందుకంత తహతహ పడటం?" సునీత అడిగింది.

"అతడు బైరాగుల్లో ఎలా కలుస్తాడు? నేను కలవ నిస్తానా? నే నతనికి చుట్టాన్నీకాదు, పక్కాన్నీకాదు అని కదూ నువ్వు అనుకోటం? కాకపోవచ్చు. కాని నేను స్వతంత్రు డిని. నా యిష్టం. నే నతన్ని బైరాగుల్లో కలవనీను. అతనికీ, నాకూ ఉన్న సంబంధం ఎటువంటిదో నీకు తెలియదు. బైరాగి జీవితం ఎలాంటిదో నీకుమాత్రం ఏంతెలుసూ? బైరాగి

జీవితం మరుభూమిలాంటిది; నిస్సారమైంది. పెళ్ళిచేసుకుంటే స్వర్గందొరికినట్లే అనికాదు నేనుచెప్పేది; వివాహంకాకుండా స్త్రీ సాహచర్యం అనుభవించకుండా ఎవడూకూడా బైరాగి కాలేడు. అదీ నేను చెప్పేమాట. హరిప్రసన్నుని విషయమై నువు ఇంత ఉదాసీనంగా ఉండటం నాకు ఆశ్చర్యంగావుంది. నీ సలహాను అనుసరించే అతన్ని మామూలు ప్రపంచంలోకి తీసుకురావాలని నా ఆలోచన, తెలుసునా? అతను ఒంటరిగా తిరుగుతున్నాడు. అన్నిపనులూ ఒక్కడే చేసుకుంటున్నాడు. అలా ఒంటరిగావుండి ఏమి సాధించగలుగుతాడు? ఊరికే తిరగటమే; అంతకంటె ఏమీ లేదు. కొందరు ఏకాంతంగాఉన్నా ఒక మూర్తిని ధ్యానించుకుని ఆనందించుకుంటూ ఉంటారు. హరిప్రసన్నుడు మాత్రం అటువంటి రకం మనిషికాదు; అతడు భక్తుడుకాదు."

సునీత మందహాసం చేస్తూ "అలాగా!" అన్నది.

"'అలాగా' అంటూ ఇగిలిస్తే సరిపోదు. హరిప్రసన్నుడు ఇంత చేరువలోకి వచ్చాడా? అతన్ని మనం కోల్పోవకూడదు. తప్పకుండా అతన్ని పట్టెయ్యాలి. పట్టి, ముక్కుకు తాడేసి సరైనదారికి లాక్కురావాలి. అతడు అలా తిరుగుతూ ఉంటే నాలోనాకే విశ్వాసం లేకుండాపోతున్నది. అస్తమానం హరిప్రసన్నుని స్మృతి నన్ను వెన్నాడుతూ ఉంది. 'శ్రీకాంత్' నువు బాగానే ఉన్నావు. నాగతి ఎలా ఉందో చూడు అంటూ హరిప్రసన్నుని కంఠం నా చెవుల్లో ధ్వనిస్తూ ఉంటుంది. నా బ్రతుకుబాటలో అడుగడుగునా హరిప్రసన్నుని స్మృతి నన్ను సందేహాస్పదునిగా చేస్తున్నది.

'ఓరీ, శ్రీకాంత్! ఇదేనా మార్గం? ఇదేనా జీవితం?' అంటూ నాలోనించే ఎవరో చీకట్లు కమ్ముకుంటూ వచ్చి, తర్జని ఆడిస్తూ అడుగుతున్నట్లు వినిపిస్తూ ఉంటుంది. ఇది నాకొక పెద్ద బాధగాఉంది. ఈ బాధనించి బైటపడటం కోసమే హరిప్రసన్నని ఎలాగైనా పట్టుకొచ్చి ఒక దారికి తీసుకురావాలని చూస్తున్నా. ఇకముందునించి హరిప్రసన్నని స్మృతి నా నిశ్చితాభిప్రాయాల్ని విచలితం చెయ్యకుండా ఉండాలని నా ఆశ. అంతేగాని నాకేం పరమార్థచింతలేదు. హరిప్రసన్నడికి శుభం చేకూర్చి, అతన్ని ఉద్ధరిద్దామన్న ఉపకార బుద్ధితో మాటాడుతున్నానని అనుకోకు. ఇందులో నా స్వార్థమే నాకు గోచరిస్తున్నది. అతడు జ్ఞాపకం వచ్చినప్పుడెల్లా నామీద నాకే అనుమానం కలుగుతుంది; నా ఔచిత్యాన్ని నేనే శంకించటం జరుగుతోంది..."

ఇటువంటి సమయాల్లో సునీతకు సహజంగా పెద్దరికం వచ్చేస్తుంది. "తిరిగివచ్చాక మీ రాయనకోసం వెదకటానికి వెళ్ళవచ్చులెండి. ఇప్పటినించే విచారపడితే ఏంలాభం?"

ఇదొక అల్పవిషయంగా భావించడం పొరపాటు... అని శ్రీకాంత్ సునీతకు గట్టిగా చెబుదామనుకున్నాడు. కాని ఆమె అన్యమనస్కమైఉంది. అతనేమీ మాటాడలేదు.

హరిప్రసన్నని విషయం తీసుకుని శ్రీకాంత్ ఇంత అధికప్రసంగం చెయ్యటం ఆమెకు ఇష్టంలేదు. శ్రీకాంత్ చెప్పేమాటల్నిబట్టి హరిప్రసన్నడు ఆమెకు స్పష్టంగా అవగాహన కావటంలేదు. ఒకరకమైన, తెరచాటున ఉన్న నిగూఢ వ్యక్తిలా ఆమెకు స్ఫురిస్తున్నది. కాని ఆమెకు

కావలసింది అతని విస్పష్టమైన మూర్తి. హరిప్రసన్నుడి పేరు వినేసరికి ఆమెకు మనోవీధిలో ఒక బొమ్మ స్ఫురిస్తుంది. బొమ్మల్ని చూచి మనమంతా తరచు ఆనందిస్తాం. బొమ్మకు బాహ్యరూపమేగాని, ఆంతర్యంలో ఏముందో మనకు బోధ పడదు. అందుచేత బొమ్మలుకూడ మనల్ని మోసగిస్తాయి. సునీతకు ఈవిషయమై భర్తతో ప్రసంగించటం ఇష్టంలేదు. ఈవిషయమై తన ఆలోచనల్నికూడా ఎప్పుడూ బైటికి చెప్పదు. అయినా ఆమెకు, హరిప్రసన్నునికి సంబంధించిన కొన్నిఅంశాలు తెలుసుకోవాలన్న కుతూహలం లేకపోలేదు. ఈ విలక్షణుడైన యువకునికి తల్లి ఉన్నదా? ఉంటే ఆమెకు అతడెలా ఉపయోగపడుతున్నాడు? సోదరులు, బంధువులు ఉన్నారా? వాళ్ళ స్థితిగతులేమిటి? చెల్లెలు ఎవరైనా ఉందా? ఉంటే, ఈ అన్నగారిని పోగొట్టుకొని ఆమె ఏం చేస్తున్నది? ఈ ప్రశ్నలన్నీ తన్ను తానే అడుగుతుంది. అన్నింటికీ తానే జవాబు చెప్పుకుంటుంది—ఇద్దరు చెల్లెళ్ళు ఉన్నారు, ముగ్గురు సోదరు లున్నారు, తల్లి చాల ముసలిది, ఇలాగ... ...; కాని ఈజవాబులన్నీ నిరాధారాలనికూడా ఆమెకే స్ఫురిస్తూఉంటుంది. మళ్ళీ భావవీధిలో ప్రశ్నలు పరిగిడుతూఉంటాయి— హరిప్రసన్నుడికి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఉన్నారా? ఉంటే వాళ్ళందర్నీ వొదిలిపెట్టి ఎక్కడున్నాడు? అక్కడా ఇక్కడా ఎందుకూ తిరగటం? ఎలా ఉంటున్నాడు? అలా ఎందుకు ఉండాలి?

"మీరుమాత్రం అతన్నిగురించి చాల బాధపడు తున్నారు. కాని అతడు మీమాట మన్నించి, మీరు

చెప్పినట్టు నడచుకుంటాడన్న నమ్మకం మీకు ఉందా? మీ మీదా మీ మాటమీదా అతనికి విశ్వాసం ఉండద్దూ?"
— సునీత భర్తను అడిగింది.

"ఉంది, లేకపోతే కలిగించాలి."

పడవ త్రివేణీ సంగమం సమీపించింది. హఠాత్తుగా శ్రీకాంత్, సునీత బుజం పుచ్చుకుని - "అదిగో చూడు; అతడులాగే ఉన్నాడు"—అన్నాడు.

సునీత ఒడ్డువైపు చూచింది. స్త్రీ పురుషులగుంపు కనిపించింది; అంతే. "అయితే కావచ్చులెండి; ముందు సంగమంలో స్నానంచేద్దాం పదండి" - అన్నది.

## 6

స్నానానంతరం శ్రీకాంత్ భార్యతోసహా బసకు తిరిగివచ్చాడు. వెంటనే హరిప్రసన్నుని వెదకి తీసుకురావటానికి బయలుదేరాడు. ప్రయాగ పెద్ద పట్నం. పైగా కుంభమేళ ఉత్సవాలు చూచేందుకు ఎక్కడెక్కడి ప్రజలూ వచ్చారు. హరిప్రసన్నుడు ఎక్కడ కనిపించేట్టుంది?

పట్నమంతా గాలించాడు. సందులు, గొందులు వెదకాడు. హరిప్రసన్నుడుమాత్రం కనిపించలేదు. తిరిగి తిరిగి బసకుచేరుకున్నాడు. "హరిప్రసన్నుడు ఎక్కడా కనిపించలేదు" - అని చెప్పాడు భార్యకు.

హరిప్రసన్నుడికోసం ఎందుకింతగా శ్రీకాంతుడు కలవరిస్తున్నాడు? అసలు విషయం ఏమిటంటే: శ్రీకాంతుని జీవన పరిస్థితులు బాగానే ఉన్నాయి. అయినా అతని మనస్సుకు

తృప్తి అనేది కనిపించటంలేదు. తన జీవితానికి ఏదో ఒక పెద్ద లోటు ఉన్నట్టు భావించుకుంటూ ఉంటాడు. ఒంటరితనం, మిత్రుల అభావం అతన్ని బాధపెడుతున్నాయి. ఇంట్లో భార్య సునీత ఉన్నది. ఇద్దరూ కలిసిమెలిసి బాగానే ఉంటున్నారు; కాని ఇంట్లో ఉన్నంతసేపే వారిద్దరి సంయుక్తజీవనం. ఇంటివ్యవహారాల్లోనే వారిద్దరి సమ్మేళనం. తదితరరంగాల్లో ఎవరికి వారే విడిపోయి ఉంటున్నారు.

మానవహృదయం ఎంత భావపరిపూర్ణమైనా ఒంటరిగా ఉన్నప్పుడు శూన్యస్థితి అనుభవిస్తుంది. దానికి ఇంకో హృదయం కావాలి. దానిలో తన భావాలన్నీ తిరగబోసుకుంటూ ఉండాలి. ఇందువల్ల దానికి శూన్యస్థితి ఏర్పడకుండా ఎప్పటికప్పుడు మళ్ళీ నింపుకుంటూ ఉంటుంది.

సునీత హృదయం శక్తిమంతమైనదే - అంటే సృజనశీలము కలదే, కల్పనాశక్తి కలదే. ఈ కాల్పనికశక్తివల్ల తాను ఒంటరిగా ఉన్నప్పుడుకూడా హృదయం నిండుగానే ఉంచుకోగలుగుతుంది. సంఘం అంటే యేమిటి? దేశం అంటే ఏమిటి? నీతి అనగా ఏది?—ఇటువంటి విషయాలమీద చర్చ వచ్చినప్పుడు ఆమె వంటయింట్లోకి పారిపోవలసిన అశక్తురాలు కాదు. కాని అటువంటి విషయాలమీద చర్చ సమాలోచన అవసరంలేకుండానే తన జీవితాన్ని సాగించుకుపోగలదు. అయాచితంగా వచ్చి శ్రీకాంతునిముందు ఆమె యెప్పుడూ ఇలాంటి విషయచర్చ తెచ్చి వాక్ప్రాగల్భ్యం చూపదు. ఇంటి వ్యవహారాల్నిగురించే తనకుతానై వచ్చి

శ్రీకాంతునితో మాటాడుతుంది. మిగతావిషయాలన్నీ ఆమె తన మనస్సులోనే ఉంచుకుంటుంది.

శ్రీకాంతునికి ఒక మిత్రుడు కావాలి; తనహృదయంలోని భావాలన్నీ అతనికి చెప్పుకోవాలి; తద్వారా తన హృదయం తేలికపడాలి — అతనితో అనేక విషయాలు చెప్పాలి; తద్వారా తన ఆశయాలకు పుష్టిచేకూరాలి. కేవలం గార్హస్థ్యనిర్వహణలో మాత్రమే తనకు భాగస్వామినియైన భార్యద్వారా ఈకోరిక నెరవేరదు. ఇల్లుగడుపుకుంటూ, భార్యాబిడ్డల్ని పోషించుకుంటూ కాలం గడపగలిగినంత మాత్రాన చాలదు. పురుషుడికి ఇంకా కావలసినవి ఉన్నాయి. దేశం, సంఘం, అభ్యుదయం, నీతి, ధర్మం — చాలా ఉన్నాయి. వీటికోసం గృహిణి సాయంకాక మరోవ్యక్తి సాహచర్యం అవసరం.

అటువంటి వ్యక్తి శ్రీకాంతునికి ఇంతవరకూ లభించ లేదు. ఇప్పుడు హఠాత్తుగా హరిప్రసన్నుడు కనిపించాడు. వెంటనే ఇంతకాలంనించీ తనలో ఉన్న ఆకాంక్ష బాగా జాగృతమైంది. కాబట్టి ఎలాగైనాసరే, ప్రయాగఅంతా గాలించియైనాసరే హరిప్రసన్నుని పట్టి తేవాల్సిందే.

మర్నాడుకూడా అలాగే వెతికాడు. వెతగ్గా వెతగ్గా ఏదో కాస్త కబురు తెలిసింది. కాని అప్పటికే చీకటి పడుతోంది. అతడు ఉంటోన్న బస అక్కడికి అయిదుమైళ్ళ దూరం. అంతదూరం వెళ్ళటంపడదు. కాని ఆ రాత్రి శ్రీకాంత్ హాయిగా నిద్రపోయాడు. మర్నాడు వెళ్ళి

కనుక్కోవచ్చునని ధైర్యంకలిగింది. ఆ సంగతి భార్యకు కూడా చెప్పాడు:

ఉదయాన్నే లేచి అక్కడికి వెళ్ళాడు. కాని అంతకు ముందే హరిప్రసన్నుడు ఏడుగంటల ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీకి ప్రయాణమై వెళ్ళిపోయాడని తెలిసింది.

ఏడుగంటలబండికి ఢిల్లీకి వెళ్ళిపోయాడా ? ఢిల్లీకే? ఎక్స్‌ప్రెస్ బయలుదేరటానికి ఇంకా కాస్త టైము వుంది. శ్రీకాంత్ స్టేషన్‌కు పరిగెత్తాడు. కాని అతడు ప్లాట్‌ఫారం మీద అడుగుపెట్టేసరికే రైలు కదిలిపోయింది.

తిరిగివచ్చి సునీతకు చెప్పాడు: "హరిప్రసన్నుడు చేతికి చిక్కకూడా అందకుండానే పోయాడు. రేపు ఈపాటికల్లా ఢిల్లీలో వుంటాడు." సునీత మొట్టమొదటిసారిగా ఆశ్చర్యం ప్రకటించింది. తాము ఇప్పుడు కాపురం వుంటున్నది ఢిల్లీలోనే. ఆ ఢిల్లీకే హరిప్రసన్నుడు వెళ్ళాడన్నవిషయం తమాషాగానే వుంది.

హరిప్రసన్నుడు ఢిల్లీలో వున్నా అతన్నిపట్టుకునే ఉపాయం దొరక్కపోవచ్చు... అనే భావం తోచి సునీత తనలోతాను విస్మితురాలైంది.

"ఇంకా మనం ఇక్కడ ఎన్నాళ్ళు వుందాం ?"— శ్రీకాంత్ అడిగాడు.

"మేళా చూచాం. త్రివేణీలో స్నానం చేశాం. ఇంకా యిక్కడ వుండవలసిన అవసరం ఏముంది ?"

"అయితే రేపే బయలుదేరి పోదాం."

"సరే కానీండి."

# 7

ఢిల్లీ వచ్చినతరువాతకూడా హరిప్రసన్నుడికోసం చాలా వెతికాడు శ్రీకాంత్. హరిప్రసన్నుని బుద్ధికి అందని విషయంలేదు. అతనికి అన్నీ తెలుసు. బైరాగి ఐపోగలడు. విప్లవకారుడు కాగలడు. వర్తకుడు, ఫొటోగ్రాఫర్, కోమటి గుమాస్తా, జర్నలిస్టు — ఏ హోదాలోనైనా చేరిపోగలడు. దుకాణం పెట్టుకుని వర్తకం చెయ్యాలంటే పెట్టుబడికి డబ్బు కావాలి. ఔను, తప్పకుండా కావాలి. అందుకుగాను పైసలు చేతబుచ్చుకుని ఒకచోట కూర్చుని, వాటిని రూపాయలుగా మార్చే తెలివితేటలుకూడా అతనికి లేకపోలేదు. లేదా బడి చెప్పుకుంటాడు. ఇలా ఏపనిలోనైనాసరే జొరబడగల యోగ్యత, సామర్థ్యం గల వ్యక్తిని ఎక్కడని వెదకి పట్టుకోగలం? ఇప్పుడు ఏ హోదాలో వ్యవహరిస్తున్నాడో ఎవరికి తెలుస్తుంది? ఏ పనీపాటా లేకుండా వాగుతూ, బిచ్చమెత్తుకుంటూనైనా ఉండచ్చు. అందుకుకూడా సమర్థుడే అతడు; అటువంటి యోగ్యతకూడా ఉన్నవాడే. అటువంటివాడిని ఎక్కడ వెదకి పట్టుకోగలం?... శ్రీకాంత్‌కు అదే ఆలోచన.

శ్రీకాంత్ మళ్ళీ తన పనిపాటల్లో పడ్డాడు. తీర్థయాత్రల్లో తిరుగుతూన్నరోజుల్లో వారి దాంపత్యజీవితానికి ఒక కొత్త శోభ, పుష్టి చేకూరాయి. ఇప్పుడు మళ్ళీ ఢిల్లీ వచ్చి మామూలుజీవితంలో పడేసరికి అవి క్రమేణా క్షీణించిపోసాగాయి. శ్రీకాంతుని దృష్టిలో సునీత మళ్ళీ పూర్వం మల్లేనే... తనతో ఎక్కువగా ప్రసంగించని... లేదా, తాను పోయి పలుకరించటానికి భయపడే... అతిశయం గల మనిషి

లాగ దిగజారిపోయింది. శ్రీకాంతుడు మళ్ళీ తనకుతానే ఒంటరిగాడై పోయినట్టు అసంతృప్తిగా ఉంటున్నాడు. ఒక రకమైన బంధనంగా అనిపించింది జీవితం.

సభలు, సమావేశాలంటే శ్రీకాంత్ కు ఎక్కువ మోజు లేదు. కాని సినీమా ప్రదర్శనాలకన్నా సభలు, సమావేశాలు మెరుగు అని అతని అభిప్రాయం. అప్పుడప్పుడు ఆయా సభలకు హాజరౌతుంటాడు. అక్కడ జరిగే ఉపన్యాసాలువిని ఉత్తేజితుడు కావటానికి ప్రయత్నిస్తూఉంటాడు. సునీత ఎప్పుడూ ఇంట్లోనే ఉంటుంది. ఏ సభకైనా వెడుతున్నప్పుడు శ్రీకాంత్ వచ్చి "వస్తావా ?" - అని సునీతను అడుగుతూ ఉంటాడు. ఇప్పుడూ అడిగాడు : "వస్తావా" అని.

"ఎక్కడికీ ?"

"అక్కడొక సభ జరుగుతోంది."

"నేను వచ్చి ఏం చెయ్యను ?"

"సరే అయితే."

సునీత మరేమీ మాటాడలేదు. తన యింటిపనుల్లో నిమగ్న అయింది.

"ఔనులే. అక్కడికి వెళ్ళటంవల్ల ఏం ప్రయోజనం?" — అని అనుకుంటున్నవాడులా తిరిగి వెళ్ళిపోయాడు.

"నే నక్కడికి వెళ్ళటంవల్ల ఏం ప్రయోజనం ?" అని తనలోతాను అనుకుంటూ సునీత ద్విగుణీకృతోత్సాహంతో తన యింటిపనులు తాను చేసుకోసాగింది.

అయితే ఆనాడు హరిప్రసన్నుడు శ్రీకాంత్ కు చాల తేలిగ్గా దొరికాడు. లోపల సభ జరుగుతోంది. బైట ఊరికే

పచార్లు చేస్తున్నాడు శ్రీకాంత్. అప్పుడు వెనుకనించి ఒకవ్యక్తి అతని బుజంమీద చెయివేసి 'శ్రీకాంత్' అని పిల్చాడు.

తిరిగి చూచేసరికి హరిప్రసన్నుడు!

శ్రీకాంత్‌కు ఆశ్చర్యం అయింది. మాట, పలుకు లేకుండా అక్కడివాడు అక్కడే నిల్చుని చూస్తూ ఉండి పోయాడు. హరిప్రసన్నుని జుట్టు చాల పొడుగ్గావుంది. గడ్డం కూడా బాగా పెరిగివుంది. ఒక పొడుగాటి ఖద్దరు-చొక్కా తొడుక్కున్నాడు. మెడమీద ఉత్తరీయం వుంది. కాలికి చెప్పులు వున్నాయి.

"శ్రీకాంత్! నన్నింకా గుర్తుపట్టలేదా? అలా భయపడిపోయి చూస్తున్నావేం? నేను హరిప్రసన్నుడి నయ్యా! అప్పుడు అలహాబాద్‌లో కలిశాం. తరువాత నీజాడ తెలియలేదు. నువు ఇక్కడే వుంటున్నావా, ఢిల్లీలో? ఏం జేస్తున్నావు?"

శ్రీకాంత్ ఇంకా అలాగే చూస్తునే ఉన్నాడు. ఈ మనిషేమిటీ? ఈ చిందరవందర వేషం ఏమిటీ? ఈ వాగుడేమిటీ? ... శ్రీకాంత్‌కు అయోమయంగా ఉంది.

"...ఆఁ గుర్తువచ్చింది. ప్లీడరువై బల్లకట్టావుకదూ? ఎవరో చెప్పగా విన్నట్టు జ్ఞాపకం. ప్లీడరు వేనా? సరే... చదువుకున్నవాడెవడూ నౌకరీకి పోడు. ప్లీడరీకేవస్తాడు... నిల్చున్నావేం? పోదాంపద!"

"పోదామా? ఎక్కడికి పోదాం?" - అన్నాడు శ్రీకాంత్.

"ఏం, నువు ప్లీడరీ చేస్తున్నావుగా! మాయింటికే పోదాం. ఇప్పుడు ఇంట్లో నువు ఒక్కడివే కాదనుకుంటానే. పైగా నీతో నాకు కాస్త పనికూడా ఉంది." అంటూ హరిప్రసన్నుడు శ్రీకాంతుని చేయి పట్టుకుని ముందుకు తీసుకుపోసాగాడు.

"...నేను కొద్దిరోజులక్రితమే ఈవూరు వచ్చాను. బహుశా ఒక నెల అయిందేమో! అయిదులక్షల జనాభా గల పట్నం ఇది. వైస్‌రాయి ఉన్నాడు; ఎర్రకోట, పచ్చకోట... చాలాకోటలు ఇక్కడ ఉన్నాయి. ఇటువంటిచోట స్థిరంగా ఉండిపోదామని నేను రాలేదు. నాతో పనిబట్టిన మనిషికూడా ఎవరూ ఇక్కడ కానరావటంలేదు. పని పాటలు ఏవో చేయించుకోగల తాహతుగలవాళ్ళు చాల మందే ఉన్నారు. కాని ఎవరికీ నామీద దృష్టి పడేట్టు లేదు."

"ఇప్పుడు ఏకామెకి మాయింటికే ఎలా పోతాం? నీ సామాను ఎక్కడ ఉందో చెప్పు. దాన్నికూడా తీసుకుని ఏకంగా పోదాం" - అన్నాడు శ్రీకాంత్.

"నాకు పెద్ద సామానేమీ లేదు. ఏదో కొద్దిగా ఉంది. అక్కడ ఒకయింట్లో అట్టిపెట్టాను. సామానుకూడా తీసుకు రమ్మంటావా? నన్ను మీయింట్లోనే వుండమనా నీ ఉద్దేశం? ఊహుఁ. వద్దు శ్రీకాంత్. నాకు ఇల్లు, వాకిలి అక్కర్లేదు."

శ్రీకాంత్ ఆశ్చర్యపోయాడు. ఇల్లు వాకిలి అక్కర్లేక పోతే ఎక్కడ వుంటావు మరి?"

"నీ యింట్లో ఎలా వుండమంటావు?"

"ఏం?"

హరిప్రసన్నుడు శ్రీకాంతుని కన్నుల్లోకి చూచాడు: "నేను ఇల్లు వాకిలికోసం పుట్టిన మనిషిని కాదు; ఒక ఇంట్లో పడివుండదగిన మనిషినీ కాదు. కాబట్టి శ్రీకాంత్! నన్ను బలవంతం చెయ్యకు. నేను ఇంటికి రాను."

"చాల్లే, అటువంటి మాటలన్నీ కట్టిపెట్టు, పద! నీ సామాను ఎక్కడ వుందో చెప్పు."

"కాని...ఆగు! ఒకమాట! ఇప్పుడు నీయింటికి నువే యజమానివి కాదు. ఇప్పుడింకో యజమానురాలుకూడా వుంది. స్వతంత్రించి ఒక పరదేశిగాడిని ఇంటికి పిల్చుకుపోయే అధికారం నీకు ఏముంది? మొదట ఆమె అనుమతి తీసుకో. ఆమెకూడా నన్ను వుండమని కోరితే...అప్పుడు ఆలోచిస్తాలే. అయినా నీకు తెలుసుకదా, అబ్బాయి! నేను వట్టి దిప్పకాయమనిషిని. ఒకచోట కాలూని నిల్చేవాడిని కాదు, పెట్టేవాడిని కాదు."

"అనవసరంగా వాగబోకు. నువు ఎవరో ఆమెకుకూడా తెలుసు. తెలియకపోతేమాత్రం ఏం? పద, ముందర సామాను పట్టుకురా."

హరిప్రసన్నుడు నవ్వాడు: "అలాకాదులే. ముందుగా నువు ఒక విషయం తెలుసుకోవాలి: నాదగ్గర ప్రస్తుతం అయిదు అణాలు మాత్రమే వున్నాయి. అయిదు అణాలతో కాలం ఎలా వెళ్ళబుచ్చాలో నువ్వే ఆలోచించు. నువు ఏమైనా కాస్త పైకం సప్లయి చేస్తావో లేదో...మాటల సందర్భంలో అడగటమే మరచిపోయాను."

శ్రీకాంత్ ఆశ్చర్యాన్వితుడై చూస్తూ "నేను కనిపించకనేపోతే ఈ అయిదు అణాలతో ఏం జేసేవాడివి?" - అని అడిగాడు.

"ఏమో, ఏంజేసేవాడినో, నాకేం తెలుసు?"

"ఇక నీ ముందు కార్యక్రమం ఏమిటీ?"

"అదే చాలరోజులబట్టి ఆలోచిస్తున్నా. రాజకీయంగా తుపాను వచ్చింది, పోయింది. ఆరోజుల్లో దేశభక్తులు కావల్సివచ్చారు. ధైర్యసాహసాలకు, విలువ ఇచ్చారు. ఆటు అణిగింది. ఇప్పుడు పోటు వచ్చింది. విలువలు మారి పోయాయి. ఇప్పుడు మనిషికి స్థిరత్వంకావాలి; బాగా డబ్బు వుండాలి. అప్పుడే అతన్ని ప్రపంచం గుర్తిస్తుంది. ఈ మారిన విలువలనుబట్టి నా జీవితం దిద్దుకోవలసిన అవసరం నాకు లేదు. నేనిప్పుడు ధనవంతుడిని కావాలని ఎందుకు ప్రయత్నించాలి? నువు ధనవంతుడివి ఔతున్నావంటే మరో పదిమందిని నిర్ధనులను చేస్తున్నావన్నమాట. ఈ కారణం వల్ల ధనికులంతా నిమ్నవర్గీయులని తెలుసుకోవాలి. మారుతూన్న ఈ బాజారువిలువలను గుర్తించకుండా నేను అలాగే నిల్చుండిపోయాను. తత్ఫలితంగా నేను నానాటికీ దిగజారి పోతున్నాను. ఆ నిమ్నవర్గీయులను పూర్తిగా వదిలేసి నేను భద్రవర్గీయుడుగా చలామణీ కావాలన్న ఆశయం నాకు లేదు. చేతిలో పైసా లేకుండా జీవితంగడిచే ఆస్కారం లేకుండాపోయింది ప్రపంచంలో. ఆవు నీది కాకపోతే దాని పాలు తాగటానికి వీల్లేదు. చెట్టు నీది కాకపోతే దాని పళ్లు తినటానికి వీల్లేదు. తోట నీది గాకపోతే అందులోనించి

కూరలు తెచ్చుకోటానికి వీల్లేదు. టిక్కెట్టు లేకపోతే రైల్లు ఎక్కి నువు వెళ్ళదలచినచోటికి వెళ్ళటానికి వీల్లేదు. అన్నింటికీ డబ్బు కావాల్సిందే. ఈ డబ్బు సర్కారువారి టంకసాలలో తయారై వస్తుంది. ఈ డబ్బుతో సంబంధించినదంతా పేచీకోరు వ్యవహారమే. విజ్ఞానవంతుడు కాకపోయినా కొన్ని కిటుకులు తెలిసిఉంటే ఇల్లంతా బంగారంతో నింపేసుకోగలుగుతున్నాడు. విజ్ఞానవంతుడై కూడా ఒకొక్కడు ఎంతకష్టపడ్డా రాగిదమ్మిడీలకు మొగంవాచి బ్రతుకుతున్నాడు. లోపం ఎక్కడ ఉందంటావు? వస్తువులకూ, వ్యక్తులకూ మనం ఇస్తున్న తప్పుడువిలువల్లో ఉంది. మనసాంఘిక శాస్త్రం, అర్థశాస్త్రం, నీతిశాస్త్రం, ధర్మశాస్త్రం... ఇవన్నీ ఆ తప్పుడువిలువలనే మన్నిస్తున్నాయి; వాటినే పుష్టివంతం చేస్తున్నాయి. వాటిలో ఒక్కసారిగా మనం పరివర్తన తీసుకురావాలి. నిల్చోగలిగిన ప్రతివాడికీ పైచూపే; ఆకాశం చూస్తూ నేలను ముద్దుపెట్టుకోవాలని చూస్తాడు... ఇటువంటి పరిస్థితుల్లో నా ముందు కార్యక్రమం ఏమిటనికదూ నువు అడుగుతున్నావు. మొట్టమొదట కొద్దిగా పైకం నీవద్ద పుచ్చుకుందామనుకున్నాను. ఆతరువాత ఎక్కడైనా ముప్ఫయి, నలభై రూపాయలకు నెల జీతానికి కుదురుదామని నా ఉద్దేశం. నాలుగేళ్ళనించీ ప్రయత్నించిచూచాను. డబ్బులేకుండా జీవితం గడపటం సాధ్యమౌతుందా, లేదా అని. సాధ్యంకాదని తేలిపోయింది. ఒకప్పుడు సాధ్యంకావచ్చు; ఎప్పుడంటే—నువు నిర్ధనుడివైనా ఒక ధనవంతుడు నీకు భక్తుడైనప్పుడు; లేదా - నువు ధనం

ఆర్జించకపోయినా ఒక ధనవంతుడికి నువ్వు భక్తుడివైనప్పుడు. గాంధీజీ మొదటి తరగతికి చెందినమనిషి. భట్రాజు రెండో రకానికి చెందిన మనిషి. ఇద్దరికీ... నిర్ధనులైనా... బాగానే గడుస్తుంది. ఇంతకూ నేను ముప్ఫయి నలభై రూపాయల జీతానికి ఎక్కడైనా కుదురుకోగలిగితే చాలు. ధనార్జనకు కూడా ఒక హద్దు ఉంది. అంతకన్నా ఎక్కువ జీతం నేను పుచ్చుకోను. ఆ జీతమైనా సంపాదించటానికి ఏమి ఉద్యోగం చెయ్యాలో•నాకింకా పాలుపోవటంలేదు."

శ్రీకాంత్ అంతా మాటాడకుండా విన్నాడు. చివరకు అన్నాడు: "ఈ తిరుగుడంతా మాన్పించేసి నిన్ను ఎక్కడేనా కుదిరిగ్గా ఉంచాలనే మేము అనుకుంటున్నాం—అంటే, నేనూ మా ఆవిడ. ఒక ఉద్యోగంలో చేరి కుదిరిగ్గా ఉండు. పనిపాటలు చేసుకో. ఇల్లు, వాకిలి ఏర్పరచుకో. గౌరవనీయుడుగా జీవించు. ఏదో కొత్తమార్గం ఆవిష్కరిస్తానంటూ పరుగులుపెట్టి ఏం లాభం?"

"నౌకరీ చెయ్యి - ఇల్లు చూచుకో - పిల్లల్ని కను - నేడు-రేపుల మధ్య నిర్బంధితుడివై బ్రతుకు... ...ఇంతేనా శ్రీకాంత్! మనం చేయవలసినదంతా?" కొంచెం ఆవేశంగా పలికాడు హరిప్రసన్నుడు.

" 'మనం చేయవలసినదంతా' అంటే నీ ఉద్దేశం ఏమిటో నాకైతే తెలియదు. పోనీ, ఆ 'అంతా' నువ్వు చెయ్యి; కాదన్నదెవరు! ప్రస్తుతం నీకు కావలసిన ముప్ఫయి రూపాయలూ ప్రతినెలా నాదగ్గరే తీసుకుంటూ ఉండు... ఎన్ని నెలలు కావలిస్తే అన్ని నెలలు."

"వద్దు బాబూ వద్దు. ఇంత విశాలమైన విశ్వం ఉండగా ఎక్కడో ఒకమూల గట్టి పునాదులుతీసి, ఎత్తైన గోడలుకట్టి, ఆ యింట్లో అన్నివిధాలా కట్టుబడి బ్రతకటం ఒకబ్రతుకనిపించుకోదు. ఈ విశాలవిశ్వంతో సంపర్కం ఉండాలి. నేడు-రేపుల మధ్య ఖైదీబ్రతుకు మాకు ఇష్టంలేదు. శాశ్వతత్వం కావాలి. అనంతాన్ని రుచిచూస్తాం. మా దారి అనంతమైనది. నువు చూపించే దారి భార్యాబిడ్డలకు, బంధువులకు సంతుష్టజీవనం ప్రసాదించవచ్చు. మనల్ని మాత్రం మోసం చేస్తుంది. మానవుడు పెళ్ళాడి భర్త ఔతున్నాడు ; పిల్లల్నికని తండ్రి ఔతున్నాడు ; తద్వారా తాను తనచుట్టూ ఇనుపచువ్వలు దట్టంగా పాతుకుం టున్నాడన్నమాట. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం కోల్పోతున్నా డన్నమాట."

ఈమాటలన్నీ చాల తమాషాగానే ఉన్నాయి. పూర్వపు హరిప్రసన్నుడికీ, ఇప్పటి హరిప్రసన్నుడికీ తేడా ఏమీ లేదు. "అయితే హరీ! నువు శాశ్వతత్వాన్ని ఎలా పొందుతావు - అనంతాన్ని ఎలా ఆస్వాదిస్తావు - చెప్పు?" శ్రీకాంత్ అడిగాడు.

"ఎలాగంటావా? మానవుని పుట్టించాడని చెప్పే భగవంతుడు నాకులేడు. పుణ్యపాపాలనేవి మానవునిలోనుంచి మానవత్వాన్ని వేరుచేశాయి. ధనికుడు-దరిద్రుడు, శాసకుడు-శాసితుడు, కులీనుడు-అస్పృశ్యుడు ... అని ఇలాగ ఉచ్చనిమ్న విభేదాల సృష్టికి కారణాలు మీ సంఘం, సభ్యత, న్యాయ చట్టం మొదలైనవి వీటన్నిటితో నాకు ప్రమేయంలేదు.

అసలు 'సత్యం' అనేది మాత్రమే నాకు కావాలి. నేను ఏ వర్గానికీ చెందినవాడిని కాదు. ఒకవేళ చెందవలసివస్తే నిమ్న వర్గానికే అంటే శ్రామికవర్గానికే చెందుతాను. నా నడత మీ సంఘపు కట్టుబాట్లకు, సాంప్రదాయాలకు బద్ధమైఉండదు. నా సహానుభూతికి భౌగోళికమైన హద్దు ఏమీ ఉండదు. నా భవిష్యత్తు ఎప్పుడూ అనిశ్చితంగానే ఉంటుంది. నిశ్చితంగా మాత్రం మృత్యువు ఎప్పుడో ఒకప్పుడు రాకమానదు. అప్పుడిక మిగిలేదేమీ ఉండదు. నేను ఒంటరిగానే ఉంటాను. ఎందువల్లనంటే – నిర్బంధం నేను సహించను. ఒక్క స్నేహబంధాన్ని మాత్రమే నేను కోరతాను. అది మనిషిని బంధించినా మళ్ళీ విడుదల ప్రసాదించగలదు. స్నేహంలో ఉండే ఔచిత్యాన్ని నేను గుర్తించగలను. నా వశంలో లేని పరిస్థితులకు మాత్రం నేను బాధ్యుడిని కాదు."

"బాగానే ఉంది... ఆగబోకు. పద, పద. మా యిల్లు ఇంకా ఎంతో దూరం లేదు... నేను నీకు నెలనెలా ముప్పయి రూపాయలు ఇవ్వటం, నువ్వు సుఖంగా కాలక్షేపం చెయ్యటం... నీ కిష్టంలేదా ?''

"నీదగ్గర ఊరికే పుచ్చుకోటం నా కిష్టంలేదు. ఆ డబ్బుకు తగినంత పని చూపించి పుచ్చుకుంటాను. ఈలోగా ప్రస్తుతానికి పదిహేను రూపాయలుమాత్రం ఇస్తే చాలు."

"ఏమి పని చేస్తావు ?"

"చేతికందిన పని ఏదైనా సరే."

"హరీ ! నన్నుకూడా ఒకమాట చెప్పనీ. డబ్బు అనేది ఎంతో అల్పమైన వస్తువని నువ్వు గుర్తించినట్టుగాని ... లేదా దాని విలువ అపారమని నువ్వు తెలుసుకున్నట్టు

గాని ... నాకేమీ బోధపడ్డంలేదు. నావద్ద అవసరానికి మించి ఉన్న డబ్బు నాది కాదనీ ... అది బీదవాళ్ళదనీ నువ్వు చెప్పావు. అటువంటప్పుడు నావద్ద డబ్బు తీసుకుని నువ్వు నాపట్ల కృతజ్ఞుడివై ఉండాల్సిన అవసరం లేదుకదా! ఒకవేళ ముప్పయిరూపాయలు తీసుకున్నతరువాత కృతజ్ఞతా భావం తప్పనిసరిగా నీలో ప్రవేశించేట్టయితే నువ్వు చేసేది మాత్రం ఏముంది? నావద్ద అవసరానికి మించి అదనంగా ముప్పయిరూపాయలు ఉన్నప్పుడు ... నీకు తప్పనిసరిగా ఆ ముప్పయిరూపాయలు కావల్సివచ్చినప్పుడు ... సాధారణ న్యాయదృష్ట్యా అవి నావి కావు; నీవే. ఆ దృష్టితోనే చూస్తే, ధనవంతుల డబ్బు వాళ్ళదికానేకాదు; బీదలదే. కాబట్టి ఈ ముప్పయిరూపాయలనిమిత్తం నువ్వు కృతజ్ఞుడవై ఉండనక్కర్లేదు. అందుకు బదులుగా ఏదో పని చేసి కృతజ్ఞత కనబరచకుండా తప్పుకోవలసిన అపసరమూలేదు."

హరిప్రసన్నుడు కాసేపు ఆలోచనలోపడ్డాడు. చివర కన్నాడు: "శ్రీకాంత్! అలామాటాడతావేం? వ్యవహారం వ్యవహారమే."

"కాబట్టి నువ్వు మామూలు వ్యవహర్తలాగే వ్యవహరించరాదూ?"

"కాదు - కాదు. నా నిశ్చయంలో లోపం ఏమీ లేదు. డబ్బు చెడ్డవస్తువుసుమీ! దాన్ని ఇచ్చిపుచ్చుకోటాల్లో కలతలు ఏర్పడతాయి. నిష్కర్షగా ఉండాల్సిందే. ఒకడు మరొకడికి డబ్బు ఎందుకివ్వాలి?... దానికి తగిన ప్రతిఫలం తిరిగి రానప్పుడు!"

ఈమాటలకు శ్రీకాంత్ ఖిన్నుడైనాడు. ఇటువంటి వ్యవహారబుద్ధి ఆ మిత్రునిలో తాను చూడఁగోరలేదు.

కేవలం వ్యాపారదృష్టితోనే మెలగేవాళ్ళు ప్రపంచంలో చాలమంది ఉన్నారు. హరిప్రసన్నుడుకూడా వారిలో చేరిపోతే ప్రపంచం బాగుపడుతుందా? "హరీ! కొంచెం బాగా ఆలోచించు. ఇతర్ల వద్ద డబ్బు పుచ్చుకుంటున్నామే అని మనస్సులో బాధ పడనక్కర్లేదు. ఇతర్లకు డబ్బుఇచ్చి తానొక దాత అయిపోయినట్లు ఎవడూ అనుకోనక్కర్లేదు. డబ్బు పుచ్చుకున్నవాడు దైన్యపడనవసరమూలేదు. అందరికీ ఎప్పుడో ఒకప్పుడు డబ్బు అవసరం రాకుండా ఉంటుందా? ఆ యవసరాలను తీర్చటమే డబ్బుయొక్క ప్రయోజనం. అంతకుమించిన మహత్వం దానికేమీ లేదు. లేనిపోని మహత్వం నువు దానికి కట్టబెట్టకు... ఇటువైపురా, ఇటు..." అంటూ శ్రీకాంత్ హరిప్రసన్నుని సరైనరోడ్డుకు తిప్పాడు.

ఇల్లు ఇంకా ఎంతోదూరం లేదు. శ్రీకాంత్ విషయం మార్చాడు. "నువు జబల్‌పూర్ ఎప్పుడు వదలిపెట్టావు; ఎక్కడెక్కడికి వెళ్ళావు? మేము నీకొక ఉత్తరం రాశాం. అది మళ్ళీ మాకే తిరిగొచ్చేసింది. అందులో మీ వదినె ఫొటోకూడా పంపించాను. ఆమె నిన్ను బాగా ఎరుగునోయ్. నీకు introduction (పరిచయవాక్యం) అవసరంలేదు" - అన్నాడు శ్రీకాంత్.

హరిప్రసన్నుడు మాటాడలేదు. స్త్రీలతో అతనికి దగ్గరసంబంధం ఎప్పుడూలేదు. స్త్రీలంటే అతనికి ఒకరకంగా భయంకూడాను. కొందరు స్త్రీలతో అతనికి పరిచయం


C. P. BROWN
MEMORIAL LIBRARY
Acc. No
Date

ఉంది. వాళ్ళతో కలిసి పనిచేశాడు. కాని వాళ్ళు స్త్రీలు, తాను పురుషుడు అన్న విభేదమే స్ఫురించేదికాదు. వాళ్ళూ తనతోపాటు కార్యకర్తలు; సభల్లో తనతోపాటు వక్తలు. ఇద్దరు నాగరికులు కలిసినట్టే తాను వాళ్ళతో మెలగేవాడు. అతనిమీద ఏ కాస్తో మమకారమంటూ ఏర్పడిన స్త్రీలూ తటస్థించలేదు, అటువంటి వాళ్ళతో అతడు కలిసిమెలిసి తిరిగిందీలేదు. స్వాతంత్ర్యయుద్ధంలో పాల్గొన్నరోజుల్లో అనేక మంది యువతులతో ఘనిష్టమైన సంబంధమే ఉండేది. అందువల్ల అతనికిమనోరంజకంగానూఉండేది. కాని వాళ్ళతో ఎంత కలిసిమెలిసి తిరుగుతూఉన్నా తాను impersonal గానే ( నిర్మముడుగా ) ఉండేవాడు. ఆ స్త్రీలంతా తనకు అక్కలు — చెల్లెళ్ళు. వాళ్ళందరికీ తాను అన్న — తమ్ముడు. ఎవర్నీ తాను 'నువ్వు' అని సంబోధించేవాడు కాదు. స్త్రీలతో సంభాషిస్తున్నప్పుడు 'మీరు' అనిగాని 'తమరు' అనిగాని సంబోధించటమే అలవాటు. 'నువ్వు' అని సంబోధించదగినంత సాన్నిహిత్యం ఏర్పడిన స్త్రీ ఎక్కడా అతనికి తటస్థపడలేదు. ఇప్పుడు శ్రీకాంత్ మాటిమాటికీ 'మీ ఒదిన' అని సూచిస్తున్న వ్యక్తికూడా 'తమరు' అని తాను సంబోధించదగిన వ్యక్తియేనా? ఆమె తనకు వదినెట! అంటే ఇదివరకు తాను ఎరిగియున్న స్త్రీలలాంటిది కాదన్న మాట. ఆమె వదినె అయితే తాను మరిది అయిపోవాలి. మామూలుగా ఒకసజ్జనుడికీ, భద్రమహిళకూ మధ్య ఉండే నాగరికసంబంధంలాంటిది కాదిది. అటువంటప్పుడు ఒక సజ్జనుడికీ భద్రమహిళకూ జరిగే సంభాషణలో వాడే 'మీరు'

లేక 'తమరు' అనే పదం వదినామరదులమధ్యకూడా సరి పోతుందా?... ...ఇలా ఆలోచించుకుంటూ నడుస్తున్నాడు హరిప్రసన్నుడు. ఈ వదినె ఎలా వుంటుంది? తా నామె ముందు మరదిగా ఎలా ప్రవర్తించాలి? ఈ వదినామరదుల బాంధవ్యం ఎలా వుంటుంది?

"హరీ! నా మాటైతే తోసివేశావుగాని, మీా వదిన మాటకూడా అలాగే తోసేస్తావా? ఈ ఢిల్లీపట్నంలో ముప్పయి-నలభై రూపాయల మాసికవేతనంమీాద జీవిస్తూ నువు వేరేయిల్లు అద్దెకు తీసుకుని ఉండటానికి ఆమె ఒప్పు కోదు" - అన్నాడు శ్రీకాంత్.

తాను వేరే ఉండటం ఉండకపోవటం అనేవిష యంలోకూడా తన్ను శాసించేంత అధికారంగల ఈ వదినె ఎవరో హరిప్రసన్నుడికి సరిగా బోధపడలేదు. "ఆమె అలా గెందుకంటుందీ?" - అని అడిగాడు.

"ఎందుకంటుందా? ఆమె నీ వదినె కాబట్టి. అంత కన్నా వేరే కారణం ఏమీాలేదు."

హరిప్రసన్నుడు మరి మాటాడలేదు. అతన్ని నిరుత్త రునిగా చేసే సన్నివేశాలు చాలతక్కువ. తనకు వదినె కానున్న ఒకానొక స్త్రీ సమక్షంలోకి వెడుతూన్న ఈ సన్ని వేశం వాటిలో ఒకటి.

వచ్చివచ్చి మెట్లదగ్గర ఆగారు. అక్కడ ఒక నల్లని కుక్క ఒళ్ళువిరిచి పడుకుని ఉంది. శ్రీకాంత్ ఈలవేసి 'బ్లేకీ, బ్లేకీ' అని పిల్చాడు. అది లేచి అతని కాళ్ళముందుకు వచ్చి, మూతి, తోక కలసికొనేలాగా వొంపులుతిరిగి స్వామి

భక్తి చూపించింది. హరిప్రసన్నుడికి గుండె దడదడ కొట్టుకో సాగింది.

"పద" అన్నాడు శ్రీకాంత్.

"నువు పద."

శ్రీకాంత్ నవ్వాడు : "ముందు నువు పద."

"పదవయ్యా బాబు!"

శ్రీకాంతుని వెనకాలే హరిప్రసన్నుడు మెట్లు ఎక్కుతున్నాడు.

## 8

సునీత శ్రీకాంతుని పఠనమందిరం ఊడుస్తూ తనలో తాను ఇలా అనుకుంటోంది : "ఎప్పుడూ నాగొడవే నాకు గాని ఈ గదులన్నీ ఇలా ఉన్నాయన్నమాటే పట్టించుకోక పోతిని. రోజూ చీపురుపెట్టి ఊడ్చి శుభ్రంచేస్తున్నాకూడా ఈగది ఎలాఉందో! 'ఆడదానికి కావలసిందంతా ఇంట్లోనే ఉంది. బైటినుంచి ఆమె పొందవలసినదేమీలేదు' అని మా వారు అంటూఉండేమాట యథార్థమే. ఇంట్లో ఆడదానికి లేనిదేముంది? సర్వం ఇక్కడేఉంది." నేల ఊడవటం అయాక సునీత ఒక ఎత్తైన స్టూలుమీద ఎక్కి నిల్చుని చీపురుతో ఇంటికప్పుకు అంటుకున్న దుమ్ము, బూజు దులుపు తోంది. ఆతరువాత అద్దాలబీరువాలు నూనెతడిపిన గుడ్డతో తుడిచి శుభ్రం చెయ్యాలి. అద్దాల్ని సారరేకుతో రాచి బాగా మెరిసేట్టుచెయ్యాలి. ఇవాళ శ్రీకాంత్ ఈగదిలోకి వచ్చేసరికి కళ్ళు జిగేలుమనాలి.

మేలిముసుగు కొంచెం జారింది. దూలాలమీది బూజు కొంత పడి వెంట్రుకల్లో చిక్కుకుపోయింది. సన్నగా ఏదో పాటకూడా కూనిరాగం తీస్తోంది. పని చురుగ్గా, చలాకీగా చేస్తోంది. ఇటువంటి పనుల్లో నిమగ్నమైనప్పుడు ఆమెహృదయానికి ఎక్కడలేని ఉల్లాసం వస్తుంది. లేకపోతే చుట్టూ మబ్బులు కమ్మినట్టుగా ఉంటుంది; మనస్సుకు లేనిపోని ఆలోచనలు వస్తాయి : ఇంటిగడప దాటితే విశాలమైన ప్రపంచం ఉంది. చిత్ర విచిత్రమైన ప్రపంచం! అక్కడ ఎన్నో రకరకాల అవకాశాలు ఉన్నాయి. అవన్నీ వదలుకుని మేము ఈ నాలుగు గోడల మధ్య ఉండిపోవాల్సిందేనా? మాకూ, ఆ విశాల ప్రపంచానికి సంబంధమే లేదా? ఉండ నక్కర్లేదా?... ఇలాంటి ఆలోచనలన్నీ – ఆమె యింటి పనుల్లో నిమగ్నమై ఉన్నప్పుడు దగ్గరకురావు. హృదయ తృప్తి పొందగలుగుతుంది.

చీపురు పుచ్చుకుని సాలెపురుగుల గూళ్ళు దులుపుతోంది. ఇన్ని సాలెపురుగులు ఎక్కడినించి పుట్టుకొస్తాయో తెలియకుండాఉంది. ఎంత పెద్ద పెద్ద గూళ్ళు కట్టాయో! ఈ గూళ్ళు కట్టటానికి ఇంత పదార్థం వాటిపొట్టల్లోనుంచి ఎలా ఉత్పత్తి ఔతున్నదో! అదిగో పారిపోతోంది! ఎంత పెద్ద సాలీడో! అరడుగు పొడుగున ఉన్నాయి దాని కాళ్ళు. సునీత అటువైపు చీపురు పుచ్చుకుని కొట్టింది. దెబ్బ తప్పించుకుని పొడుగాటికాళ్ళు చూచుకుంటూ పరిగెత్తే ఆ సాలీడును చూస్తోంటే ఆమెకు అసహ్యం కలిగింది. ఎంత అసహ్యం కలిగిందో చెప్పలేం. దాన్ని చంపటం అసహ్య

మైన పనే. వికృతంగా ఉన్న ఆ పొడుగాటి కాళ్ళమీద అలా పరిగెత్తిపోతూంటే చంపకుండా ఉండటంకూడా ఆమెకు అసహ్యమనిపించింది. ఎంతజోరుగా ఆమె చీపురు విసిరిందో ఆమెకే తెలియాలి. ఆ దెబ్బతో ఆ పురుగు చచ్చిపోయింది. దాని కళేబరం జారి క్రిందపడిపోయింది. అది చూచి ఆమె మనస్సు మెత్తపడిపోయింది. స్టూలుమీదనుంచి క్రిందికి దిగింది. ఆ దిగటంలో చీర అంచు ఒక మేకుకు పట్టుకుంది. దాన్ని విసురుగా లాగటంలో కాస్త చినిగింది చీర. కొంగు ఊగులాడకుండా నడుముచుట్టూతిప్పి కుచ్చెళ్ళలో దోపుకుంది. తలమీద ముసుగు తీసేసింది. మళ్ళీ పనిలోకి దిగింది. అప్పటి ఆమె రూపం కుస్తీకి తయారైనట్టుగా ఉంది; మనోహరంగానూఉంది. కేవలం తన పనిలో నిమగ్నమైఉంది. మిగతాలోకం ఆమె ఎరుగదు. మేలిముసుగులేదు. తల వెంట్రుకలు చెదరి అస్తవ్యస్తంగా పడిఉన్నాయి.

అంతా బాగుచెయ్యటం అయినట్టే. ఇంకా ఒకమూల మిగిలింది. ఆతరువాత బీరువాలు తుడవాలి. ఆమూల కూడ తుడుద్దామని సునీత చీపురు ఎత్తింది...

ఇంతలో హరిప్రసన్నునితోసహ శ్రీకాంత్ ఆగదిలో అడుగుపెట్టాడు.

## 9

హరిప్రసన్నుడు ఎక్కువమంది స్త్రీలను చూచియుండ లేదు; కాదు, చాలమందినే చూచాడు, చక్కనివాళ్ళు కొద్దిమందే కనిపించారు; కాదు, కాదు, చాలచక్కనైనవాళ్ళనే చూచాడు, కాని వాళ్ళందర్నీ చక్కగా ముస్తాబై ఉన్నప్పుడే

చూచాడు. చీరలు సింగారించుకొని, సొమ్ములు అలంకరించుకొని 'ఆఁ ఇప్పుడు సిద్ధంగానే ఉన్నాను' అన్న స్థితిలో ఉన్నప్పుడే వాళ్ళను చూచాడు, వాళ్ళతో మాట్లాడాడు. 'ఆగండి' నేను సిద్ధంగా లేను, అన్న స్థితిలో ఉన్న స్త్రీ సమక్షంలోకి అతనెప్పుడూ వెళ్ళలేదు, చూడలేదు. హరిప్రసన్నుడు గది గుమ్మందగ్గరే జంకు గొంకులతో నిలచిపోయాడు. వదినె సునీతను ఇంకా అతడు చూడలేదు. ఒక స్త్రీ ఆకృతిమాత్రం కనిపించింది. ఒక కొత్త వ్యక్తి తన సమక్షంలోకి రాదగిన పరిస్థితిలో ఆమె లేదు — అని హరిప్రసన్నుడు గ్రహించాడు.

"లోపలికి రావోయి హరీ!" అన్నాడు శ్రీకాంత్ వెనక్కు తిరిగి చూడకుండానే.

శ్రీకాంత్‌తో మరోవ్యక్తి ఎవరో కూడా వస్తున్నట్టు తెలియగానే సునీత చీపురుకట్ట ఒకమూల పెట్టేసి నిలబడి పోయింది. 'లోపలికి రావోయి హరీ!' అన్న భర్తమాటలు వినగానే మరీ చిన్నబుచ్చుకుని అలాగే నిల్చుంది.

హరిప్రసన్నుడు ఒకసారి సునీతవైపు చూచాడు. ఆతరువాత తల వంచుకుని గదిలోకి వచ్చాడు. వచ్చివచ్చి ఒక కుర్చీ కనిపించగా అందులో కూర్చున్నాడు.

ఈలోగా సునీత... నడుముచుట్టూ బిగించుకొన్న చీర కొంగు విప్పేసింది. తలమీదికి ముసుగు సవరించుకుంది. వాళ్ళిద్దరూ లోనికి వచ్చిన ద్వారంగుండానే తాను బైటికి వెళ్ళాలి. వెళ్ళిపోవడానికి అవకాశంకోసం ఎదురుచూచింది. వాళ్ళు లోపలికి వచ్చాక తాను బయలుదేరింది వెళ్ళి పోటానికి.

శ్రీకాంత్ ఇంకా నిల్చునే ఉన్నాడు. చీపురుకట్ట ఉన్నవైపు నడుస్తూ "అంతా శుభ్రం చేశావల్లే ఉందే... ఇంకా ఆ ఒక్క మూలా మిగిలి ఉన్నట్టుంది—" అంటూ నవ్వాడు. ఈ రెండు మూడు సంవత్సరాలనుంచీ ఇంత సహజంగా సునీతతో తానెప్పుడూ ప్రసంగించియుండలేదని శ్రీకాంతుని హృదయానికి తోచింది.

శ్రీకాంతుడు అంతసరదాగా, సహజంగా అన్న మాటలకు సునీత సంతోషించింది. కాని వినిపించుకోకుండా వెళ్ళిపోతూనేఉంది. ఛీ ఛీ, కు స్త్రీపట్టేందుకు తయారైనట్టుగా వేషం తనూ! అక్కడ ఉండకూడదు - వెళ్ళిపోవాల్సిందే.

"ఆగు, ఆగు, వెడతావేం? అంతా శుభ్రం చెయ్యకుండానే? పైగా, ఇడిగో హరిప్రసన్నుడు."

సునీత ఒక విషమావస్థలో పడ్డది. వెంటనే వెళ్ళలేకపోయింది.

ఇంతలో శ్రీకాంత్ ఆమూలనున్న చీపురు తెచ్చి ఆమె కివ్వబోతూ "ఇదిగో, తీసుకో, ఆమూలకూడా శుభ్రం చేసివెళ్ళు" అన్నాడు.

"మీరూ భలేవారేనండీ" అంటూ, తలమీది మేలి ముసుగు సవరించుకుంటూ బైటికి వెళ్ళిపోయింది సునీత.

## 10

శ్రీకాంతుడుకూడా వచ్చి హరిప్రసన్నుడికి దగ్గరగా ఒక కుర్చీలో కూర్చున్నాడు. హరిప్రసన్నుడు గది అంతా చూచాడు. ఆగదిని యావత్తూ ఒక్క గుక్కలో తాగివేద్దా

మన్నట్టుగా ఉన్నాయి అతని చూపులు. గదిలోని ఏవస్తువు మీదా అతనిదృష్టి లగ్నమౌతున్నట్టు లేదు. గదిమధ్య శూన్యప్రదేశంలో చూస్తున్నాడు. ఆ శూన్యాన్ని విడిచి పెట్టి...రూపస్పర్శగంధాది గుణాలుగల ఏ పదార్థంమీదా అతని చూపు పడటంలేదు. ఆ గది ఆత్మను ఆ శూన్యంలో తాను అవలోకిస్తున్నట్టుగా ఉన్నాడు.

అతడు చాలా యిళ్ళు చూచాడు. పెద్ద పెద్ద భవనాల్లోకి వెళ్ళాడు. కాని వాటిలో తన్ను ఆకర్షించగల పదార్థమేదీ కనిపించలేదు. నిర్మముడైన విరాగిలాగే తనకేమీ సంబంధం లేనట్టు చూచి వచ్చేసేవాడు. ఈగదిలో పైన కప్పు ఉంది; క్రింద తివాచీ ఉంది; వాకిలి, కిటికీలు ఉన్నాయి; ఏవో సామానులుకూడా ఉన్నాయి. అన్ని గదుల్లాగానే ఉంది ఇదిన్నీ. గదులు ఇంతకన్నా వేరేవిధంగా ఎలా ఉంటాయి? 'ఇల్లు' అంటే హరిప్రసన్నడికి...నాలుగు రోజులు కాలక్షేపంచేసి మళ్ళీ అక్కడినుంచి ప్రయాణమై పోయే ఒక తాత్కాలికమైన బస అని అర్థం. ఇళ్ళూ వాకిళ్ళూ తదితర వస్తువులూ అన్నీ మానవనిర్మితాలు. అన్నిటికీ ఆయుఃపరిమితి ఉంది. చివరకన్నీ చిందరవందర అయిపోయేవే అని అతని నమ్మకం. కాని ఆ గదిలో కూర్చోగా కూర్చోగా అక్కడి శూన్యప్రదేశంలో ఏదో సజీవపదార్థం ఉన్నట్టు గోచరమౌతోంది. ఆ సజీవశక్తిలో తానూ లీనమౌతున్నాడు; మళ్ళీ బైటికి వస్తున్నాడు. తాత్కాలికములైన 'బస'లు మాత్రమే కానట్టి కొన్ని గృహాలుకూడా ఉంటాయి కామాలు! ఇటువంటి ఒక గృహంలో భార్య, బిడ్డలు,

బంధువులు... పరివారం చాలా ఉంటుంది. వీరందరి ఆశలు-ఆకాంక్షలు, సుఖదుఃఖాలు, ప్రేమలు-కోపాలు ఆ గృహంలో శిశువులవలె గంతులు వేస్తూ పెరుగుతూ ఉంటాయి. వీటన్నిటినీ సాక్షీమాత్రంగా, అధిష్ఠాతయై చూస్తూ ఉంటుంది గృహం. దానికి ప్రత్యాశ ఏమీలేదు. అటువంటి యింట్లో నేనా హరిప్రసన్నుడు ఇప్పుడు కూర్చున్నది? ఆ యింటి ఆత్మ అతని ఉచ్ఛ్వాసనిశ్వాసాలతోపాటు అతనిలోనికి ప్రవేశిస్తున్నది, తిరిగి బైటికి వస్తున్నది. అతని అప్పటి స్థితి ఎలా ఉందో అతనికే తెలియాలి.

"నువ్వు భోజనం ఎప్పుడు చేస్తావు? ఏమేమి కూరలు నీ కిష్టం?" శ్రీకాంత్ అడిగాడు.

"నా భోజనానికి ఒక వేళ అంటూ లేదు. ఫలాని కూరలే కావాలనే పట్టింపూ లేదు."

"అలా కాదు, నీకిష్టమైన కూరలేమిటో చెప్పు. ఈ రాత్రి పడుకోటానికి నువ్వు మళ్ళీ ఎక్కడికో వెళ్ళటం నా కిష్టంలేదు. చెప్పు, ఏం కూరలు చేయించమంటావు?"

"ఏకూరలైనా సరే, నాకన్నీ రుచిగానే ఉంటాయి."

"అదేం మాట? నన్నడిగితే... నాకు సొరకాయకూర ఇష్టం ఉండదు. ఇంకా చూడు, (తలుపుమీద గణగణ శబ్దం వినిపిస్తుంది.) టెలిఫోను గంట మోగుతోంది. నేను చెప్పటం లేదూ? దబ్బున చెప్పు. ఆమె అదే అడుగుతుంది; ఏంకూరలు వండమంటావు? ఇష్టమైనవే వండించాలి; ఇష్టంకానివి వండించకూడదు; నాపని అంతే. (గణగణ చప్పుడు) చెప్పు, చెప్పు. టెలిఫోన్ జోరు విన్నావుగా! చప్పున తేల్చు"

"తేల్చేది ఏముందీ?"

"రోజూ నువ్వు ఏమేం కూరలు తింటూ ఉంటావో చెప్పవయ్యా స్వామీ!"

"రోజూసంగ తెందుకు? ఏమి ఉంటే అదే తింటాను."

"నువ్వు బలే చిత్రమైనవాడివి. ఆవిడ మళ్ళీ టెలిఫోన్ మోగిస్తుంది. దబ్బున చెబుదూ?"

హరిప్రసన్నుడు కొంచెం ధైర్యం తెచ్చుకుని "నేను అన్నం తినను. కాని..." అన్నాడు.

"కాని... ఏమిటి? నిన్ను అన్నం తినిపించాల్సిందే, నువ్వు తినాల్సిందే. అన్నం తినకుండా బలే పైల్వాను వయ్యావులే. (గణగణచప్పుడు) అరె, వస్తున్నా, వస్తున్నా."

హరిప్రసన్నుడు మాటాడలేదు. ఒకపక్క తలుపు మీద గణగణ చప్పుడు మరోవంక శ్రీకాంత్ మరీ తొందరచెయ్యటం అతని మనస్సు ఏమిటోగా ఉంది. ఆ గణగణచప్పుడు వెనకాల ఏం మంత్ర ఉన్నట్టు? అది వినగానే శ్రీకాంత్ అలా వ్యాకులపడతాడేం? అంత తొందరపాటు కనబరుస్తాడేం? ఇదంతా హరిప్రసన్నుడికి అర్థంకాలేదు. పైగా బాగుండలేదు కూడాను. శ్రీకాంత్ చూపిస్తున్న ఆదరణ అంతా అసహజంగా కనిపించింది అతనికి. అదంతా తాను ఆశించటంలేదు. ఆదరణ ఆదరణగాలేదు. తనపట్ల సానుభూతి ప్రకటిస్తున్నట్టుగా ఉంది. అతనికి ఆ యింట్లో భోజనం చెయ్యాలనే ఉంది. భోజనానికి ఆతృతపడుతున్నాడు కూడాను. కాని పైకిమాత్రం "శ్రీకాంత్! నేను అన్నం

మాత్రం తినటం లేదోయి; అయినా నీకు కోపం తెప్పించటం నాకు ఇష్టంలేదు" అన్నాడు.

"ఎందుకు తినవో చూస్తాగా! ఈ పిచ్చివేషాలన్నీ ఇక సాగవులే. సరే, నేనిప్పుడే వస్తాను. నువు కాస్త విశ్రాంతి తీసుకో" అని పలికి, శ్రీకాంత్ ఉరుకుకుంటూ వెళ్ళిపోయాడు.

# 11

"వారు భోజనం చేస్తారా?"- వంటింటి గుమ్మంలో నిల్చుని సునీత అడిగింది.

"ఏం? భోజనం వడ్డించటానికి భయంగా ఉందా?" - శ్రీకాంతుడు ప్రతిప్రశ్న వేశాడు.

"అన్నంలోకి ఏం చెయ్యను?"

"ఏం చేస్తావు? అదే ఇప్పుడు సమస్య. అతడేమో అన్నం తినడట. అదేం పిచ్చో మరి! పళ్ళేమన్నా ఉన్నాయా? లేకపోతే తెప్పించు. అతనిచేత ఏకాస్త అయినా అన్నంకూడా తినిపించాల్సిందే. తెలిసిందా?"

"ఇంట్లో పళ్ళేమీలేవు. ఎవర్ని పంపించి తెప్పించనూ? కుక్కనా?"

శ్రీకాంత్ తెల్లబోయాడు. "ఏం - ఏం? మున్షీ రాలేదా?" మున్షీ వచ్చేసమయం కాదది. అదీగాక పళ్లు బజారునుంచి కొనుక్కురావటం మున్షీ చేసేపనికాదు. ఆ సంగతి శ్రీకాంత్‌కు జ్ఞాపకంవచ్చి ఆలోచనలో పడ్డాడు. "సరే, ఏదీ, నేనే పోయి తీసుకొస్తాను" — అన్నాడు.

సునీత కోపంగా కూరలసంచీ తెచ్చి అతని చేతిలోకి విసరివేసింది. ఒక రూపాయికూడా ఇచ్చింది. "చప్పున పట్టుకురండి. బేరంచేసి మంచివి తెండి" – అన్నది.

ఆ మె మనస్సులో మిక్కిలి బాధగానే ఉంది : ఆ గదిలో నడుముకు కొంగు బిగించి కుస్తీపట్టటానికి సిద్ధమై నట్టుగా ఉన్న తన వేషం అతడు చూడలేదు కద!... నౌకర్లను పెట్టుకోటం నాకు ఇష్టంలేదు. ఒకడు యజమాని, మరొకడు నౌకరు అన్న హెచ్చుతగ్గులు నాకు రుచించవు. అందరూ మనుషులే. నౌకర్లన్నవాళ్ళు కూడా మనుషులే. ఇంటి పనులకుగాని, వంటపనులకుగాని నాకు ప్రత్యేకంగా నౌకర్లంటూ అక్కర్లేదు. కాని ఇప్పుడు చూడు ! ఆయనే స్వయంగా సంచీ తీసుకుని బజారుకు వెళ్ళాల్సివచ్చింది. స్నేహితుడు వచ్చి కూర్చున్నాడు ఇంట్లో. అతనితో కలిసి మాట్లాడుతూ కూర్చోటానికి వీల్లేకపోయె. నౌకరుఅంటూ ఉంటే ఇలాంటి పనులన్నీ చూస్తాడు. ఏమైనాగానీ ఒక నౌకర్ని పెడతాను...... నడుముకు కొంగు బిగించుకుని ఉన్న నా ఆకారం చూచి అతడు ఏమనుకున్నాడోకదా ! అతనికోసం అన్నంలోకి ఏం చెయ్యను ? పళ్ళేతింటాడటగా ! అన్నం అసలేతినడా ? గడ్డం బాగా పెరిగిపోయింది; ఏం బాగులేదు. ఎక్కడ కనిపించాడో ? ఎక్కడెక్కడ తిరుగుతూ ఉన్నాడో! — వంట యేర్పాట్లుచూచుకుంటూ ఇలా పరిపరివిధాల అనుకుంటోంది.

"ఇదిగో, తీసుకో" - అంటూ వచ్చాడు శ్రీకాంత్.

ఆమెకు మళ్ళీ కోపం వచ్చింది—నౌకరే వుంటే ఈయన బజారుకు పరిగెత్తాల్సిన అవసరం ఉండేది కాదు గదా! ఇకనైనా నౌకరు లేకుండా నేను వుండలేను. "ఏమేం తెచ్చారు? అరె, చాల డబ్బు ఖర్చుపెట్టుకొచ్చినట్లున్నారు. పళ్ళుకూడా నిలవ పళ్ళులా ఉన్నాయి. తాజాగా లేవే" అన్నది.

"సరే,సరే; హరిప్రసన్నుడు ఇంతసేపటినుంచీ ఒక్కడే వున్నాడక్కడ; వెడుతున్నా."

హరిప్రసన్నుడి పేరు వినేసరికి ఆమె కోపమంతా దిగజారిపోయింది. "మంగలివాడిని పిలిపించి ఆ గడ్డం అదీ బాగా తీయించేద్దురూ! చాల అసహ్యంగా ఉంది" అన్నది.

ఆమాట వినగానే శ్రీకాంత్‌కు ఆశ్చర్యం, ఆనందం కలిగాయి. అతనికి అంతకన్నా కావలసిందేమిటి? తన భార్య తన మిత్రునిపట్ల ఉపేక్షాభావంతో లేదన్నమాట. అతన్నిగురించి ఆలోచిస్తునే ఉన్నదన్నమాట!

"ఔనౌను. గడ్డం బాగా పెరిగిపోయి వికృతంగానే వుంది. మంగల్ని పిలవాల్సిందే... ...ఎక్కడ దొరికితే పట్టుకొచ్చానో తెలిసిందా? సభ జరుగుతుంటే వెళ్ళాను కదూ! ఆ బైటే కనిపించాడు. సామాను ఎక్కడో ఒక యింట్లో పెట్టాడట. జేబులో అయిదు అణాలు మాత్రమే ఉన్నాయి."

"అంత కష్టపడటం దేనికి? మనింట్లోనే వుండమని చెప్పకపోయారూ?"

"చెప్పకేం, చెప్పాను. కాని అతడు ఏమంటున్నాడో తెలుసునా? ఎవరింట్లోనూ ఉండడట! ఆతనికి పట్టిన పిచ్చి అంతా వొదిలించెయ్యాలి. ప్రపంచాన్ని వొదిలేసి ఏకాకై పోవటంలో అతని ఉద్దేశంఏమిటి? కష్టం, దుఃఖం బాగా తెలిసివచ్చినాకూడా అందులోనే పడిఉంటానంటాడు; దాని అర్థం ఏమనుకోవాలి?"

"పూరీలు చేస్తాను. గారెలైతే పిండిరుబ్బటం ఆలస్య మౌతుంది" – అన్నది సునీత... శ్రీకాంతుడు చెబుతున్న విషయమంతా... హరిప్రసన్నుడూ మొదలైన ఇతర బాహ్య విషయాలన్నీ... తనకేమీ పట్టవన్నట్టు. "పూరీలే చెయ్య మంటారా?"

"ఆఁ చెయ్యి. ఒక్కడే కూర్చుని గోడకేసి చూచు కుంటూ ఉంటాడు; వెడతాను."

"పూరీ, కూర చేస్తాను. అన్నం తిన డన్నారుగా. అయితే ఒక్క కూర చాలు—మంగలిమాట మరచిపోకండి."

"ఔనౌను" అని శ్రీకాంత్ నవ్వుకుంటూ ప్రసన్న చిత్తుడై వెళ్ళిపోయాడు.

## 12

ఆ పఠనమందిరంలో హరిప్రసన్నుడు కూర్చుని ఉన్నాడు. మనస్సు ఉల్లాసంగా లేదు. పైగా ఒక్కడే కూర్చోవలసివచ్చింది. ఏమీ బాగుండలేదు. శ్రీకాంత్ తనను అక్కడ విడిచిపెట్టిపోయి ఎంతసేపటికీ రాడేం? సరే రాకపోతే రాకపోయినా డనుకుని గది అంతా కలయ

చూచాడు. బీరువాలన్నీ చాల పరిశుభ్రంగా ఉన్నాయి. వాటిలో పుస్తకాలు చక్కగా అమర్చి ఉన్నాయి. ఆ వైపు చిన్న బీరువా ఒకటి ఉంది. దాని పై అరలో ఒకేసైజులో ఉన్న పుస్తకాలు అమర్చి ఉన్నాయి. వాటిమీద బంగారు అక్షరాలతో వాటిపేర్లు ముద్రించి ఉన్నాయి. మెరుస్తున్నవి ఆ అక్షరాలు. హరిప్రసన్నుడు వాటిని చూచాడు. లేచాడు. దగ్గరకు వెళ్ళాడు. ఈ పుస్తకాలన్నీ లెదర్ బైండు చేసి ఉన్నవి. వీటిని ఇంత చక్కగా ఒకదాని పక్కన ఒకటి అమర్చి ఎవరబ్బా చాల శ్రమపడ్డారు? ఇలా అందంగా అమర్చిన ఆ చెయి ఎవరిది? అనుకుంటూ షెల్లీకవిరాసిన కావ్యసంపుటి అందులోనించి బైటికి తీశాడు. తిరిగి తన కుర్చీలో వచ్చికూర్చుని పేజీలు తిరగవేశాడు.

అక్కడక్కడ కాస్త చదివాడు. చివరకు పుస్తకం మూసేసి ముందున్న మేజాబల్లమీద పెట్టాడు. అతని మనస్సు సరిగాలేదు. ఇంత ఆలస్యమైనా శ్రీకాంత్ ఇంకా రాడేం? అతనికి ఆశ్చర్యం కలిగింది; కోపంకూడా వచ్చింది.

శ్రీకాంత్ రానేలేదు. హరిప్రసన్నుడు మళ్ళీ షెల్లీ కావ్యసంపుటి తీశాడు. మొదటిపేజీ ఖాళీగా ఉంది. పైన మాత్రం 'సునీత' అని రాసిఉంది. ఇంగ్లీషు అక్షరాలే. అక్షరాలు ఏమంత అందంగా లేవు. అసలు అందంగానే లేవు. తీరిగ్గా కూర్చుని చక్కగా రాసినట్టు కనిపించదు. సావకాశం లేక ఎక్కడికో తొందరగా వెళ్ళిపోతూ గబగబ గీకినట్టుగా ఉన్నాయి. చివర ఒక చుక్క ఉంది. కింద చకచక గీసిన ఒక గీత ఉంది. కాగితంమీద అక్షరాలు రాస్తే కుడి

వైపుకు వాలిఉండాలి. ఈ అక్షరాలు అలాముందుకు ఏట వాలుగా లేవు. తలలు వెనక్కు ఒరిగి ఉన్నాయి; పాదాలు ముందుకు తోసుకొచ్చాయి. అందుచేత జేబులోనుంచి ఫౌంటెన్ పెన్ తీశాడు. ఆ అక్షరాల క్రిందనే చక్కగా ఎలా రాయాలో సూచిస్తున్నట్టుగా పట్టిపట్టి రాశాడు: 'సు-నీ-త' అని. ఆతరువాత అతనికి ఏమాలోచన తట్టిందో మరి! ఆ పేజీలోనే ఇంకా నాలుగైదు చోట్లకూడా రాశాడు: 'సు-నీ-త' అని. రాస్తూ రాస్తూ 'ఈపేరు ఇలా రాయాలి' అని అనుకుంటూ రాశాడు. తాను రాసిన అక్షరాల్ని చూచి చూచి, చివరకు పేరుపక్కన 'దేవి' అని కూడ కలిపాడు. ఈ రెండు అక్షరాలూ ఒక వైపు ఎక్కువయ్యేసరికి ప్రపోర్షన్ చెడినట్టు తోచింది. అందుచేత శ్రీమతి అనే పదాన్ని వెనుకపక్కన చేర్చాడు. 'శ్రీమతి సునీతాదేవి' అయింది. పేజీమీద ఆవిధంగా అంకితమైయున్న 'శ్రీమతి సునీతాదేవి'నిచూస్తూ కూర్చున్నాడు. 'ఇలా ఉండాలి పేరు' అనుకున్నాడు. సిరా బాగా ఆరిపోయింది. పుస్తకం మూసేసి బీరువాలో యథాస్థానంలో పెట్టేశాడు. ఇంకా కొన్ని పుస్తకాలు బీరువాలోనుంచి బైటికి తీసి చూచాడు. ఆయా గ్రంథ కర్తల పేర్లు చూచి కాదు; వాటి అందాన్ని చూచి బైటికి తీశాడు. అన్నింటిలోనూ మొదటిపేజీలో 'సునీత' అని రాసి ఉంది. ఈ అన్నిపుస్తకాల్లోనూ ఆ పేరు సరిజేసి తిరగ రాయవలసిన భారాన్ని అతడు మీాద వేసుకోలేదు. ఇంతలో ఇంకో చిన్న గ్రంథం కనిపించింది. దాన్నీ తీసి చూశాడు. అదొక కావ్యసంపుటి. దానిలో మాత్రం మొదటిపేజీలో

'శ్రీమతి సునీతాదేవి, మెట్రిక్ క్లాస్' అని బహు సుందర మైన అక్షరాల్లో రాసిఉండటం కనిపించింది. ఆపక్కనే అట్టకు రెండోవైపున అతికించిఉన్న ఒక కాగితాన్నిబట్టి అతనికి అర్థమైంది: ఈపుస్తకం ఆమెకు 'మ్యూజిక్'(సంగీతం)లో ప్రథమ బహుమతిగా ఇచ్చినట్టు. మ్యూజిక్!-అతని మనస్సు కలవరబడిపోయింది. వెంటనే పుస్తకం మళ్ళీ బీరువాలో పెట్టేశాడు. గదిలో పచార్లు ఆరంభించాడు. పైన ఒకచోట ఫిడేలు ఉంది. ఒకమూల సితారా దుప్పటి ముసుగేసుకుని పడిఉంది. హార్మోనియంకూడా ఉంది. 'ఎక్కడో తబలాకూడా ఉండిఉండాలి' అనుకున్నాడు హరిప్రసన్నుడు. అతనికి మనస్సంతా చెదరిపోయినట్టయింది. "శ్రీకాంత్ ఇంత ఆలస్యం చేస్తున్నాడేం? భలే గృహస్థుడే అయినాడు చివరకు" అనుకున్నాడు. గదిలో అటు ఇటు దురుసుగా పచార్లు చేస్తున్నాడు.

మరికాసేపటికి మళ్ళీ బీరువాదగ్గరకు వచ్చాడు. అందులోనుంచి బెర్నార్డుషా రాసిన కొత్తనాటకం ఒకటి బైటికి తీశాడు. కుర్చీలో కూర్చుని చదవటం మొదలు పెట్టాడు. అతనికి షా రచనలు నచ్చవు. అయినా పొద్దు పోవాలిగా! షా ఒక పంక్తిలో చెప్పింది మరో పంక్తిలో కాదంటూ ఉంటాడు. చదువుతున్నాడేగాని మనసుకేమైనా ఎక్కుతోందా అంటే......ఏమీలేదు. నాలుగైదుపంక్తులు చదివి పుస్తకం మూసేశాడు. "శ్రీకాంత్ వెళ్ళినవాడు అక్కడ ఇంతసేపు ఏం చేస్తున్నట్టు?" అనుకున్నాడు. మళ్ళీ షా పుస్తకం తెరిచాడు. మొదటిపేజీలో 'సునీతా శ్రీకాంత్'

అని రాసివుంది. దానిక్రింద 5-6-32 అని తేదీకూడా ఉంది. 'సునీతా శ్రీకాంత్ !' హరిప్రసన్నుడా పేరు చదివాడు. సునీతను ఎరిగున్నాడు, సరే; శ్రీకాంతునికూడా ఎరిగే ఉన్నాడు. అయితే మధ్య కామా లేదు; and (మరియు) అనే పదంకూడా లేదు. అటువంటప్పుడు 'సునీతా శ్రీకాంత్' అంటే ఎవరనీ అర్థం? సునీత, సునీతాదేవి, శ్రీమతి సునీతాదేవి అనబడే ఆవిడ 5-6-32 తేదీన 'సునీతా శ్రీకాంత్'గా మారినట్లు దీని అర్థమా? ఇది చాల విచిత్రంగా ఉందే. ఈపేరు మార్చేసి మామూలుగా 'శ్రీమతి సునీతాదేవి' అని తిరగరాద్దామా అనిపించింది అతనికి. లేకపోతే 'సునీతా శ్రీకాంత్' అన్న పేరుకుముందు మిసెస్ అని కలుపుదామనుకున్నాడు. ఈపేరు సునీతాదేవే స్వయంగా రాసుకుని వుంటుంది. కాని మిసెస్ అని లేకుండా వట్టి 'సునీతా శ్రీకాంత్' అన్న పేరు అతనికేదో బాధ కలిగించింది. జేబులోనుంచి ఫౌంటెన్‌కలం తీశాడు. పరిష్కరిద్దామని అతని ఉద్దేశం. కాని చెయి సాగలేదు. 'ఇక్కడ మనం చెయి పెట్టడానికి వీల్లేదు - ఇది మనకు నిషిద్ధక్షేత్రం' అనిపించింది. పుస్తకం మూసేసి మేజామీద పెట్టాడు. లేచి మళ్ళీ పచార్లు ఆరంభించాడు. అతని మనస్సులో ఏవో ఆలోచనలు సందడించాయి: "వివాహమై ఒకడికి భార్య ఐపోవటంతోనే ఆడుది తన పేరుకూడా కోల్పోవలసిందేనా? అంతవరకూ ముక్కు మొగం ఎరగని ఒక పురుషుని పేరు తెచ్చుకుని, దాన్ని తనపై గొడుగులా మూసేసుకుని, అందులో చాటున ఉండిపోవాల్సిందేనా?"

ఇంతలో శ్రీకాంత్ వచ్చాడు, "హరీ! క్షమించాలి, ఆలస్యమైంది" అంటూ.

హరిప్రసన్నుడు అతనివైపు చూచాడు. "అమ్మయ్య! చివరకు ఎలాగైతేనేం, సెలవు దొరికి బైట పడ్డావన్నమాట!"

"అప్పుడే ఏమైంది? ఇంకో నిమిషంలో మళ్ళీ పిలుపు రావచ్చు. సంసారం అంటే, ఇదొక జంజాటం అనుకో. ఇందులో సెలవు దొరకటం కష్టం."

"ఇంకా పనేదన్నా ఉంటే పూర్తిచేసుకురా. నాకేం అభ్యంతరం లేదు."

"పనేం లేదులే. ఇంట్లోనేమో నౌకరు లేడు. అందు చేత నేనే బజారుకు పరిగెత్తి పళ్ళు తీసుకొచ్చాను. ఆలస్యం అయింది."

పచార్లుచేస్తోన్న హరిప్రసన్నుడు నిల్చిపోయాడు. "నౌకరును పెట్టుకోలేదా యేమిటి?"

శ్రీకాంత్ నవ్వాడు. ఊహుఁ, అదే - చెప్పానుగా; నేనే పోయి పళ్ళు తెచ్చిపెట్టి ఇలా వస్తున్నాను. కాని..."

"నౌకరును ఎందుకు పెట్టుకోలేదు? అంట్లూ చెంబులూకూడా ఆమెగారే తోముకుంటోందా?"

శ్రీకాంత్ ముఖం విప్పారింది – "లేకపోతే ఎవరు చేస్తారు? అంట్లు తోమటమే కాదు; పాచిపనులన్నీ ఆవిడే చేసుకుంటుంది. చీపురుపట్టి ఇళ్ళన్నీ ఆవిడే ఊడ్చుకుంటుంది. నాకేం? హాయిగా తింటున్నాను, తాగుతున్నాను; ఠీవిగా కచేరీకి వెడుతున్నాను. ఆడవాళ్ళ అభిప్రాయాలు విపరీతంగా ఉంటాయి సుమీ! నేనొకసారి అన్నాను: 'ఒకడు మరొక

డిని నౌకరుగా ఉంచుకునే హక్కు లేదేమో!' అని. ఆవిడ ఆ మాట పట్టేసింది. ఆనాటినుంచీ ఇంట్లో నౌకర్ని పెట్టుకోటానికి వీల్లేదని ఒక నిర్ణయానికి వచ్చేసింది. నేను ఎన్నిసార్లో చెప్పాను : "ఏదో ఒకమాట పట్టుకుని హఠం చెయ్యకూడదు. నౌకర్ని పెట్టుకో" అని. కాని ఆమె వింటేనా? పట్టుదల పట్టాక ఎంతచెబితే ఏం లాభం?"

హరిప్రసన్నుడు గంభీరముద్ర తాల్చాడు. "అలా వల్లకాదు శ్రీకాంత్! ఆదర్శాలు నాకూ తెలుసు! నౌకరును పెట్టుకున్నంతమాత్రాన... అతన్ని పీడించి, పిప్పిచేయటానికి అధికారం మనకు సంక్రమించినట్టు కాదు. నువు నౌకర్ను తప్పకుండా పెట్టుకోవల్సిందే. భార్య అంటే దాసి కాదు సుమా!"

శ్రీకాంత్ హరిప్రసన్నుని చేతులు పుచ్చుకొని బతిమాలాడు : "ఆవిడతో ఆమాటే నువ్వన్నా చెప్పి ఒప్పించు బాబూ! చెప్పిచెప్పి నాకు విసిగెత్తిపోయింది. నీమాట ఒప్పుకుంటుందిలే. ఇన్నిసంవత్సరాల తరువాత నువు మా యింటికి వస్తే, నిన్ను ఇక్కడ ఒంటరిగా దిగబెట్టి, పళ్ళకోసం నేను బజార్లు తిరుగుతూ ఉండటం, నాకు బాగుందంటావా? సరే, మెడమీది ఉత్తరీయం తీసి అక్కడ పడెయ్యి. గాలి ఆడనీ. హాయిగా కుర్చీలో వెళ్ళి కూర్చో."

హరిప్రసన్నుడు కుర్చీలో కూర్చుంటూ "ఆలస్యమైపోతోంది; నేను మళ్ళీ వెళ్ళాలి" అన్నాడు.

"అయితే లోపలికి వెళ్ళి 'నాకు బాగా ఆకలి వేస్తున్నది. దయచేసి వంట దబ్బున చెయ్యండి' అని అడుగు."

ఈమాట హరిప్రసన్నుడికి ఎబ్బెరికంగా వినిపించింది. మాటాడకుండా కూర్చున్నాడు. చివరకు శ్రీకాంత్ అడిగాడు: "హరీ! తలమీద ఆ బారెడెదిగినజుట్టూ, గుబురుగా పెరిగిన గడ్డం నీకు ఎంతో అందాన్ని చేకూరుస్తున్నట్లు భావిస్తున్నావా?"

హరిప్రసన్నుడికి కోపం వచ్చింది: "నీ ప్రశ్న నా కర్థం కావటంలేదు. సభ్యతకూ, సౌందర్యానికీ గడ్డంతో సంబంధం ఏముందీ? పైకి కనిపించేదే సౌందర్యం అంటావా? నీకంత అసహన బుద్ధేం? నువు ఎలా ఉన్నావో, ఇతర్లు కూడా అలా ఉండకపోతే అసహ్యించుకుంటావన్నమాట! మీదంతా తప్పుడు త్రోవే. మీ జీవనవిధానాలన్నీ తప్పుడు త్రోవలోనే నడుస్తున్నాయి; అసహజంగానే ఉంటున్నాయి. సహజత్వం ఎక్కడా కనిపించదు."

శ్రీకాంత్ పకపక నవ్వుతున్నాడు. "మంగలికి కబురు చేశాను; వస్తూ ఉండాల్లే."

మరికాసేపటికి తలుపుమీద గణగణ మోగింది. "వంటైంది రావచ్చు" - అంటూ దూరంనుంచి పిలుపు వినిపించింది.

"వస్తున్నాం, వస్తున్నాం" - అన్నాడు శ్రీకాంత్.

"భోజనం ఇక్కడికే తెప్పించుకుని తింటే బాగుంటుందేమో!" - అన్నాడు హరిప్రసన్నుడు.

"వంటిల్లు ఉండగా ఇక్కడెందుకూ?"

హరిప్రసన్నుడు తన్ను తాను సంబాళించుకుంటూ "అందువల్ల ఆమెగారికి కష్టం... ..."

శ్రీకాంత్ విరగబడి నవ్వాడు. "కష్టంమాట కేంగాని మొదట నీ మొగం అద్దంలో చూచుకో."

హరిప్రసన్నుడు మండిపడ్డాడు. "నీ పరాచికాలు మానెయ్యి. మన్మథుడులా తయారుకావాలన్న కోరిక అవసరం లేదు నాకు. ఇంతకూ నా పదిహేను రూపాయల మాట జ్ఞాపకం ఉందా నీకు?"

"పదిహేనురూపాయలా! ఔనౌను. అవైనా ఆవిడ నడగాల్సిందే. అంత పెద్దమొత్తం నాదగ్గర ఆమె ఎప్పుడూ ఉండనీదు. అయినా, నువు ఆవిడనడిగితే కాదనదులే."

హరిప్రసన్నుడు పెదవి కొరుక్కున్నాడు. "అదంతా నాకు తెలియదు. నాకుమాత్రం పదిహేను రూపాయలు కావాలి."

"నేను బలంగానే సిఫార్సు చేస్తాలే."

ఇంతలో సునీత ద్వారందగ్గరకు వచ్చేసింది. "వంటైంది. ఎన్నిసార్లని పిలవనూ?"

శ్రీకాంత్ హరిప్రసన్నుడితో "పదవోయ్ పద" అంటూ లేచాడు. సునీతవైపు తిరిగి "కాని మరి చూచావా! ఈయన గడ్డం గొరిగించుకోడట!" అన్నాడు.

సునీత శ్రీకాంత్ కేసి చురుగ్గా చూచింది. చూచింది, అంతే, శ్రీకాంత్ మళ్ళీ ఆ ప్రసంగం ఎత్తలేదు. "వంటైంది, పదండి" అన్నది.

హరిప్రసన్నుడు మెల్లగా లేచాడు—లేద్దామా, వద్దా అని అనుమానిస్తున్నట్టు. సునీత అతని స్థితిని నిమిషంలో కనిపెట్టేసింది. అరె, ఇతడేనా కష్టాల్ని కొనుక్కు తెచ్చు

కునే సాహసికుడు! అలా సిగ్గుపడిపోతున్నాడేం - అను కుంది సునీత. వెడుతూ వెడుతూ శ్రీకాంత్ వైపు చూచింది. తనముఖంమీద పైనుంచి క్రిందికి చెయి పోనిచ్చింది. పిడికిలి పట్టింది. ఆ పిడికిలిలో ఉఫ్అని ఊదుతూ వేళ్ళు విడిచేసింది. అంటే - 'ఈగడ్డం గిడ్డం పూర్తిగా వొదిలిపోతుంది. తప్పదు' అని ఆమె భావం.

సునీత ముందు వెళ్ళింది. ఆ యిద్దరూ వెనకాల వెళ్ళారు.

## 13

సునీత వంటింట్లోకి తిరిగివచ్చి పొయ్యిమీద తవా రేకు వేసింది. గొట్టంలోనుంచి నిప్పు ఊదుతూ కూర్చుంది. మేలిముసుగు జారిపోయింది. పొగపోయి కళ్ళలోంచి నీళ్ళు కారుతున్నాయి.

శ్రీకాంతునితోసహా హరిప్రసన్నుడు వచ్చాడు. గుమ్మం దగ్గరకు వచ్చి చూచేసరికి స్తబ్ధుడైపోయాడు. కోపంవచ్చిన వాడుమల్లే తీక్షణంగా నేలచూపులు చూచుకుంటూ లోనికి వచ్చి తన కోసం వేసిన పీటమీద కూర్చున్నాడు.

ఇంతకుముందే చూచివచ్చాడు: షేక్స్‌పియర్, షెల్లీ, షా మొదలైనవారి గ్రంథాలమీద కూర్చున్న సునీతను. ఆమెకు సంగీతంలో ప్రథమబహుమతికూడా వచ్చింది. ఆమెను 'శ్రీమతి సునీతాదేవి'నిగా చేసి, చూచిచూచి వచ్చాడు. ఇప్పుడు పొయ్యిమీది తవారేకువైపు చూస్తూ కూర్చున్న ఈమె ఎవరు?

సునీతాదేవి తలమీది మేలిముసుగు మెడకిందికి జారిపోయింది. నిప్పు ఊదుతోంది. ఆ కట్టె, ఈ కట్టె ఎంత పెట్టినా పొయి మండదేం? - అని ఆగ్రహావిష్టురాలౌతోంది. మాటిమాటికీ పొగకమ్మిన కళ్ళలోనుంచి వచ్చే నీరు తుడుచుకుంటోంది...

"మరీ పొగపెట్టేశావే" అన్నాడు శ్రీకాంత్.

సునీత మరోసారి జోరుగా ఊదింది. భగ్గున మంట వచ్చేసింది. అప్పుడామె జారిన మేలిముసుగు సరిచేసుకుంది. ముఖాన పడుతున్న ముంగురుల్ని పైకి తోసింది. సెగకు కందిపోయిన ముఖం ఒకసారి పైటచెంగుతో తుడుచుకుంది.

"ఇప్పుడేనా తవారేకు పొయిమీదకి ఎక్కించావు? నాలుగైదు రొట్టెలు వేల్చింతర్వాత మమ్మల్ని పిలిస్తే బాగుండేదిగా! ఇప్పుడిలా ఊరికే కూర్చుని ఏం చెయ్యాం" అన్నాడు శ్రీకాంత్.

సునీత పెనముమీది రొట్టెను తిరగమరగ వేస్తూ "ఈలోగా పళ్ళు వొలిచి బద్దలు తీయకూడదూ?" అన్నది.

హరిప్రసన్నుడు నేలచూపులు చూచుకుంటూ అలాగే మౌనంగా కూర్చున్నాడు.

శ్రీకాంత్ వెంటనే లేచి కమలాఫలాలు తెచ్చి వొలుస్తూ "హరీ! ఇవాళ పళ్ళు నేను తింటాను. నువు రొట్టెలు తిను. ఏం?" అన్నాడు.

ఈమాటకు వెంటనే జవాబు చెప్పలేకపోతున్నానేమిటి? నోరు పెగలదేం?... అని అనుకుంటూ తలఎత్తకుండా

అలానే కూర్చున్నాడు హరిప్రసన్నుడు. సమాధానం స్ఫురించ నేలేదు; అతడు మాటాడనేలేదు.

కాసేపు అయాక పళ్ళెం ఇలాపెట్టండి అన్న పలుకులు వినిపించాయి. ఆ పలుకులు హరిప్రసన్నుడు అర్థంచేసుకుంటున్నాడు. ఇంతలో శ్రీకాంతుడు తన పళ్ళెం ఒకచేత్తో సునీతవైపు చాచి పట్టుకున్నాడు. సిగ్గుపడుతూ తలవంచుకుని కూర్చున్న హరిప్రసన్నుని దృష్టికి కనిపించింది ఒకహస్తం. దబ్బపండు చాయలో ఉన్న ఒక హస్తం, ఒక చిన్న గిన్నె పట్టుకున్న హస్తం; తనవైపే చాచుకుని వచ్చిందా హస్తం. 'ఏదీ ఇలా తెండి' అన్న మాటలు. ఆవెంటనే మరో అలువంటి హస్తం హరిప్రసన్నుని చేతిలో ఉన్న పళ్ళెం అందుకుంది. మొదటి హస్తం పట్టుకున్న గిన్నె పళ్ళెంలోకి వచ్చింది. హరిప్రసన్నుడు పళ్ళెం మళ్ళీ తీసుకుని ముందు పెట్టుకుని కూర్చున్నాడు తలవంచుకుని.

సునీతకు నవ్వొచ్చింది. మందహాసంచేస్తూ "పళ్ళెం ఇలా పట్టండి, రొట్టెలు వేయించుకోరూ?" అన్నది.

వెంటనే అతడు రెండుచేతులతో పళ్ళెం ముందుకు ఎత్తిపట్టుకున్నాడు. దానితో వంచినతల ఎత్తవలసివచ్చింది. అప్పుడతనికి సునీత ముఖం కనిపించింది. అప్పుడామె పెదవులమీద చిరునవ్వు ఉంది. ముంగురులన్నీ ముఖంమీద పడ్డసంగతికూడా ఆమెకు తెలియదల్లేఉంది. ఆమె ముఖం తీరు చూస్తే హరిప్రసన్నునిమీదికి రెండు మూడు పరిహాస వాక్యాలు విసిరేట్టుగా కనిపించింది. అలా మందహాసంచేస్తూ ఎదుట కనిపిస్తున్న యీావిడ 'శ్రీమతి సునీతాదేవి' కానే

కాదనిపించిం దతనికి. అసలు 'సునీతే' కాదనుకున్నాడు. అతనిమనస్సు అప్పుడు ఎలా ఉందో అతనికే తెలియాలి.

సునీత ఏమీ మాటాడలేదు. రొట్టెలు పళ్ళెంలో వేసింది. మళ్ళీ తన పనిలో నిమగ్నఅయింది.

"హరీ! ఇవాళ నేను పళ్ళే తింటానోయ్. నువు రొట్టెలు తినేసెయ్యి" అన్నాడు శ్రీకాంత్ మరోసారి.

"కాని రొట్టెలు చూచావా, ఎంత పసందుగా ఉన్నాయో!" అన్నాడు హరిప్రసన్నుడు. ఈ సారి గొంతు పెగలించుకొని జవాబు బైటికి వచ్చినందుకు తనకు తానే ఆశ్చర్యపోయాడు.

"అయితే అంత పసందైనరొట్టెలు చూస్తూచూస్తూ వొదులుకునేరకం కాదు నేను" అంటూ శ్రీకాంత్ కమలా ఫలం బద్దలు ఒక చిన్న పళ్ళెంలో పోసి దాన్ని హరిప్రస న్నుని పక్కన పెట్టాడు. అలాంటిదే మరో పళ్ళెం తన దగ్గర పెట్టుకున్నాడు. తన పళ్ళెం ఎత్తి సునీతకు చూపిస్తూ "ఇవాళ నన్ను ఉపవాసం పడుకోబెడదా మనుకున్నా వేమిటి?" అన్నాడు.

"కాస్త ఆగండి; రొట్టె కాలుతోంది. ఇస్తాగా" అన్నది సునీత. కాసేపటికి అతనిపళ్ళెంలోకూడా రొట్టెలు వడ్డించింది.

హరిప్రసన్నుడు విషమావస్థలో పడ్డాడు. ఇటువంటి అవస్థ అతనికెన్నడూ సంభవించలేదు. షేక్స్పియర్, షెల్లీ పుస్తకాలమీది సునీతను అత డెరిగిఉన్నాడు. అటువంటి స్త్రీలను చాలమందినే చూచిఉన్నాడు. కాని రొట్టెలు తిని

పిస్తూన్న ఈ సునీతను-హఠాత్తుగా తనకు వదినెగా కూర్చున్న ఈ సునీతను మాత్రం తాను అర్థం చేసుకోలేకపోతున్నాడు. ఆమెకు తనపేరు మొదట 'శ్రీమతి' పేరుచివర 'దేవి' అనే శబ్దాలు ఉన్నాయన్న విషయమే ఆమె కసలు స్ఫురించదల్లే ఉంది. వదినెనన్న భావమేకాని సునీతనన్న విషయంకూడా మరచిపోయిందా ?

"రొట్టెలు మీకు బాగాలేవా? సహించటం లేదా?" అన్న ప్రశ్న ఒకటి వినిపించగానే హరిప్రసన్నుడు వెంటనే "బాగలేకేం, బాగలేకేం..." అని గొణిగాడు.

"మరి మీరు సరిగ్గా తినటంలేదే! పోనీ సహించక పోతే పోనీండి; పళ్ళు ఉన్నాయిగా."

"లేదులెండి, తింటూనే ఉన్నాగా" అని సమాధానం గొణిగి, హరిప్రసన్నుడు బాగా తింటున్నవాడుమల్లే కనిపించటానికి ప్రయత్నంచేశాడు.

"పళ్ళు అతనిదగ్గరనుంచి తీసేస్తాను. అప్పుడుగాని సరిగ్గా భోజనం చెయ్యడు" అంటూ శ్రీకాంత్ నిజంగానే అతనిపీటదగ్గర పళ్ళబద్దలు ఉన్న పళ్ళెం లాగేశాడు.

సునీత వెనక్కు తిరిగి చూచింది. శ్రీకాంత్ తీసిన పళ్ళెం ఆమెకు చూపించాడు - "ఇవాళ భోజనంముందు మనకు చాల సరదాగాలేదూ?" అంటూ.

"మళ్ళీ అక్కడ పెట్టెయ్యండి" అన్నది సునీత.

శ్రీకాంత్ మళ్ళీ పళ్ళెం అక్కడ పెట్టేస్తూ "తీసుకోవోయి హరీ! కోప్పడకుసుమీ! ఇది నీ సొత్తు" అన్నాడు.

కాసేపయాక సునీత అడిగింది. "భోంచేసి కాసేపు ఉంటారుకదూ !"

సిగ్గుతో కుమిలిపోతున్నాడు హరిప్రసన్నుడు. "చెప్ప లేను. వెళ్ళాలి మొత్తానికి" అన్నాడు.

"ఎక్కడికి పోతారు ?"

"బసకు వెడతాను. బస ఎక్కడంటారా ? అక్కడ ఒక గుడికి సంబంధించిన ధర్మసత్రంలో సామాను పెట్టి వచ్చాను."

"అయితే ఉండరన్నమాట !"

"ప్రస్తుతానికి కొన్నాళ్ళు ఢిల్లీలోనే ఉందామని ఆలోచిస్తున్నాను. అప్పుడప్పుడు వచ్చిపోతుంటాలెండి. అయినా అందువల్ల మీకు కష్టం కలిగించటమేగా !"

సునీత తలెత్తి చూచింది. "అయితే వచ్చిపోతుంటా రన్నమాటే కదూ!" అని పలికి శ్రీకాంతుని వైపు చూపిస్తూ "మావారు స్నేహితులెవరూ లేక తోచకుండా ఉంటూం టారు. మిమ్మల్ని తరచు అనుకుంటూంటారు" అని చెప్పింది.

"అయితే నేనెవరో మీకు తెలుసన్నమాట !"

"ఔను. వారు చెబుతుంటే విన్నాను. మీరింక కష్ట పడాల్సిన అవసరంలేదు. ఇంతవరకూ చాల కష్టాలే పడ్డారు. మేము వుండగా మీకేం పరవాలేదు."

శ్రీకాంతుడు రొట్టెలన్నీ ఆప్యాయంగా తిన్నాడు. "ఏదీ, ఇంకో రొట్టె రానియ్యి. మనం యీాయనకుమల్లే ఫల హారులం, మితాహారులం కాదు" అన్నాడు.

"ఇదిగో పట్టండి" అంటూ సునీత శ్రీకాంతుని పళ్ళెంలో ఒక రొట్టె ఉంచింది. హరిప్రసన్నునివైపు తిరిగి "మాయిల్లు మీయిల్లు కాదా? సత్రంనుంచి సామానుకూడా తీసుకురాకపోయారూ?" అని అడిగింది.

హరిప్రసన్నుడి కంఠస్వరంలో కాఠిన్యం వచ్చింది. "ధర్మసత్రంలోనే ఎందుకుంటాను? ఈ ఊళ్ళోనే ఉండిపో వలసివస్తే ఏదో ఏర్పాటు చూచుకుంటాను. అయినా నేను ఒకచోట అంటిపెట్టుకుని ఉండేవాడిని కాదు. ఇల్లు, వాకిలి అంటూ ఏర్పరచుకుని మానవుడు సంకుచితుడైపోతాడు. ఆ దారి నాకు అక్కర్లేదు..."

సునీత వెంటనే ఏమీ మాటాడలేదు. రొట్టెలు పేలుస్తూఉంది. అతనిమాటల్లో ఎక్కడో ఏదో కాఠిన్యం ఉన్నట్టు ఆమెకు స్ఫురించింది. అదే ఆమెకు చాల చిత్రమని పించింది. ఈయింట్లో వచ్చి ఉండటానికి అతనికి ఇష్టం ఉన్నట్టే ఆమెకు స్ఫురించింది. ఆ యిష్టం అతని హృదయంలో అజ్ఞాతంగా, రహస్యంగా ఉందేమో! అది తెలుసుకోవాలి. ఈవ్యక్తి జేబులో అయిదు అణాలుమాత్రమే పెట్టుకుని ఏమిచెయ్యాలని ఆలోచిస్తున్నట్టు? వట్టి అమాయకుడులా ఉన్నాడు. అయినా ఇంత అనుభవశాలి ఎలా అయినా డబ్బా! ఇతని అంతేమిటో కనుక్కోవాల్సిందే.

"హరీ, నువ్వు లేచిపోతే లేచిపో. నేనుమాత్రం... నీకు తెలుసుకదా...అతిథినికాదు, ఆకలితో కంచంముందు నుంచి లేచిపోవటానికి" – అన్నాడు శ్రీకాంతుడు.

దీనికి సరైన సమాధానమే చెప్పాడు హరిప్రసన్నుడు: "నేనైనా ఇవాళ ఒక్కనాటి అతిథినై తేకదూ, ఆకలితో లేచిపోవటానికి. అప్పుడే అయిందీ! ఇంకా వచ్చిపోతూ ఉండనూ? ఇక్కడికివచ్చి నేను ఆకలితో వెళ్ళిపోతానన్న సంతృప్తి నువు పడక్కర్లేదు."

చివరకు హరి చాల చక్కగా మాట్లాడేడు; అందుకు శ్రీకాంతుడు ప్రసన్నచిత్తుడై నాడు, భార్యవైపు తిరిగి "చూచావా! హరి ఊరికేనే కూర్చున్నాడు. ఇంకోరొట్టె తినిపించు" అన్నాడు.

"అరె-వద్దు-వద్దు..."

"పట్టండి-ఇదొక్కటేగా" అంటూ సునీత...పళ్లెం మీద అడ్డంగా ఉంచిన అతని చేతులమీదే ... మరోరొట్టె జారవిడిచింది.

"శ్రీకాంత్! నన్ను చంపేస్తున్నావోయ్" అన్నాడు హరిప్రసన్నుడు.

"పరవాలేదులే-తిను-తిను."

సునీత గరిటెతో పప్పు, కూరకూడా అతనిపళ్ళెంలో వడ్డించింది.

ఈవిధంగా భోజనాలై ఇద్దరూ లేచి చెయి కడుక్కున్నారు.

## 14

శయనమందిరములోకి వచ్చాక "తమలపాకులు పట్టుకు రానా?" అన్నాడు శ్రీకాంతుడు.

"నేను తమలపాకులు వేసుకోను" అన్నాడు హరి ప్రసన్నుడు.

"పోనీ, వక్కలో?"

"ఊహుఁ అవసరంలేదు."

అయినా వక్కలు తీసుకురావటానికి శ్రీకాంతుడు బయలుదేరాడు.

"ఇదిగో శ్రీకాంత్! ఇటుచూడు..."

"వక్క వేసుకుంటే ఏం మునిగిపోతుందీ?" అంటూ శ్రీకాంతుడు సాగిపోతూనే ఉన్నాడు.

"వద్దు, శ్రీకాంత్! ఒక మాట ఉంది, విను."

"సరే చెప్పు" అంటూ శ్రీకాంతుడు వెనక్కు వచ్చేశాడు.

"ఇక నేను వెడతాను. మరి నాకు పదిహేను రూపాయలు కావాలిగా!"

"అయితే కూర్చో. ఆవిడనుకూడా వంటయింట్లోనుంచి రానీ" అంటూ శ్రీకాంతుడు అతని చెయిపుచ్చుకుని కూర్చోబెట్టటానికి ప్రయత్నించాడు.

"వద్దు వద్దు, ఈవిషయం ఆమెకు తెలియవలసిన అవసరం ఏముందీ?"

శ్రీకాంతుడు నవ్వాడు. "ఆర్థికమంత్రి, క్యాష్‌గుమాస్తా, యజమానురాలు - అన్నీ ఆవిడేనయ్యా. నాదగ్గర డబ్బెక్కడ ఉంటుంది?"

"అయితే నాకోసమని చెప్పకుండా నువ్వే ఆమెదగ్గిర అడిగి తీసుకురా."

శ్రీకాంతుడు గంభీరముద్ర తాల్చాడు. "హరీ! అలా ఇదాతా వేం? నీకు డబ్బు అవసరం వచ్చింది. రాకూడదా? తప్పా! పాతకమా? దానికి సిగ్గెందుకూ? నీదగ్గర డబ్బు లేకపోవటమనేది అగౌరవకరమైన విషయమేం కాదు. డబ్బు ఉండికూడా బుద్ర లేనివాళ్ళు చాలమంది ఉన్నారు. డబ్బు లేనందువల్ల అపవిత్రత వచ్చిపడదు. నాదగ్గర డబ్బు పుచ్చుకోటానికి నువ్వు సంకోచించనక్కర్లేదు. ఆవిడైనా నీ వదినె. ఆమెదగ్గరకూడా నీకేమీ సంకోచం అక్కర్లేదు."

"అయినా ఆమెకు ఈ విషయం తెలిసినందువల్ల ప్రయోజనం ఏమిటి?" హరిప్రసన్నుడు మెల్లిగా అడిగాడు.

"ప్రయోజనమా? సరేగాని, నువ్వు తాంబూలం వేసుకోవుగా! వక్కలు తెస్తావుండు; తరువాత మాటాడుదాం."

సునీత ఇంకా పొయ్యిదగ్గరేఉంది. శ్రీకాంతుడు వచ్చి అడిగాడు: "ఇదిగో, పదిహేను రూపాయలు ఇలా తీసి ఇయ్యి."

"ఎమిటీ–ఈ"

"హరికి కావాలిట. వెళ్ళిపోతా నంటున్నాడు."

"ఎందుకు వెళ్ళిపోతున్నారు? ఇప్పుడేగా భోజనం చేసింది! డబ్బు ఇంకో రెండుగంటలదాకా దొరకదని చెప్పండి."

"కాదులే; వెడతాడట."

సునీత పొయ్యిమీది తవారేకు దించేసి, పదిహేను రూపాయలు తీసి యిచ్చింది. "ఇదిగో చూడండి, మీరు

ఈ డబ్బు నాదగ్గరనుంచి తీసుకుని ఇస్తున్నట్టు చెప్పకండి. నా కీ సంగతేమీ తెలియనట్టే అతనికి కనిపించాలి.''

''ఏం?''

''దానివల్ల ప్రయోజనం ఏమిటి?''

''ప్రయోజనం'' అన్న పదం విని శ్రీకాంతుడు ఆలోచనలోపడ్డాడు. ''సరే అయితే'' అని ఊరుకున్నాడు.

''మీరే ఆలోచించండి. తమ ఔదార్యాన్ని ప్రకటించుకోటమనేది ఎవరికీ మంచిదికాదు.''

''కాని సునీతా! హరి ఈ ప్రపంచానికి చెందిన మనిషి కాదు. మనదగ్గర డబ్బు పుచ్చుకున్నందువల్ల అతడు మనకు కృతజ్ఞుడుగా ఉండాల్సిన అవసరంలేదు; ఉండడు కూడాను. అతడంత సమర్థుడే. డబ్బిచ్చి అతనిమీద కృతజ్ఞతాభారం మోపుతున్నట్టు నువ్వుభావిస్తున్నావా? కృతజ్ఞతే లేనప్పుడు సంకోచంమాత్రం ఎందుకుండాలి?''

''మీరు ఎన్నయినా చెప్పండి. నాదగ్గర డబ్బుతీసుకుని మీరాయన కిచ్చినట్టుగా ఆయనకు తెలియవలసిన అవసరం ఏమీలేదు. డబ్బు ఇచ్చిపుచ్చుకునే వ్యవహారాల్లో కృతజ్ఞతగాని, సంకోచంగాని ఉండనక్కర్లేదు. ఆ సంగతి నాకు తెలుసు. కాని అతనికెందుకూ చెప్పటం? అక్కర్లేదు. విన్నారా? — ఇంతకూ ఆ గడ్డం?''

''ఇవాళే తీసేయించమన్నావా?''

''నాకుమాత్రం అసహ్యంగాఉంది, చెప్పద్దూ. పైగా అదొక 'సింప్టమ్' (చిహ్నము) ఆ గడ్డంమూలాన అతడు

ఏ పంథాలో వెడుతున్నదీ తెలిసిపోతూ ఉంటుంది. అయితే ఆ పంథాలోనించి అతడు ఇవతలకు రాడనుకోండి..."

"అప్పుడే కాదులే. కొంచెం ఓపిక పడదాం."

"అప్పుడప్పుడు వస్తూపోతూ ఉండమని చెప్పండి. పళ్ళుతప్ప మరేమీ పుచ్చుకోడేమో! ఆ పళ్ళయినా ఇక్కడే దొరుకుతాయని చెప్పండి."

"సరేలే."

శ్రీకాంతుడు పరసమందిరానికి తిరిగి వచ్చాడు. "వక్క వేసుకుంటావా? ఇదిగో" అంటూ ఒక వక్క హరిప్రసన్నునికి ఇచ్చాడు. అతని చెయి పుచ్చుకుని - "ఒక్క నిమిషం కూర్చో, వెడుదువుగానిలే" అన్నాడు.

హరిప్రసన్నుడు కూర్చున్నాడు. శ్రీకాంతుడు పదిహేను రూపాయలు అతని చేతిలో పెట్టాడు.

"ఆమెగారితో చెప్పలేదుకద!" హరిప్రసన్నుడు అడిగాడు.

"చెప్పవలసిన అవసరం ఏముంది ఇందులో?"

"ఇవాళ నేను సుష్టుగా భోజనం చేసినందుకు విచార పడటంలేదు. రొట్టెలు బాగాచేసింది ఆమెగారు కృతజ్ఞుణ్ణి."

"ఆవిడ వంట బాగానే చేస్తుంది. అప్పుడప్పుడు వచ్చి పోతూ ఉండు. అక్కడా ఇక్కడా అన్నంకోసం నువు వెతుక్కోనవసరంలేదు. ఇక్కడికే వస్తూఉండు, ఏం?"

"ఉహుఁ, అన్నం కడుపులో భారంగా పడుతుంది. పళ్లు అయితే చాల ఆరోగ్యం. అయినా భోజనమే ప్రధాన

విషయం కాదుకదా! దానికోసం బాధేం లేదు - మీ యింటికి వచ్చినా, రాకపోయినా...ఊఁ, ఇక నేను వెడతాను."

"వస్తూ ఉంటావు కదూ! ఇక రేపటినుంచీ నీ ప్రోగ్రాం ఏమిటీ?"

"ఔను. ఆవిషయంకూడా నీతో సంప్రతించాల్సిందే. బ్రతుకు గడవాలిగా! నాలుగుపైసలు చేతికి రావాలిగా! అందుకుగాను ఏదోపని చూడాలి. నువుకూడా ఈవిషయమై కాస్త ఆలోచించు. అల్పమైనదిగాక, సరియైన, తగినంత పని చేతికి దొరికినప్పుడే మానవుడి ప్రజ్ఞలు రాణిస్తాయి... ఆ ఫొటో చూడు..." అంటూనే హరిప్రసన్నుడు కుర్చీని గోడవద్దకు తీసుకుపోయి, దానిమీద ఎక్కి నిల్చుని, అక్కడ తగిలించిఉన్న ఆ భార్యాభర్తల ఫొటో తీశాడు. కింద ఆ యిద్దరి ఆటోగ్రాఫ్‌లు ఉన్నాయి. తేదీకూడా ఉంది.

"అయితే 1932 లో నీవివాహం అయిందన్నమాట! ఈ ఫొటో అప్పటిదే అనుకుంటాను. ఔనా? ఎవరీ తీసిన ఫొటోగ్రాఫరు? నీముఖం పాడుచేశాడు. రిటచింగ్ అతనికి చాతకాలేదు. ఒక సన్నని 'సాఫ్ట్' పెన్సిల్ ఏమన్నా ఉందా? లేదూ? పోనీలే. నీ ముఖం ఏం బాగులేదు. ఇది నేను తీసుకుపోయి సరిజేసి రేపు పట్టుకొస్తాను. తీసికెళ్ళనా?"

"సరే, తీసుకుపో. రేపు సాయంత్రానికి ఇక్కడికే భోజనానికి వచ్చెయ్యి."

"సరే, భోజనంమాట ఆలోచిస్తాలే. నా ఉద్యోగం సంగతి నువు కాస్త మనసులో పెట్టుకో. ఫొటో రేపు మళ్ళీ పట్టుకొస్తాను. ఆమెగారికి నా ధన్యవాదాలు చెప్పు."

"అలాగే."

"మరి - వెడతాను. ఏం—". హరి వెళ్ళిపోయాడు.

## 15

సునీతా శ్రీకాంతులకు జీవితం నిస్సారంగా, శూన్యంగా, కనిపించిన రోజులు పోయినవి. హరిప్రసన్నని రాకతో వారి జీవితంలో ఒక నూతనత్వం వచ్చింది. ఆనందం, ఉల్లాసం పొంగినవి. దంపతులమధ్య సాన్నిహిత్యం పెరిగింది. ఇద్దరూ కలిసి మంచీ చెడ్డా చెప్పుకుంటూ కలుపుగోలుగా ఉండ గలుగుతున్నారు. కష్టంరానీ, నష్టంరానీ... భార్యకు భర్త, భర్తకు భార్య తోడునీడగా ఉండాల్సిందేగా! దాంపత్య జీవితం... మధ్యమధ్య సంచలనం, సంఘర్షణ లేకుండా... ఒకే గాడిలో నడుస్తూ ఉంటే... సంకుచితమైపోయి శూన్యంగా కనిపిస్తుంది. అటువంటప్పుడు ఏదో రగడ, రభస రావడమే శుభప్రదం.

సునీతకూ, శ్రీకాంతునికి మధ్య ఏనాడూ పొరుపులు, పోట్లాటలు లేనేలేవు. హరిప్రసన్నుడు వచ్చినప్పటినుంచీ వారి దాంపత్యజీవితానికి పరిపూర్ణతచేకూరింది. ఆనందంగా, ఉల్లాసంగా ఉంటున్నారు. హృదయాలు మరింత చేరువై నాయి. తమతమ పనుల్లో సమర్థంగా, చురుగ్గా మెలగు

తున్నారు. ఇదివరకుమల్లే ఎవరికివారు ఒంటరిగా, అసం తృప్తిగా ఉండటం పోయింది.

తరంగం అంటే అలజడి అన్నమాటే. అలజడి అన్న పదం సరైంది కాదు; కాని ఉపయోగించవచ్చు. లోతు ఎక్కువగా ఉంటే తరంగాలు ఉండవు. అంతు తెలియని లోతున నీళ్ళు ప్రవహిస్తోంటే అక్కడ ఉల్లాసం లేదు; తరం గాలు ఉండవు; చాంచల్యం ఉండదు. కాని మానవునిలో జడత్వంకూడా ఉంటుంది. కాబట్టి చాంచల్యమూ, వేగమూ మానవజీవితానికి లక్షణాలుగా చెబుతారు.

సునీతా శ్రీకాంతుల దాంపత్యజీవితంలో కొంత కాలం స్తబ్ధత, నిశ్చలత్వం కుదురుకున్నాయి. ఈ శాంత వాతావరణంలోకి హరిప్రసన్నుడు ప్రవేశించాడు. తరంగాలు లేచాయి. నిద్రమత్తు విడిపోయింది. స్తబ్ధతపోయి సంచలనం వచ్చింది. దంపతులకు పుష్టి వచ్చింది. ఆనందం పెరిగింది. రసాస్వాదన తెలిసివచ్చింది. సునీత కనిపిస్తే శ్రీకాంతుని కళ్ళు వికసిస్తున్నాయి. సునీత హృదయం కిలికించితమౌతున్నది. పరస్పరాకర్షణ అధికతరమైంది. ఒకరికొకరు ఇంకా మరింత చేరువ కావాలన్న ఉబలాటంకూడా పెరిగింది.

శ్రీకాంతుడు కోర్టునుంచి రాగానే సునీత అతనిముందు ఫలహారాలు తెచ్చి పెట్టింది. తాను పక్కనే ఒక కుర్చీలో కూర్చుంది. "మీరు ఇవాళ కోర్టునుంచి పెందలకడనే వచ్చారు. రోజూ చీకటిపడేది మీరు వచ్చేసరికి."

"కోర్టు అంటే నా చేతికింది ఆఫీసనుకున్నావా—నేను ఎప్పుడుబడితే అప్పుడు విడిచిపెట్టి రావటానికి? - ఇంతకూ

హరిప్రసన్నుడు రాలేదా? నిన్న ఫొటో తీసుకుపోయాడు. ఇవాళ తప్పకుండా వస్తానని చెప్పాడే. ఫొటో సరిజేసి పట్టుకొస్తా నన్నాడు."

"ఉహుఁ, వారు రాలేదు."

"ఆ ఫొటో అతనికి బాగులేదట. అందులో నీ బొమ్మ చాల బాగుందిగా! అతడు బాగుచేసేదేమిటో నాకు బోధపడలేదు."

"ఇవికూడా తినండి. ఎంతసేపటినుంచి ఆకలిగా ఉన్నారో!" అంటూ సునీత మరోపళ్ళెం అతనిముందుకు తోసింది. "ఎందుకు రాలేదో, తెలియదుమరి!... ఆయనకు ఉద్యోగం ఏదైనా కల్పించేవిషయం ఆలోచించారా?"

"అతడు ఏపనైనా చెయ్యగలడు. కాని ఏంపని ఇప్పిస్తే బాగుంటుందా - అనేవిషయం ఆలోచించాలి. ఎంత ఆలోచించినా నాకేం పాలుపోవటంలేదు. నెలకు కొంత జీతం మనమే ఇవ్వగలమనుకో. కాని అతని సామర్థ్యానికి తగినంత ఇవ్వాలంటే మనకు చాతకాదుకదా!"

"అయినా నేనొకటి చెప్పనా? అతనిచేత మా సత్యకు ట్యూషన్ చెప్పిస్తే ఎలా ఉంటుంది? మా నాన్నగారు ఒక మంచి ట్యూషన్ మాస్టరు కావాలని వెదకుతున్నారు కూడాను."

శ్రీకాంతుడు ఉప్పొంగిపోయాడు. అమాంతం లేచివచ్చి ఆమె చెయి పుచ్చుకున్నాడు, ఒకతినేపదార్థాన్ని అందిపుచ్చుకున్నట్టు. "భలేమాట చెప్పావు సునీతా! నాకు తోచనే లేదు సుమీ! అందుకైతే హరి బాగా పనికొస్తాడు, నాకు

తెలుసు. సత్య ఇంటర్ రెండోయేడు చదువుతున్నది. హరి ప్రసన్నుడు ట్యూషన్ చెప్పగలడు. బాగా చెబుతాడు కూడా" - అంటూ ఆమె చెయి బాగా నొక్కాడు. "సరే, ఇంకేం ? మీ నాన్నగారు ఎంత జీతం ఇయ్యగలరు ?"

"ఒక గంట చెబితే ముప్ఫయికి పైనే ఇస్తారనుకుంటా."

"చాలు_చాలు-చాలు! అది బాగుంది సునీతా! ఇక అతడు బ్రతకలేడేమోనన్న భయం పోయింది. దీనికితోడు అతడింకేమన్నా చూచుకుంటే చూచుకుంటాడు. పెళ్ళి చేసుకుంటే చేసుకుంటాడు. లేకపోతే విప్లవం లేవదీస్తాడు. సరే, నువు చెప్పినట్టు ఆ ట్యూషన్ అంటగడదాం. దానితో కొంతపని అంటూ ఏర్పడుతుంది అతనికి. ఇలా కొన్నాళ్లు గడిస్తే ఒకఇంటివాడుకూడా ... ఐతేకావచ్చు. ఏమంటావు?"

సునీత సాలోచనగా "ఔనేమో" అన్నది.

ఇప్పుడు శ్రీకాంతుని హృదయం తేలికపడిపోయింది. గబగబ ఫలహారం పూర్తిచేస్తూ "'ఔనేమో' అంటావు! అదీ ఒక మాటేనా ? ఇప్పుడతన్ని 'ట్యూషన్ మాస్టర్'గా కుదిరించేస్తున్నామా! అంటే ఒక అంశం నెరవేరిందన్న మాట. అలాగే రెండోది, మూడోది, నాలుగోదీన్నీ. అన్నీ నెరవేరుతూ వస్తాయి. కొద్దికాలం అయేసరికి హరిబాబు ఒకయింటివాడూ ఔతాడు; పిల్లలతండ్రీ ఔతాడు. చూడక పోతాం ? అంతకన్నా మనకింకేం కావాలి ?"

సునీత మౌనంగానే ఉండిపోయింది.

"ఇంతకూ అతడింకా రాలేదేం? ఇవాళ సాయంత్రం ఇక్కడే భోంచేస్తాడు. అతనికికూడా వంటచేశావా?"

"లేదు—"

"లేదూ? అదేమిటీ? - అతడు వచ్చేస్తే?"

"వచ్చినా పళ్ళేగా తినేది? ఇంట్లో పళ్లు ఉన్నాయి లెండి."

"అన్నం తినడు, పళ్ళే తింటాడు - అని నీకు నిశ్చయమైపోయిందా యేమిటి? నా కలా అనిపించటం లేదే!" — విస్మయపడుతూ అడిగాడు శ్రీకాంతుడు.

"అన్నం తిననివాళ్ళను మనం బలవంతంచేసి తినిపించటం దేనికీ? అన్నమే తినిపించాలని మీరు పట్టుబడితే వంట ఎంతలోకి చేస్తానూ? అయినా రాకపోతే?..."

"సరే, అయితే... చూడు, ఇప్పుడు టైమెంత అయింది? అయిదున్నర. ఆరుగంటలకల్లా వచ్చేస్తాడనుకుంటాను. వస్తే వస్తాడు; లేకపోతే లేదు... ఇదిగో నువ్వు కూడా వస్తావా? 'రాజరాణి మీరా'కు; చాల బాగుందిట."

సునీత ఆశ్చర్యపోతూ భర్తవైపు చూచింది. అయిదారు సంవత్సరాలనుంచీ ఈ యింట్లో సినీమాలనుగురించి ప్రసంగించటమే తప్పుగాఉండేది. అటువంటిది ఇవాళ ఆయనే స్వయంగా "పద, సినీమాకు వెడదాం" అంటున్నాడు.

ఆమె మౌనంగా భర్తముఖంలోకి చూస్తూ నిల్చుంది.

"ఏం? సినీమాకు వెళ్ళటం తప్పా? అదొక వ్యసనమా? మనస్సుకు కాస్త వినోదంకోసం వెడతాం,

తప్పేంలేదు. అదీగాక 'రాజరాణి మీరా' చాల మంచి ఫిలిం అని చెబుతున్నారు. హరి వస్తే, అతన్నికూడా తీసుకు పోదాం; లేకపోతే మనిద్దరం వెడదాం.'' అన్నాడు శ్రీకాంతుడు.

'నేను రాను' అని సునీత ఎలా చెబుతుంది? ఇది వరకు అనేకసార్లు అనేక ఫిలింలు చూడాలని కోరికలు కలిగాయి. కాని ఆ కోరికలన్నీ మనసులోనే అణగారిపోయాయి. ఈ విశాలవిశ్వంలోని అనేక చిత్రవిచిత్రాలు చూడాలన్న కోరిక ఆమెకు లేకపోలేదు. కాని భర్తృసాహచర్యంలో ఉంటూ తాను కర్తవ్యపరాయణమై నడచుకోవాలి; యమ నియమాల్ని పాటించాలి; - అంతే తనకు కావల్సింది. ఈ విశ్వగతమైన చిత్రవిచిత్రాలన్నీ తనకు అక్కర్లేదు. అని అనుకుంటూ ఉండేది. లోపలనుంచి తరచు హృదయం మాత్రం "చూడు; ఈ విశ్వమంతాకూడా చూడాల్సిందే" అని పోడుస్తూఉండటం మానలేదు. కాని తాను మాత్రం భర్తను నమ్ముకుని, బయటిప్రపంచానికి పెడమొగంబెట్టి, అంతర్ముఖి మైపోవటంలో ఉన్న మహిమను గురించే ఆలోచించుకుంటూ వచ్చింది. ఆ భర్తే ఇప్పుడు "సినీమాకు పోదాం పద'' అంటున్నాడు. ఆమె మెల్లగా "సరే, పోదాం'' - అన్నది.

"సునీతా! సినీమాకు వెళ్ళటంలో తప్పేమీలేదు. నీకు రావటం ఇష్టంలేదా?''

"ఇష్టం లేకపోవటంకాదు. సరేనంటినిగా!''

"దబ్బున తయారుగా. హరిప్రసన్నుడు ఇంకా రానే లేదు. సినీమానుంచి వచ్చాక భోజనం చెయ్యొచ్చులే. ఈ లోగా హరి వొస్తే రావచ్చుకూడా."

"సత్యనుకూడా తీసుకుపోదామా సినీమాకు ?

"ఔనౌను, తప్పకుండా తీసుకుపోదాం!"

సత్యను తీసుకురావటానికి శ్రీకాంతుడే వెళ్ళాలి, వెడితే వెంటనే బయలుదేరి వెళ్ళాలికూడా.

"సరే, హరిప్రసన్నుడు వస్తే కూర్చోమని చెప్పు. నేను దబ్బునే వచ్చేస్తాను. నువు తయారుగాఉండు. ఆట ఆగుంబావుకు ఆరంభం చేస్తారు... ...మంచినీళ్ళు ?"

ఫలహారం పళ్ళెందగ్గర మంచినీళ్ళగ్లాసుకూడా పెట్టటం సునీత మరచిపోయింది. గబగబ పరుగెత్తుకుపోయి మంచి నీళ్ళు తెచ్చియిచ్చింది.

శ్రీకాంతుడు సత్యను పిల్చుకురావటానికి వెళ్ళాడు. సునీత సినీమాకు వెళ్ళేందుకు దుస్తులు మార్చుకోటానికి తన గదిలోకి వెళ్ళింది.

## 16

సత్య సునీతకు చెల్లెలు. కాలేజీలో ఇంటర్ మీడియెట్ రెండోయేడు చదువుతోంది.

తండ్రి సంపన్నగృహస్థు. ఢిల్లీలోనే కాపురం. కులీనుడు. సాంఘికంగా ఉచ్చశ్రేణికి చెందినవాడు.

సత్య బక్కపలచగా ఉంటుంది. కాని మంచి చలాకీ పిల్ల. అక్కచెల్లెళ్ళు చాలమంది ఉన్నారు. కాని సత్యా సునీతలకు సాన్నిహిత్యం ఎక్కువ. సత్య ఏపనీ చెయ్యదు,

నేర్చుకోటమే ఆమెపని. చదువు నేర్చుకుంటుంది; సంగీతం నేర్చుకుంటుంది; నృత్యం నేర్చుకుంటుంది; చిత్రలేఖనం నేర్చుకుంటుంది; దేన్ని నేర్చుకుంటుంటే దానిమీదే మనస్సు నిల్పుతుంది; మరి యితరవిషయాలు పట్టించుకోదు. గొప్పవారి యిండ్లలో పెద్దపెద్ద రాజకీయాలే ఉంటాయి. యుద్ధము, విగ్రహము, సంధి-అన్నీ ఉంటాయి. మిత్రలాభం, మిత్రభేదం - ఇత్యాదులూ ఉంటాయి. అయితే సత్య ఎక్కడో కూర్చుని ఏదో నేర్చుకొంటూ ఉండటం తప్ప ఆ రాజకీయాల్లో వేలు పెట్టదు. ఇలా పద్ధెనిమిది సంవత్సరాలు గడిచాయి. కాని పదిహేనేళ్ళ పిల్లలాగాకూడా కనిపించదు.

సునీత శ్రీకాంతుడు తినిపోయిన ఫలహారపు పళ్ళాలు తీసి సర్దింది. తరువాత వంటింట్లోకి పోయింది అక్కడకూడా అన్నీ చక్కబెట్టింది. పరోటాలు ఇప్పుడే వండేద్దామా అనుకుంది. కాని టైములేదు. సత్య వస్తూ ఉండాలి. తానైనా చీరమార్చి సిద్ధంగా ఉండాలి. ఊహుఁ, ఇప్పుడు లాభంలేదు - అనుకుని తన గదిలోకి వెళ్ళింది. ఆకుపచ్చరంగు పట్టుచీర కట్టుకుని అద్దంలో చూచుకుంది.

ఇంతలో మెట్లెక్కివచ్చి ఎవరో తలుపుదగ్గర 'శ్రీకాంత్! శ్రీకాంత్ !' అని పిలుస్తున్నట్టు వినిపించింది.

"వారు ఇంట్లోలేరు; బైటికి వెళ్ళారు" - అని సునీత తన గదిలోనుంచే చెప్పింది.

ఆమాట విని హరిప్రసన్నుడు అక్కడే సంకోచిస్తూ నిల్చున్నాడు. తిరిగి వెళ్ళిపోదామా అనిపించింది. కాని అక్కడే నిల్చుండిపోయాడు.

మళ్ళీ జవాబు రాకపోయేసరికి 'వచ్చినవాడు, వెళ్ళిపోతాడేమో' ననుకుంటూ సునీత "బైటికి వెళ్ళారు; ఇప్పుడే వస్తారు, కూర్చోండి" అన్నది.

హరి వివశుడై వెళ్లి పఠనమందిరంలో కూర్చున్నాడు. "ఇప్పుడే వస్తున్నాను, ఉండండి" అని ఆమె పలుకులు వినిపించాయి.

విన్నాడు - అలాగే కూర్చున్నాడు. కూర్చుని కూర్చుని ఫోటోమీద చుట్టి తెచ్చిన కాగితం తీసేసి చూస్తూ ఉన్నాడు. ఇదివరకుకంటే ఫోటో ఇప్పుడు చాల బాగుంది. ఫోటో క్రింద 'మిస్టర్ శ్రీకాంత్, శ్రీమతి సునీతా శ్రీకాంత్' —అని తాను రాసిన అక్షరాలు నిజంగా అద్భుతంగా ఉన్నాయి. రాసినప్పుడు రాశాడుగాని, ఎందుకు రాసినట్టు? తనకే బోధపడ్డంలేదు. రాసిన పేర్లు కొట్టివేద్దామనుకున్నాడు. జేబులోనుంచి ఫౌంటెన్‌కలం తీశాడు. కాని కొట్టివెయ్యలేక పోయాడు. కొట్టివేస్తే ఫోటో అందం చెడిపోదూ? చేతిలోని కలం అలాగే పట్టుకుని ఫోటో చూచుకుంటూ కూర్చున్నాడు.

సునీత చక్కగా తల ముడుచుకుంది. ముఖాన బొట్టు పెట్టుకుంది. తనరూపం అద్దంలో మరోసారి చూచుకుంది. అప్పుడామెకు జ్ఞాపకం వచ్చింది: తాను పఠనమందిరంలోకి వెళ్ళాలి. అక్కడ హరిప్రసన్నుడున్నాడు. ఏదో ఒక రకమైన సిగ్గు ఆమెను ఆవహించింది. కాసేపు పచార్లు చేసింది అటూ ఇటూ. మళ్ళీ ఆలోచించుకొని ఒక పళ్లెంలో వక్కలు, ఆకులు పెట్టుకుని పఠనమందిరంలోకి వెళ్ళింది.

హరిప్రసన్నుడు ఫొటోగ్రాఫ్ కేసి చూస్తూ కూర్చుని వున్నాడక్కడ.

సునీత లోపలికి వస్తూ "ఇదిగో తాంబూలం వేసుకోండి. వారు యీపాటికి వస్తూనే ఉండాలి. మీరు వస్తే కూర్చోమని చెప్పి వెళ్ళారు. ఇవాళ - ఇవాళ సినీమాకు వెడదామనుకున్నాం; మీరూ వస్తారుకదూ!" ఈ మాటలన్నీ ఒక్క గుక్కలో పలికేసి, చేతిలోని తాంబూలపు పళ్ళెం అతని ముందుంచి, ఒక కుర్చీ లాక్కుని కూర్చుంది.

చేతిలోని ఫొటో వెనక్కు తిప్పేసి హరిప్రసన్నుడు "తాంబూలమా? నేను - వేసుకుంటాలెండి" అన్నాడు. "మిస్టర్ శ్రీకాంత్ యింకా ఎంతసేపటిలో వస్తారు?"

హరి సిగ్గుపడుతూన్నకొద్దీ ఆమెకు ధైర్యం వచ్చేస్తోంది. ఇంకో పదిహేను నిమిషాల్లో వచ్చేస్తారు. ఆ ఫొటో నిన్న మీరు తీసుకు వెళ్ళారుకదూ. అందులో ఏదో లోపం ఉందనీ, దాన్ని సర్దుబాటుచేసి తీసుకొస్తాననీ చెప్పారట. అయితే మీకు ఫొటోగ్రఫీకూడా వచ్చునా? ఏదీ చూడవచ్చా?"

సిగ్గుపడుతూ హరిప్రసన్నుడు ఫొటోను ఆమెకిచ్చాడు, "ఏదో కొద్దిగా వచ్చు" అంటూ.

"నాది వట్టి మట్టిబుర్ర. ఇందులో మీ రెక్కడ ఏం మార్పుచేశారో మీరే చూపించి చెబితేగాని నా కర్థం కాదు. (ఫొటో మేజాబల్లమీద పెట్టింది.) లోపం ఏం ఉండేదో అది మీరు ఎలా సర్దుబాటుచేశారో నేను తెల్సుకోవచ్చా?"

సునీత ఫొటోగ్రాఫ్‌పై వంగి చూస్తూంది. హరి తన కుర్చీని యింకా దగ్గరకు లాక్కుని చెప్పసాగాడు : "లైట్-షేడ్-ల విషయమై ఆ ఫొటోగ్రాఫరుకు కాస్తకూడా పరిజ్ఞానం లేదు కామాలు. ఇక్కడ శ్రీకాంతుని ముఖం కుడి భాగం గోధుమరంగులో వచ్చేసింది. మీ బొమ్మ మాత్రం బాగుంది. ఇంప్రెషన్ పర్‌ఫెక్టుగా వుంది."

ఇద్దరి తలలు చాల దగ్గరగా వచ్చేశాయి. సునీత పైకి చూచి వెంటనే తనకుర్చీలో మామూలుగా కూర్చుండి పోయింది. హరికూడా సిగ్గుపడుతూ సరిగ్గా కూర్చున్నాడు తన కుర్చీలో.

"ఫొటోగ్రఫీ ఎంతకాలంలో నేర్చుకోవచ్చునంటారు ?" - సునీత అడిగింది.

"నేర్చుకోటానికైతే ఒక నెల చాలు. తరువాత ప్రాక్టీసునిబట్టి ఉంటుంది."

"ఒక్క నెలే చాలా! మావారు కొన్ని నెలలనుంచీ తంటాలు పడుతున్నారు. ఇంకా బాగా తీయలేకపోతున్నారే."

"మీదగ్గర కెమేరా ఉందా ? నాకొకసారి చూపించండి. మీ యిద్దరి ఫొటో నేను తీసి యిస్తాను."

కాసేపు యిద్దరూ మౌనంగా వున్నారు. చివరకు సునీత అన్నది : "ఇవాళ మీరు చాల ఆలస్యంగా వచ్చారు. మధ్యాహ్నం రెండుగంటలప్పుడు వస్తారేమో ననుకున్నాం."

"అలాగనా ?"

"సినీమాకు మీరుకూడా వస్తారుగా !"

"నేను—వస్తాను."


C. P. BROWN
MEMORIAL LIBRARY
Acc No
Date

"మా చెల్లెల్ని తీసుకురావటానికి వారు వెళ్ళారు. ఆమెకూడా వచ్చాక అందరం కలిసి వెడదాం. మీకు చెల్లెళ్ళు ఉన్నారా?"

"ఉన్నారు, ఇద్దరు. అయినా నేను ఒంటరిగాడినే."

"ఒంటరిగా ఎందుకుండాలి? ఆపదలనుంచి తప్పించుకుని పోవటం కాదుగా మీ పంథా! అందుచేత ఒంటరిగా ఉంటూ ఉంటా రన్నమాట అంతేనా?"

"నేను - నాకు ఇల్లూవాకిలీ లేదు. అదీగాక నా బ్రతుకు విలువ ఎంత? గొప్ప విలువ ఉన్నట్టు నే ననుకోను. నేను చచ్చిపోయింతర్వాత ప్రపంచానికేమి నష్టం? ఏమీ ఉండదు."

"ఉండండి - కొంచెం ఫలహారం చేద్దురుగాని. పళ్ళు ఉన్నాయి. తీసుకొస్తాను."

"వద్దు - వద్దు."

కాని ఆమె అప్పుడే గడపదాటి వెళ్ళింది. ఆమె కట్టుకున్న పట్టుచీర ఆకుపచ్చరంగు తళతళ మెరిసి ఊగిసలాడి అతని కన్నుల్లో గూడుకట్టుకుపోయింది. ఆమె మేలిముసుగులో నుంచి చిరువంకలుగా గాలితరగలు మెల్లమెల్లగా, పాయలు పాయలై అతని నరనరాల్లోనికి ప్రాకి సెలయేటినడకలు చూపినవి.

మరికాసేపటికి సునీత తిరిగివచ్చి కొన్ని కమలాఫలాలు తెచ్చి అతని ముందుంచింది. "తినండి, తినండి. పళ్ళేగా మీ ఆహారం! సిగ్గుపడబోకండి. మీకోసం రొట్టెలే చెయ్యమన్నారు మా వారు. కాని ఎవరి రుచి వారిది. మాకుమల్లేనే

మీరుకూడా అన్నం తినటంలేదని నేనేమీ మరోవిధంగా అనుకోను. మీ రుచి మీది; మా రుచి మాది - నిన్న రొట్టెలు ఎలా ఉన్నాయి మీకు ?''

''చాలా బాగున్నాయి.''

"అయితే రొట్టెలే తెస్తాను; పుచ్చుకుందురుగాని. పల్లెగాని తినరేమో అనుకున్నాను. పొరపాటైంది."

"వద్దండీ - వద్దు. నేను రొట్టెలు తినను."

"అయితే సరే మంచిదే - మీరంత ప్రతిజ్ఞాబద్ధులన్న భయం నాకు తీరిపోయింది."

ప్రతిజ్ఞాబద్ధులు! - బాగా చదువుకున్న ఈ వదిన ఒక విచిత్రమైన రీతిలో ఉచ్చరించిన ఆ శబ్దం వినేసరికి హరి ప్రసన్నుడు విస్తుపోయాడు. ఏమో చెప్పాలనుకున్నాడు : "నేను, నేను——"

"క్షమించండి, ఏదో అనేశాను. మాదగ్గరకూడా మీరు కొన్ని విషయాలు దాస్తారని మేము అనుకోలేదు. ఒకమాట చెబుతాను, మీరు కోప్పడకండి : మీరెప్పుడూ మాదగ్గర సంకోచపడక్కర్లేదు.''

"ఎబ్బే - లేదు - లేదు."

ఇంతలో ఎవరో వస్తున్న చప్పుడైంది. "అరుగో మావారు వస్తున్నట్టున్నారు. మీరు లేస్తారెందుకూ ? కూర్చోండి - కూర్చోండి" - అంటూ సునీత గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయింది. చేతిలో కమలాఫలం పట్టుకుని హరి ప్రసన్నుడు కూర్చున్నాడు.

# 17

శ్రీకాంతుడు సత్యను వెంటబెట్టుకు వచ్చాడు. ఇద్దరూ పకపకా నవ్వుతూ వస్తున్నారు. సత్య ఎప్పుడూ పెద్దగా నవ్వదు. మందహాసం చేస్తుంది, అంతే. కాని ఎప్పుడైనా పెద్దగా నవ్విందంటే మాత్రం గవ్వలు గలబరించినట్లు పెద్ద శబ్దం ఔతుంది. అప్పుడామె ముఖం అచ్చం విచ్చిన చేమంతిపువ్వులా ఉంటుంది.

సునీత వారికి ఎదురు వెళ్ళింది. "మీరు ఇంత ఆలస్యం చేశారేం? వారు వచ్చి చాల సేపయింది!"

"ఎవరా వారు అక్కా?" - సత్య నవ్వుతూ అడిగింది.

సునీతకు కోపం వచ్చింది. "కొంచెం వొళ్ళు దగ్గర పెట్టుకుని మాటాడు. 'ఎవరా వారు?' అని అడుగుతున్నావే!" అని పలికి, వెంటనే నవ్వుమొగం పెట్టి "ఇక ముందెప్పుడూ అలా తొందరపాటుగా మాటాడకు"—అన్నది.

శ్రీకాంతుడు పకపక నవ్వాడు.

"ఏమిటి అక్కా! అలా జడిపిస్తావేం?"—సత్య అడిగింది.

సత్య వట్టి పిరికి పిల్ల. బల్లి అన్నా, దొంగ అన్నా, దయ్యం అన్నా ఆమె అడలిపోతుంది. మనుషులన్నా కూడా భయమే. చదువు కుంటున్న పిల్లే. అయితే ఏం? కాలేజికి బండిమీద వెళ్ళి వస్తుంది. మొదటినుంచీ తల్లి దండ్రులు ముద్దు మురిపెంగా పెంచారు. అందుచేత ఆమెకు ఏ వస్తువుపేరు చెప్పినా భయమే. ఇల్లు దాటి బైటికి పోలేదు.

కాస్త బైటికి వెళ్ళి ఫలానా పని చేసుకురా - అంటే వొణికి పోతుంది. కొత్త మనిషి ఎవరన్నా కనిపిస్తే గడగడలాడి పోతుంది. అందుకనే అడిగింది: అలా "జడిపిస్తావేం అక్కా-?" అని.

సునీత ఆ పిల్ల చెయి పట్టుకుని "భయమేం లేదులే - పద - పదమంటూంటే......" అన్నది.

సత్య వద్దు వద్దంటూనే ఉంది. కాని సునీత ఆమెను బలవంతాన హరిప్రసన్నుని దగ్గరకు తీసుకువచ్చింది.

"ఇదిగోండి, మా చెల్లెలు సత్య.......కమలాఫలం మీరే వొలుస్తున్నారేం. మా చెల్లెలు వొలిచి యిస్తుంది లెండి. ఇంటర్ రెండో యేడు చదువుతోంది!"

ఇంతలో శ్రీకాంతుడు కూడా లోనికి వచ్చాడు. "నువు వచ్చి ఎంతసేపయింది హరీ! ప్రొద్దుటినుంచీ ఎక్కడున్నావు?"

ఇప్పుడు హరిప్రసన్నుని చుట్టూ ఆత్మీయు లనదగిన వ్యక్తులు గుమికూడి వున్నారు. ఇటువంటి అవస్థ అతనికి జీవితంలో ఏనాడూ సంభవించి యుండలేదు. నలుగురిలో మాటాడగల కౌశల్యం అతనికి లేకపోలేదు. మాటలకోసం తడుముకునే మనిషి కాదు. కాని ఈ పరిస్థితిలో కాసేపు దిగాలు పడినవాడులా వుండిపోయాడు. ఒక వుదాత్తమైన విషయాన్ని గురించిన చర్చ లేనప్పుడు—బుద్ధిసూక్ష్మత, బుద్ధి చాతుర్యం అవసరంలేని సందర్భాల్లో—అనగా విద్వన్మండలి చేత గాక అన్నలు-తమ్ముళ్ళు, వదినెలు-మరదళ్ళ చేత పరివేష్టితుడై వున్నప్పుడు అతనికి మాట దబ్బున పెగలదు.

అటువంటి సందర్భాల్లో హృదయం పనిచెయ్యాలి. తదను గుణంగా మాటలు సాగాలి. అక్కడ తెలివితేటలు అనవసరం. అటువంటిపట్ల మూఢత్వమే ఎక్కువ కనిపిస్తూ ఉంటుందికూడా. కాని హరిప్రసన్నుడు సంచరించే ప్రపంచం వేరు. అక్కడి భావాలు వేరు. అక్కడ హృదయం తెర మరుగున పడిపోతుంది. బుద్ధిశాలులైనవారితో యోగ్యతగా ప్రసంగించవలసి ఉంటుంది. అదే తెలుసు హరిప్రసన్నుడికి.

"ఇప్పుడే వచ్చాను" అని జవాబు చెప్పాడు శ్రీకాంతుని ప్రశ్నకు.

"ఇవాళ సినీమాకు ప్రయాణం పెట్టాం. నువుకూడా వస్తావుగా! ఈ పిల్ల చూచావు మా మరదలే. కనిపిస్తోందిగా, మంచి చలాకీపిండంలే. చదువులో మాత్రం మందమతే. అయినా ఇంటర్‌లో లెక్కలు తీసుకుందయ్యా! కాని ఏకాగ్రమైన బుద్ధి కాదు. చాంచల్యం ఎక్కువ. ఈ గణిత శాస్త్రం కూడా ఒక శాస్త్రమే నంటావా? సరళరేఖలు, అంకెలు, బీజాక్షరాలు - వీటిద్వారా లోకపరిజ్ఞానం వస్తుందని నేను అనుకోను. మనతో చదివాడు - నీకు జ్ఞాపకం ఉందా? లెక్కలు తీసుకుని జయరాంజీ పచ్చి ఛాందసుడులా ఉండేవాడు. నీకు లెక్కలంటే బాగా యిష్టమేగా! గణిత శాస్త్రం 'ప్యూరెస్టు సైన్సు' కదూ నీ దృష్టిలో? ఇంకేం, ఈ అమ్మాయిని లెక్కల్లో తర్ఫీదు చెయ్యి. కాస్త ఇంగ్లీషు కూడా చెబుతూ ఉండు. ఏం?" అన్నాడు శ్రీకాంతుడు.

హరిప్రసన్నుడు సత్యకేసి చూచాడు. వీళ్ళంతా కలిసి తనమీాద ఏదో కుట్ర పన్నుతున్నారన్నట్టు భయం

భయంగా చూస్తూ నిల్చుంది ఆ పిల్ల. ఆమెది పైనుంచి క్రింది వరకు వెన్నపూస ఆకారమే. ఆమెలో మరో పదార్థమంటూ ఏమీ లేదు. కళ్ళుకూడా వెన్నముద్దలే. ఎవర్ని ఏమంటానికీ, ఏమి చెయ్యటానికీ తోచటంలేదు. "మీరంతా కలిసి నన్నేమన్నా చెయ్యండి; ఏమన్నా అనండి; నేను మాత్రం మాటాడితేగా!" అన్నట్టు నిల్చుండిపోయింది.

ఆమె హరిప్రసన్నుడివైపు చూచింది. ఇంతకుపూర్వమే దారిలో వస్తూ ఈయన్ను గురించీ, ఈయన గడ్డంగురించీ బావగారివల్ల విన్నది. ఈయన గడ్డాన్ని గురించి చెప్పుకుంటూనే నవ్వుకుంటూ వచ్చారిద్దరూ. ఓ పెద్దమనిషికి బాగా పెరిగిన గడ్డం ఉంది. అక్కయ్యగారింటికి వెళ్ళగానే ఆయన కనిపిస్తాడు. తనకు ట్యూషన్ మాష్టర్ కాబోతున్న వ్యక్తట! బావగారికి పాతస్నేహితుడట! ఆయనకు గడ్డం!... ఇలా లోలోపల ఊహిస్తూంటే నవ్వు పొంగి పొంగి వచ్చింది. కాని ఇప్పుడు ఆ వ్యక్తి సమక్షంలోకే వచ్చేసరికి, ఆయన గడ్డం కళ్ళయెదుట కనిపిస్తూనా నవ్వు రావటంలేదు. గుండెలో రాయి పడ్డట్టుగా ఉంది. ఆ గడ్డం ఆ పిల్ల దృష్టికి ఏమీ బాగుండలేదు. కనీసం హాస్యకరంగానూ లేదు.

'ఔనౌను. నాకు లెక్కలు బాగా రావు. ఎవరైనా నేర్పితే నేర్చుకొంటాను. కాని' — అని పలుకుతున్నట్టుగా ఆమె ఆలాగే నిల్చుంది గుడ్లు ఒప్పజెప్పి.

"చెప్పు. ఏమంటావ్, మాటాడవేం?" శ్రీకాంతుడు అడిగాడు.

ఇంతలో సునీత అందుకొని "ఇందులో చెప్పేదేముంది లెండి. ట్యూషన్ చెప్పటానికి ఏమభ్యంతరం ఉంటుంది వారికి?" అన్నది. వెంటనే హరిప్రసన్నునివైపు తిరిగి "చూడండి, మీరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా ఈ వ్యవహారంపరిష్కారమైనట్టే. ఈపని మీరు చెయ్యాల్సిందే, ఆ తరువాత మీయిష్టం. దేశాన్ని ఎలా ఉద్ధరించినా సరే; చేతిలో పైసాలేకుండా, ఆకలి కడుపుతో ప్రపంచానికి ఎవరూ ఏమీ ఒరిగించేది ఉండదు."

"నేను యఫ్. ఏ. కూడా ప్యాస్ కాలేదు కదా!"— అన్నాడు హరిప్రసన్నుడు.

"ఆగు ఆగు. ఆసంగతి నాకు తెలుసులే. ముందు నువు ఈ ట్యూషన్ చెప్పటానికి ఒప్పుకున్నతర్వాత ప్రజాభ్యుదయ పథకాల్నిగురించి ఆలోచిద్దాం! చెప్పు, నీ కిష్టమేనా?" — అడిగాడు శ్రీకాంతుడు.

"సరే, ఏసంగతీ రేపు చెబుతాను."

"రేపా? సరే, రేపే కానీ... ఇప్పుడు టైమెంతైంది? ఆరూపది. అయితే బయలుదేరాలి; లేవండి." అన్నాడు శ్రీకాంతుడు.

"సత్యా! పరుగెత్తుకుపోయి లోపలనుంచి ఒక తుండు గుడ్డ పట్టుకురా. వీరు పళ్ళుకూడా వెంట తెచ్చుకుంటారు." అంటూ సునీత హరివైపు తిరిగి "మీరు పళ్ళు ఒక్కటికూడా తినలేదు. పోనీలెండి, అక్కడ తిందురుగాని" అన్నది.

సత్య లోనికి పరిగెత్తింది. "వద్దులెండి, వద్దు" అని హరిప్రసన్నుడు నిరర్థకంగా గొణిగాడు.

శ్రీకాంతుడు లేచివచ్చి హరిప్రసన్నుని బుజంమీద చెయివేసి "పద, పోదాం. కమలాకాయలు ఇక్కడే విడిచి పెట్టాల్సిన అవసరంలేదు. నీకుభారం అయితే నేను మోసుకొస్తాను" అంటూ పళ్ళన్నీ తాను చేతుల్లోకి తీసుకుని అతన్ని వీధివసారాలోని గదివైపు తీసుకుపోతూ భార్యను ఉద్దేశించి "మీరుకూడా చప్పున వచ్చేయండి.. టైములేదు. మేము వసారాలో ఉంటాం" అన్నాడు.

హరిప్రసన్నుని వసారాగదిలో కూర్చోబెట్టి శ్రీకాంతుడు చెప్పాడు: "ఇందాకనే నీ విషయంగూర్చి ఆలోచిస్తూ కూర్చున్నాం. సత్యకు ట్యూషన్ సంగతి మీ వదినే జ్ఞాపకం చేసింది. నువు ఇంకా ఆలోచించే దేమిటి?"

"ట్యూషన్ చెప్పే పనికి నేను ఇష్టపడతానని నువు ఎలా అనుకున్నావు?" ప్రయత్నపూర్వకంగా అన్నాడు హరి.

"నువు ఇష్టపడవని మాత్రం నేను ఎలా ఊహించను?"

"నాకు కావలసింది ఉత్పాదకశ్రమ."

"ట్యూషన్ రోజుకు ఒకగంట. మిగతా కాలమంతా నీ ఉత్పాదకశ్రమకు వినియోగించుకో. ఉత్పాదకశ్రమ అంటే...ఏదో ఒక గట్టి పదార్థం తీసుకొని, దాన్ని విరిచి, సాగగొట్టి ఒక ఉపయోగకరమైన వస్తువుగా తయారు చెయ్యటం. కొయ్యనుంచి తలుపులు చెయ్యటం, మట్టినుంచి కుండలు చెయ్యటం, లోహంనుంచి పళ్ళేలు చెయ్యటం, పత్తినుంచి వస్త్రాలు తయారు చెయ్యటం, పొలం దున్ని ధాన్యం పడించటం — ఉత్పాదకశ్రమ అంటే నీ అర్థం అంతేనా?"

"అటువంటి పనే ఏదో చేసి జీవితం గడుపుకోవాలని నా కోరిక."

"అంటే – జీవించటమనగా శ్రమపడటమనేగా నీ ఉద్దేశం. కాని శ్రమ అంటే అర్థం శ్రమ కాదు; తెలుసా?"

"శరీరపోషణ నిమిత్తం శారీరకశ్రమ మీద ఆధార పడి ఉండాలని నా అభిప్రాయం. ఇతర్లకు చదువు చెప్పి బ్రతుకు గడుపుకోటం సముచితం కాదు."

"ఒక గంటసేపు శ్రమించినందువల్ల నీ బ్రతుకు గడు స్తూంటే, మిగతా కాలమంతా శ్రమించవలసిన అవసరం లేకుండా నిద్రపోగల అధికారం నీకు ఉందా?"

"అదికాదు నే ననేది. మనం చేసే శ్రమ మన బ్రతుకు గడపటానికి ఆధారమైనప్పుడు – అంటే ఆ శ్రమకు ప్రతి ఫలంగా మనకు ధనం ముడుతున్నప్పుడు – ఆ శ్రమ శారీరిక మైనదిగానే ఉండా లంటాను. తదితరమైన శ్రమకు ప్రతిఫలం తీసుకోనే కూడదు. నేను ట్యూషన్ డబ్బు తీసుకోకుండానే చెబుతాను."

శ్రీకాంతునికి కోపం వచ్చింది. "నువు డబ్బు తీసు కోకుండా చెబుతావా? నే నందుకు ఒప్పుకోను. డబ్బు ఇవ్వ కుండా తన కూతురికి ట్యూషన్ చెప్పించుకోటానికి మా మామగారూ ఒప్పుకోరు. నీకు ప్రతిఫలం లేకుండా శ్రమ పడాలనే అభిలాష ఉన్నప్పుడు శారీరకశ్రమ మాత్రం డబ్బు పుచ్చుకోకుండా సరదాగా ఎందుకు చెయ్యవు? నీకు కావల్సిన ముప్ఫయి రూపాయిలూ ఈ ట్యూషనువల్ల లభిస్తున్నప్పుడు, మిగతా కాలంలో నువు ఉత్పాదకశ్రమ డబ్బు పుచ్చుకో

కుండా చెయ్యరాదూ ? అప్పుడు ఉత్పాదకశ్రమదానం చేసిన వాడవౌతావు.”

“అలా చెయ్యకూడదు. శారీరకశ్రమదానం చేసినందు వల్ల శ్రామికవర్గానికి మేలు చేకూరదు. అందువల్ల వస్తువుల విలువల్లో అవాంఛనీయమైన మార్పు వస్తుంది. మార్పు లన్నీ చెరుపుకోసమే అనటానికి వీల్లేదనుకో. అయినా శారీ రికశ్రమ విలువ తలక్రిందైపోయి, డబ్బు శ్రమకు గాక ధూర్తచాతుర్యానికే లభించడం సంభవిస్తే... ...ఇటువంటి మార్పుమాత్రం చాల చెడ్డది. అందువల్లనే ప్రతివాడూ తాను తినే అన్నాన్ని చెమటోడ్చి సంపాదించుకోవాలి. ఆతరువాత చదువు చెప్పటం, ప్రజాసేవ మొదలైన పనులు చెయ్యాలి.”

శ్రీకాంతునికి చాల విచారం కలిగింది. హరిప్రసన్నుడి పట్ల అతనికున్న శ్రద్ధ అపారం. అతని మాటలు వింటుంటే హృదయం క్షోభించిపోయింది. “హరీ! నువు వట్టి పిచ్చి వాడివోయ్. నీ సంగతి ఏం కావాల్సివుందో నాకేం అర్థం కావటంలేదు” అన్నాడు.

శారీరకశ్రమ ప్రాధాన్యంమీద తానెందు కంత గట్టిగా నిల్చోవలసివచ్చిందో తనకే సరిగా అర్థం కాలేదు. తనలో తనకే సందిగ్ధంగా ఉన్నట్టు తోచింది. అప్పు డన్నాడు హరిప్రసన్నుడు : “ట్యూషన్ చెప్పటం నా కిష్టం లేకపోవటంకాదు. మీ మరదలికి నేను సంతోషంగా చెబుతాను.”

ఇలా అంటూండగానే అతని మనఃఫలకంలో సత్య కనిపించింది—మొదట పకపక నవ్వుకుంటూ బావతోవచ్చిం దామె. మళ్ళీ ఆమె నవ్వు తాను చూడలేదు, వినలేదు. 'మీరు ట్యూషన్ చెప్పండి, నేను చదువుకుంటాను' అంటు న్నట్లు యిందాక తనముందు నిలబడింది.

"ఊరికే మీతో ఏం ట్యూషన్ చెప్పించుకుంటాడో మా మామగార్నే కనుక్కోవాలి" అన్నాడు శ్రీకాంతుడు. వెంటనే బిగ్గరగా "ఇంకా రారేం? వినిపిస్తోందా?" అని కేకవేశాడు.

సునీత వచ్చింది. "ఏమిటీ బిగ్గరగా పిలుస్తున్నారు?"

"సత్య ఇంకా లోపల ఏం జేస్తోంది? ఇంకా రాదేం? ఇంతకూ విన్నావా? ఈయనగారు సత్యకు ట్యూషన్ చెప్పరట."

"ఏం? ఎందుకనీ?"

"ఆయన్నే అడుగు."

సునీత హరిప్రసన్నునివైపు చూచింది.

ఆ చూపుతో హరి ఏమైపోతున్నాడో అతనికే తెలి యాలి. ఆధికారికమైన వైఖరిలో ఆమె అతనివైపు చూచింది. అతడు ట్యూషన్ చెప్పటానికి నిరాకరిస్తాడన్న అనుమానం ఆమె కెక్కడాలేదు. అటువంటి మనిషికి నిరాశ కలిగించే ధైర్యం అతనికి లేకపోయింది. "ఏమండీ! ట్యూషన్ చెప్ప మని నేను మిమ్మల్ని కోరుతున్నాను. అప్పటికీ వల్లకాదం టారా? ఏమండీ? అప్పటికీ చెప్పనంటారా? చెప్పండి పోనీ, 'వల్లకా'దని" ఇలా అంటూన్న ఆవిడ కళ్ళలోకి

చూస్తూ హరి ఏమైపోతున్నాడో అతనికే తెలియాలి. "లేదు వదినా! నేను చెప్పనలేదు!" అన్నాడు.

ఆ క్షణాన సునీతకూడా తనకు తెలియకుండానే ఎలాగో అయిపోయింది. ఇక ఆమె అతన్ని 'మీరు' అని సంబోధించలేకపోయింది. ఆ పూర్వపు 'మీరు' శబ్దం ఎక్కడ దాగిపోయిందో! "నువు ఎందుకు చెప్పనంటావు? మేమే తమాషా చేస్తున్నాంకదూ!" అన్నది. ఆ తరువాత "సత్యా! సత్యా!" అని కేకవేసింది.

హరిప్రసన్నుడికి అక్కడ తానూ, సునీత మాత్రమే ఉన్నట్టు కనిపించింది. మరోవ్యక్తికూడా ఉన్నాడన్న విషయం మరచిపోయాడు. "వదినా..." అంటూ ఏమో చెప్పబోయాడు.

సునీత చెయి ఊపుతూ "అక్కర్లేదు. ఇంకా ఈ విషయమై చెప్పవలసిందీ వినవలసిందీ ఏమీలేదు" అని, శ్రీకాంతునివైపు తిరిగి, "చాల ఆలస్యం అయినట్టుంది, పదండి" అంటూ, "ఒసేయి, సత్యా, సత్యా! వస్తున్నావా, లేదా" అని కేకవేసింది.

హరిప్రసన్నుడు ఓడిపోయినవాడులా ముఖంపెట్టి, మూతి బిగించుకుని కూర్చున్నాడు. శ్రీకాంతుడు దగ్గరకు వచ్చి "ఇక లే హరీ, పోదాం పద" అంటూ రెక్కపుచ్చుకుని లేపాడు. ఇంతలో సత్యకూడా వచ్చింది.

## 18

హాల్లో లైట్లు ఆర్పేశారు. సినీమా ఆరంభమైంది. హరిప్రసన్నుడు చూస్తూ కూర్చున్నాడు. కాని అతని

మనస్సు ఎక్కడో ఉంది. అతని ప్రక్కకుర్చీలోనే సునీత కూర్చునిఉంది. అక్కడినుంచి తిన్నగా లేచి వెళ్ళిపోతే బాగుండు ననుకున్నాడు హరి. ఇంటర్వెల్ వచ్చింది. మళ్ళీ లైట్లు వెలిగాయి. హరి ప్రక్కకు తిరిగి చూచాడు : సునీత కుర్చీలో తల వెనుకకు వాల్చి కళ్ళుమూసుకుని పడి ఉంది. శ్రీకాంతుడు ఒక ఉన్నితుండు ఆమె మెడచుట్టూ చుడుతున్నాడు. సునీత ఉదాసీనంగా పడిఉంది. ఎంతో ప్రేమగా శ్రీకాంతుడు ఉన్నితుండు చుడుతున్నాడు. చుట్టటం పూర్తి అయిన తర్వాత "సునీ! ఇక జలుబు చెయ్యదులే - మంచినీళ్ళేమన్నా కావాలా?" అని అడిగాడు. నిద్రనుంచి లేచినదానికి మల్లే సునీత కళ్ళు తెరచి కుర్చీలో సరిగ్గా కూర్చుంది. చెయి అడ్డంగా ఊపుతూ "నాకేమీ అక్కర్లేదు. మీ దయ ఉంటే చాలు" అన్నది.

"సోడా గాని, టీ గాని?"

"ఉహుఁ, ఏమీ వద్దు."

అంతట శ్రీకాంతుడు ఆమె మెడపై చెయి ఉంచి వెనగ్గా కూర్చుని, సినీమా గురించో, మరింకేమన్నా సంగతులో ప్రసంగిస్తున్నాడు.

ఆ సమయంలో హరిప్రసన్నుడు తనలో తాను ఏమాలోచించుకుంటున్నాడో!... వాళ్ళు తన్ను ఎంతో ఆత్మీయుడుగా చూచుకుంటున్నారు. తాను మాత్రం ఆత్మీయుడుగా ఉండలేక పోతున్నాడు; దూర దూరంగానే ఉంటున్నాడు.

"బావా! ఇక్కడ మంచినీళ్ళేమైనా దొరుకు తాయా?" - సత్య అడిగింది.

"ఎందుకు దొరకవు? లెమన్ తెప్పించనా?" - శ్రీకాంతుడు అన్నాడు.

"మంచినీళ్ళే కావాలి" అన్నది సత్య.

హరిప్రసన్నుడు ఈ అవకాశాన్ని అందిపుచ్చు కున్నాడు. అన్నాడు: "మంచినీళ్ళు నేను తెచ్చిపెడతాను."

శ్రీకాంతుడు కుర్చీలోనుంచి లేచాడు. "అరె, మంచి నీళ్ళకోసం నువ్వు ఎక్కడికి పోతావు; కూర్చో కూర్చో."

"నిమిషంలో పట్టుకొచ్చేస్తాను" అంటూ... ఇంతలో మళ్ళీ సునీత ఏమి అభ్యంతరం చెబుతుందోనని ... హరి ప్రసన్నుడు గబగబా హాల్లోనుంచి తోవచేసుకుంటూ బయ టికి వెళ్ళాడు.

సినీమా చూచి చూచి సునీత మనస్సు ఎలాగో అయిపోయింది. భర్తకు చాల చేరువగా జరిగింది. అతని చేతులు తన్ను ఏమిచేస్తున్నాయో ఆమెకు తెలియలేదు. ఆమెకు ఈ చలిగాలికి జలుబు చేసుకొస్తుందేమోనని అతని భయం. అందుచేత ఉన్నితుండు తీసి ఆమె మెడ చుట్టూ చుట్టాడు. ఇటువంటి భర్తపట్ల ఆమె చాల కృతజ్ఞురాలు. కాని ఈ మీరాబాయి సంగతేమిటి? ఆమె వ్యవహారం తనకు అర్థం కావటంలేదే! మీరాబాయిని బాగా చివాట్లు పెట్టాలనిపించింది సునీతకు. అయినా ఆమె సంగతేమిటో బాగా అర్థంచేసుకోవాలి. పతిభక్తురాలు

కాకుండా దేవభజనపరురాలైందేం? "ఇదేం విపరీతం? ఇదేం విపరీతం?" అనుకుంది సునీత. స్త్రీకి భర్తే దైవం కదా! భర్తను విడిచి, భర్తకు విముఖురాలై మరో దోవ పట్టిన మీరాబాయి ద్రోహి కాకుండా ఎలాఉంది? నిజంగా ఆమెను ద్రోహి, దుర్మార్గురాలు అనాల్సిందే. కాని సునీతకు హృదయంలో మరోమూలనుంచి మీరాబాయిపట్ల జాలి, సానుభూతి కూడా పుట్టుకొస్తున్నాయి. మనస్సంతా ఆవేదనగా ఉంది. ఈ మీరాబాయి తత్వం ఏమిటో బాగా అర్థం చేసుకోవాలి. ఆమె భర్త ఒక మహారాజు. తాను అతని రాణి. అయినా ఆమె మహారాజునూ మరచిపోయింది, తన రాణిత్వాన్నీ తృణీకరించింది. ఏమాలోచించుకొని ఇలా ఉన్మత్తురాలైపోయినట్టు? ఈ రహస్యం ఏమిటో తెలుసుకోవాలన్న కుతూహలం సునీతకు ఎక్కువైంది, ఈస్థితిలో ఆమెకు తన భర్త మాటిమాటికి తలపులోకి వస్తున్నాడు. ఆమెహృదయం విహ్వాలమైపోయింది. "ఏమన్నా కావాలా?" అని అతడడిగినప్పుడు ఆమె హృదయం అపారమైన కృతజ్ఞతతో నిండిపోయి "మీ దయ చాల గొప్పది. అది ఉండగా నాకేమీ అక్కర్లేదు" అని పలికింది.

"సోడా? టీ?"

"ఊహుఁ. ఏమీ అక్కర్లేదు."

భర్తృవాల్లభ్యాన్ని తాను పొందగలిగింది. భర్తృసేవ ద్వారానే స్త్రీ సర్వశుభాలు పొందాలి. ఈ కర్తవ్యాన్ని విస్మరించిన మీరాబాయి తత్వం ఏమిటో తాను బాగా తెలుసుకోవాలి. ఈ మీరాబాయికోసం రెండుమూడు

కన్నీటి బొట్లు విడిచి, నిలవదీసి అడుగుదామనుకుంది : 'ఓసి మీరా! ఏమిటి ఆ నీ ప్రేమ! అది నీకు హృదయ కాశి న్యాన్ని ప్రసాదించింది. భర్త అలా బాధపడుతూంటే చూస్తూ... నిలువునా నీరైపోకుండా... సహించి ఊరుకో గలుగుతున్నావు. భర్తృహృదయాన్ని ముక్కలు ముక్కలుగా ఖండిస్తున్నావు ఆ ఖండాలు చూస్తూకూడా ఆ నీ భయంకర ప్రేమ భయంకర ప్రేమగానే ఉంటోంది. ఆ ప్రేమేనా నువు ప్రపంచానికి ప్రసాదించ దలచింది! ఓ మీరా! నీ హృదయబాధ నా కర్థమయ్యేలాగు చెప్పు. ఆ నీ బాధ ఇవాళ నాకు పూర్తిగా తెలిసిపోవాలి – నేను నా జీవితంలో అనుభవించే ఈ ఆనందానికి సరితూగుతూన్న ఆ నీ బాధ!'

ఆమె మెడమీద చెయివుంచి భర్త ప్రేమగా అడిగాడు : "సునీ, సినిమా బాగుంది కదూ!"

ఆమె మెల్లగా "ఔను" అంది.

"చాల మంచి సినిమా!"

"ఔనౌను" – మెల్లగా జవాబు.

"మీరా పార్ట్ చాలా బాగుంది."

"ఔనౌను"– వినపడీ వినపడనట్టుగా సునీత జవాబు చెప్పింది.

"కుంభరాణా వున్నాడే... ...సునీతా!... ...అతని హృదయవేదనే యీ కథకు ప్రాణం – అని నా ఉద్దేశం."

"ఔను"– అని సునీత అన్నదో, లేదో వినిపించలేదు.

"సునీతా! మీరాబాయికోసం కుంభరాణా పడుతున్న బాధ నాకు అర్థంఅయింది. ధర్మచ్యుతికూడా అర్థం

అయింది. అతడు తుపాకితో మీరాబాయిని పేల్చి చంపే సినా, అతని హృదయబాధపట్ల నాకు సానుభూతి వుండక పోదు. జీవితానికి ప్రేమేకదా సారం! ఆ ప్రేమ లేకపోయిన తరువాత వ్యక్తి జడమూర్తి అయిపోతాడు. అంతేగా! మనిషికి తప్పనిసరిగా పిచ్చెత్తించేటువంటి పరిస్థితులు ఏర్ప డ్డాయి - కుంభరాణాకు. అయినా మీరా చూడు: ఎంత నిర్దాక్షిణ్యంగా ఉందో! ఆవిడ దార్ఢ్యం చూస్తే నాకు ఆశ్చర్యంగా వుంది - నిర్ఘాంతపోతున్నాను.''

సునీత అంతా వింటూనేఉంది. తెరమీద సినిమా చూస్తూనూఉంది. సత్య మంచినీళ్ళు అడగటం, హరి ప్రసన్నుడు బైటికి వెళ్ళటం ఆమెకు జ్ఞాపకం ఉంది. ఇంతా వింటూ, చూస్తూకూడా... ఏదీ తన కంటకుండా... వేరుగా ఆమె ఎత్తున ఎక్కడో ఉంది.

''సునీతా! ఎవరైనా కృష్ణవిగ్రహాన్ని పూజించుకో వచ్చు - భక్తి ఉండచ్చు. ఆ భక్తి మనల్ని కర్తవ్యవిముఖు లనుగా చేయటం, తోడివారిపట్ల కృతఘ్నులనుగా చేయటం, అటువంటి కృతఘ్నతకు ఔచిత్యాన్ని ప్రసాదించటం — ఇదేమిటో నా కర్థం కావటంలేదు. మీరాబాయి వ్యవ హారం నాకు దురవగాహంగా ఉంది.''

అంతా తాను వింటూనే ఉన్నట్టుగా ''ఊఁ'' అన్నది సునీత.

''మాటాడవేం సునీతా! చెప్పు. ఈ ప్రపంచంలో మనం నిర్వర్తించవలసిన కర్తవ్యాలనుంచి విముక్తి పొందా

లన్న అభిప్రాయంలాంటిది నీకూ కలుగుతోందా? కలిగితే దాన్ని నువు వెంటనే పరిహరించాలి.''

"ఊఁ..."

"ఆ-ఊఁ, అంటే కాదు, చెప్పు సునీతా!"

సునీత తలెత్తి భర్తవైపు చూచింది. ఆమె కన్నులు సగం మూసీ, సగం తెరచీ ఉన్నాయి. క్రమశః అవి విప్పారినవి. ఆమె ఇలా చెప్పింది :

"లౌకికం ఉంది; పారలౌకికమూ ఉంది. పారలౌకికం యొక్క ఆధిపత్యాన్ని అంగీకరించకపోవచ్చు. అతీతమైన బుద్ధి నెమ్మదిగా కాళ్ళమీద నడిచేదికాదు ; అడుగడుక్కీ తర్కం సహాయంగా steps (మెట్లు) నిర్మించుకుంటూ పోదు. లౌకికం పారలౌకికాన్ని బహిష్కరిస్తుంది - నేను ఒప్పుకుంటాను. కాని అందుచేత పారలౌకికం అసత్యం కాదు. మీరాబాయి ఇరవై సంవత్సరాలుకూడా నిండని యువతి. అటువంటప్పుడు ఆమె లౌకికకర్తవ్యాల్ని అంటిపెట్టుకుని నిశ్చింతగా ఉండవలసింది; పారలౌకిక చింత అంత ఉద్ధృతంగా లౌకిక చింతను కప్పివేయవలసిన యీడు కాదు. లౌకిక వ్యాపారానికి ఒక సరియైన దిక్కు, దారి చూపించేందుకే అప్పుడప్పుడు పారలౌకికం సంఘటితమాతూ ఉంటుంది. దాన్ని బహిష్కరించవలసిందే; కాని దానినుంచి చైతన్యంకూడా మనం పొందవలసి ఉంటుంది. మీరాబాయి తత్వం నాకూ దురవగాహంగానే ఉంది; కాని అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తే అర్థం ఔతుందనే నా అభిప్రాయం. రాణా హృదయంలోని ప్రేమవ్యథను మించిన

ఇంకో ఉత్కట ప్రేమవ్యథను పొందాలన్న ఆకాంక్ష ఆమె హృదయంలో ఉంది—ఇది మీరు ఒప్పుకోరా?"

"ఊహుఁ" - కచ్చితంగా చెప్పాడు శ్రీకాంతుడు.

"మీకు నేను చెప్పలేను." మెల్లగా అన్నది సునీత. ఇంతసేపటినుంచీ ఆమె మెడమీద ఉన్న తన చేయి తీసే శాడు శ్రీకాంతుడు. "రాణాపట్ల మీరాబాయి అన్యాయంగా ప్రవర్తించలేదంటావా? ఆమెకు రాణామీద ప్రేమే లేదు. ఆ ప్రేమ లేకపోవటమనేది శుద్ధ అన్యాయం."

సునీత కళ్ళుమూసుకుని మెల్లగా స్పష్టంగా ఇలా పలికింది: "రాణా ఏవిధమైన అన్యాయమూ చెయ్యలేదు. రాణావిషయమై నేను చెప్పేది అదే. మీరాబాయి విష యమైకూడా అదేచెబుతాను. రాణాహృదయంలో తీవ్ర మైన దుఃఖజ్వాలలు ఉన్నాయి. ఆ జ్వాలల్లో క్రూరకృత్యా లనబడేవికూడా... యాగాగ్నిలో సమిధల్లాగా... భస్మీపట లమైపోతున్నాయి. రాణాను తలచుకుంటే నాకు ఏడు పొస్తుంది. అలాగే మీరాను తలచుకున్నా కడుపు చెరువౌ తోంది. మీరు అనుమతి ఇస్తే ఇప్పుడు ఏడ్చి ఏడ్చి పడుకుంటాను. మీరాబాయిని బాగా అర్థం చేసుకోగలిగితే, ఆమెను దండించాలన్న భావం కలగనే కలగదు."

"సునీతా!" ఆమె చెయి తన చేతిలోకి తీసుకుంటూ అన్నాడు శ్రీకాంతుడు.

అప్పుడు ఆమె శరీమంతా నీళ్ళకన్నా పల్చగా ద్రవించి ప్రవహించినట్లైంది. "నన్ను క్షమించండి."

మళ్ళీ "సునీతా!" అన్నాడు శ్రీకాంతుడు, అంతే. మెల్లగా ఆమె చెయి తన చేతిలోనుంచి తీసి ఆమె ఒడిలోనే వుంచేశాడు. ఆ చెయి అలాగే అక్కడే నిశ్చలంగా పడి వుంది. సునీత దిగాలు పడిపోయింది; చిన్నతన మనిపించింది. కుర్చీకి తలానించి నిశ్చేష్టయై కూర్చుంది. అప్పుడామెకు "ఇవిగో మంచినీళ్ళు పుచ్చుకోండి" అన్న హరిప్రసన్నుని కంఠం వినిపించింది.

సునీత కళ్ళు తెరచి చూచింది. "మంచినీళ్ళు పుచ్చుకోండి" అన్న మాటలు అసహజంగా ఉన్నాయి. చెవులకు ఎబ్బెరికంగా వినిపించాయి. "హరిబాబూ! మంచినీళ్ళు తెచ్చావా? నాకు బాగా జలుబుచేసి ఉంటే మంచినీళ్ళెందుకూ?" అన్నది.

హరిప్రసన్నుడు శ్రీకాంతునివైపు సాగివచ్చి "మంచి నీళ్ళు మీరు పుచ్చుకుంటారా?" అని అడిగాడు.

ఆ 'మీరు' అన్న పదానికి శ్రీకాంతుడుకూడా విస్మితుడైనాడు. "వద్దు, నా కక్కర్లేదు" అన్నాడు.

వ్యవహారం నిరానందంగా పరిణమించినట్లు తోచి సునీత సత్యను పిల్చి "నువు మంచినీళ్ళు తాగావుటే" అని అడిగింది.

"తాగాను; కాని అక్కా! మంచినీళ్ళు కాస్త ఉప్పులుగా ఉన్నాయి."

హరిప్రసన్నుడు చేతిలోని కూజా పైకెత్తి "అయితే దీన్ని అవతల పారేసి రానా?" అన్నాడు.

"పారేయటం ఎందుకు? ఏదీ ఇలా ఇవ్వు" - అన్నది సునీత చెయి చాచి.

"కాని మీకు దాహం వెయ్యటం లేదన్నారుగా!"

"ఔను, కాదు - కాదు, మరచిపోయాను, నాకు దాహంగానే ఉంది" - అంటూ చెయి చాచి హరిప్రసన్నని చేతిలోనుంచి కూజా లాక్కుంది. "నిల్చునే ఉన్నావేం హరిబాబూ !"

"నేను వెళ్ళిపోతాను. ఈ ఆటలో నా మనస్సు చొరటంలేదు. రేపు ఉదయాన్నే నాకు చాల పనులు ఉన్నాయికూడా."

శ్రీకాంతుడు అందుకున్నాడు: "నీకేమన్నా పిచ్చెత్తిందా? వెడతానంటావేం? ఆట ఎంతో బాగుంటేను!"

"ఇప్పటికి నాకు సెలవిప్పించండి. వీలుగా ఉంటే రేపు వచ్చి కలుస్తాను. అప్పుడు ట్యూషన్ విషయమై కూడా నా నిర్ణయం చెబుతాను."

"ఊహుం, నువ్వు వెళ్ళద్దు. ఇంకో అరగంట పావుగంటలో మేమూ వచ్చేస్తున్నాం. ఇంతలో ఏం మునిగిపోయింది. ఆట నీకు అసహ్యంగా ఉంటే చూడబోకు. కళ్ళు మూసుకు కూర్చో" అన్నాడు శ్రీకాంతుడు.

మధ్యలో సత్య కల్పించుకుని "అదేమిటి బావా? పనిఉండి వెడతానంటూంటే వద్దంటావేం? అదేం ఘోరం?" అన్నది.

ఇన్నిమాటలు సత్యనోటినుంచి ఎలా వచ్చాయో మరి ! ఆ మాటలు పలికేసి మళ్ళీ నోరు నొక్కుకుని కూర్చుండిపోయింది.

సునీతకు మనస్సేమీ బాగా లేదు. అకారణంగా ఏదీ జరగదు. ఈ రసాభాసకు కారణం ఏమిటి ? ఆమెకు అంతు పట్టలేదు.

"సత్యా !" అంటూ తీవ్రంగా అదలించింది సునీత. కాని సిగ్గుపడుతూ, భయభయంగా ముడుచుకొని కూర్చున్న ఆపిల్లను చూచేసరికి ఆమెకు నవ్వొచ్చింది. సత్య ముఖం మీద లజ్జ - భయం ఎంతగా కమ్ముకున్నా పరిహాసంకూడా తొంగిచూస్తూనే ఉంది. అది చూచి 'హుం' అనుకుంది సునీత తనలో తాను.

ఇంటర్వెల్ అయిపోయింది; గంట కొట్టారు. సునీత కూర్చున్న కుర్చీకి పక్కకుర్చీముందే హరిప్రసన్నుడు నిల్చుని ఉన్నాడు. ఆమె తన రెండు చేతులూ చాచి అతని బుజాలు పుచ్చుకొని ఆ కుర్చీలో కూర్చోబెట్టింది: "కూర్చో, కూర్చో, ఆట మళ్ళీ ఆరంభం ఔతోంది; తెలియటంలా ?" అంటూ.

హరిప్రసన్నుడు మరేమీ అభ్యంతరం చెప్పలేదు. కుర్చీకి అతుక్కుపోయి కూర్చున్నాడు.కూర్చుంటూ అన్నాడు: "సరేలే వదినా ! నీకోసమని ఉండిపోతున్నాను."

"ఔనౌను, నాకోసమనే."

"నీకోసమనే ఉండిపోతున్నాను" అన్న మాటలు పలికి, ఆమె జవాబు విని, హరిప్రసన్నుడు కుర్చీకి అతుక్కు

పోయాడు. ఆమె తన్ను బుజాలు పట్టుకొని కూర్చోబెట్టింది. ఆ స్పర్శ తనమీద ఇంకా అలాగే ఉన్నట్టుంది. అతడు తనలో తాను మునిగిపోయి ఉన్నాడు.

హాలులో లైట్లు ఆరిపోయాయి. ఆట మళ్ళీ మొదలైంది.

ఆమె బలిష్ఠములైన చేతులు స్పృశించిన అతని బుజాలమీది పులకలు ఇప్పటికీ చల్లారలేదు. ఎప్పటికప్పుడు కొత్తలై ఉబుకుతున్నాయి. శరీరమంతా గగుర్పాటుతో వొణికిపోతోంది. తాను వెళ్ళిపోతానంటే వెళ్ళనీకుండా... ఆమె తన రెండు గుప్పెట్లతో బుజాల్ని కరచిపట్టి బలవంతాన కూర్చోబెట్టింది. ఈమెకు తనమీద ఏమి అధికారం ఉంది? అధికారం లేకపోయినా అధికారం చలాయిస్తున్నదే! ఆమె ఒకని భార్య. ఇతర్లకు ఏమౌతుంది? ఎదుటివాడిలో ఔద్ధత్యం రేగుతుందేమో నన్న భయమే ఆమెకు లేదా యేమిటి? లేక అటువంటి పురుషోచితమైన ఔద్ధత్యాన్నే తననుంచి ఆమె వాంఛిస్తోందా? అంత సంకుచితమైన స్వభావమా ఆమెది?... ...

సునీత అతని చెవి దగ్గర ముఖంపెట్టి అడుగుతోంది: "హరిబాబూ! ఎందుకూ వెళ్ళిపోతా నంటున్నావు?"

"ఏం లేదు, ఏం లేదు..."

"హరిబాబూ! నువు నన్ను వదినా అని పిలుస్తున్నావు. ఇంకెందుకూ పారిపోవటం. తమ వీపుకేసి ఎవరన్నా పారిపోగలరా? నువ్వూ పారిపోలేవు... ఆట అసహ్యంగా ఉందా నీకు?"

"లేదు, లేదు..."

"ఔను, ఎందుకు అసహ్యంగా ఉంటుంది! సినిమా చూడకపోయినా మీరా పేరు తలుచుకుంటేనే మనసు నీరై పోతుంది. సరేగాని, హరిబాబూ, సత్యకు ట్యూషన్ చెప్ప మని నేనుకూడా కోరానుకదా, కాదంటావేం? ఒకవేళ నేను కోరాను కనుకనే కాదంటున్నావా?"

"ఔను - కాదు -" ఏదో గొణిగాడు హరి.

"మా సత్య భావతరంగాల్లో విహరిస్తూ ఎప్పుడూ ఏదో స్వప్నావస్థలో ఉన్నట్టు కనిపిస్తుంది. అందువల్ల సృజన శక్తిగల పిల్లే. మంచి భోగానుభవంలో శూన్యస్థితి కల్పించ గలదు, వట్టి శూన్యవాతావరణంలో ఉత్సాహదాయకమైన రంగాన్ని సృష్టించగలదు. ఇటువంటి పిల్లను నువు కాస్త ఒక దారికి తీసుకురావాలి. అంతమాత్రం సాయం చెయ్యి. ఈ సాయానికి మానాన్నగారు ప్రతిఫలం ముట్టజెప్పకుండా ఉండలేరు. దీనికి నీ అభ్యంతరం ఏమిటి?"

హరి జవాబేమీ చెప్పలేదు. వింటూ కూర్చున్నాడు.

"చూడు, హరిబాబూ! నువు చిన్నవాడివేం కాదు. కాని మేం ఆడవాళ్ళం. పురుషుడిని ముందు పరిగెత్తించటం మా పని. అతడు ముందు పరిగెత్తుతున్నంతసేపు మేము వెనకాలే వుంటాం. ఉండి ఉండి వెనక్కు వచ్చేద్దామని అతడు తిరుగుముఖం పెట్టాడంటే ఎదురుగా మేం కనిపిస్తాం. మమ్మల్ని దాటేసుకుని అతడు పోలేడు. పురుషుడు ముందు మార్గాన్ని చక్కగా పరిష్కరించుకుంటూ పోకపోతే స్త్రీ సహించదు. ఈ బాధ్యతనుంచి తప్పించుకుని పురుషుడు

పారిపోజూస్తే వెనకాల ఉన్న స్త్రీ చేతిలో బందీ అయి, తరువాత మళ్ళీ ముందడుగు వేస్తాడు. పురుషునికిగల యీ అధికారంపట్ల స్త్రీ కృతజ్ఞురాలు. అయితే పురుషుడు పద చ్యుతుడు కాకుండా చూడాల్సిన అధికారం స్త్రీకీ వుంది. హరిబాబూ! నువ్వు తిరస్కరించలేవు. నువ్వు ఇప్పుడు ఏ సంకటాల్ని ఎదుర్కోబోతున్నావో ఆ సంకటాల్లోనే ఉండి పోతావు. వెనక్కు పారిపోలేవు.''

''ఒదినా, నన్ను క్షమించాలి. నేను ఎప్పటికైనా ఈ ఢిల్లీ విడిచిపెట్టి పోయేవాడినే. ఉండేవాడిని కాదు.''

''ఏమిటీ-ఈ?''

''నా కలాగే అనిపిస్తున్నది.''

''ఉహుఁ, అలాకాదు, చూస్తాగా! అలా కాకూడదు.''

## 19

ఆ తరువాత సునీత మరేమీ మాటాడలేదు. ఆట చూస్తూ కూర్చుండిపోయింది. హరిప్రసన్నుడుకూడా ఏవేవో ఆలోచనల్లో నిమగ్నుడై యుండి తెరవైపు చూస్తూనే వున్నాడు. తన కుర్చీకి పక్కనే ఉన్న కుర్చీలో కూర్చున్న ఆ యువతి హస్తాన్ని తన రెండు చేతుల్లోకి తీసుకుని ''ఒదినా, నేను వున్నాను; పారిపోలేదు; ఉన్నాను'' - అని మెల్లిగా చెబుదామని మాటిమాటికీ అనిపిస్తూవుంది.

సినీమా అయిపోయింది. అందరూ బయటికి వచ్చేస్తున్నారు. అప్పుడు సునీత భర్తతో అంది: ''ఇంత పొద్దు పోయాక అతడు ఎక్కడికి వెడతాడు? మనింటికే రమ్మనండి.''

"ఔనౌను" అన్నాడు శ్రీకాంతుడు. హరిప్రసన్నుడు దూరదూరంగా నడిచి వస్తున్నాడు. శ్రీకాంతుడు అతన్ని సమీపించి, చెయిపుచ్చుకుని "ఏం హరీ! సినీమా ఎలా ఉంది? సుస్తీగా కనిపిస్తున్నావేం? ఆట నీకు బాగా లేదా యేమిటి?" అని అడిగాడు.

"ఉహుఁ, ఉహుఁ, బాగానే ఉంది." గొణిగాడు హరి.

"ఇంత రాత్రిపూట ఎక్కడికి పోతావు? మాయింటికే రా. !"

"కాదులే; నా బసకు వెడతాను."

"ఏమైనా మునిగిపోయే పని ఉంటే సరే, లేకపోతే మాయింటికే వచ్చి పడుకో."

"కాదు, కాదు, నా బసకే వెడతాను."

సునీత, సత్య వెనకాలే వస్తున్నారు. "హరిబాబూ! మాయింటికే వస్తున్నావుగా!" - సునీత అడిగింది.

"అయితే అక్కా! మీరు ఆటమధ్య లేచి వెళ్ళిపోలేదా? వెళ్ళిపోయారనుకున్నానే!" - అన్నది సత్య ఆశ్చర్యం నటిస్తూ.

"చూచావా సునీతా! బసకే వెళ్ళిపోతానంటున్నాడు!" - శ్రీకాంతుడు సునీతకు ఫిర్యాదు చేశాడు.

"అదేమిటి, హరిబాబు!" సునీత ముందుకు వచ్చి అడిగింది.

"బసకు వెళ్ళిపోతేనే బాగుంటుంది"—హరిప్రసన్నుడు మెల్లగా అన్నాడు.

"సరే, రేపు మధ్యాహ్నం వస్తావు కదూ! అప్పుడు మా వారు ఇంట్లో ఉండరు; అయినా రేపు సత్యకు సెలవు రోజు. ఒంటిగంటా, రెండుగంటలప్పుడు రా."

"సరే, ఎదురుచూస్తూ ఉండండి."

"అదేం మాట? అయితే రావా యేమిటి?"

"వస్తేవస్తాను, లేకపోతే—నమ్మకం ఏమిటి?"

సునీత కంఠస్వరంలో దృఢత్వం వచ్చింది. "అలా కాదు; నువు తప్పకుండా రా. వీలైతే కొంచెం ముందుగానే వచ్చెయ్యి. ఇక్కడే భోజనం చేద్దువుగాని. సత్య చదువు సంధ్యలు ఎలా ఉన్నాయో చూద్దువుగాని. 'ఆట మధ్యలో వీరు లేచి వెళ్ళిపోలేదా' అని అడుగుతోంది సత్య. ఆ పిల్ల మిమ్మల్ని... అదేమిటే సత్యా! ఏమిటి చేస్తున్నావు?" విషయం ఏమిటంటే సత్య, వెనకనుంచి సునీత కొంగు పుచ్చుకుని లాగింది.

"వదినా! రేపు నేను వస్తాననే అనుకోండి. ఒకవేళ రాకపోతినా క్షమించటానికి సిద్ధంగా ఉండండి."

"క్షమించి ఊరుకోకపోతే శిక్షించగల అధికారం నాకెక్కడిదీ? శిక్షించటానికి నువు ఒప్పుకునేట్టయితే, క్షమించి ఊరుకోటం మాత్రం నా కిష్టంలేదు."

"అయితే సరే, శిక్షించండి."

మధ్యమధ్య శ్రీకాంతుని అవసరం లేకుండానే... సునీతకూ, హరిప్రసన్నుడికీ సంభాషణ ఇలా చాలసేపు సాగిపోవటం...... శ్రీకాంతునకు సంతోషదాయకమే అయింది. సునీత మాటలకు వెతుక్కోకుండా తడుముకోకుండా ధారా

శంగా ఎంత చక్కగా మాటాడింది? ఆమె మాటలు సరసంగా, ఇంపుగా ఉన్నాయి. శ్రీకాంతునకు చాల సంతోషం అయింది. ఇది తనకొక నూతనానుభవంలాగ మనస్సుకు ప్రీతి చేకూర్చింది. తన భార్య అంత వాక్చాతుర్యంగల మనిషి అయినప్పుడు తన జీవితం నిస్సారం కాదు. తమ దాంపత్యజీవితం పచ్చపచ్చగానే ఉంటుంది. ఏమీ లోటు లేదు.

"హరీ! నువ్వు సత్రం విడిచిపెట్టి మా యింట్లోనే ఉండటానికి ఇష్టం లేకపోతే, వేరే ఎక్కడైనా ఒక గది రేపే అద్దెకు తీసుకో. రేపు నేను కచేరీనుంచి వచ్చేసరికి మా యింటిదగ్గర ఉంటావుగా. మనిద్దరం కలసి యిళ్ళకోసం వెదకుదాం పోయి, ఏం!" అన్నాడు శ్రీకాంతుడు.

"ఊఁ, అలాగే."

సునీత బండి ఎక్కుతూ "కాబట్టి రేపు మధ్యాహ్నం పన్నెండు గంటలకు..." అన్నది.

బండి వెనుక హరిప్రసన్నుడు ఆమెవైపే చూస్తూ నిల్చున్నాడు. అతడేమీ పలుకలేదు.

"వస్తావుకదూ!" సునీత అడిగింది.

కాని హరి ఏం జవాబు చెబుతాడు?

బండిలో సునీత పక్కనే సత్యకూడా కూర్చుంది. హరి ఆమెవైపుకూడా చూచాడు. వారిద్దరి పలుచని పెదవులమాటున ఏదో దాగిఉండి, పకపకలాడుతూ బైటపడాలని ఉబలాటపడుతున్నట్టుంది. కాని అది ఆలోపలనే బల.

వంతాన ఆపుచేయబడుతున్నట్టుగా ఉంది. హరి ఏం మాటాడతాడు?

బండి కదిలింది. వాళ్ళిద్దరూ చేతులెత్తి నమస్కారం కాబోలు చేశారు.

హరిప్రసన్నుడుకూడా అక్కడే నిల్చుండి నమస్కారమే కాబోలు చేశాడు.

"గుడ్ నైట్" అన్నాడు బండిలోనుంచి శ్రీకాంతుడు. అప్పుడు హరి నోట్లోనుంచి కూడా 'గుడ్ నైట్' అన్న శబ్దం అప్రయత్నంగా వచ్చేసింది.

బండి సాగిపోయింది.

హరిప్రసన్నుడు నడిచే వెళ్ళాడు బసకు. అక్కడ నేలమీద ఒక చాపవేసుకుని తన మామూలు పక్క పరచుకున్నాడు. ఒక దీపం వెలిగించాడు. నిద్రపోదామని అతని ఉద్దేశం. కాని నిద్ర రాలేదు. ఆలోచిస్తూ పడుకున్నాడు: ముందు కర్తవ్యం ఏమిటి? సునీత అనే పేరు గల ఆ యువతి "అలా కాదు, అలా కాకూడదు" అని ఖచ్చితంగా చెప్పింది. అలా ఎందుకు కాకూడదు? అలా అనటానికి ఆమెకేం అధికారం వుందనీ? ఆమె తన కెవరనీ? ఎవరూ?... ...

ఆలోచనలు తెగలేదు. స్త్రీ అంటే ఎవరు? పురుషుడంటే ఎవరు? ఈ జీవితానికి పరమార్థం ఏమిటి? ఎవరికి భయపడి పారిపోవాలి? ఏ దిక్కుకు పారిపోవాలి? బంధుత్వం అంటే ఏమిటి? వివాహం అంటే ఏమిటి? గాలిదుమారం ఒక చెట్టు అడ్డమైతే ఆగిపోతుందా? ఒక దౌర్భాగ్యానికి ప్రేమ అనే పెద్ద పేరు పెట్టి మానవుడు బందీ అయిపోవ

టానికి కోరుకోటం, ఇంతకూ తా నా బంధనంలో పడి వుండలేకపోవటం...... ఈ గందరగోళమంతా ఏమిటి?

ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానాలకోసం వెతుక్కు-న్నాడు. ఈ తాను పడిపోయిన విచికిత్సలో తనకు సాను భూతికోసం ఆశించాడు. కాని అతనికి ఎటుజూచినా వట్టి జంజాటమే కనిపించింది. చివరకు మెల్లగా నిద్ర వచ్చేసింది.

# 20

ఆరాత్రి సత్య అక్క-గారింట్లోనే ఉండిపోయింది. మర్నాడు హరిప్రసన్నుడు వచ్చినప్పుడు సత్యను అతనికి చదువుకు అప్పగించేయాలని సునీత ఉద్దేశం. సత్యకు ట్యూషన్ చెప్పటానికి హరిప్రసన్నుడు నిరాకరిస్తాడేమో నన్న అనుమానం ఆమెకు లేదు. సత్యకూ, హరిప్రసన్నుడికీ మధ్య...కొత్త కాబట్టి... సంకోచం ఉంది. ఈ సంకోచాన్ని తొలగించామంటే ఒకే దెబ్బతో రెండు ప్రయోజనాలు నెరవేరుతాయని సునీత భావించింది. స్త్రీ కాబట్టి సునీతకు ఈ ఉద్యమంలో ఉత్సుకతకూడా సహజంగా కలిగింది.

అయినా ఇంతమాత్రంతో ఆమె మనస్సు తేలికపడ లేదు. మరో గడ్డుసమస్య ఏదో అడ్డం ఉన్నట్టుతోచింది ఈ తన పన్నాగం నెరవేరగలదన్న విశ్వాసం ఆమెకు లేక పోలేదు. కాని ఒకరకమైన సందిగ్ధంకూడా ఉంది. హరి ప్రసన్నుడు తేలిగ్గా ఒకపట్టాన ఈ పన్నాగానికి లొంగి

వస్తాడా? - రాడా? సినీమా హాల్లో ఉన్నంతసేపూ హరి ప్రసన్నుడు అన్యమనస్కుడయ్యే ఉన్నాడు. ఎందువల్ల?... అతని మనస్తత్వం ఆమెకు పూర్తిగా అవగాహన కావటం లేదు.

హరిప్రసన్నుడు ఎటువంటివాడని తాను భావిస్తున్నదో పూర్తిగా అటువంటివాడే కాదేమో నన్న అనుమానం సునీతకు కలిగింది. అతడు సాహసికుడే, కాని పిరికితనం కూడా అతనిలో ఉంది. పైకి విరాగిగా కనిపిస్తాడు; కాని అతని హృదయంలో ఏదో ఒకవిధమైన వేదన ఉన్నట్టే ఉంది. వేదన ఉంది - ఉన్నది. అయితే దేన్నిగురించి ఆ వేదన? ఈ ప్రశ్నకు జవాబేదో సునీత ఊహకు స్ఫురించింది. కాని అది ఔనో, కాదో నిశ్చయంగా తేల్చుకోలేక పోయింది. ఇంకా బాగా పరిశీలించిగాని ఆ విషయం తేల్చుకోటానికి వీల్లేదని భావించింది.

తన చెల్లెలు సత్య అనాకారి పిల్లేంకాదు. ప్రాణాలెప్పుడూ వ్యాకులపాటుతోనే ఉండే హరిప్రసన్నుడికి ఒక కళ్ళెం అవసరం. ఇంతకూ ఆ పొడుగాటి జుట్టూ, బాగా పెరిగిపోయిన ఆ గడ్డాలు, మీసాలు... ఈ గొడవ పెద్ద గొడవేంకాదు. ఒక్క చిటికెలో అవి మాయమైపోతాయి. ఆ తరువాత అతడు విచిత్రవ్యక్తిగా కాని, దేశద్రిమ్మరిగా కాని కనిపించడు. క్రమేణా అతని పూర్వపు మనస్థితి మారిపోయి, మామూలు ప్రపంచంలో పడి బాగుపడతాడు.

"వీరి సమ్మేళనం చాల బాగుంటుంది. ఆ విషయంలో నాకేం అనుమానం లేదు. హరిప్రసన్నుడు గృహస్థుడైతే

అతనివల్ల సంఘానికి ప్రయోజనం ఉంది" - అనుకుంది సునీత. "కాని అతడు ఇన్నాళ్ళనుంచీ ఎక్కడెక్కడ ఉంటు న్నాడు? ఏమేం చేస్తున్నాడు? ఆ రహస్యం అంతా నా కెలాగ తెలియటం? అతని హృదయం నిస్సారమా? శూన్యమా? అందుచేతే ఇలా ప్రపంచమంతా విశృంఖలంగా తిరుగుతున్నాడా? లేక తనలో ఏదో లోటు ఉండి, దాన్ని భర్తీ చేసుకోవాలన్న ఉద్దేశంతో వెతుక్కుంటూ పోతు న్నాడా? ఈ రహస్యం నా కెలాగ తెలియటం?"

సునీత సాధారణంగా ఎప్పుడూ ఇల్లు అంటిపెట్టుకునే ఉంటుంది. ఎక్కడికీ వెళ్ళదు. అందుచేత ఆమెకు దేశద్రిమ్మరు లంటే ఒకరకమైన ఆకర్షణ. దూరపుకొండలు నునుపుగా కనిపిస్తాయికదా! దేశద్రిమ్మరులంటే ఆమెకు జాలి, సాను భూతి పొంగివస్తాయి. కాని వాళ్ళ మనస్తత్వం ఏమిటో ఆమెకు ఎంత ఆలోచించినా బోధపడదు. "ఒక ఉద్దేశం, ఆశయం లేకుండా ప్రయాణాలు చేస్తూంటారు. ఇల్లు అనేది వాళ్ళకు ఒకటి రెండుపూటలు ఉండి పోయే బస మాత్రమే. ఏ బసా వాళ్ళకు ఇల్లులా కనిపించదు. బైట ఎలాగుంటారో, జైల్లోనూ అలాగే ఉంటారు. ప్రపంచంలో ఎంతో సంపద ఉంది. కాని అందులో ఏస్వల్పమూ వారిది లేదు. ఎందరో ప్రజలు ఉన్నారు; ఏ ఒక్కడూ వారికి చుట్టం కాడు. వారికి అందరూ సమానులే. అందరూ వారికి శిష్టుల్లాగే కనిపిస్తారు; లేదా అందరూ సామాన్యుల్లాగే కనిపిస్తారు; ఒకరు ఇవ్వటం, తాము పుచ్చుకోవటమంటూ ఉండదు. ఇల్లు లేదు; చుట్టాలు లేరు; పరిచయాలు అక్కర్లేదు; అతిథుల్లా వస్తారు, పోతారు.

ఈ విశాల విశ్వంలో డొల్లుకుపోతూ ఉంటారు. ఒకచోట ఉండరు. నిత్యం పరిభ్రమిస్తూ ఉండేందుకేనా భగవంతుడు వీళ్ళను సృష్టించాడు? ఆయన అభిప్రాయం ఏమిటి?

"కాని హరిప్రసన్నుని జీవితం అలాగ నిష్ప్రయో జనం కాకూడదు - కానీయరాదు. అతడు అందుకు కాదు పుట్టింది. నేనతనికి ఇట్టె వదినె నైపోయాను. అతడొక యింటి వాడు, ప్రయోజకుడు, బంధుమిత్ర పరివేష్టితుడు, కర్మ ణ్యుడు అయేలాగు నేను ప్రయత్నించి చూడాల్సిందే.

"పురుషుడిని ఒక ప్రయోజనకరమైన మార్గంలో పెట్టి నడిపించలేకపోతే ఆడుది ఇంకెందుకు? పురుషుడిలో నిరీహ, నిరపేక్ష చోరకుండా ఆడుది కనిపెట్టి ఉంటుంది. ఈ మహా ప్రకృతి గోద్రాలుఅయిపోకూడదు. ప్రపంచం సస్యశ్యామలమై కన్నులపండువుగా ఉండాలిగాని, సహారాయెడారి అయిపోతే ఏం ప్రయోజనం? ప్రపంచాన్ని పచ్చపచ్చగా ఉంచేందుకే భగవంతుడు పురుషులతోపాటు స్త్రీలనుకూడా సృష్టించాడు. ఇంతవరకూ హరిప్రసన్నుడు దూరదూరంగా, ఒంటరిగా, విరాగిగా కాలక్షేపం చేస్తూవచ్చాడు. ఉహుఁ, ఇక అతన్ని అలానే ఉండనీరాదు. అలా ఉండటం భగవంతుని ఉద్దేశం కాదు. అప్రయోజకత్వం జీవితలక్ష్యం కాదు. నిరుపయో గత నిస్సారం. ముందు జన్మ ఉన్నప్పుడే మృత్యువు సత్యం. జన్మపూర్వకము కనుకనే మృత్యువు బ్రతుకగలుగుతోంది."

ఇలా ఆలోచించుకుని సునీత సత్యకు ముందుగా కొన్ని నీతులు ఉపదేశించి తయారు చేసింది. "అతనితో నవ్వులు, వెకిలి వేషాలు లేకుండా, చెప్పినట్టు విని జాగ్రతగా

చదువుకో. మంచి చెడ్డలు ఎరిగి ప్రవర్తించు" - అని బోధించింది. సత్య చక్కనిది, బుద్ధిమంతురాలు, సుశీల - అని ఆమె మనసులో నిశ్చయం చేసుకుంది. ఇవాళ పన్నెండు గంటలకు హరిప్రసన్నుడు వస్తాడు. భోజనం ఇక్కడే చేస్తాడు. చీకటి పడనిదే మళ్ళీ వెళ్ళనీకూడదు.

శ్రీకాంతుడు కూడా కోర్టుకు వెడుతూ చెప్పి వెళ్ళాడు: "నేను సాయంత్రం వచ్చేసరికి హరిప్రసన్నుడు నా కిక్కడ కనిపించాలి, నేను రాకముందే అతన్ని వెళ్ళనీకండి."

సత్యకు మాత్రం హరిప్రసన్నునిపట్ల గౌరవభావం ఏ మాత్రమూ లేదు. అతని పేరు చెపితే కడుపుబ్బ నవ్వొస్తుందామెకు. మనిషి కనిపిస్తే ముఖం దాచుకుని పగలబడి నవ్వుకుంటుంది. ఈ వ్యక్తిపట్ల తన అక్కకూ, బావకూ ఇంత సౌహార్దం ఎందుకు ఏర్పడిందో ఆమెకు ఆశ్చర్యంగానే వుంది. ఏవో సూటీపోటీ మాటలని అతన్ని ఏడిపించాలనే ఆమె కోరిక. అతనిపట్ల ఆమె కెప్పుడూ విరోధ భావమే. అక్కయ్యకు అయినా అతనిపట్ల యింత సద్భావం ఏర్పడి ఉండటం సముచితంగా కనిపించలేదా పిల్లకు. అక్కయ్య అతని చెవిదగ్గర ముఖంపెట్టి మాటాడవలసిన సంగతులేమున్నాయనీ? సత్యకు మాటిమాటికీ ఈ సంగతి ఆలోచనకు వస్తూ వుంటుంది. సినిమాహాల్లో అతని చెవి దగ్గర ముఖం పెట్టి మాటాడుతూ కూర్చుంది అక్కయ్య! ఎందుకనీ?

మధ్యాహ్నానికల్లా హరిప్రసన్నుడు భోజనానికి ఇక్కడికే వస్తాడు. అందుకని వంటపనిలో తనకు సాయంచేస్తూ

ఉండమని సునీత ఆజ్ఞాపించింది సత్యను. సత్య సాయం చేస్తూనేవుంది. కాని కూరల్లోనూ, పచ్చళ్ళలోనూ ఉప్పు అసలే వెయ్యకుండానో, కారం అధికంగా కుమ్మరించో పాడుచేసేద్దామనీ ఆమె ఉద్దేశ్యం. అయినా అలాంటి పనేమీ ఆమె చెయ్యలేకపోయింది. వ్యంజనాలన్నీ మంచి మెలకువతో బాగానే తయారుచేసింది, తన కిష్టంలేకపోయినా. కాని చివరకు అక్కయ్యకు తెలీకుండా ఒక్క పని మాత్రం చేసింది: బాదంపప్పు, ఏలక్కాయలూ వేసి మైదాపిండితో పేడా, బర్ఫీ చాల తెలివితేటలుగా తయారుచేసింది. హరిప్రసన్నుడు వాటిని గబగబా నోట్లో కుక్కుకునే వికృతవైఖరి కళ్ళారా చూడాలని ఆమె కోరిక. చూచి అతని మూర్ఖతకు...... పరికిణీ అడ్డం పెట్టుకుని మనసారా నవ్వుకోవాలని ఆమె సరదా.

శ్రీకాంతుడు తన మామూలు భోజనం ముగించుకుని కచేరీకి బయలుదేరాడు. "నేను వచ్చేవరకూ హరిని ఇక్కడే ఉంచెయ్యండి. ఇవాళ మూడు కేసులు ఉన్నాయి. నేను రావటం కొంచె ఆలస్యం కావచ్చు. అయినా అతన్ని ఉండమనండి."

"అయితే బావా! ఇవాళ ఆయన నాకు లెక్కలు ట్యూషన్ ఆరంభిస్తారా?" సత్య అడ్డం వచ్చి అడిగింది.

శ్రీకాంతుడు నవ్వాడు. "ఇవాళ నువు ఆయన్ను పరీక్షచేసి వొదిలెయ్యి - చాలదూ?"

"పరీక్షలో ఆయన్ను ఫేల్ జేయించగలను. ఆయన ఫేల్ అయిపోతే మీరు నామీద కోప్పడతారా?"...

ఇంతా అనేసినతర్వాత 'అలా అన్నానేమిటి ?' అనుకుంది సత్య.

ఇంతలో సునీత అందుకుని "మీరు కచేరీనుంచి ఇంటికి వచ్చేటప్పుడు పళ్ళేమన్నా కొనుక్కురండి. మరచి పోకండి" - అని చెప్పింది.

"అలాగే కాని... ఇవాళ సత్య హారిని పరీక్షిస్తుందట. నిరభ్యంతరంగా పరీక్షించనీ. హరి గొప్ప పండితుడన్న సంగతి నాకైతే తెలియదు. అయినా సత్య సాహసం ఎంతవరకుందో చూద్దాం" అంటూ శ్రీకాంతుడు కచేరీకి వెళ్ళిపోయాడు.

"సత్యా ! నువ్వు భోజనం చేసిరా !" అంది సునీత.

"మరి నువ్వో, అక్కా !"

"నామాటకేంలే. నువు చప్పున భోజనం ముగించేసి రా !"

"నేనూ నీతోపాటే తింటాలే."

"ఊఁ, పద, పద, కంచం పెట్టుకుని కూర్చో."

సత్యం యింకేం చేస్తుంది ? కంచం పెట్టుకుని కూర్చుంటూ "మరి నువ్వో!" అని అడిగింది.

"నేనా? అతిథి రాకముందే నన్ను దిట్టంగా తినేసి కూర్చోమంటావా?"

సత్య కోపంగా తలవంచుకుని కంచంలో అన్నం తింటోంది.

# 21

కాని హరిప్రసన్నుడు రానేలేదు. పన్నెండైంది; ఒంటిగంటైంది, రెండైంది; అతడు రానేలేదు.

చాలసేపు ఎదురుచూచింది. చివరకు ఎదురుచూడ్డం మానేసింది. హరిప్రసన్నుడు వచ్చాక అతనికి భోజనంపెట్టి, ఆతరువాత తానూ భోజనం చేద్దామనుకుంది. కాని ఇప్పుడు తాను భోజనం చెయ్యలేదన్న విషయమే జ్ఞాపకంలేదు. ఇంతవరకూ వంటింట్లో ఏవేవో పనులు చక్కబెడుతూనే ఉంది. ఇప్పుడు వంటింటి విషయం కూడా మరిచేపోయింది. శయనమందిరంలోని ఒక పడకకుర్చీలో మేను వాల్చింది. మరి కాసేపటికి సితారు తీసుకుని వాయించటం మొదలు పెట్టింది.

సితారు తీగలమీద ఆమె చెయివేసి ఎన్నాళ్ళో అయింది. తాను చివరసారి సితారు ముట్టుకున్నది పూర్వ జన్మలో కాబోలనిపించింది. వివాహం అయిన తరువాత ఆమె తీరిగ్గా కూర్చుని, మనస్సు తేలికపడేలాగు సితారు వాయించుకోటానికి సమయమే దొరకలేదు. ఇన్నాళ్ళనుంచీ మరపుతగిలి ఉన్న సితారు తీగలను ఇప్పుడు మీటింది.

తీగల్లోనుంచి సంగీతం ఆరంభమైది. ఆ తీగల్లో ఎక్కడ ఏమి దాక్కుని ఉందో, తీయని స్వరాలు పలికాయి. ఆ వచ్చిన రాగంలో ప్రణయం లేదు; అభియోగమూ లేదు. కేవలం ఒక నివేదన మాత్రమే. ఒకరిపై నేరారోపణకాదు; కేవలం ఉచ్ఛ్వాసం మాత్రమే. సితారులోనుంచి ఎవర్నిగురించి పాట బయలుదేరిందో ఆమెకు

తెలియదు. ఆమె వాయిస్తూ ఉంది; అంతే. ఆ సంగీతం లోని జీవము తన ఆత్మలోనుంచే బయలుదేరి వచ్చి, సితారు తీగలు పలికే స్వరం సహాయంతో, ఆ శూన్యవాతావరణంలో, అవ్యక్తమధురంగా ప్రచలిత మౌతోంది—గది అంతా నిండిపోయింది. ఆమె అలా వాయిస్తూనే ఉంది.

హరిప్రసన్నుడు ఎంతసేపటికీ రాకపోయేసరికి సత్య ఒకటి రెండుసార్లు అక్కయ్యకు జ్ఞాపకంచేసింది. ఇప్పుడామె సంగీతంలో నిమగ్నమై ఉండటం చూచి సత్య భయపడి పోయింది. సంగీతం వింటే సత్యకు తన్మయత్వం వస్తుంది. వాళ్ళ కాలేజీలో అందరికంటే తానే 'వయొలిన్' బాగా వాయిస్తుంది. అక్కగారి వేళ్ళలోనుంచి బయలుదేరి వస్తున్న స్వరాలు చెవినిపడేసరికి సత్యకు గాభరా పుట్టింది. "అక్కా! ఓఅక్కా! ఆకలితోనే పడిఉంటావేమిటి? అన్నం తినవ్వూ?" అని అరిచింది.

సునీత సితారు వాయిస్తూనే "సత్యా! నువ్వు వంటయిల్లు బాగుచేసి రా; తరువాత తింటాలే."

"అలా వీల్లేదు. మూడుగంటలైంది, తెలుసా? ఆకలితో పడిఉండటం దేనికీ! వచ్చి అన్నం తిను."

"సరే, వస్తున్నా. పదా! నువ్వు ఈలోగా వడ్డించి ఉంచు."

దీపం ఆరిపోయేటప్పుడు మిక్కిలి కాంతిమంతంగా ఒక్కసారి వెలుగు విస్ఫారిత మౌతుంది. అలాగే... సునీత తీగలమీద గట్టిగా మీటేసరికి... ఒకటి రెండు స్వరాలు

శక్తిమంతములైనవి కంపిస్తూ బయలువెడలినవి. అవి అవ్యక్తమధురంగా లేవు. కేకలవలె ఉన్నాయి. అవి ఈ శూన్యవాతావరణాన్ని చీల్చుకుంటూ పైపైకి పోయాయి. దమ్ము ఉన్నంతవరకూ పైకిపోయాయి. దమ్ము ఆరిపోగానే అవి తలక్రిందుగా పాతాళానికి పడిపోయి నిద్రించాయి.

సంగీతం అయింది. సితారు తీసి మెల్లగా అవతల పెట్టేసి, సునీత వెళ్ళిపోయింది.

ఆమె మనస్సు తేలికపడింది. ఇప్పుడామె హాయిగా నవ్వగలదు. సితారుకు తాను ఇన్నాళ్ళనుంచీ బాకీపడి ఉన్న అప్పుతీరిపోయింది. నిశ్చింతగా ఉంది ప్రాణం.

సునీత వంటింట్లోకి వెళ్ళింది. "వడ్డించవేమే, వడ్డించు, ఏమేం జేశావో పట్టుకురా. వంటచెయ్యటంలో నీ నేర్పు ఎలాంటిదో చూస్తాను ఇవాళ."

అక్కయ్య ఇంత హాయిగా, మామూలు ధోరణిలో మాటాడుతున్నందుకు సత్య ఆశ్చర్యపోయింది. "ఇంతసేపటి వరకూ నువు కడుపుమాడ్చుకుని పడి ఉండాల్సిన అవసరం ఏమిటే?"

"కడుపు మాడ్చుకుని ఎందుకు పడి ఉంటాను ? పట్టు కురా, వడ్డించూ!"

సత్య కంచంలో అన్నీ వడ్డించింది. "నాకు ఆయన మాటలమీద మొదటినుంచీ నమ్మకం లేదు. ఆయన ఏమి ఇబ్బంది వచ్చిందని రాకుండా ఉండిపోయాడంటావు? పొద్దుటినుంచీ ఆయనకోసం నేను వంటపనిలో నానా అవస్థ పడ్డానుకదా !"

"ఏదో పని అడ్డంవచ్చింది కామాల్లే" - మెల్లగా అన్నది సునీత. తనకైనా వినిపించిందో లేదో! తనకు విని పించాలన్న యిష్టం లేకపోబట్టే అంత మెల్లగా అన్నదేమో! ఆ మాట అనీ ప్రయోజనం లేదు; అది వట్టి అబద్ధమే - అని ఆమె అభిప్రాయమేమో!

"ఏం పని అడ్డం వస్తుందేమిటి? ఆ ఘనకార్యం ఏమిటో కాస్త చెప్పు చూస్తాను."

"మగవాళ్ళకు అనేక పనులుంటాయే. ఇప్పటికైనా యికరాడు అని ఖండితంగా ఎలా చెప్పగలం?" అని పైకి అన్నదేగాని, 'రాకుండా వుండాలన్న తలంపుతోనే అతడు రాలేదు' - అని సునీత విశ్వసించింది.

"నిజంగా పనే ఏదైనా వుంటే మనకు ఆయన కబురు చేసివుండాల్సింది. ఆయన రానీ, అడుగుతాను"అన్నది సత్య.

సునీత పకపకా నవ్వింది. "ఔనౌను, అడగాల్సిందే."

"ఆయన యింకా వస్తాడనీ, ఏదో పని మూలాన్నే ఆలస్యం అయివుంటుందనీ నువ్వు నమ్ముతున్నావా?" - సత్య అడిగింది.

"పిచ్చిపిల్లా! ఏమైందో ఏమో, నాకేం తెలుసునే! కాని నీకు ట్యూషన్ చెప్పటానికి అతనికెందుకూ అంత కోపం?"

"ఇదిగో అక్కా! నేను చెప్పేస్తున్నాను: నే నాయనదగ్గర చదువుకో నసలు."

సునీత నవ్వింది. "ఏం?"

"నేను చదవనే చదవను ఆయన దగ్గర."

"సరే, సరే." సునీత భోజనం చేస్తోంది.

మరికాసేపటికి ఒక నౌకరు వచ్చాడు. "ఇంటిదగ్గర అమ్మగారికి ఒంట్లో బాగులేదు. కడుపులో ఏదో నొప్పిట. సత్యమ్మగార్ని పిల్చుకు రమ్మన్నారు. సాయంకాలానికి మిమ్మల్నికూడా రమ్మన్నారు" అని కబురు తెచ్చాడు.

"బండికూడా తెచ్చావా మరి!" సునీత అడిగింది.

"సత్యమ్మగార్ని ఇప్పుడే తీసుకు రమ్మన్నారుగా! అందుకోసం బండికూడా తెచ్చాను" అన్నాడు నౌకరు.

"వెళ్ళు సత్యా!" అన్నది సునీత.

"నువుకూడా వస్తున్నావా, అక్కా!"

"ఆఁ, సాయంత్రానికల్లా వచ్చేస్తానని చెప్పు."

సత్య వెళ్ళిపోయింది. భోజనం ముగించి సునీత పఠన మందిరంలోకి వచ్చింది.

నిజం చెప్పవలసివస్తే ఆమె మనస్సు నిశ్చింతగా ఏం లేదు. "నేనూ వెడితే అయిదారు రోజులదాకా అక్కడే ఉండి వస్తాను. ఈ యింట్లో ఉండటానికి మనస్కరించటం లేదు" అనుకుంది. తన కనిష్టమైన పని హరిప్రసన్న ఏదో చెయ్యక మానడు. నిన్న అంత గట్టిగా చెప్పినా అతడు ఇవాళ ఎందుకు రాకపోయినట్టు? అతడు తనమాటకూడా తిరస్కరించి 'తనమాటే తానుగా' ఉన్నాడన్నమాట! తన అభిమానం దెబ్బతిన్నట్టుగా సునీత భావించింది. మళ్ళీ సితారు పుచ్చుకుని హృదయం తేలికపడేట్టు వాయించు కుందా మనుకుంది. కాని సితారుకు బదులు షెల్లీ కావ్య సంపుటి తీసుకుని పడకుర్చీలో వాలింది. చదువుతూ చదు

వుతూ ఆమె కళ్ళు మూతపడిపోయాయి. పుస్తకంకూడా తనంత తానే మూసుకుపోయి ఆమె చేతిలో అలాగే పడి ఉంది. మరికాసేపటికి ఆమె కళ్ళు తెరచి పుస్తకం తీసింది. అట్ట తిరగేసి చూచింది. అక్కడ 'శ్రీమతి సునీతాదేవి' అని రాసి ఉండటం కనిపించింది. ఎవరీ రాసింది? అక్షరాలు విడి విడిగా, పొంకంగా ఉన్నాయి. రాసినవాని దార్ఢ్యం, సాహసం వాటిలోనుంచి తొంగిచూస్తున్నాయి. ఇంత స్వతంత్రంగా ఎవరో తన పుస్తకంమీద ఇలా రాయటం ఆమెకు బాగుండలేదు. ఈ పని హరిప్రసన్నుడిదేనని ఆమె ఊహించింది. పుస్తకం అవతల పెట్టేసి గదిలో పచార్లు ఆరంభించింది. ఇంతలో గోడమీద ఒకపటం కనిపించింది. అది గోడమీద ఎత్తుగా ఒక చక్కమీద చక్కగా అమర్చ యుండవలసిన పటం. ఆమెకు కోపం వచ్చింది. దగ్గరకు వచ్చి పటాన్ని లాగి చేతుల్లోకి తీసుకుంది. చూచింది. ఆనాడు హరిప్రసన్నుడు బాగుచేస్తానని ఇంటికి తీసుకుపోయిన ఫొటో అది. అందులో తన బొమ్మ చూచుకుంది. చాల కాంతిమంతంగా కనిపించింది. నిజంగా తనది అంత మనోహరమైన విగ్రహమా? నిజంగా తాను అలానే ఉందా? ఆమెకు కలిగిన ఈ ఆశ్చర్యమంతా మరుక్షణమే తొలగించేసుకుంది. లేదు, ఇది చాలకాలంక్రిందటి ఫొటో, ఇప్పుడు తాను అలా లేదు, మామూలుగానే ఉంది - ఇలా అనుకుని తనలో తాను సంతృప్తిపడింది. నిజమే! తాను ఇలా ఉండటమే మంచిది - అనుకుంది అకస్మాత్తుగా! వెంటనే ఫొటోకింద తనపేరు కనిపించింది. అది చూడగానే ఆమెకు

మళ్ళీ కోపం వచ్చింది. ఫోటోను అవతల పెట్టేసింది. హరిప్రసన్నని గురించి తా నింకేమీ ఆలోచించకూడ దను కుంది. అతడేమైపోయినాసరే, ఏం జేసుకున్నాసరే...అతని ఊసే పట్టించుకోనక్కర్లేదు. ఢిల్లీ విడిచి పోతానంటున్నాడు, ఔను, పోతే పోనీ. అతన్నిగురించి తన కేమాత్రమూ విచా రంలేదు. అతడు తన మాట మన్నించాడు కనకనా, తా నతన్ని గురించి దిగులు పడటానికి? ఆమె సితారు తీసు కుని వాయించటం ఆరంభించింది. మళ్ళీ కొన్ని మధుర ధ్వనులను పుట్టిద్దాం - అవి మ్రోగి మ్రోగి వ్యాప్తమై ఎక్కడికో పయనిస్తాయి, చివరకు అలసిపోయి నిద్రిస్తాయి - అనుకుంటూ ఆమె సితారు తీగలమీద ఒక పటిష్ఠమైన రాగం వాయించింది. ఆమె అలా తీవ్రంగా వాయిస్తోంటే తీగలు తెగిపోతాయేమో నన్నట్టుగా ఉంది. బలంకొద్దీ తీగలు మీటుతూ యమకగమకాలు విస్పష్టంగా వినిపించేట్టు ఆమె రాగం వాయించింది. అకారణంగా తనలో రేగిన కోపాన్ని, వ్యథను బలవంతాన బైటికి లాగి, ఈ స్వరాల్లో కలిపేసి, ఎక్కడికో దూరంగా...చిరశాంతి, పరిపూర్ణత నెలకొని ఉండే చోటికి... పంపించివెయ్యాలని ఆమె కోరు తున్నదా? చేతిలో సితారూ, ఆమె... ఎంతో క్రుద్ధ మూర్తిలా ఉంది. వేళ్ళు చకచక తీవ్రతరంగా తీగలమీద ఆడుతున్నాయి. తీగల్ని చాల పరుషంగా, కసిదీర మీటుతోంది.

సరిగ్గా ఈసమయంలో శ్రీకాంతుడు లోనికి వచ్చాడు. "ఓహో! ఏమిటీ కథ!" అంటూ.

MEMORIAL LIBRARY
Acc No 1220
Date
CUDDAPAH.

సునీత భర్తను చూచింది. సిగ్గుపడిపోయింది. ఏదో తప్పుపని చేస్తూండగా పట్టుబడ్డ మనిషిలా చిన్నబోయింది. తీగలమీద చెయి ఆడలేదు, ఆగిపోయింది. తంత్రీ నినాదాలు ప్రతిధ్వనించి, ప్రతిధ్వనించి, సన్నగిల్లి అంతర్హితమైనాయి. ఆమె అస్తవ్యస్తంగా లేచినిల్చుంది. "ఎంతసేపయిందీ మీరు వచ్చి?" అని అడిగింది.

"ఎంతసేపయిందా? ఎంతోసేపుకాలేదులే, సితారు ఆపేశావేం? చాల బాగా వాయిస్తున్నావు సుమీ!"

"ఎన్నాళ్ళకో మళ్ళీ సితారు బైటికి తీశాను. మీరేమీ అనుకోకండి" అని పలుకుతున్నట్టుగా ఉంది ఆమె ముఖవైఖరి. పైకి మాత్రం అనలేదు. ఆమె నిల్చున్న తీరు, ముఖభంగిమ అలా అంటున్నట్టుగా ఉన్నాయి. పైకి ఆమె పలికిన మాటలు ఇవి: "మీరు దుస్తులు మార్చుకోండి; ఇంతలో ఫలహారం తీసుకొస్తాను."

"నేను వచ్చి నీ పాటకు అంతరాయం కలిగించాను. నా కది చాల బాధగా ఉంది."

సునీత నవ్వింది. "అయితే మీరు వాయించండి; నేను వింటాను" అంటూ సితారు అతనికి ఇవ్వబోయింది.

"గురువుగారి ముందర తలెత్తుకుని ధీమాగా వాయించేందుకు......అంత పటిష్టంగా నువు నాకు నేర్పావా మరి?" అంటూ సితారు పుచ్చుకుని వేళ్ళు ఆడించటానికి ప్రయత్నం చేశాడు శ్రీకాంతుడు.

సునీత పోబోయింది. కాని మళ్ళీ వెనక్కి తిరిగి "నాన్నగారి నౌకరు వచ్చి వెళ్ళాడు. అమ్మకు ఒంట్లో

బాగులేదట. సాయంత్రానికి అక్కడికి రావలసిందిగా కబురు చెప్పాడు. వెడితే మళ్ళీ రావటానికి నాలుగైదు రోజులు పడుతుంది. వెళ్ళమంటారా ?"

"నేను వెళ్ళమనాలా ? లేకపోతే వెళ్ళవా యేమిటి ? ఏమిటీ సుస్తీ మీ అమ్మగారికి ?"

"కడుపులో నొప్పిట."

"మళ్ళీ రావటానికి అయిదారు రోజులు పడుతుందంటావా ?"

"మీ రా మాట అడుగుతారని నాకు తెలుసు. పోనీ, వెళ్ళను లెండి."

"అరెరె. వెళ్ళద్దంటానికి ఎవడికి అధికారం వుంది. అంత అధికారం ఎవడికి ఉందో చూపించు, చూస్తాను. కాని 'భర్త' అనబడేవాడు ఏమైపోవాలో......అది కాస్త ఆలోచించావా—అని అడుగుతున్నాను."

"భోజనానికి రెండుపూటలా అక్కడికే రండి. లేకపోతే నౌకరుచేత యిక్కడికే పంపిస్తాను."

"సరే అయితే, చాలు, అదే నాకు పదివేలు. ఇంతకూ హరిప్రసన్నుడు అప్పుడే వెళ్ళిపోయాడేమిటి ?"

"అసలు రానేలేదుగా !"

"రానే లేదా ?"

"పనేమన్నా ఉందేమోమరి !...మీరు దుస్తులు మార్చేసి, కాళ్ళు చేతులు కడుక్కోండి" అంటూ సునీత వెళ్ళిపోయింది. ఏమీ అర్థంగాక శ్రీకాంతుడు అక్కడే కూలబడ్డాడు.

సునీత ఆసాయంత్రమే అమ్మగారింటికి వెళ్ళిపోయింది. సునీతను వెంట తీసుకుపోతూ శ్రీకాంతుడు దారిలో అనుకున్నాడు: "సరే, ఇదీ బాగానే ఉంది; ఇప్పుడిక హరి ప్రసన్నుడి జాడ తెలుసుకుంటాను పోయి."

## 22

కాని హరిప్రసన్నుని జాడ యేమీ తెలియలేదు. ఎక్కడెక్కడ ఉంటాడని తోస్తే అక్కడక్కడికల్లా వెళ్ళి కనుక్కున్నాడు శ్రీకాంతుడు. ఎక్కడా లేడు. రెండు రోజుల క్రితమే ఎక్కడికో వెళ్ళిపోయాడని మాత్రం కబురు తెలిసింది.

శ్రీకాంతునికి కోపం వచ్చేసింది. ఇప్పటికి కూడా హరి ప్రసన్నుడు తనగోడవే తానుగా ఉంటున్నాడు. తాను ఎక్కడికి వెళ్ళేదీ పెట్టేదీ ప్రియమిత్రునికి కూడా చెప్పకూడదన్నమాట!

మూడురోజులు గడిచాయి. ఇంట్లో శ్రీకాంతుడు ఒక్కడే ఉంటున్నాడు. హరిప్రసన్నుని కబురేమీ తెలియలేదు అమ్మగారింటినుంచి సునీత కూడా ఇంకా రాలేకపోతోంది. కాస్త తృప్తికరమైన విషయం ఏమంటే - సునీత తండ్రిగారిల్లు ఆ ఊళ్ళోనే, ఎంతో దూరంకూడా లేదు. ఒకసారి వీలు చూచుకుని శ్రీకాంతుడు అక్కడికి వెళ్ళి సునీతకు చెప్పాడు: హరిప్రసన్నుడు కనిపించటమే మానేశాడనీ, ఆ సత్రంలోకూడా లేడనీ. సునీత విని ఊరుకుంది గాని

ఆవిషయమై ఏమీ ప్రసంగించలేదు. తానుమాత్రం ఇంకా నాలుగైదురోజులదాకా అక్కడే ఉండాల్సి వస్తుందని చెప్పింది. సునీత మనస్సులో ఎలా వుందో చెప్పలేం; కాని హరిప్రసన్ను డెక్కడా కనిపించటంలేదని చెబుతున్నప్పుడు ఆమె అన్యమనస్కమై విని ఊరుకోటం శ్రీకాంతునికి కష్టం కలిగించింది. ఐనా అతడు మరేమీ ఆవిషయమై ప్రసంగించ లేదు. ప్రసంగించటానికిమాత్రం ఏముంది?

ఒకటి, రెండు, మూడు రోజులు నీరసంగా గతిం చాయి. నాలుగోరోజు సాయంత్రం చీకటి పడుతోంది. శ్రీకాంతుడు ఆఫీసు గదిలో కూర్చున్నాడు. ఏమీ తోచ టంలేదు. బైటికి పోయి అటూ యిటూ కాసేపు తిరిగి వద్దామా అనుకున్నాడు. లేకపోతే అక్కడే కూర్చుండిపోయి 'లా' పుస్తకాలు తిరగవేద్దామా అనిపించింది. ఇంతలో ఎదురుగా హరిప్రసన్నుడు వచ్చి నిల్చాడు. అప్పటి అతని రూపాన్ని గుర్తుపట్టటం చాల కష్టమైంది. తలమీద పొడు గాటి వెంట్రుకలు మాయమైనవి. గడ్డాలు, మీసాలు కూడా లేవు. చంకలో ఒక చిన్న మూట వుంది.

మూట మేజామీద పెడుతూ "శ్రీకాంత్! నే నిక్కడ నాలుగైదురోజులు వుండవచ్చా? అందుకే యీ మూటకూడా తెచ్చుకున్నాను" అన్నాడు హరిప్రసన్నుడు.

ముంచుకున్న ఆశ్చర్యంలోనుంచి శ్రీకాంతుడు ఇంకా బయట పడలేదు.

"చప్పున చెప్పు, నే నిక్కడ వుండవచ్చా లేదా?" హరిప్రసన్నుడు మళ్ళీ అడిగాడు.

"నువు ఎక్కడికి వెళ్ళిపోయావు?"

"ఎక్కడికి వెళ్ళిపోయానో......ఆ విషయం అలా వుంచు. ఏమంటావ్? నే నిక్కడ నాలుగు రోజులు వుండ టానికి అవకాశం ఇస్తావా?"

శ్రీకాంతుడు ఆశ్చర్యంగా అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు.

హరిప్రసన్నుడు తనమీదినుంచి ఏదో ఒక బరువును దించుకుంటున్నవాడులా ఇలా అన్నాడు: "వదినె ఇంట్లో లేదా? ఇంకేం, నే నిక్కడ ఉండిపోడానికి అభ్యంతరం లేదన్నమాటే. నా సామానుకేసి తదేకంగా అలా చూస్తా వెందుకూ? కొంచెంగానే ఉందనా? ఔను సామాను స్వల్పంగా ఉండటమే శ్రేయస్సు 'who possesses little is so much the less possed' అనేమాట అనుభవజ్ఞులే చెప్పారు. ఇన్నాళ్ళనుంచీ ఇతర్ల వద్ద పరిగ్రహించటమనేది చాలవరకు తగ్గించేశాను. ఇంకో విషయం ఏమిటంటే—"

అంటూ హరిప్రసన్నుడు మూట విప్పాడు. అందులో కాసిని ధోవతులు, చొక్కాలు, రెండుమూడు పుస్తకాలు, ఒక నార దుప్పటి...ఇలాంటివే ఉన్నవి. ఒక రివాల్వరు కూడా ఉంది. తోలు కవరులోనుంచి దాన్ని బైటికి తీస్తూ ఇలా అన్నాడు: "ఇది కూడా ఉంది నాదగ్గర. ఇది ఒక చోట పరిగ్రహించిన వస్తువే. సత్యార్థికి పిస్తోలెందు కంటా వేమో! శత్రుభయం లేకుండా ఉండేందుకు, శత్రువుల్ని నిలువరించేందుకు ఇదొక సాధన. ఎల్లప్పుడూ నిర్భయుడుగా ఉండేవాడు ఇతర్లకు భయం గొలపడు, అటువంటప్పుడు

నిర్భయుడైనవాడు శస్త్రహీనుడుగానే ఉంటాడు - అని నువ్వు అంటావు కదూ! ఔను. ఆమాట నేనూ ఒప్పుకుంటాను. అయినాకానీ, ఇది నా దగ్గర ఉంది మరి!"

పిస్తోలు మళ్ళీ తోలు సంచీలో పెట్టేసి మూట కట్టేశాడు. "అందుకనే అడుగుతున్నాను శ్రీకాంత్ - నాలుగైదు రోజులు నేనిక్కడ ఉండటానికి అవకాశం లభిస్తుందా? అని."

"హరిబాబూ!"

"చూడు శ్రీకాంత్! ఇంకో విషయం కూడా ఉంది. నా కిప్పుడు డబ్బుకూడా కావాలి. నూరు రూపాయలు అవసరంగా కావాలి."

"హరీ! మళ్ళీ ఇంకెక్కడికేనా ప్రయాణం ఉందా? పోనీ, ఆ విషయం నా కక్కర్లేదు. ఈ మూడురోజుల్నుంచీ, నువ్వు ఎక్కడున్నావ్? ఏం చేశావ్? ఏమేం జరిగింది - అది చెప్పు."

తనమీద ఇంత ఉదారభావం కనబరుస్తూన్న శ్రీకాంతుని ముందు రవంత చిన్నబోయాడు హరి. మనస్సులో పొడమిన సంకోచంలోనుంచి అహంకారం లేచింది. అన్నాడు: "ఆ విషయమంతా నువ్వు వినటానికీ, చెప్పటానికీ యోగ్యమైంది కాదులే శ్రీకాంత్!"

శ్రీకాంతుడు మరి మాటాడలేదు. లేచాడు. మూట తాను పుచ్చుకున్నాడు. "సరే అయితే, లోపలికి రా" అంటూ దారితీశాడు. పఠనమందిరంలోకి తీసుకుపోయాడు. "ఈ గది నీది. నువ్వు ఎన్నాళ్ళు ఉంటావో, అన్నాళ్ళూ

ఈ గది నీదే" అన్నాడు. మరుక్షణమే వ్యాకులపాటు సూచిస్తూ "మరీ నీ భోజనంమాట?" అని అడిగాడు.

"నా భోజనమా?"

"ఔను. భోజనంమాటే ఎప్పుడైనా ప్రముఖంగా ఆలోచించాల్సింది. అన్నపూర్ణాదేవి మీ వదిన ఇక్కడ లేదు. వేళకు అన్నం ఎవరు సమకూర్చి పెడతారు? ఆమె తిరిగి ఎప్పుడు వచ్చేదీకూడా తెలీదు. నేనూ అప్పుడప్పుడు అక్కడికే వెడుతున్నా భోజనానికి. ఒక్కొక్కసారి ఇక్కడికీ తెప్పించుకుంటున్నా. భోజనంకోసం నువ్వు హోటలుకు పోవటం నా కిష్టంలేదు. నీకూ బాగుండదు. కాబట్టి—"

"కాబట్టి... ఏమిటి? ఇక్కడే వంట చేసుకోనా?"

"ఇక్కడే వంట చేసుకో" అని మామూలు ధోరణిలో అనేసి శ్రీకాంతుడు కాసేపాగి "అదే మంచి పద్ధతిలే. మనిద్దరం వంట చేసుకుందాం ఇక్కడే. నేనుమాత్రం అక్కడి నుంచి అన్నం తెప్పించుకోటం దేనికి? నీకు వంట చెయ్యటం బాగా తెలుసనుకుంటానే; ఔనా?"

హఠాత్తుగా తోచిన ఈ కొత్త పద్ధతి శ్రీకాంతునకు కొంత ఆనందాన్ని చేకూర్చింది.

"వద్దు—వద్దు, నువ్వుకూడా నాతోపాటు అవస్థ పడటం దేనికి? నా గొడవ నాకే వదిలెయ్యి" అన్నాడు హరి.

శ్రీకాంతుడు మాట క్రింద బెట్టాడు. ఇద్దరూ నిల్చునే ఉన్నారు. హరిప్రసన్నుని ఒక కుర్చీలో కూర్చోబెట్టి, తానూ ఒకకుర్చీలోకూర్చుంటూ శ్రీకాంతుడు అన్నాడు: "కూర్చో; నువ్వు ఇక్కడ ఉండటానికి అభ్యంతరం లేదు. ఒక విషయం

తేలిపోయింది. ఇక రెండో విషయం ఉంది, దానిసంగతి తరువాత ఆలోచించవచ్చుగాని, నువ్వు ఇవాళ ఇంతవరకు ఏమన్నా తిన్నావా?"

"లేదు."

"ముందర ఆమాట చెప్పకుండా, ఆవిషయం ఈ విషయం మాటాడతావేం మరి?" అంటూ శ్రీకాంతుడు కుర్చీలోనుంచి లేచాడు. ఎక్కడికో వెళ్ళిపోడానికి సంసిద్ధుడై "ఇప్పుడే వస్తా ఉండు. వెళ్ళి మీ వదినతో చెబుతాను: నువ్వు వచ్చావనీ, ఆకలిగా ఉన్నావనీ, నీకోసం కూడా భోజనం ఇక్కడికే పంపించమనీ. ఒకవేళ ఆమే ఇక్కడికి వచ్చేస్తే...ఇదిగో తమ్ముడూ! ఆ రివాల్వర్ మాత్రం ఆమెకు కనిపించనీకు సుమీ! ఆడవాళ్ళు దాన్ని ఒక పరాక్రమచిహ్నంగా భావించి గాభరాపడిపోతారు."

హరిప్రసన్నుడు పకపకా నవ్వాడు. "శ్రీకాంత్! రివాల్వర్ అంటే ఏమనుకుంటున్నావో. ప్రాణాలు తీసేయగలదు సుమీ! నీకు మాత్రం అది గడ్డిపోచకంటే హీనంగా కనిపిస్తున్నట్టుందే!"

"ఎబ్బెబ్బే. ఎవరన్నారు? పిస్తోలంటే నాకు భయమే. అది ఒక అల్పవస్తువని నేనెలా అంటాను? కాని రక్తదాహంగల క్రూరజంతువు కంటి మెరుపుజీర వంటిది కాదు కదా - ఈ వస్తువు, చూడగానే ఇది ప్రతివాళ్ళను చంపి పారేస్తుందని అనుకోటానికి? మారణక్రియలో వినియోగమౌతున్నప్పుడుకూడా ఈ పిస్తోలుముఖం అన్నివైపులకూ ప్రసరించదు. దానికి హద్దు ఉంది." వెడుతూ వెడుతూ

శ్రీకాంతుడు ఆగాడు. "సింహానికి పంజా ఉంది; కోర లున్నాయి; కాని మనిషిది దుర్బలమైన శరీరమే; కాబట్టి మనిషి చచ్చిపోవలసిందేనా? అందుకనే మానవుడు రివాల్వర్ తయారు చేశాడు; దానిమూలాన సింహాన్ని పంజా ఎత్తకుండా నిరోధించగలుగుతున్నాం; అందులోనుంచి గుండు విడిచామంటే సింహం శవమై చల్లబడి ఊరుకుంటుంది... అని నువు అంటావు. ఔను, అది సరైన మాటే. కాని నీ రివాల్వరు సింహానికి బదులుగా మానవుడినే నిమిషంలో శవాన్ని చేసేస్తున్నదికదా! దానికి నువు చెబుతావు కదా: దుష్టులను నాశనం చేయాల్సిందే; అప్పుడుగాని సాధువులకు రక్షణ ఉండదు; కాబట్టి నరహత్య అంటే మీకు వొణుకెందుకూ? అని. ఔనా? కాని నే నొకటి అడుగుతాను: ఒక వ్యక్తి అపరిచితుడైనంతమాత్రాన అతడు దుష్టుడే అన్నభావం మన బుద్ధికి ఎందుకు తోచాలి! ఇతర్లు దుష్టులని నిర్ణయించటంలో మనకు సంకోచమే లేనప్పుడు, మన చెయ్యి రివాల్వరు పేల్చటానికికూడా సంకోచించదు. అంతేనంటావా? కాని ఇలాగైతే మానవజీవితం సాఫీగా సాగుతుందా? అసలు నిలుస్తుందా? మనిషికీ మనిషికీ ఉండే సంబంధాల్లో ఏమూలనుంచైనా రివాల్వర్ వచ్చి ప్రవేశించటమే సంభవిస్తే, క్రమేణా దాని ప్రభావం చతుర్ముఖంగా విస్తరించి తీరుతుంది. దాన్ని అడ్డగించటమే కష్టతరమౌతుంది. అప్పుడా రివాల్వరు సాధువుల్నే నాశనం చేసి, దుష్టుల్నే ఉద్ధరిస్తుంది. కాదనగలవా?"

హరిప్రసన్నుని సమాధానం వినకుండానే... గబ గబా సునీత దగ్గరకు పోయి, హరిప్రసన్నుడికి కూడా భోజనం తయారుచేసి పంపించవలసిందిగా చెప్పి రావటానికి తాను బయలుదేరినట్టు జ్ఞాపకంవచ్చి ... వెంటనే వెళ్ళి పోయాడు.

హరిప్రసన్నుడు మందహాసం చేస్తూ "పిస్తోలు చేత పుచ్చుకుంటే నరనరాల్లోనూ పులకరింత వస్తుంది. నవనవ స్ఫూర్తి ప్రజ్వలిస్తుంది. నువు నీతులు వల్లిస్తావు. నీతి అనేది ఎప్పుడూ వివాదాస్పదమైన విషయమే. కాని నరాల్లోని నవస్ఫూర్తిని మాత్రం నువు నిరాకరించలేవు సుమీ! నిరాయుధుడు చేయబడటంవల్లనే భారతీయుడు పుంస్త్వాన్ని కోలుపోయాడు, కాదా? చెప్పు..."

"సరే, సరే!" అంటూ శ్రీకాంతుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

హరిప్రసన్నుడు పఠనమందిరంలో ఉండిపోయాడు. కొంగు నడుముకు బిగించుకుని, చీపురు పుచ్చుకుని సునీత తనకు ప్రథమంగా కనిపించింది ఈ గదిలోనే. ఆనాడు తాను వస్తున్నట్టు ఆమెకు తెలియదు. హఠాత్తుగా వచ్చాడు. తన్ను చూడగానే జారిపోయిన మేలిముసుగు గబగబా సవరించుకుంటూ జంకుగొంకులతో నిలబడిపోయింది. ఈ గది లోనే తాను ఆనాడు షెల్లీ, షా గ్రంథాలు తీసి వాటిలో విడివిడిగా, షాంకంగా 'శ్రీమతి సునీతాదేవి' అని రాశాడు. తాను సరిచేసిన ఆ భార్యాభర్తల ఫొటో అదిగో, ఈ గది లోనే ఉంది. ఈ గదిలోనే ఆ భార్యాభర్తలు ఎన్నో పవిత్ర

రహస్యాలు చెప్పుకుని ఉంటారు. ఏవేవో క్రీడావిలాసాలలో తేలి ఉంటారు. వారి ప్రణయసౌరభం ఇప్పటికీ ఎప్పటికీ ఈ గదిలోనే అంతర్లీనమై ఉండదూ? ఇప్పుడు తాను ఈ గదిలోకే... ప్రాణాలుతీసే పిస్తోలు ఒకటి మూటలో కట్టుకుని... మళ్ళీ వచ్చాడు. ఎందుకు వచ్చినట్టు? ఏమో! "ఏమిరా! ఎందుకు వచ్చావురా?" - అని తన్ను తానే నిలవదీసి ప్రశ్నించుకోవాలనిపించింది అతనికి.

హరిప్రసన్నుడు కుర్చీలో అలాగే కూర్చున్నాడు. తన హృదయాంతరాళంలో ఏమి దాగి ఉంది? కాల గర్భంలో తన భవిష్యత్తు ఎలా ఉండబోతోంది? విస్పష్టంగా కళ్ళముందు తనకు కనిపిస్తే బాగుండును.

## 23

శ్రీకాంతునికి మనస్సులో వ్యాకులంగానే ఉంది. హరిప్రసన్నుడి హృదయంలో ఎక్కడో ఎవరిమీదనో ద్వేషభావం ఉండాలి. హేతువాదాన్ని అంగీకరించని వట్టి పట్టుదలమనిషి అయిపోతున్నాడు. తన గుట్టు ఏదో దాచు కోవాలని ప్రయత్నిస్తున్నవాడులా కనిపిస్తాడు. అసలు మనిషే స్వతహా విచిత్రమైన వ్యక్తి. ఇతర్లకు చప్పున అర్థమయ్యే ప్రవర్తన కలవాడుకాదు, మాతృదేశవిముక్తి అతని ఏకైక లక్ష్యం అయిపోయిందా? భారతీయ స్వాతంత్ర్య సమస్యను పరిపూర్ణంగా అర్థంచేసుకోకపోతే, అది కేవలము నినాదంగా- అవాస్తవికంగా తోస్తుంది వ్యక్తికి. ఈ స్వాతంత్ర్య సమస్య హరిప్రసన్నుని జీవితంతో అంత అభిన్నంగా పెనవేసుకు

పోయిందా? అతని ప్రేమ యావత్తు భారతదేశాన్ని ఆక్రమించుకోగలిగిందా? లేనప్పుడు మామూలుగా, సహజంగా ఉండడేం? అతనిలో ద్వైధీభావమూ లేకపోలేదు. ఏదో ఒక ఉద్దేశాన్ని అంటిపెట్టుకుని నడుస్తున్నట్టూ, తద్వారా ప్రపంచానికి దూరమైపోతూన్నట్టూ కనిపిస్తాడు. ఇంతకూ ఇప్పుడు అతని హృదయంలోని గాఢవ్యధ ఏమిటి? ఏగొడవ పరిష్కరిద్దామనీ రివాల్వర్‌తోకూడా తయారైనాడు? శ్రీకాంతునికేమీ బోధపడలేదు.

హరిప్రసన్నుడు ఎటువంటివాడైనాసరే, ఎటువంటివాడుగా మారిపోయినాసరే, అతని హృదయభావాలు ఎటువంటివైనాసరే, అతడెలా ప్రవర్తించినాసరే—అదంతా అతని యిష్టం. శ్రీకాంతుడు ఈ విషయాల్లో ఏమీ జోక్యం కలిగించుకోదలచలేదు. అతని భవిష్యత్తును ఒక నిర్ణీత మార్గంలోకి మలచుదామన్న కోరికా అతనికి లేదు. హరిప్రసన్నుడు తనకు మిత్రుడు. అంతే తనకు కావలసింది. రేపు అతడు పచ్చినెత్తురుతో తడిసిఉన్న చేతులతో వచ్చినా సరే, శ్రీకాంతుడు అతనికి హృదయపూర్వకంగా స్వాగతం ఇస్తాడు. "రావోయి హరీ! రా, హంతకుడివో, మరింకెవరివన్నానో, ఎవరివైనాసరే, నువు హరిప్రసన్నుడివే కదూ! కాబట్టి రా. శ్రీకాంతుడు నీకు ఇదివరకూ స్నేహితుడే; ఇప్పుడూ స్నేహితుడే" - అంటాడు.

కాని హరిప్రసన్నుని హృదయభావాల్ని, అతని మనస్తత్వాన్నీ తెలుసుకోవాలన్న ఆతృత శ్రీకాంతునకు నానాటికీ ఎక్కువౌతున్నది. అతడు తన స్నేహితుడు.

స్నేహితుని పూర్తిగా అర్థంచేసుకోటం అవసరం. ఇలా హఠాత్తుగా జుట్టు, గడ్డం గొరిగించేసుకుని, మూటలో రివాల్వర్ కట్టుకుని తయారైన హరిప్రసన్నుని వ్యవహారం తన కేమీ బోధపడడం లేదు. అదీ అతని వ్యథ.

తాను వకీలు. న్యాయచట్టం బాగా తెలుసు. అందులోని ధర్మాలన్నీ తెలుసు. ప్రపంచంలోని మానవుల నాగరిక వ్యవహారాలన్నీ ఆ ధర్మాలకు బద్ధమై ఉండాల్సిందే. లేకపోతే శిక్ష తప్పదు. కాని తాను "హరీ! నువ్వు ఎన్నాళ్లు ఉంటావో అన్నాళ్ళూ ఈ గది నీదే" అని పలికినప్పుడు ఆ ధర్మం పాతాళానికి దిగజారిపోలేదూ? కాని ఈ మామూలు ధర్మాన్ని మించి మరో ధర్మం, మహా ధర్మం వేరే ఉంది. అది చాలా ఎత్తున సుస్థిరంగా ఉండే ధర్మం. అక్కడ మమత్వం లేదు; కాబట్టి అది అమోఘమైన ధర్మం. ఈ మహాధర్మాన్ని కాదని శ్రీకాంతుడు అడుగు మెట్టుమీదే ఉంటాడా? ఊహుఁ, ఉండడు.

శ్రీకాంతుడు వెళ్ళి సునీతకు చెప్పాడు ఏకాంతంగా: "హరిప్రసన్నుడు వచ్చాడు" అని.

సునీత ఉలికిపడలేదు. "అలాగా" అన్నది మెల్లగా.

"ఈసారి చాల విలక్షణంగా ఉన్నాడులే. గడ్డం, మీసం గొరిగించేసుకున్నాడు. చాలనీరసంగా కనిపిస్తున్నాడు. అతనికి త్వరగా భోజనం పంపించే ఏర్పాటు చెయ్యి."

"ఇన్నాళ్ళనుంచీ ఎక్కడున్నాడో అడిగి కనుక్కున్నారా?"

"తన గుట్టూ రట్టూ మనకు చెప్పే మనిషా అతను? నే నేమీ అడగలేదు."

సునీత ఏమీ వెంటనే మాటాడలేదు. తన ప్రశ్నకు తానే జవాబు చెప్పుకుంటున్నట్టు మౌనంగా ఉండిపోయింది. చివరకు "గడ్డం, మీసం లేకుండా మనిషి చాల చిత్రంగా కనిపిస్తూ ఉండాలి. ఔనా? కాని తలమీద బాగా పెరిగిన వెంట్రుకల మాట? అవికూడా వొదిలిపోయాయా?" అంటూ చిరునవ్వు నవ్వింది మేఘాల్లో మెరుపులాగ.

"దుబ్బు అంతా దోకివేసిన మైదానంలా ఉంది తల."

"ఇక్కడే ఉండిపోతాడటనా?"

"కొన్నాళ్ళు ఉంటా డనుకుంటాను. ఇల్లు వాకిలితో కూడా కదలి వచ్చేశాడు. అతని సామానుచూచి నేను గాభరా పడిపోయాను."

"సామాను చాలా ఉందేమిటి?"

"చాలాఉంది. గదిలో సర్దటానికి ఎంతో శ్రమపడ్డాం. మన పఠనమందిరం అతని కిచ్చేశాను. మీ అమ్మగారికి కులాసాగా ఉందా? నువు ఎప్పుడొస్తావు?"

"నేనా?"

"చిత్తం, తమరే."

"నేను ఇప్పుడప్పుడే రాలేను."

"అయితే మరీ మంచిదిలే. నేను అవస్థపడతానని నువు చింతించ నక్కర్లేదు కూడా. హరిబాబు రొట్టెలు తయారుచేస్తాడు; మేమిద్దరం తింటాం. మేము మామూలానే బ్రతుకుతున్నట్టు భావించకండి దొరసానిగారూ! ఇంకా మీరు

తెలుసుకోవలసిన మరో విషయం ఏమిటంటే... హరి ఎటు వంటి రొట్టెలు తయారుచేయగలడో తెలుసా? అటువంటి రొట్టెలు మనం ఎప్పుడూ తిని ఉండం. ఏమనుకుంటు న్నావో మరి!"

"అతడు వంటచెయ్యటం దేనికి? రెండుపూటలా నేనే వచ్చి వంటచేసి పెట్టి పోనా?"

"శ్రీమతిగారు అంద దయావతి అయితే... రండి పోనీ."

సునీత కాసేపు ఆలోచనలో పడ్డది. "ఉహుం, నేను రాను లెండి" అన్నది చివరకు.

"అయితే రెండుపూటలా మీ దయాభిక్షమాత్రం పంపించటం దేనికి? అదికూడా నిలుపుచేసెయ్యండి. రెండు మూడురోజులు మా యిష్టప్రకారం వండుకు తిననీయండి."

సునీత మళ్ళీ కాసేపు ఆలోచించింది. "సరే, రేపు సాయంత్రానికి వచ్చేస్తాను" అన్నది చివరకు.

"అదేమిటి మళ్ళీ? మాకు నాలుగు రోజులు సెలవు వచ్చిందనుకుంటూంటే?"

సునీతకు ఏదో జ్ఞాపకంవచ్చి "అరె, మాటలసంద ర్భంలో మరచేపోయాను; ఇవాళ ఇంట్లో కోపాలువచ్చి వంట పాడుచేశారు. ఉండండి; నే నిప్పుడే అతనికోసం భోజనం తయారుచేసి పట్టుకొస్తాను" అంటూ పోబోయింది.

"పెద్ద యేర్పాట్లేమీ చెయ్యకు. ఉన్నదేదో పంపిం చెయ్యి, చాలు. వేళకు అమరితేచాలు, రుచి అక్కర్లేదు. ఎంతసేపని అతడు ఆకలితో పడిఉంటాడు? అది ఆలోచించు.

పాకచాతుర్యం మరెప్పుడన్నా చూపించుదువుగానిలే" అన్నాడు శ్రీకాంతుడు.

"ఆలస్యంలేదు. ఐదు నిమిషాలే" అంటూ సునీత నాలుగడుగులు ముందుకు వేసింది.

"ఇంకో మాట ఉంది, వినిపో - చాల అవసరం" అన్నాడు శ్రీకాంతుడు. సునీత ఆగిపోయింది.

"హరికి నూరు రూపాయలు కావాలిట."

"ఉహుං, నూరులేదు - ఏం లేదు."

"సునీ..."

"ఉహుం. అతన్ని అప్పుడే వెళ్ళిపోనీకండి. అవసరాలకు కావలసినంతకంటే ఎక్కువ డబ్బు మనదగ్గర లేదని చెప్పెయ్యండి."

"సునీతా!..."

"అతడు హాయిగా ఇంట్లో ఉండకుండా ఎందుకు వెళ్ళిపోయాడు? మనం కోటీశ్వరులమా?"

"అయితే డబ్బు లేదని చెప్పెయ్యనా?"

"ఔను, చెప్పెయ్యండి. అనవసరపు ఖర్చులకు దమ్మిడీకూడా లేదిక్కడ. సత్యకు ట్యూషన్ చెబితే నెలకు ముప్పయి, నలభై రూపాయలదాకా దొరుకుతవి. డబ్బు తీసుకుపోయి ఏం పాడుచేస్తాడో మనకు తెలియాలా? నీరసంగా ఉన్నాడని చెబితిరే! ఇంకెవరిపొట్టన తీసుకుపోయి పెట్టటానికీ ఈ డబ్బు? చెప్పండి!"

శ్రీకాంతునికి కొంచెం రోషం వస్తున్నట్టుగా అతని ముఖవైఖరిలో కనిపించింది. కాని ఆదేసమయంలో అతని

హృదయం కరుణతో నిండిపోయింది. సునీత ఈవిధంగా కచ్చితమైన ఒక నిర్ణయాన్ని జారీచెయ్యటం... కేవలం తానే డబ్బుకు అధికారి నన్న భావంతో కాదు. శ్రీకాంతుడూ తానూ ఒకటే నన్న అభిప్రాయంతోనే. డబ్బు శ్రీకాంతుడు సంపాదించినదే. ఆ డబ్బుమీద అతనికన్నా ఎక్కువ హక్కు ఆమెకు చేకూరటానికి ఆధారమైన బలం ఏది? ఆ బలం శ్రీకాంతుడే. "సరే, అలాగే లెండి" అని ఆమె నోట వినాలని అతని కోరిక. కాని అతని ముఖాన్నే, అతని బలంతోనే బలిష్ఠురాలై, "ఉహుఁ, ఉహుఁ, వీల్లేదు" అని పలికేసింది. ఆమె చూపిన ఇంత హక్కునూ, బలాన్నీ ఎలా త్రోసిరాజంటాడు? వినయంగా చెప్పబోయాడు : "సునీతా! సునీతా! నామాట విను..."

"ఉహుఁ, వినేదేమీ లేదులెండి. చెప్పేసెయ్యండి: అతడెక్కడికీ వెళ్ళిపోనక్కర్లేదు. ఎందుకూ ఆయనకీ దేశ సంచారం? ఆయనగారు సంచారాలు చేస్తూంటే ఇక్కడ మనమేమీ బ్యాంకి తెరుచుకూర్చోలేదని చెప్పండి.

శ్రీకాంతుడు మరి మాటాడలేదు. హరిప్రసన్నుని పట్ల ఆమెకు సానుభూతి లేకపోలేదు; ఉంది. ఆ సంగతి శ్రీకాంతునికి తెలుసు. అయినా ఈ విషయంలో ఆమె అంత కఠినంగా మాటాడిందేం? అదే అతనికి అర్థం కాలేదు. చివరకు అడిగాడు : "సరే అయితే; రేపు సాయంత్రానికి వస్తావుకదూ!"

"ఆఁ, రేపు సాయంత్రానికల్లా వచ్చేస్తాను" - అంటూ సునీత లోనికి పోసాగింది.

"ఇక్కడే కూర్చోనా? భోజనానికి ఇంకా ఎంత ఆలస్యం?"

"కూర్చోండి, సత్యను పంపిస్తాను. పరీక్షలు దగ్గర కొచ్చేశాయని పిల్లకు జ్ఞాపకం చెయ్యండి. వంట చిటికలో చేసేస్తాను."

సునీత వెళ్ళిపోయింది. హఠాత్తుగా శ్రీకాంతుని పెదవులమీద చిరునవ్వు మెరిసింది.

## 24

శ్రీకాంతుడు మందహాసవదను డైనాడేకాని అతని గుండెలో బెడదగానే ఉంది. హరిప్రసన్నుడికి కావలసిన నూరు రూపాయలూ సునీత మంచిమాటలతో ఇవ్వకపోతే? అయినా హరిప్రసన్నుడికి ఇంత డబ్బు ఎందుకవసరం బట్టిందీ? ఈలోగా అతన్ని కలిసి ఈవిషయమై అడిగి తెలుసుకుందా మనుకున్నాడు శ్రీకాంతుడు. నోరు తెరచి తనకు నూరు రూపాయలు కావాలని అడిగాడు. తనకోసం అయివుండదు. తన అవసరంకాకపోతే మరింకెవరి అవసరాన్ని తీర్చేందుకూ? ఏమో శ్రీకాంతునికి ఎంత ఆలోచించినా బోధపడటంలేదు.

ఇంతలో సత్య వచ్చేసింది. "ఇవాళ ఇంత ఆలస్యంగా వచ్చావేం, బావా?"

"ఆలస్యం ఏం లేదే."

"మా పరీక్షలేమో దగ్గరకు వచ్చేశాయి. నాకు లెక్కలు బాగా రావటంలేదు. నువు ఒక గంటసేపు నాకు చెబుతూండకూడదూ?"

శ్రీకాంతుడు ఆమెముఖంలోకి చూచాడు. దేనికోసం చూచాడో అతనికే తెలియాలి.

"చెప్పవేం? ఒక గంటసేపు తీరిక చేసుకుంటావా మరి?" - రెట్టించి అడిగింది సత్య.

పిల్ల తెలివితక్కువది. ఆమెకు తెలియజెప్పటం చాల కష్టం. అందుచేత శ్రీకాంతుడు ఇలా చెప్పాడు: "చదువు కుంటావా? అయితే విను. రేపు సాయంత్రం మీ అక్కయ్య అక్కడికి వస్తుంది. ఆవిడతోపాటు నువుకూడా రా. రోజూ సాయంత్రం బండియెక్కి వచ్చేస్తూఉండు. హరిప్రసన్నుడు నీకు కావలసినవన్నీ చెబుతాడు."

మళ్ళీ హరిప్రసన్నుడు! ఆపేరు విని మొదట సత్య ఆశ్చర్యం ప్రకటించింది. కాని వెంటనే కటువైన ఒక వ్యంగ్యహాసం చేసింది. "వారు తిరిగి విచ్చేశారేమిటి? ఎప్పుడు దయచేశారూ?" అని అడిగింది, లేనిపోని చిలిపి తనం అంతా ముఖంలో ఒలికిస్తూ.

శ్రీకాంతుడు ఆమెవైపు స్థిరంగా చూచాడు. "ఇవాళే వచ్చాడు. కాని సత్యా! విద్యవల్ల వినయం రావాలి. వినయం ఉంటేనే విద్య వస్తుంది. నువుమాత్రం..."

ఇంతలో సత్య మాట కడ్డం వచ్చి, "ఒక లెక్క రాలేదు బావా! తీసుకురానా? చెబుతావా?" అని అడిగింది.

శ్రీకాంతుడు అలాగే స్థిరంగా ఆమె ముఖంలోకి చూస్తూ "ఇప్పుడు కాదు, నేను వెళ్ళాల్లే. కాని ఇటు

చూడు, నిజం చెప్పు; అతని దగ్గర చదువుకోటం నీకు ఇష్టం లేదా ?" అన్నాడు.

సత్య తాను నిర్దోషినన్నట్టుగా ముఖంపెట్టి "నే నెప్పు డన్నానూ..." అంది.

శ్రీకాంతుడు మెత్తపడ్డాడు. "అయితే సరే. నేను అతనితో మాటాడతాను. కాని అతన్ని ఒప్పించటం తేలికైన పని కాదు."

ఆమాటతో సత్యకు కోపం వచ్చేసింది. "ఆయనకు చెప్పటానికి ఇష్టం ఉన్నా సరే, లేకపోయినా సరే, నేను మాత్రం చదువుకుంటానని ముందుగా ఒప్పుదల ఇచ్చేసెయ్యా లన్నమాట ! నా కిదేం బాగులేదు బావా !"

అభిమానంతో అన్నమాట అది. అటువంటి అభిమానం స్త్రీలకు సహజంగా ఉంటుంది. అందుచేత శ్రీకాంతుడు మనస్సులో కష్టపెట్టుకోలేదు. అన్నాడు : "అతని భావాలు గ్రహించటం చాల కష్టం. చదువు చెప్పటానికి అతనుమాత్రం ఎందుకు ఒప్పుకోడూ ?...సరే, ఇంకా భోజనానికి ఎంత ఆలస్యం ఉందో కనుక్కురా పోయి."

సత్య వెళ్ళిపోయింది. శ్రీకాంతుడు ఒక్కడే ఆలోచించుకుంటూ కూర్చున్నాడు : సునీత వేసుకున్న ప్రణాళిక మంచిదే. హరిప్రసన్నుడు, సత్య... జోడు బాగానే ఉంది. ఈ పిల్లది వట్టి భావశూన్యమైన గుండె అనుకున్నాను, కాదు సుమీ! కోపం, అభిమానం, చిలిపితనం - బాగానే ఉన్నాయి. జగడాలమారిపిల్లే. ఇంకేం? ఇప్పుడు హరిప్రస

న్నాడు ఎటువంటివాడైతే మాత్రమేం? పెళ్ళి అయాక తప్పనిసరిగా బాధ్యతగల భర్తే ఔతాడు; సందేహం లేదు."

సత్య మళ్ళీ వచ్చింది. "వంటైపోయింది. అక్కయ్య భోజనానికి రమ్మంటోంది, పద."

"సరేగాని సత్యా! ఇలాచూడు. ఇటురా. నువ్వు నిజంగా సత్యారాణివే. పరీక్షలో మొదటి తరగతిలో ప్యాసు కావాలి..."

"ఔనులే, భోజనానికి పద!" – విసుక్కుంటూ అంది సత్య. విసుగెందుకంటే – బావగారి మాటల్లో రానున్న సంకటస్థితి సూచితమౌతున్నది. ఛీ, ఛీ, సత్య తప్పిపోతుంది అన్న భావమే అతని మాటల్లో ఆమెకు స్ఫురించింది.

"చూడు సత్యా! లోపలికి పోయి మీ అక్కయ్యతో చెప్పు – నా భోజనం కూడా టిఫిన్ కారియర్‌లో పెట్టమను. ఇంటిదగ్గరే హరితోపాటు భోంచేస్తాను."

"ఊహుఁ, అలాకాదు. నువ్వు ఇక్కడే భోజనం చెయ్యి. ఆయనకోసం నువ్వు మాడటం ఎందుకు?"

"అతడు నాకోసం ఎదురుచూస్తూ ఉంటాడు. నా భోజనంకూడా కారియర్‌లో పెట్టేయమని మీ అక్కయ్యతో చెప్పు వెళ్ళి."

సత్య కోపంగా ముఖం పెట్టుకుని వెళ్ళిపోయింది.

మరికాసేపటికి సునీత వచ్చింది. "మీ రిక్కడే భోజనం చెయ్యకూడదూ? అతనికోసం... కొద్దిగా వంట చెయ్యాలి; ఆలస్యం ఉంది."

"వద్దు. కారియర్‌లో పెట్టెయ్యి. తీసుకుపోతాను."

సునీత తిరిగి వెళ్ళిపోతోంటే శ్రీకాంతుడు అన్నాడు: "నువు రేపు సాయంత్రం వస్తున్నావుకదూ! సత్యనుకూడా వెంట తీసుకురా. హరిప్రసన్నుడు ఇక్కడ ఉన్నన్నాళ్ళూ అతనిదగ్గర చదువుకుంటుంది."

సునీత వెడుతూ వెడుతూ "అతని కిప్పుడు నూరు రూపాయలు దేనికిట? మీకేమన్నా తెలుసునా?" అని అడిగింది.

"ఊహుఁ, నా కేమీ తెలియదు."

"ఏమీ తెలియకుండా ఎలా ఇస్తాం చెప్పండి. సరే, రేపు సాయంత్రానికి నేను వస్తాను. సత్యకూడా వస్తుంది. కాస్త పనిపాటలకు రామదయాళ్ (నౌకరు)ను తీసుకుపొండి. లేకపోతే ఇల్లంతా ఇంత ఎత్తున చెత్తా చెదారం... మీరేం బాగుచేసుకోగలరు?"

"అక్కర్లేదులే. ఇంకొక్క రోజేగా! ఒక్కపూట వాడువచ్చి బాగుచేస్తేమాత్రం బాగౌతుంది కనుకనా?"

"సరే అయితే. భోజనం ఇప్పుడే క్యారియర్‌లో పెట్టి తెస్తా ఉండండి" అంటూ సునీత వెళ్ళిపోయింది.

సత్య క్యారియర్ పట్టుకొచ్చింది. అది పుచ్చుకుని శ్రీకాంతుడు..."సత్యా! రేపు మీ అక్కయ్యతోకూడా రా సుమీ! మరచిపొయ్యేవు" అని హెచ్చరిక చెప్పి వెళ్ళిపోయాడు.

శ్రీకాంతుడు ఇంటికి వచ్చేసరికి హరిప్రసన్నుడు అన్నిగదులూ చీపురు పుచ్చుకుని చక్కగా ఊడ్చేశాడు; ఒక పళ్ళెం తోముతూ కూర్చున్నాడు.

"ఏం చేస్తున్నావేమిటి?" అంటూ వచ్చాడు శ్రీకాంతుడు.

"వచ్చావూ? చాల ఆలస్యం అయిందే! నే నిప్పుడే తయారౌతున్నా, ఒళ్ళంతా దుమ్ము కొట్టుకుందోయ్. స్నానంచేసి వస్తాను. రెండు నిమిషాలు. నువు భోజనం చేసే వచ్చావు కదూ!"

"నీకేమన్నా పిచ్చా! నే నెక్కడ తిని వచ్చాను? దబ్బున స్నానంచేసి రా. నే నిక ఉండలేను."

మిత్రు లిద్దరూ భోజనానికి కూర్చున్నారు. ఏవేవో విషయాలు మాటాడుకున్నారు. కాని అసలువిషయం మాత్రం ఎవరూ ఎత్తలేదు. నూరు రూపాయలు దేనికి కావలసి వచ్చింది? ఆ పిస్తోలుకూ, నూరు రూపాయలకూ ఏమన్నా సంబంధం ఉందా? ఈ సంగతులుమాత్రం చర్చకు రానేలేదు. శ్రీకాంతుడు మాట సందర్భంలో ఇలాఅన్నాడు: "హరీ! నువు ఇవాళ ఇంటికివచ్చావు. అంటే - ఏనాటికైనా యింటి బాధ్యత స్వీకరించ గోరుతున్నా వన్నమాట. ఇంటి బాధ్యత అంటే హాయిగా తిని కూర్చోటం కాదోయి తమ్ముడూ! చీపురు పుచ్చుకుని ఇల్లంతా శుభ్రంగా తుడవటం మాత్రమే కాదు ... ఇంతకూ చెప్పటం మరచి పోయాను: ఆవిడ రేపు వచ్చేస్తుంది."

"రేపు వస్తుందా?"

"రావటానికి ఎలాగో ప్రయత్నంమీద ఒప్పించాను... ఏం? సహించటం లేదా? పదార్థాలు రుచిగా లేవా? తిను - తిను."

"అయితే మరి నేనుకూడా రెండు మూడు రోజులు ఉండాల్సి ఉంటుంది..."

"ఏమిటీ-ఈ? రెండు మూడురోజులా?"

హరిప్రసన్నుడికి కొంచెం చీకటి కమ్మినట్టయింది. "ఎన్నాళ్ళు ఉంటానో నిశ్చయంగా చెప్పలేననుకో. అయినా ఆవిడకు కష్టం కలిగించటం నా కిష్టంలేదు."

"ఏమిటీ-ఈ? కష్టమా? నీకేమన్నా పిచ్చెక్తిందా?"

హరిప్రసన్నుడు ప్రయత్నపూర్వకంగా నవ్వుతెచ్చుకుని అన్నాడు: "అయితే నేను వెళ్ళిపోనక్కర్లేదంటావా? వెళ్ళనులే పోనీ..."

మరికాసేపటివరకూ ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. ఆ మౌనం ఇద్దరికీ భారంగానే అనిపించింది. నిమిషనిమిషానికీ శ్రీకాంతునకు ఏవేవో సందేహాలు పొడుసూపుతున్నాయి. హరిప్రసన్నుడు హృదయంవిప్పి అంతా చెప్పేస్తేతప్ప శ్రీకాంతుని గుండె తేలికపడేలా కనిపించటంలేదు. చివరకు హరిప్రసన్నుడు ఇలా ఆరంభించాడు: "విషయం ఏమిటంటే శ్రీకాంత్! నాకు కొన్ని సామాన్లు కావాలి. నేనేమో బజారుకు వెళ్ళలేను. అదీగాక చేతిలో డబ్బేమీ లేదుగా!..."

"సామాన్లుకోసం నువ్వేమీ దిగులు పడనక్కర్లేదు. ఇక్కడ నీ కేవిధమైన ఇబ్బందీ కలగదు."

"అదికాదు నే ననే మాట. నాకు కొన్ని రంగులు, బ్రష్‌లు, ఇంకా ఆ రకమైన సామానులు కొన్ని కావాలి."

"ఏమిటా ఇంకా..."

ఏమేమి సామానులు తనకు కావాలో హరిప్రసన్నుడు విశదంగా చెప్పాడు. అంతా విని శ్రీకాంతుడు అడిగాడు: "చిత్రకారుడి వై పోతావన్నమాట! చిత్రకళ నీకు తెలుసా మరి?"

"తెలియదు. కాని నేర్చుకుంటాను. ఖాళీగా కూర్చోకుండా ఏదో చెయ్యాలిగా మరి!"

"కాబట్టి ఈ సామానులన్నీ ఇప్పుడే తెచ్చి ఇవ్వాలంటావా?"

"తెచ్చి ఇస్తే ఈరాత్రే కొన్ని గంటలు అభ్యాసం చేసి చూస్తాను."

"నేను తెచ్చి ఇవ్వలేకపోతే?"

"మీరు గదిలో దాచుకున్న సితార్లు, గితార్లు నా మూర్ఖపు చేతుల్లో ఆగవు, చెబుతున్నా."

"అయితే నీకు సితారు వాయించటంకూడా వచ్చునన్నమాట!"

"ఎబ్బే, రాదు. వాయించాలనీ నాకు అనిపించదు. కాని ఏదీ దొరక్కపోతే, దొరికిందే అందిపుచ్చుకుని ఏదో చెయ్యాలిగా! కాబట్టి ఆసామాన్లు తెప్పించి ఇస్తివా నీ యిల్లంతా అలంకరించి పెడతాను."

ఇటువంటి హరిప్రసన్నునికోసమే శ్రీకాంతుడు మొదటి నుంచీ వ్యాకులపడుతూ ఉన్నాడు. హరిప్రసన్నుని ప్రాణాలు ఎప్పుడూ అశాంతిగానే ఉంటాయి. ఒక్క క్షణంకూడా అతడు విశ్రాంతిగా కూర్చోలేడు.

"హరీ! నువు చాలాచాలా తిరిగి అలసిపోయావు. నాలుగు రోజులు సుఖంగా కూర్చుని విశ్రాంతి తీసుకో. సత్య వస్తుంది; ఆమెకు పాఠాలు చెప్పు. మీా వదినె వస్తుంది; ఆమెను అర్థం చేసుకో. ఈ ప్రపంచమంతా నిర్జన ప్రదేశంగా భావించుకుంటావేం? పైనున్న ఆకాశంతోనేనా నువు ఎప్పుడూ మాటాడుతూ కూర్చునేది? ఒక పదార్థ రూపంలో ఉన్నదానితోనే నీకు సంబంధం ఏర్పడగలదు. ప్రపంచంలో ఇంతమంది స్త్రీలు, పురుషులు ఉండగా వారిలో నీకు మనోరంజకమైన విషయమే కనిపించదా?" – అడిగాడు శ్రీకాంతుడు.

"శ్రీకాంత్! పనిలేకుండా ఖాళీగా ఉన్నప్పుడు ఏం చెయ్యాలో చెప్పావు, బాగానే ఉంది. పనిలేకపోవటం నాకు భారంగా ఉంటుంది. పనిలోనే కాలం గడవాలి. కాలక్షేపానికి చెప్పుకునే కబుర్లు చాలానే వున్నాయి. నాది ఏకాంత స్థితి. దానికి కారణం ప్రపంచంలో మరింకెవరూ లేరని కాదు; నే నలా తయారైనాను మరి!"

ఈ హరిప్రసన్నని తలచుకున్నప్పుడెల్లా శ్రీకాంతునికి బాధ కలుగుతుంది. హరిప్రసన్నుడికి జీవితంలో ఏనాడూ ఆనందానుభవమే లేదా? అవిరామ కర్మణ్యుడు. అతడు నిమగ్నుడై యున్న పనిలోనే అతనికి రసానుభూతి ఉండదా? అన్నిపనులూ అతనికి కాలక్షేపం కోసమేనా? ఇటువంటి కర్మశీలుని హృదయంలో ఇంత విషాదం గూడుకట్టుకుని ఉందేం?

"అయితే ఆ సామానులన్నీ తెచ్చిపెట్టమన్నావా?" - శ్రీకాంతుడు అడిగాడు.

"తెచ్చిపెడితే తెచ్చిపెట్టు."

"సరే, తెస్తాను. అవి పెట్టుకుని ఒక మూల ఖైదీలా కాలక్షేపం చేస్తావన్నమాట. అలా ఒంటరిగా పడిఉండి ఎలా బ్రతుకుతావో నాకేం తోచకుండా ఉంది."

భోజనం అయాక శ్రీకాంతుడు బజారుకు బయలు దేరాడు. "చూడు సారీ! రివాల్వర్ నాకిస్తావా, ఇచ్చెయ్యి. భద్రంగా దాచేస్తాను. లేకపోతే నువు అయినా జాగ్రతగా ఎక్కడో పెట్టి ఉంచు. ఎవరికీ కనిపించకూడదు సుమీ!"

"అలాగే" అని మెల్లిగా అన్నాడు హరిప్రసన్నుడు.

"నాకిచ్చేస్తావా?"

హరిప్రసన్నుడు శ్రీకాంతునివైపు కాసేపు స్థిరంగా చూచాడు. "అది ఒకచోట భద్రంగానే దాచాను శ్రీకాంత్! అయినా దాన్ని మనం మాయం చెయ్యలేం కదా! ఇంతకూ దానివల్ల ఉత్పాతం ఏమీ జరగదులే. నువు నిశ్చింతంగా ఉండు."

"ఎక్కడ దాచావు?"

హరిప్రసన్నుడు నీరసంగా నవ్వాడు. "భద్రంగానే దాచాలే."

"సరే అయితే" అంటూ శ్రీకాంతుడు బజారుకు వెళ్ళాడు.

హరిప్రసన్నుడు గదిలోకి వెళ్ళాడు. రివాల్వరు తీశాడు. అందులో నింపి ఉన్న తోటాల్ని బైటికి తీశాడు. వాటిని

అరచేతిలో కాసేపు అటూ ఇటూ దొర్లించి తివాచీమీద పడేశాడు. రివాల్వరును తోలుసంచిలో దూర్చేసి అలమార పైన పెట్టాడు. దానిమీద నిర్లక్ష్యంగా ఒక పాత వార్తా పత్రిక కప్పాడు. ఇక పోతే తోటాల్ని ఏం జెయ్యాలి? విసిరి పారేద్దామా? కాసేపు ఆలోచించి, చివరకు వాటిని కూడా ఒక పొట్లం కట్టి అలమార మీదే పెట్టాడు. ఇక తరువాత? పనేం కనిపించలేదు. పనిలేకపోతే అతనికి తోచదు. పని లేకుండా అసలు ఉండలేడు. కాసేపు ఆలోచించాడు. గదిలోని ప్రతివస్తువూ శుభ్రంగా తుడిచి, చక్కగా ఎక్కడి దక్కడ అమర్చి పెడదామనుకున్నాడు. ఇంకేం? ఆ పనిలో నిమగ్నుడైనాడు. పటాలన్నీ తీశాడు. శుభ్రంగా అన్నీ దుమ్ము దులిపాడు. మళ్ళీ ఎక్కడి వక్కడ అమర్చాడు. ఈ పనిలో చాలసేపే గడిచింది. అంతా అయాక "ఇంకా శ్రీకాంతుడు రాలేదే! ఎందుకు రాలేదబ్బా!" అనుకున్నాడు. గదిలోనుంచి బయటికి వచ్చి కాసేపు పచార్లు చేశాడు. మళ్ళీ గదిలోకి వెళ్ళాడు. ఆగదిలోనే తన జంపఖానా పరుచుకుని పడుకుందామనుకున్నాడు. అప్పుడతని మనస్సులోకి కొన్ని ఆలోచనలు పరిగెత్తుకు వచ్చాయి: ఈ గదిలో వదినెగారు ఏమేం పనులు చేసుకుంటూ కూర్చునేదో! ఆమె వాయించుకునే వాయిద్యాలు ఇక్కడే ఉన్నాయి. పుస్తకాలు ఉన్నాయి. పటాలూ ఉన్నాయి... ఈ గది ఇవాళ తనదీ. ఈ రాత్రి ఈ గదిలోనే తివాచీమీద తన జంపఖానా పరచుకుని పడుకుంటాడు.

చేతిలో పనిలేదాయె. పొద్దు పోవటంలేదు. పని లేక పోతే అతనికి కంపరం ఎత్తుతుంది. శ్రీకాంతుడు ఇంకా రాలేదేం? బుర్రలో ఏవేవో ఆలోచనలు చొచ్చుకువచ్చి సందడిచేస్తున్నాయి. ఇంకా శ్రీకాంతుడు రాడేం? రెండు గంటలైంది వెళ్ళి. తివాచీమీద జంపఖానా పరచుకున్నాడు. పడుకుందా మనుకున్నాడు. కాని పడుకోలేదు. పచార్లు ఆరంభించాడు. ఇప్పుడీ యింటికి తానే కాపలాదారు. పడుకుంటే ఎలా? బైట వసారాలోకి వచ్చి పచార్లు చేస్తున్నాడు.

పచార్లు చేస్తూనే ఉన్నాడు. ఎవరో నవయువకుడు దగ్గరకు వచ్చాడు. హరిప్రసన్నుడు అతన్నిచూచి గుర్తించాడు. యువకు డతనికి నమస్కారం చేశాడు.

“ఏం ?” అన్నాడు హరిప్రసన్నుడు అన్యమనస్కుడు లాగ.

“మీతో అవసరం ఉంది.”

“నాతో ఏమీ అవసరం పెట్టుకోకు. ఆజ్ఞ ఎలా ఉంటే అలా నడచుకో. కొత్తవిశేషాలేమన్నా ఉన్నాయా?”

“మీరు వస్తారా!”

“చూస్తూ ఉండు.”

ఆ తరువాత ఆ యువకుడు కళ్ళతోనే ఏమేమో ప్రశ్నిస్తూ అలాగే నిల్చున్నాడు.

“ఎందుకూ?” హరిప్రసన్నుడు అన్నాడు.

యువకుడు తొట్రుపాటుగాఅడిగాడు: “నేను-వెళ్ళనా?”

సంభాషణ అంతటితో ముగించేయాలన్న తలంపో యేమో చటుక్కున “ఆఁ-వెళ్ళు” అనేశాడు హరి.

యువకుడు అప్పటికీ వెళ్ళలేదు. అడిగాడు: "మళ్ళీ?"

"రేపు సాయంత్రం."

"ఇక్కడే కలుస్తారా?"

"ఇక్కడే... ఇక్కడే... ఇక్కడే... వినిపించిందా?"

యువకుడు నమస్కారంచేసి వెళ్ళిపోయాడు.

హరిప్రసన్నుడు పూర్వంకంటే వేగంగా పచార్లు చేస్తున్నాడు. చివరకు శ్రీకాంతుడు వచ్చాడు. "అమ్మయ్య! వచ్చావూ? చాల ఆలస్యం అయిందేం?" అంటూ సగం బరువు దించుకున్నవాడులాగ పలుకుతూ ముందుకు సాగి వచ్చాడు. మిత్రుడిని అమాంతం కౌగలించుకోవాలని అతని ఉబలాటం. కాని మధ్యలోనే ఆగిపోయాడు. "నేనేమీ కృతజ్ఞత ఆశించేవాడిని కాదు"... అన్నట్టు గంభీరంగా ముఖం పెట్టాడు శ్రీకాంతుడు.

శ్రీకాంతుడు ఏమీ మాటాడలేదు. అతని వెనకాలే కూలివాడుకూడా వచ్చాడు. వాడి నెత్తిమీది తట్టలో నుంచి వస్తువులన్నీ తీసి విడివిడిగా పెట్టాడు శ్రీకాంతుడు. ఆ తరువాత వాడికి కూలి యిచ్చి పంపించేశాడు. "చూచుకో హరీ! నీకు కావలసిన వస్తువులన్నీ సరిగ్గా ఉన్నాయో లేదో!" అన్నాడు.

హరిప్రసన్నుడు శ్రీకాంతుని ముఖంలోకి చూచాడు. చూచి చూచి ఏదో భావం పట్టలేక అన్నాడు: "శ్రీకాంత్!"

శ్రీకాంతుడు చిరునవ్వు ఏమన్నా తెచ్చుకున్నాడా? అన్నాడు: "పచార్లు ఆపేసెయ్యి. సామానులు చూచుకో. అన్నీ ఉన్నాయో, లేదో!"

# 25

శ్రీకాంతుడు హరిప్రసన్నుడివైపు కాసేపు చూస్తూ నిల్చున్నాడు. చివర కన్నాడు: "హరీ! పైన పక్క వేసి ఉంటుంది. వెళ్ళి పడుకో. నేను కాసేపు ఆఫీసుగదిలో కూర్చుంటాను."

"మొదట నువ్వు తెచ్చిన సామానులన్నీ చూచు కోనీ. నిద్ర ఎప్పుడు వస్తుందో ఎవడికి తెలుసు? నిద్ర వచ్చి నప్పుడు ఈ గదిలోనే పడుకుంటాలే."

రాత్రిపూట అతన్ని ఒంటరిగా పెట్టడం శ్రీకాంతునికి ఇష్టంలేదు. మాటల్లోకి దింపి అతని మనస్సుకు కాస్త ఆహ్లాదం కలిగించాలని శ్రీకాంతుని అభిప్రాయం. అదీగాక అతని వ్యవహారం ఇంకా లోతుగా తెలుసుకోవలసిన అవస రమూ ఉంది. అందుచేత "పైనే పడుకుందాం హరీ! ఇద్దరం కలసి మాటాడుకుంటూ పడుకోవచ్చు" అన్నాడు.

"నువ్వేం భయపడబోకు. నేనిక్కడే పడిఉంటా."

హరిప్రసన్నుడు ఒకరు చెబితే వినే మనిషి కాదు. ఎల్లప్పుడూ తన యిష్టప్రకారం నడిచిపోతూ ఉండాల్సిందే. ఆ సంగతి శ్రీకాంతునికి బాగా తెలుసు. "సరే, ఒక గంట సేపు నాకు సెలవు ఇయ్యి" అంటూ శ్రీకాంతుడు వెళ్ళి పోయాడు.

హరిప్రసన్నుడు ఆ సామానంతా తీసుకుపోయి శయన మందిరంలో పరిచాడు. అప్పటికప్పుడు కూర్చుని ఏదో బొమ్మలు గీయటం ఆరంభించాడు.

చాలసేపటికి శ్రీకాంతుడు లేచి, పడుకోటానికి పైకి వెడుతూ పిల్చాడు. అప్పటికీ బోర్డుమీద కాగితం పరచుకుని, వంగి దానిమీద బొమ్మ గీస్తునే ఉన్నాడు హరి. "ఇంకా అదే పనా? నిద్రపోవా యేమిటి; లే, లే" అన్నాడు శ్రీకాంతుడు.

"ఇది పూర్తి కావాలి; తరువాతే నిద్ర."

శ్రీకాంతుడు అతని చెయి పుచ్చుకొని లేవనెత్తుదామనుకున్నాడు. ఆసమయంలో అతని కన్నుల్లో ఒక దైన్యభావం కనిపించగా శ్రీకాంతుడు ఆతృతగా అడిగాడు: "ఏం, ఏమైంది?"

"ఏమీ లేదు, నన్ను ఇక్కడే పడి ఉండనీ."

"అదేంమాట! బొమ్మ రేపు పూర్తిచెయ్యకూడదూ?"

"ఎప్పుడైనా చెయ్యొచ్చు. అదిగాదు. నా ఊహాప్రపంచంలోనుంచి సగంవరకూ కాగితంమీదికి తీసుకొచ్చేశాను. ఇప్పుడు నిద్ర ఎలా వస్తుంది చెప్పు. నన్ను విడిచిపెట్టెయ్యి, దీన్ని పూర్తిచేసి ఇక్కడే పడుకుని నిద్రపోతాను."

ఈమాట శ్రీకాంతునికి పూర్తిగా అర్థం కాలేదు. "సరే అయితే; మెట్లదగ్గర తలుపు తాళంవేసి పోయి పడుకుంటున్నాను, ఇదిగో తాళం చెవి."

హరి ఆశ్చర్యపోయాడు. "తాళంచెవి! నాకెందుకూ? నేనేం జేసుకునేదీ?"

శ్రీకాంతుడు గంభీరముద్ర తాల్చాడు: "రాత్రివేళ నువు బయటికి వెళ్ళాల్సిన అవసరం పట్టదా?"

"ఉహుఁ."

"బొమ్మ పూర్తి కానిది నిద్రపోవా ?"

"బొమ్మ అంతా కాదు ; out line పూర్తి కావాల్సిందే."

"పైకి వచ్చి పడుకోవా ?"

"ఇక్కడే పడిఉంటాను."

శ్రీకాంతుడు మరి మాటాడలేదు. అతని సంకోచం తీరలేదు. మనస్సులో కలకగానే ఉంది. చెయ్యెత్తి హరి ప్రసన్నని ఆశీర్వదించుదా మనిపించింది : "హరీ, నీ ఆత్మ నిన్ను పీడకుండు గాక ! ఈ రాత్రి నీకు సుఖంగా గడచి పోవు గాక !" అని. అతని చేయి తన చేతిలోకి తీసుకుని "మిత్రుడా ! నువ్వేమీ అనుమానించబోకు ; ఇది నీ స్వంత యిల్లే సుమీ!" అని చెబుదా మనిపించింది. హరిప్రసన్నని పట్ల తా నెట్లు ప్రవర్తించాలో అలా ప్రవర్తించటంలే దన్నట్లు కించపడ్డాడు. అతనికి చేయవలసిందంతా తాను చేయటంలే దన్నట్టు మనసులో బాధపడ్డాడు.

చివరకు ఎంతో స్నేహపూర్వకంగా "హరీ! నీ మంచం - పక్క, పైన ఉన్నాయి. వీలైతే పైకి రా" అన్నాడు.

"శ్రీకాంత్ ! నువ్వెందుకంత బలవంతం చేస్తావు ? నేను బలవంతం చెయ్యదగిన మనిషినేనా ? ఇక్కడే పడుకుంటా నంటినిగా !"

"హరీ ! నీకు ఇప్పటికీ భగవంతునిలో విశ్వాసం లేదా !"

"ఇప్పటికీ లేదు."

"అయినాసరే, నన్ను ఆశీర్వదించనీ: భగవంతుడు నీకు సుఖాన్ని చేకూర్చుగాక! భగవంతుడు సర్వులకు శ్రేయస్సు సమకూర్చుగాక!" అంటూ శ్రీకాంతుడు మెల్ల మెల్లగా అడుగులు వేసుకుంటూ పోయాడు.

హరిప్రసన్నుడు పీడగ్రస్తుడులా అయిపోయాడు. వెడుతోన్న శ్రీకాంతునివైపే చూస్తూ కూర్చున్నాడు. అతడు కంటికి కనిపించకుండా దాటిపోయాక ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. మళ్ళీ ముందుకు వాలి గీస్తున్న చిత్రంలో నిమగ్నుడైనాడు. "శ్రీకాంతునిపట్ల నే నెంతో దయాదాక్షిణ్యాలు గలవాడినిగా దంభం చూపించటం నాకిష్టం లేదు." అనుకున్నాడు తనలో తాను.

ఆరాత్రి అతడు రెండు మూడు రంగు రంగుల బొమ్మలు గీశాడు. లతలు, చెట్లు వేశాడు. మధ్య మధ్య నాగరి లిపిలో ఏవో అక్షరాలు ఉన్నాయి. కాని అవి విస్పష్టంగా లేవు. వాటి క్రమం, అర్థం దురవగాహంగా ఉన్నాయి. ఒకచోట 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అని గుండ్రిగా, చాల అందంగా నిలిపి నిలిపి రాశాడు. అక్షరాలు ధగధగా మెరుస్తూ కొట్టవచ్చేట్టుగా ఉన్నాయి. ఈ వాక్యానికి పైన ముద్దొచ్చేలాగ, ఎర్రరంగులో ఒక చిన్న ప్రశ్నార్థక చిహ్నం వుంచాడు. అది నెత్తురు చుక్కలాగ చిన్నది, ఎర్రగా వుంది. ఒక అందగత్తె నుదుటిమీది కుంకుమబొట్టువలె స్థిరంగా, దీప్తిమంతంగా వుంది. ఉత్కృష్టమైన ఆ వాక్యానికిపైన స్థానం ఏర్పరచుకుని వుంది. అంతటకీ కేంద్రబిందువు తానే నన్నట్టు, ప్రాముఖ్య

మంతా తనదే నన్నట్టు వెలుగుతోంది - ఆ ప్రశ్నార్థక చిహ్నం. ఆ పంక్తిలోని సౌభాగ్యం, గురుత్వం అంతా ఆగుర్తులోనే కేంద్రీకృతమైనట్టు కనిపిస్తుంది. ఆ చిత్రం యొక్క ఆత్మ ఆప్రశ్నార్థక చిహ్నం; మిగిలిందంతా శరీరం. ఆప్రశ్నార్థకచిహ్నం మూలాన్నే అంతా సజీవంగా ఉంది. లేకపోతే అంతా వ్యర్థమే - భ్రమే.

ఇదంతా అయాక ఒక పెద్ద కాన్వాసు గుడ్డ తీశాడు. దానిమీద చిత్రం వెయ్యాలి. ఏం చిత్రం? దాని స్వరూపం ఇంకా తన మనస్సులోనే విస్పష్టంగా ఏర్పడలేదు. అదంతా ఏదో విషాదమయమైన దృశ్యం. తనహృదయంలో మబ్బు మబ్బులుగా సంచలిస్తూ పరివ్యాప్తమాతోంది. దాన్ని యీవత్తూ ఈ కాన్వాసుమీదికి తీసుకురావల్సిందే. తన ఆత్మను కరచిపట్టుకున్న ఈ రూపంలేని విషాదానికి పెన్సిల్ గీతలతో ఆకారాన్ని కల్పించాల్సిందే. ఈరాత్రి ఎంత పొద్దు పోయినాసరే, తెల్లవారినాసరే, ఈపని పూర్తికావాలి - తప్పదు.

...పైన కప్పు విశాల నీలాకాశం. అది అనంతము, అగాధముకాబట్టి శాంతంగా, నిశ్చలంగా ఉంటుంది. చప్పుడు ఉడిగి నిల్చినట్టు శూన్యంగా, శ్యామలవర్ణంలో ఉండాలి. సంధ్యాసమయం. మసక మసక చీకట్లు క్రమ్ముకొస్తూ ఉంటాయి. ఒకటిరెండు నక్షత్రాలు ఉంటాయి. వాటిక్రింద దూరంగా ఏవో చెట్లు. ఆకాశానికి చివరిఅంచున ఒక స్థూపం... ఒక నిగూఢకావ్యంలాగ అభేద్యమరీచికవంటి స్థూపం... నల్లని మబ్బులవెనుకనున్న ప్రచండ కిరణ పుంజం

లాగా ప్రకాశవంతమైన స్థూపం. దానికిముందు ఈ విశాల మైన పృథివి. చెట్టు చేమ ఉండదు. పాడుపడిన ప్రదేశంలా ఉంటుంది, చదునుగా. అక్కడక్కడ ఆకులెండిన మొండి చెట్లు నీరసంగా పడిఉండవచ్చు. ఆ స్థూపానిది కటికి చీకటితో తయారైన రూపంగా ఉండాలి— కాని ఆగు! ఆ స్థూపం తలమీదనుంచి ఆ చూపేమిటి? ఎవరివా కళ్ళు? ఏమిటా కళ్ళలో మెరుస్తోంది? ఆ కళ్ళు మూసుకు పోయి ఉన్నాయా, తెరిచే ఉన్నాయా? సగంమూసీ, సగం తెరచీ ఉన్న ఆ కళ్ళు దేనినో అడ్డగిస్తున్నట్టున్నాయి. దేన్ని? ప్రళయాన్ని! ఏం ప్రళయాన్ని? ఆ కళ్ళలో వెలిగేది విషాదమా? ఆనందమా?... అయితే అది స్థూపంకాదా? స్త్రీయా?... ఊహుఁ. స్థూపమే, పర్వతంలాగా విశాలమూ, అచలమూ అయిన స్థూపమే. దాని ముందు ఒక పురుషుడు అమావాస్యనాటి దీపశిఖవలె నిస్సహాయుడు. కాని శక్తి మంతుడు. పూర్తిగా నగ్నశరీరుడు. చేతులు రెండూ సిలువ (cross) ఆకారంలో చాచుకున్నాడు. ఉజ్వలమూ, బలిష్ఠమూ అయిన శరీరం. కాని ఎలాంటి పురుషుడు? దిక్కూ దివాణం లేకుండా ఒక యిసుక యెడారి ఒడ్డున పాతిన మైలురాయిలా ఉన్నాడు. అతనికి ఇంగితజ్ఞానం నశించిపోయింది. శూన్యంలోకి తదేకంగా చూస్తున్నాడు. ఎవరైనాసరే తనకు తోడు ఎక్కడైనా దొరుకుతారా? సిలువముద్ర వేసుకుని ఈ పురుషుడు ఎంతసేపటినుంచీ ఇక్కడ నిల్చిఉన్నాడో ఎవరికి తెలుసు?... అతని ముందు ఆ ఉన్న దేమిటి? స్థూపమా? శూన్యమా? స్త్రీయా? ఎందుకు అక్కడ

తాను నిల్చి ఉన్నాడు? చాచిన చేతులు జోడించి నమస్కారం చేస్తాడా? కావిలించుకుంటాడా? చీల్చి చెండాడతాడా? ఏమో తెలియదు. అడ్డంగా నిల్చి 'ఓసీ!' అని పిలుస్తున్నట్టున్నాడు.

ఇదీ, హరిప్రసన్నుడు కాన్వాసుగుడ్డమీద గీయదలచుకున్న చిత్రం. మనస్సులో ఉన్నది కాన్వాసుమీదికి దించితీరుతాడు. ఎంతకాలమని భరిస్తాడు, మనస్సులో ఈ పీడ మరి? క్రింద రాస్తాడు— **'ఓసీ!'**

పెన్సిల్ పుచ్చుకుని ఈ 'ఓసీ' ని కాగితంమీద బంధించే ప్రయత్నంలో పూర్తిగా నిమగ్నుడై పోయాడు.

రాత్రి పన్నెండు గంటల కొకసారి శ్రీకాంతునికి మెలకువ వచ్చింది. లేచి చూచాడు; విద్యుద్దీపం వెలుగుతూనే ఉంది. హరిప్రసన్నుడు బొమ్మ గీస్తూనే ఉన్నాడు.

మళ్ళీ మూడుగంటలప్పు డొకసారి శ్రీకాంతుడు ఉలికిపాటుగా లేచాడు. అప్పటికీ దీపం వెలుగుతూనే ఉంది. పక్కమీదనుంచి లేచి మెల్లిగా నడచి వచ్చాడు. "హరీ! చాలా పొద్దుపోయింది. ఇకనైనా పడుకోవోయి" అని చెబుదామని అతని ఉద్దేశం. తీరా వచ్చి చూచేసరికి హరిప్రసన్నుడు రెండు అరచేతుల్లోనూ గడ్డం పెట్టుకుని, వ్రేళ్ళతో కణతలు అదుముకుంటూ... తనముందు కాగితంమీద పెన్సిల్ గీతలతో తయారైన గారడీని తదేకంగా చూచుకుంటున్నాడు. అతని ప్రాణాలన్నీ అందులో లీనమైపోయినట్టు వివశుడై ఉన్నాడు. చూచి శ్రీకాంతుడు మాటాడకుండా వెనక్కు వెళ్ళిపోయాడు.

తెల్లవారుఝామున అయిదుగంటలకు కొంతదూరం షికారుగా వెళ్ళిరావటం శ్రీకాంతునికి అలవాటు. ఇవాళ లేచేసరికి ఆరుగంటలైంది. లేచివచ్చి చూచాడు. దీపం వెలుగుతూనే ఉంది. కాగితం పక్కనే హరిప్రసన్నుడు తన చెయ్యే తలగడగా పెట్టుకుని నిద్రపోతున్నాడు. బాగా అలసిపోయిన కూలివాడులాగ ఒళ్ళుమరచి శాంతంగా నిద్రపోతున్నాడు. శ్రీకాంతుడు కాసేపు అలాగే నిలబడి చూచాడు. చప్పుడు కాకుండా వెనక్కు తిరిగి తనగదిలోకి వెళ్ళాడు. నారదుప్పటి ఒకటి తెచ్చి అతనికి కప్పాడు. అక్కడనుంచి మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఆఫీసుగదిలో వెళ్ళి కూర్చున్నాడు. షికారు వెళ్ళలేదు.

## 26

హరిప్రసన్నుడు లేచేసరికి చాల పొద్దెక్కింది. లేచి చూచాడు. చుట్టూ పెన్సిళ్ళు, రంగులు, కుంచెలు...... సామానులన్నీ చెల్లాచెదరుగా ఉన్నాయి. అన్నీ అలా ఉంచే తాను నిద్రపోయాడన్నమాట! ఇంతలో ఒంటిమీద నారదుప్పటి కనిపించింది. శ్రీకాంతే తీసుకువచ్చి కప్పిపోయాడని ఊహించుకున్నాడు. హృదయం శ్రీకాంతుని పట్ల కృతజ్ఞతాభావంతో నిండిపోయింది. నిండి నిండి, బరువై, దుర్భరమైంది. చివాలున లేచాడు. సామానులన్నీ చక్కగా సర్ది ఒక మూలపెట్టాడు. చీపురు ఒకటి పుచ్చుకుని ఇల్లంతా శుభ్రంచెయ్యటానికి ఉద్యమించాడు. ఇంకో విధంగా కాకపోయినా, కనీసం ఈ విధంగానైనా ఈ ఇంటికి తాను సేవచెయ్యాల్సిందే నని అతని కోరిక.

ఆ సమయాన శ్రీకాంతుడు వచ్చాడు. "అప్పుడే లేచావా? తెల్లవారుఝామున ఎప్పుడో ఒళ్ళు వాల్చావల్లే ఉంది. కదూ!...అదేమిటి, చీపురు పుచ్చుకున్నావెందుకూ? నీకేం రోగం వచ్చిందీ?"

"ఔను. రాత్రి చాల పొద్దుపోయేవరకూ ఆ బామ్మా నేనూ తలపట్లు పట్టాం. ఇంత పొద్దు ఎక్కేవరకూ యోగ్యుడైనవాడు నిద్రపోతడా చెప్పు!...సరే గాని, ఇవాళ నీ చేత ఏమేమి వంటకాలు తినిపించమన్నావు? నేను చాత కాని వంటమనిషినేం కాదు సుమీ!"

శ్రీకాంతుడు చిరునవ్వు నవ్వాడు. "వంట ఇక్కడే చేద్దామా? నువు చేస్తావా? అయితే సరే; కాని నేను మాత్రం ఆవిషయంలో భజగోవిందాన్నే."

"వకీలూ, భజగోవిందమూనా? సరే, నువు పోయి నీ వకాల్తా పనేమిటో చూచుకో. వంట అవగానే కబురు చేస్తాను. ఏయే సామాన్లు ఎక్కడున్నాయో, ఏమేం పదార్థాలు చెయ్యమంటావో...అది మాత్రం చెప్పివెళ్ళు."

ఈయింటికి సేవ చెయ్యాలని హరిప్రసన్నుడి కోరిక. అందుకుగాను ఏదో ఒక పని దొరక్కపోతే అతని మనస్సు వ్యాకులంగా ఉంటుంది. అతని హృదయం అంత కృతజ్ఞతా భావంతో నిండిపోయింది. ఇల్లు ఊడుస్తున్నాడంటే...మామూలుగా ఊడవటంకాదు...శుభ్రంగా, ఇల్లు అద్దంలా కనిపించేట్టు ఊడవాలని అతని ఉద్దేశం. అతనిలో ఉన్న ఉత్సాహాన్ని యావత్తూ ఈ సేవాకర్మలో వినియోగించాలని అతని పట్టుదల.

శ్రీకాంతుడు మొదటినుంచీకూడా హృదయవాది. హరిప్రసన్నుడు చీపురుపుచ్చుకుని గది ఊడుస్తుంటే అతనికి ఎబ్బెరికంగానూ అనుచితంగానూ ఏమీ కనిపించలేదు. అది పవిత్రమైన సేవాకర్మ. దానిపట్ల మనస్సులో ఏవిధమైన అసహ్యమూ కలగకూడదు.

"నువు వంట చేస్తా నన్నావు కదూ! సరే అయితే. నీ కే యే పదార్థాలు ఇష్టమో అవే చెయ్యి. నీ రుచులూ, సామర్థ్యం ఎంతవరకున్నాయో తెలుసుకుంటాను." అంటూ శ్రీకాంతుడు హరిప్రసన్నుని వంటింటివైపు తీసుకువెళ్ళి చూపించాడు. "ఇదే వంటిల్లు. సామాన్లన్నీ ఇందులోనే ఉంటాయి. ఏది ఎక్కడుందో చూచుకోగలవుగా! కూర లేమైనా కావాలంటే చెప్పు. ఇప్పుడే తీసుకొచ్చి ఇస్తాను" అన్నాడు.

శ్రీకాంతునిచేత ఏ చిన్నపనికూడా చేయించకూడదని హరిప్రసన్నుని పట్టుదల. "నువు వెళ్ళి తేవాలా? ఏం, కూర లేకపోతే వెళ్ళదూ!" అన్నాడు.

"ఎందుకు వెళ్ళదూ? నువు కూరలేకుండా కటికిరొట్టె తినిపించినా తినాల్సిందే. ఏం చేస్తాను?"

"అయితే ఇవాళ కటికిరొట్టెలే తినిపిస్తాను. నేతి రొట్టెలు రోజూ తింటున్నవేగా!"

"అయినా ఈ ఒక్కపూటేగా! పెద్ద ఎత్తుబారం ఏం పెట్టుకోకు. సాయంత్రానికి ఆవిడ రానేవస్తుంది. ఏదో సామాన్యంగా వెళ్ళదీ. అసలు ఈ గొడవకూడా అక్కర్లేదు. అక్కడినుంచి భోజనం రానేవస్తుంది."

ఈమాటలతో హరిప్రసన్నుని ఉత్సాహం రవంత కుంగిపోయింది — మేఘం ఆవరించుకువస్తే ఎండ తగ్గిపోయి నట్టు. అన్నాడు: "ఒక్కపూట నీకు ఆవిడగారి చేతిమీది భోజనం దొరక్కపోతే అంత విచారం అన్నమాట!"

"నాకేం; నువు అవస్థ పడదలచుకుంటే పడు. ఆవిడ గారి చేతిమీది భోజనం ఒక్కపూట దొరక్కపోతే నా కది సంతోషకరమైన విషయమని నువు భావిస్తున్నావా, (చిరునవ్వు) సంతోషకరమైన విషయం కానేకాదు. (మరో చిరునవ్వు) కాని నీ చేతిమీది భోజనం ఎప్పటికీ లభ్యాం కావటం?"

హరిప్రసన్నుడు మరేమీ మాటాడకుండా వంటింట్లో ప్రవేశించాడు. అక్కడ ఉన్న డబ్బాలన్నీ మూత తీసి చూచుకుంటున్నాడు. శ్రీకాంతుడు గుమ్మంలోనే నిల్చుని "ఈ వంటిల్లు ఉంది; నువు ఉన్నావు. ఇక మీ యిష్టం. నేను వెడుతున్నాను" అన్నాడు.

"ఉండు, కాస్త ఆగు."

హరిప్రసన్నుడు డబ్బాలన్నీ మూతలు తీసి, పరీక్ష చేసి తిరిగివచ్చాడు. "వదిన మరీ బేపరవా మనిషయ్యా!"

"ఆసంగతి ఆమె సాయంత్రం వచ్చాక చెప్పు."

ఆమాటతో హరిప్రసన్నుడు కొంచెం జంకాడు. చూచావా, మసాలా దినుసులన్నీ... కొన్ని ఉన్నాయి, కొన్ని లేవు. వంట బాగులేకపోతే తప్పు నామీద వెయ్యద్దు."

శ్రీకాంతుడు నవ్వాడు. "నిస్సందేహంగా తప్పు నీది అవదు. ముందు నువ్వు స్నానం గీనం చేసి రా. ఈ లోగా

నేనోకసారి ఆఫీసుగదిలోకి పోయి వస్తాను. అవసరమైతే తప్ప కుండా నీకు శిష్యత్వం వహించి నేనుకూడా వంటలో జొర బడతా... ఆс, వందరూపాయలు నీకు ఈ క్షణంలోనే కావాలా? బహుశా ఇప్పుడే దొరకవనుకుంటా."

"ఇప్పుడే కావాలి మరి."

"ఇప్పుడే ?"

"పోనీ, సాయంత్రంలోగానైనాసరే."

హరిప్రసన్నని ముఖం నల్లబారింది. శ్రీకాంతుడు అది గమనించాడు. "ఆవిడ సాయంత్రానికి కదా వస్తుంది? ఈలోగానే ఎలా వీలౌతుంది?" అన్నాడు.

"వీలుకాదా ?"

"ఎలా వీలౌతుంది ?"

"వీలు చెయ్యాలి, శ్రీకాంత్ !"

శ్రీకాంతుడు చాల నొచ్చుకున్నాడు. తానేదో తప్పు చేసినట్టుగా భావించాడు. తన తప్పేమిటో విస్పష్టంగా కనిపిస్తున్నట్టు ఉంది. "సరే, చూదాంలే" అంటూ వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. అతని మనసులోని కాతరభావం నడ కలో వ్యక్తమౌతూనేఉంది. హరిప్రసన్నుడు మరేమీ మాటాడలేకపోయాడు. శ్రీకాంతుడు వెళ్ళిపోయాడు.

హరిప్రసన్నుడికి ఒక క్షణంసేపు ఏమీ తోచలేదు. చీకట్లు క్రమ్మినట్టుగాఉంది. నిశ్చేష్టుడై అలాగే నిల్చుండి పోయాడు. చివరకు కాళ్ళు వాటంతట అవే కదిలాయి. మెల్లిగా ఒకటి, రెండు, మూడు అడుగులు వేశాడు. ఏడె నిమిది అడుగులు వేశాక మళ్ళీ కాస్త మామూలు మనిషి

అయినాడు. పారేసిన చీపురు పుచ్చుకుని పాచిపనిలో దిగాడు. మిక్కిలి వ్యస్తచిత్తుడై పనిపాటల్లోపడ్డాడు. పాచిపను లయాక స్నానం చేశాడు. అన్నిపనులూ గబగబా పూర్తిచేశాడు. చివరకు ఒక కర్తవ్యాన్ని పాలిస్తున్నవాడువలె, ఒక ఆజ్ఞను నిర్వర్తిస్తున్నవాడువలె వంటపనిలో నిమగ్నుడైనాడు.

శ్రీకాంతుడు అఫీసుగదిలోనుంచి కొంతసేపయాక తిరిగి వచ్చాడు. హరి ఏకాగ్రచిత్తుడై వంటచేస్తూండటం చూచాడు. "మహాశయా! ఇంకా ఎంత ఆలస్యం ఉంది?"

హరిప్రసన్నుడు నవ్వలేదు. చిరునవ్వుకూడా ప్రదర్శించలేదు. "ఆలస్యం ఏం లేదు; వచ్చెయ్యి."

"వచ్చి నీకేమైనా సాయం చెయ్యనా?"

"ఏం అక్కర్లేదు. పళ్ళెం పెట్టుకుని కూర్చో."

"సరే అయితే" అంటూ శ్రీకాంతుడు చొక్కా విప్పేసి కేవలం బనీనుతో వంటింట్లో ప్రవేశించాడు. అక్కడ తడిపి పెట్టి ఉన్న పిండిముద్ద పట్టుకుని చూచాడు. పప్పు ఉడుకుతోంది. "ఏదీ ఇలా కాస్త గరిటెతో తీసి చూపించు" అన్నాడు. అదికూడా పట్టుకుని నలిపి చూచాడు. "ఉడికిందిగా; ఇక దించవేం? పసుపు వెయ్యలేదాయేం? చూడ్డానికి ఇంపుగా కనిపించటం లేదే! మరి పచ్చడేమన్నా చేశేవా? చెయ్యలేదూ! ఏం? ఎందుకనీ!" అంటూ గబగబా రోలూ, రోకలీ కడిగేసి "పచ్చడి చెయ్యలేదూ! నేను చేస్తా చూడు" అన్నాడు.

శ్రీకాంతుడు ఈ పని అంతా చేస్తూ ఉండటం చూచి హరిప్రసన్నుడు బాధపడ్డాడు. "చాల్లే, అల్లరి మానేసి పళ్ళెం పెట్టుకు కూర్చో."

"కాదులే. పచ్చడి లేకుండా ఒక్క కూరతోనే ఎలా తింటాం? పచ్చడి నేను చేస్తా చూడు."

"అయితే చెయ్యి."

ఇప్పటికి రోలూ, రోకలీ మూడుసార్లు తోమాడు శ్రీకాంతుడు. "రోట్లో ఏమేం వెయ్యాలో చెప్పు. లేకపోతే పచ్చడి ఎలా తయారుచెయ్యగలను?"

"పచ్చడి తయారుచేశావులే మహా! వచ్చికూర్చో" అన్నాడు హరి. నవ్వలేదు, పెట్టలేదు.

"అయితే పచ్చడి లేదన్నమాట! అరే, ఎలా మరి?"

"పచ్చడి చెయ్యను. రొట్టెలే పేలుస్తాను. తవారేకు ఇలా ఇవ్వు."

శ్రీకాంతుడు వెంటనే లేచి తవారేకు పట్టుకొచ్చి ఇచ్చాడు. "పప్పు అయిపోయిందా?"

"అయిపోయింది."

"రొట్టెలు నేను చాల పసందుగా తయారుచెయ్యగలను."

"అలాగేం? అయితే నువ్వేచెయ్యి."

శ్రీకాంతుడు ఇంత అమాయకంగా ప్రవర్తించటం చూస్తోంటే హరిప్రసన్నుని మనస్సు మెత్తపడిపోయింది. లోలోపల కోపంగాని, కాఠిన్యంగాని ఏమన్నా ఉంటే

మాయమైపోయాయి. 'శ్రీకాంతుడు తా నడిగిన నూరురూపాయలూ ఇవ్వకుండా తప్పించుకోటం అతని వశం కాని పని' అని హరిప్రసన్నుడికి తోచింది. ఒకవేళ తనకు ఆ నూరు రూపాయలూ లభించకపోయినా శ్రీకాంతునిమీద హరిప్రసన్నుడికి కోపం ఒక్కనాటికీ రాదు.

శ్రీకాంతుని సాధుస్వభావం చూస్తోంటే హరిప్రసన్నుడికి ఒకరకమైన భయంకూడా కలిగింది. అందరియెడలా అనుకూలంగా వీచే వాయువుపట్ల స్పర్థ ఎవరికి ఉంటుంది? కత్తి తీసుకుని ఎవరు తలపడతారు? తలపడితేమాత్రం కత్తి వాయువును ఖండిస్తుందా? అటువంటి వస్తువుముందు కత్తి పదును ఏం పనిచెయ్యలేదు. దేన్ని అయినాసరే నరికి పారేయగల కరకుకత్తి సరళస్వభావాన్ని హింసించలేదు. దాని పదును, తీక్షత అక్కడేం పనికిరావు. అహంభావం అక్కడ నీరుగారిపోతుంది. ఉద్రేకంకూడా ఇక్కడ, తన బెదిరింపు నిరర్థకమై, తానే బెదిరిపోతుంది. ఇక్కడ తన అశక్తత తెలుసుకుని పరితపిస్తుంది. ఇక్కడే శక్తికి హద్దు. దంభం ఇక్కడ జారిపోతుంది. దర్పం ఇక్కడ మోకరిల్లి నమస్కారం చేస్తుంది.

హరిప్రసన్నుని మనస్సు ఒక నిరర్థకమైన బరువుక్రింద సంకుచితమైపోతుంది. సంకుచితతత్వంలోనుంచే అహంకారం, భయం ఉత్పన్నమాతాయి.

"ఏం? నువు అజేయుడివా? విజేతవా నువు? అధముడివిరా! వట్టి అధముడివి" అని లోపల్నుంచి ఎవరో తన్ను తూలనాడుతున్నట్టుగా ఉంది హరిప్రసన్నుడికి.

భోజనాలైనాయి. శ్రీకాంతుడు కచేరీకి బయలుదేరాడు. "నువు నాకు నూరు రూపాయలు ఇస్తావు; ఆ సంగతి నాకు తెలుసు. కాని ఇంకా అయిదారు రోజులు నన్ను ఈ యింట్లో ఉండనిస్తావుకదూ! నీకు అన్నపానాదుల్లో ఏమీ లోటు రాకుండా నేనుండి కనిపెట్టిచూస్తూంటాను. ఈ సంగతి వదినెగారితో వెళ్ళి చెప్పు. ఆమె అప్పుడే తొందరపడి రానక్కర్లేదు. అయిదారురోజులుండి నేను వెళ్ళిపోతాను. అప్పుడామెగారు రావచ్చు. ఈలోగా నీకు సర్వసేవలూ చేయటానికి నేను ఉన్నానని చెప్పు."

"హరీ!..." అన్నాడు శ్రీకాంతుడు. అని అక్కడ ఆగిపోయాడు. హరిప్రసన్నని ముఖంలోకి స్థిరంగా చూచాడు. "అదేం మాట హరీ! ఏమన్నావు?"

హరిప్రసన్నడు కొంచెం విచలితుడైనాడు. కాని వెంటనే తన్ను తాను సంబాళించుకున్నాడు. "నువు ఇక్కడ ఒంటరిగా ఏమి ఇబ్బంది పడుతున్నావో అని ఆమెగారు ఆతృతపడుతూ ఉండవచ్చు. అటువంటి ఇబ్బందీ ఏమీ లేదని నాతరఫున నువు ఆమెకు నచ్చజెప్పమంటున్నాను. అందుమూలాన... తాను ఇక్కడికి తొందరపడి రావలసిన అవసరం లేదని ఆమె గుర్తిస్తే... అది తప్పేం కాదుకదా!"

శ్రీకాంతుడు అతనివైపు ఇంకా స్థిరంగానే చూస్తున్నాడు. "హరీ! ఆమె ఈ సాయంత్రానికే వచ్చేస్తుంది ఇక్కడికి. నీకు కావలసిన డబ్బు రావలసిందికూడా ఆమె దగ్గరనుంచే. నన్నుగురించిన చింత ఆమెకు సహజం. అది ఆమె పని. అది ఆమె జీవితంలో ఏనాడూ మరచిపోదు.

అది ఆమె వ్రతం; ఉపాసన. ఈ వ్రతంతోపాటు నిన్ను గురించిన బాధ్యతకూడా భరించగల సామర్థ్యం ఆమెకు ఉండదని నే నిప్పు డెలా అనుకునేది? గాభరాపడబోకు, ఆమెను రానీ... (నవ్వుతూ) నీ పాకచాతుర్యం, చీపురుకట్ట రోగం వొదిలిపోతాయి. నువు హాయిగా విశ్రాంతి తీసుకో, విశ్రాంతి."

అసలే కలతగా ఉన్న హృదయానికి దెబ్బకూడా తగిలినట్లయింది హరిప్రసన్నుడికి. "రూపాయలసంగతి ఆమె గారితో చెప్పావేమిటి?" - కంపితస్వరంతో అడిగాడు.

"చెప్పకపోతే కాలవ్యాపన అవదూ?"

"ఇస్తుందా? ఆవిడే ఇస్తుందా?"

"లేకపోతే ఇంకెక్కడనుంచి తేగలనూ?"

హరిప్రసన్నుడు ఏదో ఆలోచిస్తున్నవాడులా ఉండి పోయాడు. అన్యమనస్కుడులా "సరేలే" అని గొణిగాడు.

"సాయంత్రం కచేరీనుంచి దబ్బునే వస్తాలే. నీకు ఇంకేమన్నా కావలసినవి ఉన్నాయా?"

"ఏం అక్కర్లేదు. సాయంత్రానికి నా బొమ్మకూడా పూర్తిఔతుంది దాన్ని చూచావా అసలు?"

"ఇప్పుడు చూస్తేమాత్రం నా కేం అర్థమౌతుంది? సాయంత్రానికి అంతా పూర్తిఅయాక చూచినా... అప్పటికి దాన్ని అర్థంచేసుకోగలుగుతానో, లేదో!" అంటూ శ్రీకాంతుడు వెళ్ళిపోయాడు.

C. P. BROWN
MEMORIAL LIBRARY
Acc. No 1220

## 27

వంటయిల్లు సర్ది హరిప్రసన్నుడు మళ్ళీ బొమ్మదగ్గర వచ్చి కూర్చున్నాడు. ఎంత టైము అయిందో, బయట ఏమి జరుగుతోందో అతనికేమీ తెలియదు. పూర్తిగా బొమ్మ గీయటంలో నిమగ్నుడై ఉన్నాడు. రెండైంది, మూడైంది, సూర్యాస్తమయంకాబోతోంది. మధ్యమధ్య రెండుచేతుల్లో తల పట్టుకుని లేచి నిల్చుంటాడు; కాసేపు పచార్లు చేస్తాడు; కాగితం ముక్కలు చించి అవతలా ఇవతలా పారేస్తాడు; ఒక్కొక్కప్పుడు కళ్ళుమూసుకుని శూన్యంగా కూర్చుంటాడు—ఇవన్నీ చిత్రం గీయటంలోని ప్రక్రియలే అనుకోవాలి.

ఉండగా ఉండగా కళ్ళు సరిగా కనిపిస్తూన్నట్టు లేదు. అప్పుడు తెలిసింది అతనికి: సందెవేళ అయిందనీ, గదిలో వెలుతురు తగ్గిపోతున్నదనీ. అప్పుడు తాను లేచి నిల్చుని పచార్లుచేస్తూ, విశ్రాంతి తీసుకుంటున్నట్టుగా తోచింది. వెంటనే బటన్ నొక్కి లైటు వేశాడు. బొమ్మముందు వచ్చి కూర్చున్నాడు. దానివైపే చూస్తూ గీస్తున్నాడు.

ఇంతలో బైట ఏదో కోలాహలం జరుగుతున్నట్టు వినిపించింది. రానురాను ఆ కోలాహలం వీధివసారాలోకి కూడా ప్రాకివచ్చింది. అయితే అది అప్రియమైన కోలాహలంగా లేదు. ఆనందకరమైనదిగానే తోచింది. కిలకిల నవ్వులూ వినిపిస్తున్నాయి. కాని ఇదంతా తన పనికి విఘ్నకారిగా కనిపించింది హరికి. విసుక్కుంటూ కోపంగా బయటికి వచ్చాడు. వదినెగారు వస్తోంది. ఆమె వెంట సత్యకూడా ఉంది. అతనికిక

కాళ్ళు ఆడలేదు. నేలకు అతుక్కుపోయాయి. వెనక్కు తిరిగి పారిపోదామనుకున్నాడు. కాని చాతకాలేదు. సునీత సాగి వచ్చేస్తూనే ఉంది. ఆమె వెనుకనే మెట్లన్నీ ఎక్కి శ్రీకాంతుడు కూడా ప్రత్యక్షమైనాడు. అతనికి ఒక చేతిలో ఏదో సంచి ఉంది; రెండో చేతిలో ఒక పొట్లం పట్టుకున్నాడు. అందరకీ వెనకాల ఒక నౌకరు కూడా వస్తున్నాడు. వాడి నెత్తిన పెద్ద మూట ఒకటి ఉంది.

"నమస్తే!"

హరిప్రసన్నుడుకూడా నమస్తేలాంటి మాట ఒక రకంగా గొణిగాడు. అప్రయత్నంగా తల వంచాడు; చేతులు కూడా జోడించినట్టే ఉంది.

నమస్కారంచేసి సునీత కొంచెం ఆశ్చర్యపడకపోలేదు. ఆమె వెనకాలే ఉన్న సత్య ముఖకవళికలో "నాకు చాత నైనట్టు నేనూ 'నమస్తే' చెప్పేశాను. మీకు చాతగాక పోతే నాకూ చాతకాదు. నేను 'నమస్తే' అని బిగ్గరగా అరిచే దాన్ని కాదు" అని పలుకుతున్నట్టుగా కనిపించింది. అక్క గారి నీడలోనే నడచి వస్తోంది. "నేనూ నమస్కారం చేసేశా లెండి" అని పలుకుతున్నట్టుగా.

సునీతకు ఆశ్చర్యం కలిగిందంటే... కలగదూ మరి? అది నిజంగా హరిప్రసన్నుని రూపమేనా? అరె, చాల విచిత్రంగా ఉంది సుమీ! పైగా ఈ మహాశయుడు నిద్ర పోతున్నట్టున్నాడే! కళ్ళనిండా కలలే తూలిపడుతున్నాయి. పైగా నుదుటిమీద ఆ చెమట ఏమిటి?

"కులాసాగా ఉన్నారా ?" దగ్గరకు వచ్చాక సునీత అడిగింది.

జవాబు ఏదో గొణిగాడు హరిప్రసన్నుడు. కాని తనపై తనకే కోపం వచ్చినవాడులా ఉన్నాడు.

శ్రీకాంతుడుకూడా చేరువకు వచ్చాడు. "మాటాడవేం, హరీ! చిత్రం గీయటంలో మునిగిపోయి ఉన్నావు కాబోలు! అలాగే కనిపిస్తున్నావులే...సత్యా! ఈ సంచీ, పొట్లం తీసుకుపోయి జాగ్రతచెయ్యి. క్రిందపడేసేవు సుమీ!"

సత్య తొట్రుపాటుగా వచ్చి, సంచీ, పొట్లం అందుకుని, మాటాడకుండా తిరిగి వెళ్ళిపోయింది.

"ఓ రామదయాల్! ఇలా తీసుకురా!" అని కేక వేసింది సునీత. నౌకరు రామదయాల్ మూట తలమీద పెట్టుకుని సునీత చూపిన చోటికి తీసుకుపోయాడు.

అందరూ తనముందునుంచే వెళ్ళిపోయారు. హరిప్రసన్నుడుకూడా తనగదిలోకి వెళ్ళిపోడానికి రెండడుగులు వేశాడు. ఇంతలో శ్రీకాంతుడు అడ్డం వచ్చి "ఎక్కడికీ వెడుతున్నావు? కాస్త అలా తిరిగివద్దాం రా, వాకిట్లో బండికూడా ఉంది. పోదాం రా" అన్నాడు.

"ఉహుం, నేను రాను" అన్నాడు హరిప్రసన్నుడు దృఢంగానే.

"ఇంట్లో ఏం తోస్తుంది ? చక్కని సంధ్యాసమయం. పోదాం రా."

"నేను రానుగాని; ఒకమాట చెబుతాను, వింటావా?" అంటూ హరిప్రసన్నుడు తలవంచుకుని పఠనమందిరంవైపు

సాగాడు. శ్రీకాంతుడుకూడా వెనకాలే వెళ్ళాడు. పఠన మందిరంలో ప్రవేశించాక హరిప్రసన్నుడు తలవంచుకునే ఇలా అన్నాడు: "శ్రీకాంత్! సాయంత్రానికల్లా నూరు రూపాయలు నేనొకడికి ఇచ్చెయ్యాలి. అతను వస్తాడు. తప్పకుండా ఇస్తానని అతనికి మాట యిచ్చాను."

"హరీ!" అంటూ శ్రీకాంతుడు అతని ముఖంలోకి చూస్తూ నిల్చిపోయాడు.

హరిప్రసన్నుడు తాను సగం పూర్తిచేసిన చిత్రాన్ని వేలెత్తి చూపిస్తూ "చూచావా ఆ చిత్రం! పూర్తి అయాక దాని విలువ నూరు రూపాయలకన్నా ఎక్కువే ఉంటుంది. ఆ విషయం నేను గ్యారంటీగా చెప్పగలను" అన్నాడు.

శ్రీకాంతుని కనుబొమలు ముడుచుకుపోయాయి. "ఎవరతను?" అని అడిగాడు.

"ఎవరో నాకూ తెలీదు. ఒక దళంలో సభ్యుడు. నమ్మదగిన మనిషే. డబ్బు అతనికి అవశ్యం అందించి తీరాలి. లేకపోతే దళం తలపెట్టిన కార్యం నిలిచిపోతుంది."

"నేను కాసేపు అలాపోయి తిరిగివస్తాను, సెలవిస్తావా? కాస్త హాయిగా గాలి పీల్చి వస్తాను."

హరిప్రసన్నుడు అసమంజసమైన పరిస్థితిలో పడ్డాడు. "మరి నా సంగతి?"

"మళ్ళీ ఇప్పుడే వచ్చేస్తాగా!"

"కాని అతడు ఈలోగానే వస్తాడేమో!"

"ఎప్పుడు వస్తాడూ?"

"ఏ నిమిషంలోనైనా రావచ్చు."

"నేను ఒక్క గంటలోపలనే తిరిగి వచ్చేస్తాను."

"శ్రీకాంత్ !" — శ్రీకాంతుడు ప్రదర్శిస్తున్న వైఖరికి హరిప్రసన్నుడు చకితుడైనాడు.

"వాకిట్లో బండి నిల్చి ఉంది" అంటూ, శ్రీకాంతుడు ఒకసారి హరిప్రసన్నుని చెయి తన చేతిలోకి తీసుకుని, గట్టిగా నొక్కి విడిచిపెట్టాడు. "నాకిప్పుడు గాలి కావాలి; చాల అవసరం. క్షమించు. ఇప్పుడే వచ్చేస్తాను. ఇంట్లో మీ వదినె ఉందిగా!" అంటూ వెళ్ళిపోయాడు.

హరిప్రసన్నుడు దిగాలుపడి కూర్చున్నాడు. అతడు రాగానే డబ్బు ఇచ్చెయ్యాలి. తప్పదు. డబ్బు తాను తుచ్ఛవస్తువుగా పరిగణిస్తాడు. కాని ఇప్పుడు అది దొరకటమే కష్టమైపోయిందే! హరిప్రసన్నుడికి కోపం రాసాగింది. ఇంకాసేపటికి ఆ కుర్రవాడు వస్తే ఏం చెప్పాలి? 'డబ్బు దొరకలేదు; ఇంకా ప్రయత్నంచేసి చూస్తాను' అని చెప్పాలా? ఛీ-ఛీ!

ఆగదిలో అటూ ఇటూ పచార్లు చెయ్యసాగాడు.

...డబ్బు దొరకలేదు; కాబట్టి దేశానికి సంబంధించిన ఒక కార్యం ఆగిపోవలసిందేనా? ఎవడి పని వాడికి సాగిపోతూనే ఉందే! అటువంటప్పుడు దేశం పని మాత్రం ఎందుకు ఆగిపోవాలి? నూరు రూపాయలంటే ఏమంత గొప్ప సంపత్తి? ఒకవంక దేశానికి సంబంధించిన ఒక కార్యం ఆగిపోతూ ఉంటే...అందుకు కావలసిన నూరు రూపాయలూ ఒక పెద్దమనిషి జేబులో అనవసరంగా ఎందుకు నిలవఉండాలి?

ఇంతకూ సమయానికి నూరు రూపాయలూ దొరక్కుండా పోవలిసిందేనా? ఉహూ౦, అలా జరగటానికి వీల్లేదు. ఎలాగైనా సంపాదించాల్సిందే.

చాలసేపు అటూ ఇటూ గదిలో వేగంగా పచార్లు చేశాడు. బుర్రలో ఆలోచనలు తీవ్రంగా సాగిపోయాయి. చివరకు గదిదాటి బైటికి వచ్చాడు. ఇందాక సునీత, సత్య వెళ్ళిన గదివైపు నడిచాడు. ఆ గదిగుమ్మందాకా పోయి అనుమానిస్తూ అక్కడే ఆగిపోయాడు. లోపలికి వెళ్ళలేదు. ఇక్కడినుంచే కేకవేసి పిలుద్దామా? వద్దా? లేకపోతే సరాసరి లోపలికే వెడదామా ? — అని ఆలోచిస్తూ నిల్చున్నాడు. ఇంతలో సత్య వచ్చింది లోపలనుంచి. ఆమె హరిప్రసన్నని చూచింది. చూచి విస్మితురాలైంది. "వదినెగారు లోపల ఉందా? ఏం చేస్తోంది?" అని అడిగాడు హరిప్రసన్నడు.

సత్య జవాబేమీ చెప్పకుండానే లోపలికి పారిపోయింది.

అప్పుడు ఎక్కడలేని ధైర్యమూ తెచ్చుకొని హరిప్రసన్నడు గుమ్మంలోనుంచే కేకవేసి పిల్చాడు: "వదినగారూ!..."

మరికాసేపటికి సునీత లోపలనుంచి వచ్చింది. "నన్ను పిల్చారా? ఏమిటి? ఎందుకూ?"

ఆమెను చూడగానే క్షణంసేపు అతడు... తానెందుకు వచ్చిందీ సర్వం మరచిపోయాడు. ఉపోద్ఘాతం ఎలా ఆరంభించాలో తోచలేదు. ప్రస్తావన ఆవశ్యకతే స్ఫురించలేదు.

"నాకు నూరు రూపాయలు కావాలి వదినగారూ" అని ఒక్కసారిగా వెళ్ళబెట్టేశాడు.

గడపవద్ద నిలబడి సునీత అతనివైపు అలానే చూస్తూ ఉండిపోయింది. చివరకు అడిగింది : "ఇప్పుడే కావాలా ?"

"ఇప్పుడే, ఎనిమిది గంటలలోగా. శ్రీకాంత్‌నూ అడిగాను. మిమ్మల్నీ అడుగుతున్నా. ఇవ్వలేకపోతే వొదిలెయ్యండి. ఇవ్వగలిగితేమాత్రం ఇప్పుడే ఇచ్చెయ్యండి. మీకు ఆశ్చర్యం కలగవచ్చు. ఒక పనికోసం ఆ డబ్బు కావాల్సివచ్చింది. ఆ పని ఆగిపోతగింది కాదు."

"మావారు ఎక్కడున్నారు ?"

ఆ ప్రశ్నతో హరిప్రసన్నడికి లోలోపల కోపం వచ్చింది. ఏ విషయం వచ్చినా 'మావారెక్కడున్నారూ?' అని ఈవిడ అంటుంది. 'మా ఆవిడను కనుక్కుంటా'నని శ్రీకాంతుడు అంటాడు. ఏమిటీ గొడవ ? "బయటికి షికారు వెళ్ళాడు" అన్నాడు ఆమె ప్రశ్నకు జవాబుగా.

"నేను రెండు నిమిషాల్లో వచ్చి మాట్లాడతాను. మీరు పదండి."

"అలాకాదు. ఈ నిమిషాన్నే, ఈ క్షణాన్నే అంతా తేలిపోవల్సిందే. మీకు ఎన్ని పనులుంటే యేంగాక! అవన్నీ మానేసి నామాట ఎందుకు వినిపించుకోరూ ?" అని ఖచ్చితంగా అడిగేద్దామనే అతని ఉద్దేశం. కాని పైకేమీ అనలేదు. అక్కడినుంచి కదలిపోనూలేదు.

"మీరు పదండి; నేను ఇప్పుడే వస్తాను. రాత్రి అంతా మీరు మేలుకునే ఉన్నారటగా; విన్నాను. ఆబొమ్మ కూడా నేను చూడాలి."

హరిప్రసన్నుడు అక్కడనుంచి కదిలిపోయేట్టు కని పించ లేదు.

సునీత చిరునవ్వు నవ్వింది. నిజంగా నే నిప్పుడే వచ్చే స్తాను; మీరు పదండి. అందులో మీకింద ఖర్చు అయేది ఒక్క పైసాకూడా ఉండదు; ఆసంగతి నాకు బాగా తెలుసు. అటువంటప్పుడు నేను మీకు ఆ డబ్బు ఇవ్వకపోయినా... అందులో విచారించవలసిన విషయం ఏమీ లేదు."

"నాది ఏదో, నాది కానిదేదో తెలియజెప్పండి. నాది కాదగినడబ్బు...నూరుకాదు, ఒక్క రూపాయికూడా మీదగ్గర లేదనే నేను అనుకోనా?"

"అటువంటి విషయాలు వారితో చర్చించండి. వారు మీకు మిత్రులు. అటువంటి చర్చకు నేను యోగ్యు రాలను కాదు. మీరు పదండి; నేను వస్తాను. నిస్సందే హంగా ఒక్క పైసాకూడా అవసరానికిమించి నా దగ్గర లేదు. 'నా దగ్గర' అంటే వారి దగ్గర అన్నమాటే 'నాది' అంటూ వేరే నా కేముంది? (తన కుడి మణికట్టుమీదికి జారిపడుతూన్న రెండు బంగారు గాజులు చూపి) ఈ గాజు లున్నాయి, తీసుకుంటారా?"

హరిప్రసన్నుడు దబ్బున ఓడిపోయే మనిషి కాడు. కాని ఎదుట ఉన్న కోట నాలుగువైపులా దుర్గమంగానే

ఉంది. ఈ స్థితిలో విజయం సాధించటానికి మార్గం ఏది? అన్నాడు : "మీరు వస్తానన్నారు కదూ!"

"ఔను, ఇప్పుడే వస్తాను."

—హరిప్రసన్నుడింకా అక్కడినుంచి కదలక ముందే సునీత వెనక్కు తిరిగి మాయమైపోయింది. లోపల సత్య సామానులన్నీ ఎక్కడి వక్కడ సర్దుతోంది ప్యాకెట్లూ, వస్తువులూ సర్ది పెడుతూ ఏదో పనిలో ఉంచి మొత్తానికి. అక్కగారు రావటంతోనే "ఏమైంది అక్కా!" అని అడిగింది.

"ఏం లేములే"

సత్య తనలో తాను 'హుం' అనుకుంది.

"చేతిలో పని దబ్బున చెయ్యి. ఇంకా అన్నం వండాలి. వినిపిస్తోందా నేను చెప్పేమాట; - ఈలోగా నేను వెళ్ళి నీ ట్యూషన్ విషయం తేల్చుకుని వస్తాను. ఆ పని అలా ఉండనీలే. వంటింట్లోకి పోయి నిప్పురాజెయ్యి ముందు. నే నిప్పుడే వస్తాను మళ్ళీ" అన్నది సునీత.

సత్య గప్‌చిప్‌గానే ఉంది. కాని లోలోపల 'హుం హుం' అన్న శబ్దాలు మాత్రం పొంగి పొరలుతున్నాయి.

"నీకు తొందరే లేదేమే! ఇక్కడినుంచి కదలవాయేం? ఇక్కడే ఉంటావా? అరె, ఈ సామాను విడిచిపెట్టి నువ్వు వంటింటి పనులు చూడు వెళ్ళి. ఇవన్నీ నే నిక్కడ సర్ది పెడతాలే" అన్నది సునీత మళ్ళీ.

"నేను ఆయన దగ్గర చదువుకోను."

సునీత నవ్వింది. "ఆసంగతి ఆలోచిద్దాంలే... ఇవాళ పరోటాలు చేద్దాం, చాలదూ?"

ఈ మాటలసందర్భంలో సత్య చేతులు పని చెయ్యటం ఆపేసి ఊరికేనే ఉన్నాయి. అప్పుడు సునీత గబగబా ఆ వస్తువులన్నీ ఎక్కడి వక్కడ చక్కగా సర్ది పెట్టింది. ఆ పని ముగిశాక హరిప్రసన్నని గదిలోకి వెళ్ళేందుకు బయలు దేరింది. "సత్యా! నేను వెడుతున్నాను. వంట ఆలస్యం కాకూడదు; తెలిసిందా" అని హెచ్చరించింది.

"నీకు ఇప్పుడేమన్నా అవసరమైన పని ఉందా అక్కా" - బిగ్గరగా అడిగింది సత్య.

సునీత నవ్వింది. "ఔను, పనే ఉంది."

సత్య తనలో తాను మళ్ళీ "హుఁ" అనుకుంది.

## 28

జీవనవిధానం రెండు పద్ధతులుగా ఉంటుంది. కొందరు అడుగడుగునా సవిమర్శగా, సవిచారంగా వెడుతూ ఉంటారు. మరికొందరు ఈ విచార-విమర్శనలను పొట్లంకట్టి జేబులో పెట్టేసుకుని, వాటి అవసరం లేకుండా సహజధోరణిలో సాగి పోతూ ఉంటారు. ఆంగ్లభాషలో 'సెల్ఫ కాంషస్' అనే శబ్దం ఒకటి ఉంది. చేతనాశక్తి మనలో చక్కగా సమీా హితమై యథాక్రమంలో పనిచేస్తూ ఉండాలి. అలా గాక అది ఒక చోట గడ్డకట్టుకుపోయి 'కాంప్లెక్సుగా' తయారై మాటిమాటికీ లోపలనుంచి ఎగిరెగిరి పడుతూ ఉంటే... అది ఆరోగ్యచిహ్నంకాదు. మానవునికిహృదయం, బుద్ధి ఉన్నాయి. అందువల్ల విమర్శన, విచారం... అప్పు డప్పుడు ఆగిపోతూఉన్నా... మామూలుగా సాగిపోతూనే ఉంటాయి. కాని ఈ విచార - విమర్శనలలో 'అహం'

ఎక్కువగా ప్రవేశించిందంటే ... అది చాల బాధకరం ఔతుంది. దీన్నే 'సెల్ఫ్ కాంషస్' అంటారు. ఈ పరిస్థితిలో మానవుని వ్యవహారంలో సరళస్వభావం లుప్తమైపోతుంది. అడుగడుక్కీ మిక్కిలి సవిచారంగా, సవిమర్శగా ముందుకు సాగిపోతూ ఉండాలన్న పద్ధతిలో ఈ 'అహం' ప్రవేశించే అవకాశం ఉండనే ఉంది. కాబట్టి ఆ రెండో పద్ధతే...విచార విమర్శనలమీద ఆధారపడకుండా, వాటి ప్రమేయం పెట్టుకోకుండా సహజంగా సాగిపోతూ ఉండే పద్ధతే...అంత భారమైంది కాదు; పైగా ప్రియమైనది.

సునీత సరాసరి పఠనమందిరంలోకి వచ్చేసింది. ఎక్కువగా తనలో తాను తర్కించుకోటానికీ, విమర్శించుకోటానికీ ఒక్క నిమిషంకూడా వినియోగించలేదు.

హరిప్రసన్నుడు ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతనికేమీ పాలుపోవటంలేదు. ఒక కలహానికి తన్ను తాను సిద్ధపరచుకుంటున్నాడు. చిత్రంకేసి చూస్తూ కూర్చున్నాడు; కాని చిత్రంలోని భావమేకాదు, దాని స్వరూపంకూడా అతనికి కనిపించటంలేదు. అతని మనస్సు ఎక్కడో దూరాన ఉంది.

"నేను రావటం ఎక్కువ ఆలస్యం కాలేదనుకుంటాను" - అన్న మాటలు వినిపించాయి. అప్పుడు హరిప్రసన్నుడు మామూలు ప్రపంచంలోకి వచ్చాడు.

హరిప్రసన్నుడనీ, సునీత అనీ పేర్లు పెట్టాం. నిజానికి వాళ్ళ పేర్లు అవే. కాని అవి పేర్లు మాత్రమే. సునీత స్త్రీ. హరిప్రసన్నుడు పురుషుడు. పైకి వినిపించే ఈ పేర్ల అడుగున

ఒక వ్యక్తి స్త్రీ; రెండో వ్యక్తి పురుషుడు. మన నిత్యవ్యవహారంలో పేర్లుపెట్టి పిలుస్తుంటాం, వరసలు కల్పించుకుంటాం, కాని మానవుని హృదయంలో లోతులకు పోయినప్పుడు అవన్నీ పై పొరలలోనే మాయమైపోతాయని తెలుసుకుంటాము. లోతుకు పోయాక అనుకుంటాము: 'అరె, ఈమె కేవలం స్త్రీ, అంతే; చూచావా, మంచిదనీ, చెడ్డదనీ, 'క' అనీ 'ఖ' అనీ ఏమేమో అనుకున్నాం. ఇంతకూ ఈవిడ నీకు మల్లేనే, నాకు మల్లేనే ఉంది సుమా.' మానవజాతి అనేక సంజ్ఞలద్వారా, విశేషణాలద్వారా, సర్వనామాలద్వారా తన ప్రాపంచిక వ్యవహారం సాగించుకుపోతూ ఉంటుంది. ఇవన్నీ ప్రథమతః రెండేరకాలు: ఒకటి-స్త్రీ, రెండు పురుషుడు. కుటుంబం, పరివారం తరువాత వచ్చేవి. చుట్టాలు - పక్కాలు, పేర్లు-గోత్రాలు, మతాలు-కులాలు, జాతులు - సంప్రదాయాలు — అన్నీ తరువాత వచ్చేవే. సునీత సునీతే; హరిప్రసన్నుడు హరిప్రసన్నుడే. ఆసంగతిమాత్రం మనం మరచిపోకూడదు. సునీత అనే పేరులో ఇమిడియున్న వ్యక్తిత్వంలో అంతర్వాహిని స్త్రీయే. అట్లే రెండో పేరు కూడా ఒక ముసుగే; ఆ ముసుగులో ఉన్నది పురుషుడే. ఈసంగతికూడా మనం మరచిపోకూడదు.

భార్యాభర్తలు, ప్రేమికాప్రేమికులు, మాతాపుత్రులు, అన్నాచెల్లెళ్ళు—ఇలా ద్వంద్వసమాసాలు పలుకుతాం. ఆ సంబంధబాంధవ్యాలు ఉన్నాయి; లేకపోలేదు. స్త్రీ పురుషులమధ్య యుక్తాయుక్తాల్ని పురస్కరించుకుని ఏర్పడిన సంబంధాలకు మనం పెట్టిన పేర్లు అవి. కాని సర్వత్రా ఒక్క-

విషయంలోమాత్రం సామ్యం కనిపిస్తుంది. ఎక్కడ చూచిన స్త్రీ పురుషులమధ్య పరస్పరం ఆంశిక సమర్పణ, లేదా అంశిక స్పర్ధ ఉండితీరుతుంది. ఒకరొకరికి ఉన్ముఖులై, ఒక రిలో ఒకరు కలిసిపోదామన్న కోరిక ఉంటుంది. అన్ని సంబంధాల్లోనూ, అన్ని సంబంధాలబయటా కూడా ఇదే కని పిస్తుంది. ఒకరి కొకరిమీద విజయం సాధించాలన్న తహ తహ ఉంటుంది; అంతేకాదు, ఒకరి కొకరి చేతిలో ఓడి పోవాలన్న తాపత్రయమూ ఉంటుంది. ఒకరు మరొకర్ని జయించవచ్చు; కాని ఆ మరొకరికోసం తాను చచ్చిపోవ టానికికూడా సిద్ధపడవచ్చు. ఒకరు మరొకరికోసం త్యాగం చేయాలన్న కాంక్ష ఎంత తీవ్రంగా ఉంటుందో, ఆ యిద్దరి మధ్యా స్పర్ధ కూడా అంత తీవ్రంగానే ఉంటుంది. స్త్రీ పురు షులమధ్య ఈ రెండు విరుద్ధభావాలూ ఇరుపక్షాలా సమంగా ఉంటాయి. ఈ సమంగా ఉండటం... ఆ యిద్దరూ భాగ స్వాములు కాబట్టికాదు; ఇద్దరూ ఎవరి వ్యక్తిత్వ పరిపూర్ణ తకు వారు ఉన్ముఖులై ఉంటారు కాబట్టే. ఎక్కడ ఆ ఇద్దరి వైరుధ్యముగాని, సమైక్యతగాని సిద్ధి పొందుతుంతో... ఆ విస్ఫోటక మహాతత్వంకోసం—అరె, ఏం పదం అది? మరింకే పదం ద్వారా దాన్ని వ్యక్తంచెయ్యాలి...

ఇక మన కథ కానిద్దాం—

"నేను రావటం ఎక్కువ ఆలస్యం కాలేదనుకుం టాను." అంటూ సునీత వచ్చింది. ఆ మాట విని హరి ప్రసన్నుడు మామూలు ప్రపంచంలోకి వచ్చాడు. తివాచీ

మీద కూర్చున్నవాడు లేచాడు. ఒక కుర్చీ పట్టుకొచ్చి వేశాడు. "కూర్చోండి" అన్నాడు.

సునీత కుర్చీలో కూర్చుంది. హరిప్రసన్నుడు మరో కుర్చీకూడా తీసుకొచ్చాడు. కాని తానందులో కూర్చో లేదు. దానివెనకాల ముంజేతులు రెండూ మోపి వంగి నిల్చున్నాడు.

సునీత అతన్ని కూర్చోమనలేదు. కూర్చోమని చెప్పాలనికూడా ఆమెకు తోచలేదు. "నేను మళ్ళీ వంట చెయ్యాలి పోయి. ఎక్కువ వ్యవధానంకూడా లేదు; క్షమించండి. మీకు డబ్బు ఇంత అవసరంగా ఎందుకు కావల్సి వచ్చిందో నేను అడగవచ్చా?" - అన్నది సునీత.

"మీ రా మాట అడగకూడదు."

ఆదిలోనే వ్యవహారం ముదిరేటట్టు కనిపించింది. అయినా సునీత జంకలేదు. "ముదిరితే ముదరనీ" - అనుకుంది. "నే నివ్వనని నిరాకరించకూడదు కూడానా?"

"ఇవ్వటానికి ఇష్టం లేకపోతే మీరు తప్పకుండా నిరాకరించవచ్చు."

"డబ్బు అవసరాలు తీర్చే వస్తువు. దాన్ని ఊరికే చీకట్లో విసిరిపారేస్తారా ఎవరైనా?"

"నేను చీకటిని కాదే - సశరీర వ్యక్తిని, నాకెందు కివ్వకూడదూ?"

"ఇవ్వాల్సిన బాధ్యత నాకేమీ లేదుకాబట్టి."

"బాధ్యతా?"

"చిత్తం. బాధ్యతే. నాకేం బాధ్యతో చెప్పండి."

"మరి ఏబాధ్యత పురస్కరించుకుని నువు నాకు వదినె వైనట్టు? ఆ సంగతి చెబుతావా ?"

"అవసరం వచ్చినప్పుడు ఎందుకు చెప్పనూ? వదినెను కాబట్టే ఇవ్వనని చెబుతున్నాను. బిచ్చగాళ్ళకెప్పుడన్నా నేను 'లేదు' అని చెప్పానా ?"

"అయితే నా మంచిచెడ్డలు, పుణ్యపాపాలు కూడా నువ్వే ఆలోచిస్తావన్నమాట !".

"ఎందు కాలోచించకూడదు ?"

"చాలు-చాలు, నేను ఆటవస్తువును కాదు."

"కావు, నాకు తెలుసు." సునీతకు నవ్వొచ్చింది.

హఠాత్తుగా హరిప్రసన్నుడికి ఆవేశం వచ్చింది. ఒక దుర్ధర్షమైన భావానికి లొంగిపోయాడు. చకచకా కుర్చీ వెనుకనుంచి ఆమె ముందుకు వచ్చాడు. ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు. "చూడు, వదినా, నువు వదినెవై తే నాకేం పరవాలేదు. ఏదో తేల్చి చెప్పెయ్యి. ఇంకాసేపటికి ఒక కుర్రవాడు ఇక్కడికి వస్తాడు. ఈ సాయంత్రానికి నే నతనికి వందరూపాయలూ ఇస్తానని మాట యిచ్చాను. అతడొక దళంలో సభ్యుడు. ఆదళంలోని వాళ్ళంతా దేశంకోసం ప్రాణాలర్పించటానికి సిద్ధంగా ఉన్నవాళ్ళే. డబ్బు ఇవ్వటానికి నీకు ఇష్టంలేదు కాబట్టి నా మాట అబద్ధం అయిపోవల్సిందేనా? వాళ్ళ పని నిల్చిపోవల్సిందేనా ?

"ఔనౌను, అందుకు కాబట్టే! మాట యిచ్చింది నేను కాదుగా !"

"కాని నేను మాట యిచ్చాను. ఇప్పుడు నీముందు ఉన్నాను."

"అది నీ వ్యవహారం... మరి నాకు పని ఉంది; వెడతాను" అంటూ సునీత లేచింది. హరిప్రసన్నుడు చటుక్కున చెయిచాచి ఆమె మణికట్టు పట్టేశాడు.

"ఎక్కడికి పోతావు, కూర్చో!"

చెయి వదిలించుకోటానికి సునీత ఈషణ్మాత్రమూ ప్రయత్నించలేదు. ఆమె ముఖం వివర్ణమైంది; భయంచేత కాదు, నిర్లక్ష్యభావంవల్ల. అతనివైపుచూస్తూ నిల్చొంది.

"సునీతా!" అన్నాడు హరిప్రసన్నుడు.

'సునీతా!' - అని అతడు పిల్చింది అది ఆమె పేరు అనికాదు; ఆ పదంలోని అన్వయార్థాన్ని పురస్కరించుకునే—'ఓ... స్త్రీ!'

'సునీతా!' - అని పిలుస్తూనే అతని పంజా ఆమె మణికట్టు మీాదనుంచి సడలిపోయింది.

సునీత మంచుగడ్డలా అయిపోయింది. అతని కన్నుల్లోకి సూటిగా చూస్తూ "హరిబాబూ! ఏమిటీ రభస!" అని అడిగింది.

కాని ఆమెగారి అధికారస్వరం ముందు హరిప్రసన్నుని బిగువు తేలిగ్గా జారిపోయేటువంటిది కాదు. "వదినా, నిన్ను నువు అన్యాయం చేసుకోలేవు - కఠినురాలివి కాలేవు. నేనుకూడా నిన్ను కాఠిన్యం వహించనివ్వను. కాఠిన్యం పొందడానికి కాదు - నువు వదినవయింది. నువు నాకు రొట్టెలు పెట్టినట్టుగానే రూపాయలుకూడా ఇస్తావు - ఇవ్వాలి. ఒక్క-

వందరూపాయలు నీచేతిలోనుంచి పెకలి బయటికి రాలేక పోవడం నేను చూడగలనా? — సహించగలనా? లేదు వదినా, అలా ఎన్నటికీ జరగనివ్వను. అలా జరగడానికి ముందుగానే, వదినా, నా ప్రతిమను నాశనం చేస్తాను - నన్ను నాశనంచేసుకుంటాను. ఆ పరిస్థితిమాత్రం నా కళ్లతో చూళ్లేను. రూపాయలంటే యేమిటి? అది ధాతువుకాదూ? మట్టికాదూ? ఎక్కడ నిలిచిపోతే అక్కడ మైలనే పెంచు తుంది. దాన్ని పరిత్యజించడంలోనే కృతార్థతఉంది. దాన్ని వదలడానికేనా నువు ఇంతగా నిరాకరిస్తున్నావు, సంకోచి స్తున్నావు, ఇంతగా పట్టుకు పాకులాడుతున్నావు! అరె, చివ రికి అది నీ మృత్యువుతో సమానం కాదూ? నేను దాన్ని మృత్యువుకి ఎంతమాత్రం తక్కువగా భావించలేను."

"నాకు పని ఉంది అవతల."

"సునీతా!" హరిప్రసన్నని కంఠస్వరం రోషం తోనూ, కరుణతోనూ... మెరుపువలె...కంపించింది.

"నేను వెడుతున్నాను - వెళ్ళాలి..."

"సునీతా!"

"వెళ్ళిరానా?"

హరిప్రసన్నని ముఖం కళావిహీనమైపోయింది. నిస్తే జుడైనాడు. మొదలునరికిన చెట్టులాగా కుర్చీలో దభీలున కూలిపడ్డాడు. "వెళ్ళు" అన్నాడు.

సునీత మేలిముసుగు సవరించుకుంటూ వెళ్ళిపోయింది.

## 29

హరిప్రసన్నుడు కుర్చీలో కూలబడి ఉన్నాడు. నిశ్చేష్టుడై ఉన్నాడు. వెళ్ళిపోయిన సునీత మళ్ళీ తిరిగివచ్చింది. "మీతో ఒకమాట చెప్పటం మరచిపోయాను. సత్యను ఇప్పుడే మీదగ్గర చదువుకోటానికి పంపిస్తాను. ఈమాట ముందుగా మీతో చెప్పాల్సిన అవసరం కనిపించదు; అయినా..."

హరిప్రసన్నుని ఓటమి చూచి సంతోషించి అంతటితో ఊరుకోవటం లేదే ఈవిడ. ఇంకా ఏడిపించాలనుకుంటోందా? కత్తిపెట్టి కోసి గాయంచేసి, దానిమీద ఉప్పు రాయాలని వచ్చిందా? "నన్ను ఈ విషయంలో క్షమించండి." అన్నాడు హరిప్రసన్నుడు.

"అంటే...సత్యను చదువుకోటానికి రావద్దంటారా? ఆమె నాతోకూడా ఇంటిదగ్గర్నుంచి ఎందుకు వచ్చిందనీ?"

హరిప్రసన్నుడు పైకి చూచాడు. ఈ వచ్చిన సునీత బలవంతురాలు కాదు; కఠినురాలు కాదు; తనచేతిలో చిక్కిపోడానికే వచ్చిందనుకున్నాడు.

"ఆమెకు చదువు చెప్పవలసిన బాధ్యత నాకేం లేదు"- అన్నాడు.

"బాధ్యతా?"

"చిత్తం, బాధ్యతే. నాకేం బాధ్యతో చెప్పండి."

"సత్యతో మీరేమీ పోట్లాడ లేదుగా!"

"పోట్లాడలేదు. కాని నన్ను క్షమించి విడిచిపెట్టండి."

"సత్యను ఇప్పుడే ఇక్కడికి పంపిస్తాను. మాటాడించి చూడండి"- అంటూ సునీత వెళ్ళిపోయింది.

హరిప్రసన్న ఆ మాట విని ఊరుకున్నాడు. తన మాటే తనకుగాని ఇతర్ల మాటే చొరనీదే! తనదే పై చేయిగా వెళ్ళిపోతూ ఉంటుంది ; ఈవిడ ఎవరనీ ?

సునీత వంటింట్లోకి వెళ్ళింది——కాని ఈలోగా ఒక చిన్న దొంగపని జరిగింది. చెప్పాలి:

హరిప్రసన్నడితో మాటాడేందుకు సునీత శయన మందిరంలోకి వచ్చాక...కొంతసేపటికి సత్య వంటింట్లోకి వెళ్ళింది. పొయ్యి అంటించి తాను వంటచెయ్యాలిగా ! భోజనం తయారుచేయవలసిన పనిలో రెండు మూడు విష యాలు తక్షణం అక్కగారిని అడిగి తెలుసుకోవలసిన పరి స్థితి ఏర్పడింది. కాని ఆమెదగ్గరకు వెళ్ళి అడగటానికి సాహ సంలేక అక్కడే ఉండిపోయింది. కాని సునీత ఎంతసేపటికీ రాకపోయేసరికి, ఇక లాభంలేదని బయలుదేరింది. జంకుతూ జంకుతూ శయనమందిరం గుమ్మందాకా వచ్చింది. అంత వరకే వచ్చింది ; అక్కడే ఆగిపోయింది. రామరామ! లోప లికి ఎలా వెడుతుంది? అక్కడే ఉండి, లోపల వారిద్దరి సంభాషణ అంతా వింటోంది. ఆ మాటలన్నీ వినాలని ఆమెకు కుతూహలమా యేమిటి ? లోపలినుంచి వారి సంభా షణలోని ప్రతి అంశమూ - అపభ్రంశమూ వచ్చి, వాటం తట అవే చెవుల్లో దూరుతున్నాయి. ఆమె కాళ్ళు నేలకు అతుక్కుపోయాయి; అలాగే నిల్చుండిపోయింది. లోపల వాళ్ళ కంఠస్వరం తీవ్రమౌతూ వచ్చింది. చివరకు హరిప్రస

న్నని కంఠం ఒక్కసారిగా పైకి లేచి..."ఆగు, ఎక్కడికి వెడతావు?" అని గద్దించటం వినిపించగానే సత్య 'అమ్మ బాబోయ్' అని కేకవేసి వంటింట్లోకి పారిపోయింది.

కేకవేసిందని చెప్పాం. ఔను నిజంగానే కేకవేసింది. కాని ఆ కేక గుండెలోనుంచి బయలుదేరి కంఠందాకానే వచ్చి అక్కడే ఆగిపోయింది; బయటికి రాలేదు. అలా ప్రరుద్ధమై ఆ కేక లోలోపలే కొట్టుమిట్టాడింది. ఆ కేకను లోలోపలనే భరించి సత్య తిరిగి వచ్చేసి వంటపనిలో నిమగ్న అయింది.

సునీత వంటింట్లోకి వచ్చింది. "సత్యా! ఎంతవరకు వచ్చింది వంట. పొయ్యి అలా మండిపోతుంటే కూర తాలింపు వెయ్యరాదూ! అరె, కూర ఇంకా తరగనేలేదే! ఏం చేస్తున్నావే మరి ఇందాకటినుంచీని?"

సత్యమీద సునీతకు కోపం ఎప్పుడూ లేదు. ఉన్న ప్రేమే అలా పొంగుగా ప్రకటమౌతూ ఉంటుంది.

"నేను ఊరికే కూర్చోలేదక్కా! ఏదో చేస్తూనే ఉన్నా..."

"ఊఁ, చేస్తూనే ఉన్నావులే. లేచి కత్తిపీట పట్టుకురా, నేను చేసుకుంటాను అంతా" అంటూ సునీత కూరగాయల బుట్ట తెచ్చుకుంది. వెదకి కత్తిపీటకూడా తానే తెచ్చుకుంది. కూర తరుగుతూ కూర్చుంది. "సత్యా! నువు చదువుకునే పుస్తకాలుకూడా తెచ్చుకున్నావుకదూ!"

"ఒకటి తెచ్చాను."

"ఒక్కటి చాల్లే. ఆ పని మానేసి పుస్తకం పుచ్చుకుని వెళ్ళు. ఆయన ఇప్పుడు ఖాళీగానే ఉన్నారు; చదువు చెబుతారు."

"ఊహుఁ. నేను వెళ్ళను." అని చెబుదామని సత్య ఉద్దేశం; కాని ఆ మాట పైకి చెప్పలేకపోయింది.

"లేచి పోవేమే, సత్యా !"

ఏమిసమాధానం చెప్పటానికీ సత్యకు పాలుపోవటం లేదు. "నా కన్నీ వచ్చులే, ఆయనదగ్గర చదువుకోనక్కర్లేదు" అని చెబుదామా అనుకుంది. "ఆయనదగ్గరకు వెళ్ళటం చదువుకోటానికి కాదు; బలి అవటానికి" అనికూడా చెబుదామనుకుంది; కాని ఏమీ చెప్పలేదు. మాటాడకుండా కూర్చుంది.

"సత్యా ! నేనేం చెబుతున్నానే ! వినిపిస్తోందా ?"

సత్య మూతిముడుచుకుని లేచింది; వెళ్ళింది. గదిలోకి పోయి పుస్తకం బైటికి తీసింది. అందులోనుంచి మధ్యలో పది పన్నెండు పేజీలు ఇవతలకు లాగి, చించి అవతల పారేసింది. ఇక అదిపుచ్చుకుని పఠనమందిరంలోకి వెళ్ళింది.

హరిప్రసన్నుడామెను చూడేలేదు. ఆమె చాల చేరువకే వచ్చింది. అయినా ఆతడు ఈ ప్రపంచంలో లేడు. ఏదో ఆలోచనలో మునిగి ఉన్నాడు.

"నన్ను మా అక్కయ్య పంపించింది" అన్నది సత్య.

ఈమాటలు చెవిని పడటంతోనే అతడు ఉలికిపడ్డాడు. ఈ దుర్ఘటనకు అతడు సంసిద్ధమై లేడు. గాభరాపడి లేచి నిలుచున్నాడు.

"ఆఁ, ఔను, రండి-రండి" అని నాలుగు మాటలు గబగబా అనేశాడు. ఏం చెయ్యాలో, ఎలా మాట్లాడాలో అతని కేమీ తోచలేదు.

"చదువుకోటానికి పంపించింది" నంగినంగిగా పలికింది సత్య.

హరిప్రసన్నుడు చేతులు నలుపుకుంటూ విన్నాడు. "చిత్తం, కూర్చోండి, చదువుకోటానికా ? నేను — కూర్చోండి."

సత్య పోతవిగ్రహంలా కుర్చీలో కూర్చుంది.

హరిప్రసన్నునిపట్ల ఇది ఎంత అన్యాయం! ఎంత మోసం! ఇంత అవమానమా? తాను ఏమరుపాటున ఉన్నప్పుడు ఇలా వచ్చిపడిన ఈ పరిస్థితిని ఎలా తట్టుకోటం ? 'వదినె' అనే పేరుతో ఆవిడ ఎటువంటి వ్యూహం పన్నిందీ!

"నన్ను చదువుకోటానికని పంపించిందండీ!"

"చిత్తం, కూర్చోండి-కూర్చోండి, తమరు - తమరు నాకు అయిదారు నిమిషాలు వ్యవధానం ఇవ్వండి."

"నేను వెళ్ళిపోనా?"

"వద్దులెండి, కూర్చోండి, నేను—చూడండి—"

సత్య కిప్పుడు బాగా తెలిసిపోయింది. పరిస్థితి తాననుకున్నంత ఘోరంగా ఏమీ లేదు. తానిక్కడ ఒక బలి పదార్థంగా భావించుకోవలసిన పనిలేదు. పరిస్థితి తనకు మించిందేమీ కాదు. తనకు అదుపులో ఉండేదే. తన ఆజ్ఞకు లోబడేదిలాగే ఉంది. హరిప్రసన్నుడన్న పేరు గల ఈవ్యక్తి పరిస్థితిని సంబాళించలేకపోతున్నాడు. కావలిస్తే తాను

సంబాళించగలదు. ఈయన ఇంతమాత్రం మనిషేనా! ఈయన్ను చూచి తాను భయపడాల్సిన అవసరమే లేదు. దేశదేశాలూ తిరిగే వట్టి నిరుపద్రవమైన ప్రాణి! శాంతంగా స్థిరంగా ఎందుకని ఉండడో? సర్వం పోగొట్టుకున్నవాడులా అలా ఉంటాడేం?

"ఇప్పుడు మీరు చదువు చెప్పరా? మళ్ళీ రానా?"

"మళ్ళీనా?—ఔనౌను. మీరు మళ్ళీ ఎప్పుడేనా వస్తే బాగుంటుంది. కాని నేను చదువు చెప్పగలనని అనుకోటం పొరపాటు. నేనేం చదువు చెప్పగలనూ?"

సత్య పెద్దపెరిగిన స్త్రీ కాదు. ఇప్పటికీ కన్య అనే చెప్పాలి. అయినా కూడా ఈ పురుషుని నిస్సహాయస్థితిపై దాడిచేసి జయం పొందకుండా ఉండలేకపోయింది. ఇప్పుడిప్పుడే అక్కయ్య ఇక్కడికి వచ్చి వెళ్ళిన సంగతి ఆమెకు తెలియదా?

"మళ్ళీ ఎప్పుడు రమ్మంటారూ?" అని అడిగింది.

"ఎప్పుడా? చదువుకోటానికేనా? అది కష్టమేనే!"

"మీరు వద్దంటే రాను; మానేస్తాను."

ఇంతసేపు మాటలు సాగినతరువాత హరిప్రసన్నుడికి కాస్త ఆందోళన తగ్గింది. వచ్చి మెల్లిగా కుర్చీలో కూర్చున్నాడు. "సరే, పుస్తకం ఏదీ, కాస్త చూడనీయండి. నాకెంతవరకు తెలుసునో యేమిటో!" అంటూ చెయి చాచాడు. సత్య పుస్తకం ఇచ్చింది.

పుస్తకంలో పేజీలు చించి పారెయ్యటం అనవసరమైన పనే అని సత్యకు తోచింది. చించిన కాగితాల పుస్తకం

చాటున ఈ వ్యక్తినుంచి తన్ను తాను రక్షించుకోవలసిన అవసరం ఏమీా లేనేలేదు.

"పుస్తకం అంతా చినిగేపోయిందే. ఇది ఇక్కడ ఉంచి వెళ్ళండి. ఒకసారి చూస్తాను : నే నెంతవరకు చెప్ప. గలనో యేమిటో."

"ఎన్నాళ్ళు చూస్తారూ ?"

హరిప్రసన్నుడిని అడుగడుక్కీ విపరీత పరిస్థితే ఎదురొట్కొంటోంది. "ఎన్నాళ్ళా ? ఆలోచిస్తాను. త్వరలోనే చూస్తాను."

"రేపు సాయంత్రం మళ్ళీ నేను వస్తాను. ఈలోగా చూచెయ్యండి, బాగుంటుంది."

"అలాగే, ఈలోగానే చూస్తాను."

చదువు వ్యవహారం ఇంతటితో ముగిసింది; కాని సత్య మనస్సులో ఏదో ఉంది. అందుచేత అక్కడే కూర్చుంది; లేచి వెళ్ళలేదు. వంటింట్లో నాలుగైదు రొట్టెలు ఒక గిన్నెలో మూతపెట్టి ఉండటం ఆమె ఇందాక చూచింది. అవి పల్చగా, అందంగా, బాగున్నాయి. అంత కళాత్మకంగా వాటిని తయారుచేసినది ఈ వ్యక్తియేనేమో తెలుసుకోవాలని ఆమెకు చాల కుతూహలంగా ఉంది. ఇతడే తయారుచేసి ఉన్నట్టయితే— నిజంగా చాల విచిత్ర వ్యక్తి యని చెప్పాల్సిందే. ఆ విషయమే తేల్చుకోటానికి యుక్తి ఏమిటా అని ఆలోచిస్తూ అక్కడే కూర్చుంది.

సంభాషణ సాగింది—

...మీరు చదువుకుంటున్నారా! ఇంటర్ రెండో యేడా? బాగుంది. నే నెక్కడెక్కడ ఉంటూఉంటానా? దానికి ఒక నిర్ణయం లేదు. స్థిరనివాసం ఇంతవరకు ఎక్కడా ఏర్పరచుకోలేదు. ఏర్పరచుకోవాలా? ఎందుకూ? అంతా సవ్యంగానే నడుస్తోంది. విధి చాల బలీయం. దానితో యుద్ధంచేసి లాభం ఉండదు...ఔను, నాకు చాల పనులు తెలుసు. నెలల కొద్దీ రొట్టెలు తయారుచేస్తూ ఉండేవాడిని.

ఇలా సంభాషణ సాగిపోయింది కొంతసేపు. మాట వెంబడి మాట...సంభాషణ సహజంగానే సాగింది. ఇద్దరి మధ్యా సంకోచంగాని, సందేహంగాని రాలేదు. ఇంతలో శ్రీకాంతుడు వచ్చాడు. అతనిముఖం కాస్త గంభీరంగా ఉన్నా ప్రసన్నంగానే ఉంది. హరిప్రసన్నునివద్ద సత్య కూర్చుని ఉండటం చూడగానే అతని గాంభీర్యం మాయమై పోయింది. "Well done హరీ! పిల్ల చదువు ఎంతవరకు ఉందో చూచావా?" అన్నాడు.

శ్రీకాంతుడు రావటంతోనే సత్య కుర్చీలోనుంచి దూకేసి వెళ్ళిపోతోంది. అప్పుడు శ్రీకాంతుడు ఆమె మెడ మీద చెయి వేసి ఆపాడు. "ఇలా రోజూ చదువుకోటానికి వచ్చావంటే నీకు ఫస్టుక్లాసు రాకుండా ఎవరు అడ్డగలరు? వెడతావేం? కూర్చో."

సత్య మాటాడలేదు; కూర్చోనూలేదు, వెళ్ళి పోయింది.

తరువాత కొంతసేపు శ్రీకాంతుడు హరిప్రసన్నుడు ఒకరి నొకరు మౌనంగా చూచుకుంటూ కూర్చున్నారు. ఇద్దరి

మధ్యా కాస్త సత్య ఉంటేనే బాగుండేది. కాని ఆమె లేదుగా! ఏమిమాట్లాడాలో తోచక ఇద్దరూ అలాగే కూర్చున్నారు... మౌనంగానే.

రానురాను ఈ మౌనం భారంగా తోచింది. "ఇప్పుడే వస్తా ఉండు" అంటూ శ్రీకాంతుడు వెళ్ళిపోయాడు.

ఇంతవరకూ శ్రీకాంతుడు ఏం చేసినట్టు! ఏమీ చెయ్యలేదు. మనస్సుకు ఏవిధమైన ఆలోచనా రానీకుండా శాంతంగా కాసేపు తిరిగి వచ్చాడు, అంతే. బండి ఎక్కి ఊరి బయట పార్కులోకి వెళ్ళాడు. అక్కడ గడ్డిమీద కూర్చు న్నాడు కొంతసేపు. బండివాడిని వెళ్ళిపొమ్మన్నాడు. గడ్డి మీద మంచుబిందువులా అక్కడే... ఆకాశం మీద పరిగిడు తూన్న మబ్బులీన్ని, అందమైన చంద్రబింబాన్ని చూస్తూ... ఒక అరగంటసేపు ఉన్నాడు. మనస్సు ఎటుపోతే అటు పోని చ్చాడు; తానేమీ దాన్ని అడ్డగించలేదు. చిత్తం ఎలా ఆడితే అలానే ఆడనిచ్చాడు. బుద్ధి ఎక్కడ లీనమౌతూంటే అక్కడే లీనం కానిచ్చాడు. పైన మబ్బులు పలుముఖాలుగా సంచలిస్తున్నాయి. సుస్థిరంగా చంద్రబింబం ప్రకాశిస్తోంది. తనలోకూడా అనేక కోరికలు, ఆకాంక్షలూ గుబురుగుబు రుగా భ్రమిస్తూనే ఉన్నాయి. తానుమాత్రం వెన్నెట్లో సుస్నాతుడై, వెన్నెలలాగే చల్లగా, ముకుళించిన పువ్వులాగ, ఆనందమయమైన ఒక స్వప్నపు తునుకలా స్థిరంగా కూర్చొని ఉన్నాడు. చాలసేపు తన ప్రాణాల్ని వెన్నెట్లో స్నానం చేయించి కుదుటపరచుకున్నాడు. అదివరకల్లా చెదరియున్న

ట్లున్న అంతస్సుకు హాయి చేకూరింది. అప్పుడు లేచి తిన్నగా ఇంటికి వచ్చేశాడు.

ఇంతే అతను చేసింది. మనస్సు విచారవిమర్శనల నుంచి విముక్తి పొందింది. ఈ పద్ధతిద్వారా తన్ను తాను పరిశుభ్రపరచుకోగలిగాడు. శాంతి లభించింది. హృదయం సదాశయపరిపూర్ణమైంది.

అతడు సునీత దగ్గరకు వెళ్ళాడు. అప్పటికి వంటంతా పూర్తి అయింది. అతన్ని చూడగానే "ఎక్కడికి వెళ్ళారు? వంటైంది; భోజనానికి వారూ, మీరూ రావచ్చు" అన్నది.

"సత్య ఏదీ?"

"ఏమో! అక్కడ చదువుకుంటోంది కాబోలు!"

"అక్కడినుంచి వచ్చేసిందిగా!"

"ఎక్కడో ఉంటుందిలెండి. అతనితో చెప్పండి, ఇద్దరూ భోజనానికి వచ్చెయ్యండి."

"అతనికి పైకం కావాలని చెప్పానుకాదూ! ఇంకా ఇవ్వవేం? సూరి చాల బాధపడుతున్నాడు దాన్నిగురించి."

"ఔను. ఇవ్వండి. కాని నాదగ్గర రొక్కం ఏమీ లేదు. చెక్కు రాసి ఇవ్వండి."

"అతనికి ఈ డబ్బు ఎందుకో కనుక్కోవల్సిందే నంటావా?"

"అక్కర్లేదులెండి. ఎందుకైతే మనకేం? మనకు మాత్రం ఆ పట్టుదల ఎందుకూ? మనమేం వ్యాపారం చెయ్యటంలేదుగా! ఈ డబ్బుకు బదులుగా మనకు సరైన ప్రతిఫలం లభిస్తుందా లేదా అన్న అనుమానంతో అన్ని విష

యాలూ పరీక్షగా తెలుసుకోటానికి? మీరిద్దరూ చప్పున భోజనానికి వచ్చెయ్యండి. ఇదిగో చూడండి: ఆవిషయం ఎక్కువగా అతనితో తర్కించకండి.''

శ్రీకాంతుడు తిరిగి వచ్చాడు. హరిప్రసన్నుని ముందు ఒక యువకుడు కూర్చుని ఉన్నాడు. సిపాయి దుస్తులు ధరించి ఉన్నాడు. సుమారు ఇరవై యేళ్ళ వయస్సు ఉంటుంది. శ్రీకాంతుడు వచ్చి హరిప్రసన్నుని భుజంపై చెయివేసి "ఒక మాట!" అంటూ అవతలకు తీసుకుపోయాడు. "చెక్కు రాసి ఇస్తాను. సరేనా? నూరు రూపాయలు రొక్కం లేదిప్పుడు" అన్నాడు.

హరిప్రసన్నుడు స్తబ్ధుడై శ్రీకాంతునివైపు చూస్తూ ఉండిపోయాడు. "కావలిస్తే చెక్కు ఇప్పుడే రాసి ఇస్తాను' అన్నాడు శ్రీకాంతుడు.

"ఇవ్వు" అన్నాడు హరిప్రసన్నుడు స్థిరస్వరాన.

"అయితే రా" అంటూ శ్రీకాంతుడు హరిప్రసన్నుని తన ఆఫీసుగదిలోకి తీసుకుపోయి నూరురూపాయలకు చెక్కు రాసి ఇచ్చేశాడు.

చెక్కు చేతిలో పుచ్చుకుని హరిప్రసన్నుడు కాసేపు అలాగే నిల్చున్నాడు. చివరకు "ఇకపోదాం, రా" అన్నాడు.

"నేను కాసేపు ఇక్కడే ఉంటాను. నువు ఈలోగా నీ పని కానిచ్చుకుని సిద్ధంగా ఉండు. వంటైంది, భోజనాలకు చప్పున రమ్మంటోంది మీ వదిన."

"నీతో పని ఉంది."

శ్రీకాంతుడుకూడా హరిప్రసన్ననితోసహా పరనమంది రంలోకి వెళ్ళాడు. ఆ యువకుడు అక్కడే ఉన్నాడు. "ఈ యన నా మిత్రుడు - శ్రీకాంతుడు" అంటూ హరిప్రసన్నడు యువకునికి పరిచయం చేశాడు. శ్రీకాంతుడు చూస్తూండ గానే చెక్కును యువకునికి ఇచ్చేశాడు. ఇచ్చి "వీరికి నమ స్కారం చెయ్యి" అన్నాడు.

యువకుడు శ్రీకాంతునికి నమస్కారంచేశాడు. శ్రీకాంతుడు మరేమీ మాటాడలేదు.

"ఇక వెళ్ళిపో. వీళ్లైనంతవరకు మళ్ళీ ఇక్కడికి రాబోకు" అన్నాడు హరిప్రసన్నడు అది ఒక అనుల్లంఘనీయమైన ఆజ్ఞగా ధ్వనించింది. యువకుడు వెళ్ళిపోయాడు. అతడు గడపదాటి బయట అడుగు పెట్టాడోలేదో, డాబామీద నుంచి సత్య "చంద్రసేన్ !" అని పిల్చింది.

యువకుడు వెనక్కు తిరిగి చూచాడు. వెంటనే ముఖం తిప్పేసుకుని, జంకుగొంకులతో మెట్లుదిగి గబగబా వెళ్ళిపోయాడు.

## 30

సత్య ఆ యువకుని పేరుపెట్టి పిల్చినప్పుడు హరిప్రస న్నడు చకితుడైనాడు. శ్రీకాంతుడుకూడా చాల ఆశ్చర్య పడ్డాడు. కాని ఇద్దరిలో ఎవరూ ఏమీ మాటాడలేదు. శ్రీకాంతుడు మెల్లిగా లేచి గదిలోనుంచి బయటికి వచ్చాడు. డాబామీదికి వెళ్ళాడు. "ఇక్కడేం చేస్తున్నావు సత్యా నువు !" అని అడిగాడు.

"ఏంచెయ్యటం లేదు బావా! ఊరికేనే వచ్చా ఇక్కడికి."

"ఇప్పుడిక్కడికి వచ్చివెళ్ళిన అబ్బాయిని నువ్వు ఎరుగుదువా?"

"ఎందుకెరుగనూ? మా కాలేజీలోనే చదువుకుంటున్నాడు."

"అతన్నిగురించి నీకు ఇంకేమన్నా తెలుసా?"

"అంతకన్నా నాకు ఇంకేం తెలియదు."

చూడగానే పేరుపెట్టి బిగ్గరగా కేకవేసి పిల్చిన సత్యాకు అతని పేరు తప్ప మరింకేమీ తెలియదంటే నమ్మి ఊరుకోవలసిందేనా? ఒకవేళ ఆమెకు అతన్ని గురించి ఇంకా ఎక్కువగా ఏమన్నా తెలిసి ఉన్నా—అది బయటికి రావటం ఎలాగా?

"నీ క్లాసేనా అతడు చదివేదికూడా?"

"ఔను. మాక్లాసే అతడు కూడా."

"సరే అయితే. వెళ్ళు, అన్నం తిను పో. ఇవాళ హరిప్రసన్నుడిదగ్గర ఏమన్నా చదువుకున్నావా?" ప్రేమగా అడిగాడు శ్రీకాంతుడు.

"చదువుకోలేదు."

"చదువుకోవా అతని దగ్గర?"

"నే నామాట ఎప్పు డన్నాను బావా!"

"సరేలే పో. పోయి మీ అక్కయ్యతో చెప్పు: మేము భోజనానికి వచ్చేస్తున్నామని."

హరిప్రసన్నుడు ఖైదీలాగ అక్కడే కూర్చుని ఉన్నాడు...ముందున్న మేజామీద రెండు మోచేతులూ ఆనించి, అరచేతుల్లో ముఖం వాల్చుకుని. శ్రీకాంతుడు డాబా మీదనుంచి దిగి వచ్చాడు; భోజనానికి లెమ్మని పిల్చాడు. హరిప్రసన్నుడు అప్పుడు లేచాడు. కాళ్ళు కడుక్కోమన్నాడు శ్రీకాంతుడు. హరిప్రసన్నుడు కాళ్ళు కడుక్కున్నాడు. ఆ క్రియలోని ఉద్దేశంతో అతనికి పనిలేదా? ఏదో కడుక్కున్నాడు. అన్యమనస్కుడులా వచ్చి పీటమీద కూర్చున్నాడు.

భోజనం చేశాడు. తాంబూలం ఇస్తే వేసుకున్నాడు. శయనమందిరంలోకి వచ్చి పదిహేను నిమిషాలు మౌనంగా కూర్చున్నాడు. ఆతరువాత మళ్ళీ తన చిత్రం పూర్తిచెయ్యటంలో పడ్డాడు.

శ్రీకాంతుడు ఆఫీసుగదిలోకి వెళ్ళాడు. తన పనులేవో చూచుకుని పదిగంటలప్పుడు తిరిగి వచ్చాడు. "హరీ! ఏదో ఒక్కనాడైతే ఊరుకోవచ్చు. ప్రతిరోజూ ఇదే వరసైతే ఎలా సహించటం? నిద్రపోవలసినప్పుడు పడుకుని నిద్రపోవేం? ఇకలే - ఆ పని మానేసి...పైన పక్కవేశారు పద!" అన్నాడు.

"పైనా? ఎందుకూ? ఇక్కడే పడుకుంటాలే."

"కాదులే పద; కాగితాలూ అవీ అన్నీ తీసెయ్యి."

"శ్రీకాంత్! నాగోడవ ఎందుకు పెట్టుకుంటావు నువు. నేను ఇక్కడే పడుకోగలను. నే నిక్కడ సుకుమారంగా కాలక్షేపం చెయ్యటానికి వచ్చానా మరి!"

"ఇక్కడే పడుకుంటావా? అయితే సరే; నీ పరుపు ఇక్కడికి తీసుకువస్తానుండు."

"వద్దు భాయీ! వద్దు. ఈ తివాచీ చాలు. కుర్చీ కాస్త అవతలకు జరిపానంటే నా పక్క ఏర్పడిపోతుంది. దీనికి పెద్ద హంగామా ఎందుకూ?"

"చూడుహరీ! ఇంకొకరి యింటికి వెళ్ళినప్పుడు ఆ యింటి పద్ధతు లనుసరించటం నేర్చుకోవాలి నువ్వు."

ఆమాట తనకు అంగీకారం కాదన్నట్లుగా హరి ప్రసన్నుడు నవ్వాడు. "ఈ యిల్లు ఇంకొకరిదని నువ్వు అనుకుంటున్నావేమో కాని శ్రీకాంత్ ! నేనుమాత్రం అనుకోటంలేదు. ఇంకొకరిదేనని నే ననుకోవాలని నీ ఉద్దేశమూ లేకపోతే?"

"ఇక నీ యిష్టం" అంటూ శ్రీకాంతుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. హరిప్రసన్నుడు మళ్ళీ చిత్రలేఖనంలో మునిగిపోయాడు. చిత్రంగీస్తూ కూర్చుంటే అతనికి రాత్రి రాత్రిగా ఉండదు; పగలు పగలుగా ఉండదు. కాలజ్ఞానం పూర్తిగా లుప్తమైపోతుంది. హృదయంలోని ఒకానొక అనిర్దిష్టమైన బాధకు రూపకల్పన చెయ్యాలన్న ప్రయత్నంలో పూర్తిగా మునిగిపోతాడు. అభావంలోనుంచి భావాన్ని, శూన్యంలోనుంచి నిండుతనాన్ని సృష్టించాలి. కాగితంమీద చిత్రాన్ని వాయుగుల్మంలాగ గబగబా పెరిగి రానీడు. కొంచెంకొంచెంగా శూన్యాన్ని పూరిస్తూ పోతాడు. ఎన్నాళ్ళ నుంచో హృదయంలో బాధ పెరిగి పెరిగి, పరిపక్వంచెంది, కరిగి కన్నీళ్ళుగా ప్రవహించేసమయంలో... ఆ హృదయానికి

గడియ ఎంతైందో తెలియజెప్పి, ఆ సమాధిలోనుంచి బయటికి లాగి స్పృహ కల్పించటం ఎవరికి సాధ్యమౌతుంది? పరిగెత్తుతూ పయనించే సమయమనే శయ్య వీడి... సర్వాన్నీ విస్మరించి... హరిప్రసన్నుడు చిత్రకల్పనలో మునిగిపోతాడు. అలా మునిగిపోయి ఉండగా చేరువనే ఒక శబ్దం వినిపించింది: "ఈ పాలు కాసిని తాగండి."

అతడు తలెత్తి చూచాడు. పాలగ్లాసు చేతిలో పుచ్చుకుని వదినగారు నిల్చిఉంది.

"పుచ్చుకోండి పాలు."

"పాలా?" అప్రయత్నంగా చెయిచాచి ఆమెచేతిలోని పాలగ్లాసు అందుకున్నాడు హరిప్రసన్నుడు.

"గ్లాసు చాలా వేడిగా ఉందే!"

"ఏం వేడిగా లేదు. నేను ఇందాకటినుంచీ చేతిలో పట్టుకునే ఉన్నాకదూ!"

"కూర్చోండి" అంటూ ఒక కుర్చీ ఆమె ముందుకు నెట్టాడు హరి.

"కూర్చోనా? సరే, రెండు నిమిషాలు కూర్చుంటాను. మీరు ఎంతసేపు మేల్కొనిఉంటారేం? చిత్రం పూర్తి అయేవరకూ నిద్రపోనని ప్రతిజ్ఞా?"

"లేదు; కాని—"

"మీకు పక్క పైన వేయించాను. వెళ్ళి అక్కడ పడుకోరా?"

"ఇక్కడ చాలా చోటు ఉంది."

"మంచిమాటే. మేం మీకు ఏమి సాయమూ చెయ్య లేకపోతున్నాం—నాకు మీ చిత్రం చూడాలని ఉంది. ఇప్పుడు చూపిస్తారా?"

"ఇంకా అన్నీ గీతలే. చూస్తారా?...చూడండి." అంటూ హరిప్రసన్నుడు బోర్డు ఎత్తి పట్టుకున్నాడు. దాని మీది కాగితంలో ఇంకా బొమ్మ బాగా స్పష్టంగా ఉబికి రాలేదు. సునీత చూచింది. "నాకేమీ బోధపడటంలే దీ చిత్రం" అన్నదామె.

"అలాగా!" అన్నాడు హరి.

సునీత కుర్చీలోనుంచి లేచింది. మీరు ఇక్కడే పడుకుంటారన్నమాట! పైన పక్క వేసే ఉంది. మీరు ఎప్పుడుకావలిస్తే అప్పుడు వెళ్ళి పడుకోవచ్చు. మేము-మేము వేరే పడుకుంటున్నాం."

ఈ గుప్తవిషయం ఆమె నోటివెంట అత్యంత సహజంగా వెలువడటం చూచి హరిప్రసన్నుని ముఖం సిగ్గుతో కందగడ్డ అయిపోయింది.

"ఔను, మేం వేరే పడుకుంటున్నాం. మీరు వెళ్ళక పోతే వారు ఒక్కరే ఔతారు...పాలు వేడిగా ఏమీ లేవు; తాగెయ్యండి...అయితే ఇక్కడే పడుకుంటారా? నేను వెళ్ళనా?

"చిత్తం, నే నిక్కడే పడుకుంటాను."

"అయితే సరే; కాని చూడండి; మీరు చాల పొద్దు పోయేవరకూ మేలుకుని ఉండద్దు."

హరిప్రసన్నుడు సమాధానం చెప్పలేదు.

"నమస్తే" అని సునీత మెల్లిగా వెళ్ళిపోతోంది.

హరి క్షణంసేపు వెడుతోన్న ఆమెవైపు చూచాడు. "వదినగారూ! ఒక మాట! మీరు నాకు ఏం భరోసామీద ఆ నూరు రూపాయలూ ఇచ్చినట్టు? చెప్పండి!"

"నూరురూపాయలా? ఎక్కడివి? ఎవరిచ్చారూ?"

"మీరే."

"నేనా?"

"చిత్తం - మీరే"

"అదేమిటీ?"

"నాకు తెలుసులెండి."

"తెలిస్తే మళ్ళీ నన్నడగటం దేనికి?" అంటూ సునీత పోబోయింది.

"ఆగండి వదినా! నన్ను పూర్తిగా చెప్పనీయండి; నేను మీ యిరువురిపట్ల చాల కృతజ్ఞుణ్ణి."

సునీత చటుక్కున ఆగింది. "ఒకమాట నేను అడగ వచ్చా? మీకోసం వచ్చిన ఆ కుర్రవాడు ఎవరు?"

"నే నెరగను. కాని మీసత్యకు తెలుసనుకుంటాను!"

"మీరెరగరా?"

"నే నేమీ యెరగను."

"ఆ నూరు రూపాయల్లో ఒక్క పైసాకూడా మీ స్వంతానికి ఉంచుకోలేదు. మొత్తం అంతా ఆ కుర్రవాడికే ఇచ్చేశాగు. అటువంటప్పుడు మీకు మాపట్ల కృతజ్ఞత ఉండాల్సిన పనిలేదు."

"నేను మీపట్ల కృతజ్ఞతగా ఉండాల్సిన పనే లేదంటున్నారా?"

"ఔను, కృతజ్ఞత ఒక బంధనం లాంటిది. దానికి యాదార్థ్యం లేదు"

హరిప్రసన్నుడు తలగోక్కుంటూ కూర్చున్నాడు. సునీత ఇంకా ఇలా చెప్పింది: "మీరు నన్ను వదినా, వదినా అని ఎక్కువగా పిలుస్తున్నారు. కాబట్టి మన మధ్య కృతజ్ఞత అనే వస్తువు రానేకూడదు. ఇంకో సంగతేమంటే-వదినెమాట ఎప్పుడూ తోసివెయ్యకూడదు. మీరిక్కడే పడుకుంటారా?"

"వదినా! నన్ను క్షమించు. నీ మాట తోసివేయటమంటే నాకూ చాల కష్టంగానే ఉంటుంది. కాని మీరిద్దరూ ఎందుకింతగా నా గొడవ పట్టించుకుంటూ ఉంటారు? నేనందుకు అర్హుడినికాదు. అదీగాక ఈ చిత్రం పూర్తి కాకుండా నాకు నిద్ర ఎలా వస్తుంది?"

"సరే, మీ యిష్టం" అంటూ సునీత వెళ్ళిపోయింది.

సునీత వెళ్ళిపోయాక హరిప్రసన్నుడు వెంటనే తన పనిలో నిమగ్నుడు కాలేకపోయాడు. లేచి కాసేపు గదిలో అటూఇటూ పచార్లుచేశాడు. కాసేపటికి మళ్ళీ చిత్రంముందు వచ్చి కూర్చున్నాడు. అలా ఇంకా ఎంతసేపు కూర్చునిఉండేవాడో తెలియదు. రాత్రి సుమారు పన్నెండు గంటలయేసరికి పైన విద్యుద్దీపం హఠాత్తుగా ఆగిపోయింది అప్పుడతనికి చాల కోపం వచ్చేసింది. కాని పని ఆపుచెయ్యక తప్ప

లేదు. మొదట కాస్త ప్రయత్నించి చూశాడు. మళ్ళీ వెలిగించుకుందాం అని. కాని ఎక్కడ ఏం చెడిపోయిందో, అతని కేమీ ఆ చీకటిలో బోధపడలేదు. ఏంచేస్తాడు? ఆ సామానులమధ్యనే ఎలాగో కాస్త చోటు చేసుకుని పడుకున్నాడు. ఏవేవో ఆలోచనలు వచ్చాయి, పోయాయి. చివరకు కళ్ళ మీదికి నిద్ర వచ్చేస్తోంది. ఆ సమయంలో హఠాత్తుగా మళ్ళీ దీపం వెలిగింది: కాని నిద్రమబ్బు వచ్చేస్తున్న దేమో, అతడు లేవలేదు. మరి రెండునిమిషాలకు మళ్ళీ దీపం దానంతట అదే ఆరిపోయి, గది అంతా చీకటిమయంఅయింది.

ఈ చిలిపితనమంతా సత్యది. అందరూనిద్రపోయారు. పఠనమందిరంలోమాత్రం దీపం దయ్యంలా వెలుగుతోంది. హరిప్రసన్నుడు పనిచేసుకుంటూ ఉన్నాడు. చాలసేపటి వరకూ సత్య ఇదంతా చూస్తూ ధైర్యంగానే పడుకుంది. కాని ఎంతసేపటికీ ఈ మహాశయునికి స్పృహ వచ్చేట్టు కనిపించలేదు. 'ఆయనకు నిద్ర లేకపోతే లేకపోయింది; నాకెందుకు లేకుండా చేసుకోవాలి?' అనుకుంటూ సత్య లేచింది. లేచి చప్పుడు కాకుండా వచ్చి 'మేన్ స్విచ్' బందు చేసేసింది. ఈ 'మేన్‌స్విచ్' పఠనమందిరం బయట ఎక్కడో ఉంది. అప్పుడంతా చీకటైపోయింది. సత్య ఊపిరి బిగబట్టి కాసేపు అక్కడేఉంది. లోపల హరిప్రసన్నుడు కోపంగా చిందులు తొక్కటం ఆమె గమనించింది; లోలోపల చాల ఆనందించింది. మరి కాసేపటికి లోపల గడబిడేమీలేదు. అయ్యగారు ముడుచుకు పడుకుని నిద్రపోతుండాలి అని తేలిపోయింది. అప్పుడు సత్య మెల్లిగా తన పక్కదగ్గరకు తిరిగి

వచ్చేసింది. మంచంమీద పడుకుంది. కాని చేసిన పని మంచిది కాదేమో నని మనసు వ్యాకులపడసాగింది. మరి కొంతసేపయాక ఇలా ఎందుకు చేశానా అని విచారపడ్డది. వెంటనే లేచి మళ్ళీవచ్చి మేన్‌స్విచ్ వొదిలేసింది. పూర్వం లాగ వెలుతురు ప్రవహించింది. కాని లోపల ఆ పెద్దమనిషి లేచి మళ్ళీ పనిలో జొరబడలేదు. ఆయన నిద్రపోయివుంటా డని ఆమె సంతోషించింది. మేన్‌స్విచ్ తిరిగి బందుచేసి మెల్లిగా తనపక్కమీదికి వెళ్ళి పడుకుని నిద్రపోయింది. ఏమిటి ఈ సత్యాదేవి మనోవ్యాపారం?

# 31

ఈ యింట్లో హరిప్రసన్నుడు దాగి దాగి ఉంటు న్నాడు. అందరూ తనపట్ల ఆత్మీయత చూపుతున్నారు; అవ్యాయంగా పలకరిస్తున్నారు. అది అతనికి కష్టంగా ఉంది - అందులో ఏదో ప్రమాదం కనిపిస్తోంది. బిడియపడక తప్పటం లేదు. జంకు, బిడియం అతనికి లేనే లేవసలు. ఇదివరకల్లా ఎక్కడ ఉన్నా, ఎక్కడికి వెళ్ళినా విచ్చలవిడిగా తిరిగే వాడు, సహజధోరణిలోనే ఉండేవాడు. జంకుగాని, బిడియం గాని అతనిలో కనిపించేదే కాదు. కాని ఈ యింట్లోకి వచ్చి నప్పటినుంచీ సిగ్గుసిగ్గుగా ప్రతిదానికీ సంకోచిస్తూ, అనుమా నిస్తూనే ఉంటున్నాడు—అలా ఉండడంలోనే అతనికి రక్షణ కనిపిస్తోంది.

బొమ్మ ఒకటి గీయటం ఆరంభించాడుగా! అస్త మానం అదే ధోరణిలో ఉంటాడు-అందులోనే బంధితుడై

ఉంటాడు. మరింకేవిషయంమీాదికీ మనస్సు పోనీడు. ఇక తన ప్రోగ్రాం ఏమిటీ? తనకే తెలియదు. ఎన్నాళ్ళుఉంటా డిక్కడ? అదికూడా తెలియదు. ఎన్నాళ్ళో ఇక్కడ ఉండి పోడానికి తన మమకారాన్ని ఆకర్షించి, తన్ను కట్టిపడేసి ఉంచే వస్తువు ఏముంది ఇక్కడ? ఏమో!

శ్రీకాంతుడు చాల సాయలాపాయలాగా ఉంటు న్నాడు. హరిప్రసన్నుడుకూడా... ఇది తన యిల్లుగానే భావించి... నిస్సంకోచంగా ఉండాలని శ్రీకాంతుని కోరిక. బిడియపడకుండా సహజ ధోరణిలో ఎలా సంచరించాలో హరిప్రసన్నుడికి బోధపడటంలేదు. తన హృదయంలో కుత్సి తమో, కుటిలత్వమో, ఏదో భయంకరమైన వస్తువు ఉంది. కాబట్టి తాను ఒదిగి ఒదిగి, దాగి దాగి ఉండాల్సిందే. లేక పోతే తనలోని విషసర్పాలు బుసలుకొడుతూ బయటికి వచ్చి విషం కక్కవూ? ఛీ-ఛీ. ఈ చెడువస్తువుల్ని లోలోపల దాచి ఉంచవలసిందే. శ్రీకాంతుడు ఎప్పుడూ తన బాగో గులు విచారిస్తూనే ఉన్నాడు; అతనిభార్య సునీతకూడా తన కెప్పుడేది కావాలో కనుక్కుంటూనే ఉంది. సత్య కూడా అప్పుడప్పుడు మెల్లిగా తనదగ్గరకు వచ్చి తమా షాగా పలుకరిస్తూనే ఉంది. కాని వీరి ఆదరణంతా తన్ను శూలంపెట్టి పొడుస్తున్నట్టుగా ఉంది. ఇంతవరకూ హరి ప్రసన్నుడు ప్రపంచంలో తనకు కావలసిందంతా తానే - జబర్దస్తీగానే - తీసుకొని అనుభవిస్తూ వచ్చాడు. తా నేది పొందినా, ఒకరికి రుణపడిపోయినట్టు ఎన్నడూ భావించ లేదు. దాన్ని తాను పొందటం తన హక్కు అనుకునే

వాడు. ఎక్కడా తలవంచి మెరుగడు. అట్టి పట్టుదలతోనే తాను బలవంతుడైనాడు. ఆ తరువాత ఈ యింట్లోకి వచ్చినప్పటినుంచీకూడా... ఇక్కడ అందరిమీద తన కొక హక్కు ఏర్పడేఉంది. తన ఈప్సితానికి అవరోధం కలిగిస్తున్నవాళ్ళెవరూ లేరు. తనకెవరిమీదా విరోధం లేదు. ఎవరినీ తాను బలాత్కరించి ఏదో జబర్దస్తీగా లాక్కోవలసిన అవసరమూ లేదు. అందుచేత తన స్వాభావిక తీక్ష్ణత బుజ్జగింపులో పడిపోయింది; మందగించిపోతోంది. ఇలా తానీ చిత్రరచనలో మునిగిపోవటం తన ఇచ్ఛాశక్తి సాగుతూ, సచేతనంగా ఉండేందుకే. లేకపోతే ఈ యింట్లో, ఈ పరివారంమధ్య తన యిచ్ఛాశక్తి విశ్రాంతికి అలవాటు పడి, నిద్రపోతుందేమోకూడా.

కాని అలా నిద్రపోనీకూడదు. కర్తవ్యం కఠోరమైంది. మార్గం సుదీర్ఘమైంది. దానికి అంతం ఎక్కడ? చెయ్యాలనుకునేది, చెయ్యాల్సిందీ చాలాఉంది. భవితవ్యాన్ని లాగి బయటికి తీసుకురావాలి. లేకపోతే దానంతట అది తేలిగ్గా బయటికిరాదు. ఈ పోరాటంలో పడ్డవాడికి ప్రమాదాలేమిటి - జడత్వమేమిటి? మోహమేమిటి? పదవోయ్ పద; ముందుకు పద - వేగంగా పద. ఆగబోకు; ఇటు అటు చూడబోకు; ముందుకుసాగిపోతూ ఉండాల్సిందే - అరె, సాగిపోతూనే ఉండాలోయ్ !

కాని లోలోపల కాలసర్పంలా బుసలుకొడుతున్నది, ఏమిటది? దాన్ని బయటికి లాగివెయ్యాలి; చీల్చి అవతల పారెయ్యాలి; ఆతరువాత ఈ చిత్రరచనలో మునిగిపోవాలి.

చిత్రం పూర్తిఅయ్యాక ఇలా అనాలి: "ఓసీ! అక్కడే పడి ఉండు. ఓకీ నగ్నపురుషుడా! ఏమిటి నీ పడికాపులు? ఆ చీకటి స్థూపాన్ని విడిచి రారా! అక్కడంతా చీకటే. నీ పిలుపుకు జవాబేమీ రాదక్కడ. ఈ పాడుపడిన పృథివి వైపు తిరిగిరా. దాన్ని ఫలవంతంచెయ్యి, సస్యశ్యామలం చెయ్యి. ఆ చీకటి గుహాలో లోతులేదు; నీకు చోటు లేదు. ఓరి అభాగ్యుడా! రారా! కర్మక్షేత్రంలో నీకోసం ఎదురు చూస్తున్నారు అక్కడ బలియైపోవటానికా పోయి నిల్చున్నావు? ఇటువైపు రా. వచ్చి జయోపేతుడవు కా; ఊర్జస్వలుడవు కా."

పెన్సిలు, రంగులు, బ్రష్ తీసుకుని హరిప్రసన్నుడు ఆ 'ఓసీ' చిత్రంతో యుద్ధం చేస్తున్నాడు. మర్నాడు రెండు జాములైంది. శ్రీకాంతుడు ఇంట్లో లేడు కచేరీకి వెళ్ళాడు. సత్యకూడా లేదు, కాలేజీకి వెళ్ళింది. పనిపాటలు చేసుకుంటూ సునీత మాత్రం యింట్లో వుంది. హరిప్రసన్నుడు కూడా ఉన్నాడు. కాని అతడు ఇంట్లో లేడు; బొమ్మగీయటంలో ఉన్నాడు. అతనిలో అదే బాధ రేగుతూ వుంది— 'ఓసీ!'. మనస్సంతా గింజుకొని ఆలోచించాడు - ఈ 'ఓసీ'ని సరిగా అర్థంచేసుకోటానికి. మనస్సు సిగ్గుమాలినది; మారాం చేస్తూవుంటుంది. కాబట్టి దాన్ని ఒకవంక కళ్ళెం బిగించే ఉంచాడు. ఈ 'ఓసీ' అనబడేది చిత్రానికి బయట ఎక్కడా వుండకూడదు. దాన్ని చిత్రంలోనే జడస్వరూపినిగా ఉంచెయ్యాలి.

సునీత పనిపాటలు ముగించుకుని విశ్రాంతి తీసుకుని, మూడుగంటలప్పుడు ఫలహారాలపళ్ళెం పుచ్చుకుని అక్కడికి వచ్చింది. "మీ శరీరంమీద మీకే దయ లేకుండా వుందే! ఇవి కాస్త పుచ్చుకోండి" అంటూ ఫలహారాలపళ్ళెం అతని ముందు పెట్టింది.

"కూర్చో" అన్నాడు హరిప్రసన్నుడు. కాని ఎక్కడ కూర్చోవాలో చోటు చూపించలేదు. ఒక కుర్చీ లాగి ఇవతల వెయ్యనూలేదు. కేవలం "కూర్చో" అన్నాడు; అంతే.

సునీత అక్కడే తివాచిమీద... చీర సర్దుకుని కూర్చుంది... పక్కనే ఉన్న కుర్చీ ఆనుకుని. "అవి కాసిని పుచ్చుకోండి. ఇప్పుడు ఎంత టైమైందో తెలుసా ?"

హరిప్రసన్నుడు చేతిలోని బ్రష్ అవతల పెట్టాడు. రంగులు కలిపిన పాత్రలన్నీ అవతలకు నెట్టాడు. చిత్రం రాస్తూన్న బోర్డు ఎత్తి గోడకు ఆనించి పెట్టాడు. "ఇక చెప్పు" అన్నాడు.

సునీత మందహాసంచేసింది. "చెప్పేదేముందీ ? ఇప్పుడెంత టైమైందో చూడండి; ఫలహారాలు పుచ్చుకోండి. చాలసేపటినుంచీ పనిచేస్తున్నారు. కాస్త లేచి చేతులు ముఖం కడుక్కోండి."

"చేతూలూ, ముఖం కడుక్కునేదా ? సరే" అంటూ హరిప్రసన్నుడు వెంటనే లేచి బైటికి వెళ్ళిపోయాడు. సునీత బోర్డు ఎత్తి పట్టుకుని చిత్రాన్ని పరిశీలించిది. చిత్రంలో

భావం ఎక్కువగా ఉంది. అర్థం తక్కువగా ఉంది. ఎక్కువ లోతు కనిపించటంలేదు. 'నిర్గుణం సగుణమైంది' అన్న వాక్యం ఆమె ఎక్కడో చదివి ఉంది. ఈ చిత్రం చూచాక ఆమె కా వాక్యం కొంచెం కొంచెం అర్థం కాజొచ్చింది. చిత్రంలోని అర్థంమాత్రం ఆమెకు కొంచెంకూడా బోధపడ లేదు. అంతమాత్రాన అది వట్టి పిచ్చిబొమ్మ అని తోసి పారేయటానికీ ఆమెకు మనస్కరించలేదు. మనస్సును అందు లోకి బాగా జొప్పించి అర్థంచేసుకోవాలని ప్రయత్నించింది. బొమ్మలో ఏదో ఉంది; పరిచితమైన-అనుభూతమైన వస్తువే ఉంది; చాల ఉదాత్తమైన విషయంకూడాను కాని ఆ వస్తు వేది? ఎక్కడుంది? వెదకి వెదకి తెలుసుకోవల్సిందే; తేలిగ్గా దొరికేట్టులేదు.

హరిప్రసన్నుడు తిరిగి వచ్చాడు. "ఏమిటి చూస్తు న్నావు వదినా? అలా పెట్టు. అక్కడ పడి ఉండనీలే."

సునీత అతనివైపు చూచింది. ఆమెకు నవ్వువచ్చింది. "స్నానాలగదిలోని తువ్వాలు మీద వేసుకుని వచ్చారేం?"

హరిప్రసన్నుడు మళ్ళీ వచ్చినదారినే తిరిగి వెళ్ళాడు. "పోనీలెండి. తెస్తే తెచ్చారు, ఉండనీయండి." అని సునీత అంటూన్నా వినిపించుకోకుండా హరిప్రసన్నుడు ఆగకుండా వెళ్ళిపోయాడు. తువ్వాలు యథాస్థానంలో పెట్టేసివచ్చాడు. వచ్చి వెంటనే కూర్చున్నాడు. "ఈ బొమ్మ మీకోసం కాదులెండి. అలా పడి ఉండనీయండి. ఇంకా పూర్తికాలేదు కూడాను."

"ఓహో, చిత్రం మీకోసమే అన్నమాట! అయితే సరే" అంటూ సునీత బోర్డును రెండుచేతులా జాగ్రతగా పట్టుకుని యథాస్థానంలో పెట్టేసింది.

వెంటనే హరిప్రసన్నుడు "అదికాదు నా ఉద్దేశం. ఇంతకూ..." ఏమో అనబోయాడు.

"పోనీలెండి. అడక్కుండా మళ్ళీ బొమ్మను తీసి చూడనులెండి."

"వదినా!"

"ఇక ఫలహారం చెయ్యండి."

"ఇక ఇవి తినేసెయ్యమంటావన్నమాట! – బాగానే ఉంది" అంటూ హరిప్రసన్నుడు పళ్ళెం చేతిలోకి తీసుకున్నాడు.

"చూడండి, మీకు కోపం రాకపోతే రెండుమాట లడుగుదా మనుకుంటున్నాను."

"రెండుమాట లడుగుదా మనుకుంటున్నావా? అడుగు. చివరకు నేనుకూడా రెండుమాట లడగాల్సిందే."

"మీకు పెళ్ళిచేసుకోవాలని లేదా? చెప్పండి."

"ఆసంగతి నేనేమీ చెప్పలేను. కాని పెళ్ళిచేసుకోకుండా ఉండిపోవాలన్న ప్రతిజ్ఞమాత్రం నాకేం లేదు. కాని నన్ను పెళ్ళాడదలచిన యువతి, ఎప్పుడో ఒకప్పుడు నన్ను విడిచిపెట్టి పోయేంత ధైర్యంగల మనిషైఉండాలి. ఎందుచేతనంటే... నేనుమాత్రం ఎప్పుడో ఒకనాడు ఆమెను విడిచిపెట్టిపోనని గ్యారంటీ ఏముందీ?"



C. P. BROWN
MEMORIAL LIBRARY
Acc. No

"ఇంకా ?"

హరిప్రసన్నుడు ఆశ్చర్యపోయాడు. "ఇంకా ఏమిటి?"

"ఇంకా... ఆవిడకు మూడు కళ్ళూ, మూడు చేతులూ ఉండక్కర్లేదూ ? దేవలోకంలోని అప్సరసకు ఏమాత్రం తీసిపోకుండా ఉండద్దూ ?"

"వదినా !"

"ఏం ? నేనేం అసంగతమైన మాట అంటున్నానా ? నువ్వు అన్నదానికంటే అసంగతంగా నేనేమీ అనలేదే !"

"అయితే వదినా ! విను. నేను అసలు పెళ్ళే చేసుకోను."

"మరేం చేస్తావు ?"

"బ్రతికి ఉంటాను."

"చావకుండా బ్రతికే ఉండాలని కోరుతున్నావు. ఆ సంగతి నాకు అర్థం అయింది. కాని ఎలా బ్రతుకుదామని? మనిషిలాగనా ? దేవతలాగనా ?"

"నాకు మల్లేనే."

"అంటే – ఎలాఁగ ? తెలిసేట్టు చెబుతావా ?"

"నీకుమల్లేమాత్రం కాదు" అన్నాడు హరిప్రసన్నుడు ఆమెవైపు చూస్తూ. ఆ చూపుతో ఆమె ఇందాకటినుంచీ ప్రదర్శిస్తోన్న వ్యంగ్యవిస్ఫూర్తి బాగాదెబ్బతిన్నది. ఆమె చిన్నపోయింది.

ఎలాగైతేనేం, హరిప్రసన్నుడు వదినగారిమీద ఒక్క విసురు విసిరాడు. దానితో ఆమెలోని యువతీప్రాగల్భ్యం కుంటుపడిపోయింది. అప్పుడు అతనిలోనిపౌరుషం ఉజ్వలంగా

లేచింది. అన్నాడు : "ఇది ఆటకాదు. పెండ్లి అయిన వారికి పెండ్లిసమస్య తమాషాగా గోచరించవచ్చు. నాకు మాత్రం అలా కనిపించదుసుమీ! నువు నన్నెటువంటి ప్రశ్న వేశావో తెలుసునా? దానికి జవాబు ఇంతవర కెవరూ నాదగ్గరనుంచి పొందలేదు. 'నేను చెప్పను పో' అని నిన్ను కూడా ధిక్కరిస్తానా ? ధిక్కరించలేను. ఎందుచేతనో తెలుసా ? నా అన్నవాళ్ళెవరూ నా కింతవరకు కనిపించ లేదు. నాకు నేనై ఎవరినీ ఆత్మీయులనుగా ఎన్నుకోలేదు. తమకు తామై నాకెవరూ ఆత్మీయులు ఏర్పడనూలేదు. మొట్టమొదటిసారిగా నువు నాకు వదినెవై కనిపించావు. వదినె అంటే యేమిటో నాకు తెలియదు. నా మనసులోమాట చెప్పేస్తాను. నా సర్వస్వం నువ్వే. గాభరా పడబోకు. సర్వం నువ్వే. ఇక పెళ్ళీ, పెడాకులూ... అవన్నీ నా కెందుకు ?"

సునీత గడియారంవైపు చూస్తూ "అరె, రెండున్నర అయిందే; రొట్టెలు చెయ్యాలి పోయి" అన్నది – తొందర పని ఉన్నట్టుగా.

"రొట్టెలు చెయ్యొచ్చులే. కాస్త ఆగు. అవన్నీ నా కెందుకూ అని అడుగుతున్నాను. కేవలం పతివ్రత అయిన భార్యవల్ల ఏమౌతుంది? నాకూ ఒక భార్య కావాలి; కాని ఆమె... పతివ్రత కాకపోయినాసరే... అచంచల ధైర్యసాహసాలుగల వ్యక్తి అయివుండాలి. విపత్సమయాల్లోకూడా ఆమె... నీలిమబ్బుల్లోని మెరుపు తీగవలె తళతళలాడుతూ వెలిగిపోవాలి. ఆమె నాకు తల్లివలె, దాసివలె ఉపయోగ పడాలనీ కోరతాను. కాని ముఖ్యంగా తేజస్ఫూర్తి, బుద్ధి

నైశిత్యముగల మంత్రిగా సాయపడాలి. ఆమె ప్రేమ హింసకు వెరువనిదై ఉండాలి. నెత్తురుటేర్లు ప్రవహిస్తున్నా సరే... ప్రవహించనీగాక... ఆమె శాంతిస్వప్నం అఖండంగా నిల్చి ఉండాలి. ఆమె జండా పుచ్చుకుని ముందు నడుస్తూంటే వెనుక యువకులంతా నెత్తురుటేర్లు దాటి సాగివస్తూ ఉండాలి."

"ఓహ్!..." సునీత స్వరం కంపించింది.

"ఆగు, వదినా! నాకు భార్య అక్కర్లేక కాదు, నేను పెళ్ళిచేసుకోకుండా ఉన్నది. నాకు ముఖ్యంగా కావల్సింది మహాత్యాగం - వెలుగుకిరణాలను విరజిమ్మే మహాత్యాగం - మహోన్నత జీవితాదర్శం గర్భితమైయున్న మహాత్యాగం. వదినా!— "

హరిప్రసన్నుని చెయి సాగివచ్చి ఆమె హస్తాన్ని సంగ్రహించింది.

"వదినా! నా ఆదర్శం అదీ! నాకు కావల్సింది అదీ! యువకుడు ముందడుగు వేసి సాగిపోవాలి; విజయాన్ని చూరగొనాలి. కాని ఎవరి జండాక్రింద సాగిపోవాలి? ఎవరి చిరునవ్వుతో సముత్సాహితుడు కావాలి? ఎవరి భ్రూవిక్షేపంతో ఉన్మత్తుడై పోవాలి ? ఎవరి కటాక్షంతో గర్వశోభితుడు కావాలి? అటువంటి యువతికోసం నేను కలలుకంటున్నాను."

సునీతచేయి అతనిచేతిలోనే ఉంది. తీసేసుకోటానికి ఆమె ప్రయత్నించలేదు.

"వదినా! వదినె అంటే ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో నాకైతే తెలియదు..."

సునీత తన చెయి తీసేసుకుంది. "అరె, మూడుగంట లైపోయిందే. నాకు చాల ఆలస్యమైపోతోంది!"

"వెళ్ళు. కాని నేను చెప్పదలచుకున్న అసలు మాట ఇంకా మిగిలే ఉంది."

సునీత లేచి నిల్చుంది. "సాయంత్రానికి సత్య వస్తుంది. ఆమాట చెబుదామనే వచ్చాను."

"నేను చదువు చెప్పలేను."

"ఆమాట సత్యతోనే అనండి; నాకెందుకూ!"

"ఆ అమ్మాయికి చెప్పగలశక్తి నాదగ్గరేముంది వదినా? నీకంతా తెలిసికూడా నన్నెందుకూ బాధపెట్టటం?"

సునీత విషయం మార్చేసింది. "సరే, ఇవాళ మీకు భోజనానికి ఏమేం చెయ్యనూ?"

హరిప్రసన్నుడికి కోపం వచ్చింది. "వదినా!"

"మీరు చెప్పరన్నమాట!" అంటూ వదిన వెళ్ళి పోయింది.

హరిప్రసన్నడు లేచి గదిలో పచార్లు మొదలుపెట్టాడు.

# 32

రాత్రి భోజనాలయాక భార్యాభర్తలు మాటాడు కుంటూ కూర్చున్నారు. ఎప్పుడోగాని మామూలుగా ఇలా కూర్చోరు. ఈమధ్య చాలరోజులబట్టీ ఇలా కలిసికూర్చుని మాటాడుకోటం సంభవించలేదు.

"హరిప్రసన్నుడిని కనిపెట్టి ఉన్నావా? ఎంతవరకు వచ్చాడు?" శ్రీకాంతుడు అడిగాడు.

సునీత హరిప్రసన్నుడి వ్యవహారం చూస్తూనే ఉంది. కాని ఎంతవరకు వచ్చాడో ఆమెకు సరిగా బోధపడటంలేదు. ఎంతవరకు వచ్చాడో......ఆవిషయం తరచిచూస్తేమాత్రం ఆమెకు భయం కలుగుతోంది.

"చెప్పు; ఏమన్నా అవకాశం కనిపిస్తోందా ?" మళ్ళీ అడిగాడు శ్రీకాంతుడు.

"ఉహుఁ, ఏం కనిపించటం లేదు."

"పెళ్ళిచేసుకోడా అసలు? నీకు అలాగే అనిపిస్తోందా ?"

"ఔను, చేసుకోకపోవచ్చు!"

"ఎందువల్ల ?"

"వివాహంలో అతనికి విశ్వాసం ఏర్పడలేదు."

"చూడు సునీ! నేను ఒక కేసుసందర్భంలో ఎల్లుండి లాహోరు వెడుతున్నాను. రెండుమూడురోజులదాకా అక్కడే ఉండిపోవాలి. హరిప్రసన్నుడు మళ్ళీ పారిపోకుండా, ఇక్కడే ఉండేట్టు చూడు. అతని క్షేమం చూస్తూ ఉండు. ఆ భారం నీమీద పెట్టి పోతున్నాను. నా కతన్నిగురించి సందేహం గానే ఉంది."

భర్త లాహోరు వెళ్ళాలన్న వార్త వినగానే సునీత దిగాలుబడిపోయింది. "మీరు వెళ్ళాల్సిందేనా? తప్పదా ?"

"అదేంమాట సునీతా! ఎలా తప్పుతుందీ ?"

"నేను మిమ్మల్ని ఎప్పుడూ ఏవిషయంలోనూ అడ్డగించలేదు. ఈసారిమాత్రం వెళ్ళకండి." అనునయపూర్వకంగా అన్నది సునీత.

ఆమె స్వరం కంపించింది. అది శ్రీకాంతు గమనించాడు. ఆమె భయం ఏమిటో అతనికి బోధపడ లేదు. "అలా ఇదాతావేం సునీ! మూడు నాలుగురోజుల్లో మళ్ళీ తిరిగి రానూ?"

"ఆయన్ను నాకెందుకూ ఒప్పజెప్పి పోతున్నారు. ఆయన మనస్సు నావశంలో ఉండేది కాదు. నేను మీా—అనకూడదుగాని... అయినా ఆయన్ను వేరే ఇంకెక్కడైనా ఉండేట్టు తగిన ఏర్పాటుచేస్తే బాగుండదూ?"

"అలా అంటావేం సునీతా!"

"ఆయనకు ఇక్కడ సుఖంగా ఉండటంలేదు."

"సుఖమా? అతనికెప్పుడూ సుఖంలేదు. ఇదివరకూ లేదు; ఇక ముందూ లేదు. అయినా ప్రపంచంలో సుఖం అనేది ఎవరికి ఉంది చెప్పు."

"మూడు నాలుగురోజుల్లో తిరిగి వచ్చేస్తారుకదూ! ఈలోగా ఆయన్ను ఎక్కడికీ వెళ్ళద్దని మీారే చెప్పండి. వెళ్ళిపోయేట్టయితే నే నెలా ఆపేదీ? నాకు ఏం అధికారం ఉందనీ?"

"సరే, అతనితో నేనే చెబుతాను. కాని నేను ఊరికి వెడుతున్నానంటే నువు ఎందుకంత దిగాలుపడుతున్నావు?"

"లేదులెండి—"

ఈ "లేదులెండి—" అన్నమాటే "ఔనౌను, చాల దిగాలుపడిపోయింది. నువే ఆలోచించు: ఈ సమయంలో మరి ఆమెకు గుండెదిటవుగా ఉంటుందా?" అని పలుకుతున్నట్టుగా ఉంది.

"లేదు లెండి—" అని ఆమె పలికిన శబ్దం విని శ్రీకాంతుడు మరీ మెత్తబడిపోయాడు. " 'లేదు లెండి—' అన్న శబ్దంతో మెలికలుగా పెనవైచుకుని 'ఔనౌను, కాదామరి!' అన్న భావం... అడ్డగించటానికి వీల్లేని ప్రవాహంవలె... ఎలా దూకి వచ్చిందో చూడు! ఆ శబ్దం ఎలా కంపించిందో కని పించలేదూ! లేవవేమయ్యా! లేచి ఆమెను బుజ్జగించవేం? పాపం దిగాలుపడిపోయింది; ఆర్తురాలు" అని ఏదో వాణి తన్ను ప్రబోధిస్తున్నట్టుగాకూడా వినిపించి శ్రీకాంతుడు చటుక్కున లేచి వచ్చాడు. తల నిమురుతూ "సునీ! రాణీ!" అని పలుకరించాడు.

"మీరు వెళ్ళాల్సిందేనా?"

"సునీ!" బుజ్జగించాడు శ్రీకాంతుడు.

సునీత విచలిత అయింది. గంభీముద్ర తాల్చింది. "అయితే నాకు పరిపూర్ణమైన ధర్మవిశ్వాసం కల్పించిపొండి. ఆ విశ్వాసం నాలో సడలిపోతున్నది. వివాహమనేది లౌకిక నీతి మాత్రమేనా? అది పరమ ధర్మంకాదా? అది మానవుడి మనోభావాలపైనే ఆధారపడి ఉండేదా? అంత తేలికైన వస్తువా అది? వీటన్నిటినీ మించిన పవిత్రవస్తువు అది కాదా? నాకు పరిపూర్ణవిశ్వాసం కల్పించండి. ఈశ్వరుని పూజించటం మానేసి, అతన్ని కొలవాలనీ, తూచాలనీ ప్రయత్నించే ప్రవృత్తి నాలో ప్రవేశిస్తున్నదేమిటి? ఈ హైన్యం నన్ను ఎందుకు ఆవరిస్తున్నట్టు?... మీరు వెళ్ళాల్సిందేనా? ఎందుకు వెళ్ళటం? వెళ్ళకండి - వెళ్ళ

వలసివ స్త్రీమాత్రం నాలో పరిపూర్ణ విశ్వాసం కల్పించి మరీ పొండి."

"సునీతా! సునీతా! ఏమిటీ విచారమంతాను?"

సునీత శ్రీకాంతుని వక్షంలో తలానించి "ఏముందీ? రాహువువస్తాడు, వెళ్ళిపోతాడు. పూర్ణిమ మళ్ళీ ప్రకాశ వంతంగానే ఉంటుంది. నా విశ్వాసం రాహుగ్రస్తమైనా కాంతి తగ్గదు. మీరుమాత్రం నన్ను ప్రేమించటం మానె య్యకండి. మీ ప్రేమలో నన్ను వివశురాలినిగానే ఉండ నీయండి. ఆ వివశత్వంనుంచి తొలగిస్తే నేను బ్రతుకలేను. నా జీవనాధారమే పోతుంది. నన్ను ఆత్మవిస్మృతగానే ఉండ నీయండి" అన్నది.

శ్రీకాంతుడు ప్రేమగా ఆమె వీపు నిమురుతూ "నా సునీత! నా రాణి! నేను నీ వాడిని" అన్నాడు.

సునీత భర్త కౌగిలిలోనుంచి విడివచ్చింది. "మీరు నా సొత్తు - నా సొత్తే. 'నువు నాదానివి' అనికూడా మీనోటి మీదుగా అనండి."

"సునీతా!"

"అనండి. నేను మీదాన్ని. నేను మీదాన్నే అని మీరూ అనండి."

"సునీతా!"

"అనండి, అనండి!"

"నేను నీవాడినే సునీతా!"

"'నేను మీదాన్ని' - ఈమాటకూడా అనండి!"

"నువు నాదానివి!"

ఇప్పటికి సునీతకు పరితృప్తి కలిగింది. హృదయం నిండిపోయినట్టయింది. ఇక తరువాత ఏమిటి? ఒకరికొకరు ఎదురుగానే ఉన్నా ఎడమెడంగా ఉనికి దుస్సహమనిపించింది యిద్దరికీని. ఇటువంటి సమయంలో ఒకరినొకరు గాఢంగా కౌగలించుకొని యీ 'ఎడము' అనేది లేకుండా చేసుకుంటారా? లేకపోతే ఒకరి సమక్షంలోనుంచి ఒకరు లేకుండా పోయి పరస్పరం దూరస్థులౌతారా? ఇటువంటప్పుడు కాస్త ఎడముకావటమే ఒకరిలో ఒకరు లీనంకావటానికి మరింత సహాయపడుతుంది.

"ఎప్పుడు వెడతారు? - ఎల్లుండా?"

"రేపు కాకపోతే ఎల్లుండి తప్పదు."

"పాలు పట్టుకురానా?"

"తీసుకురా, కాని—"

"తీసుకొస్తాను."

మరికాసేపటికి పాలగ్లాసుతీసుకుని సునీత తిరిగివచ్చింది. "హరిప్రసన్నుడుకి ఇచ్చావా మరి?" శ్రీకాంతుడు అడిగాడు.

సునీతకు ఎంతో ఎత్తునుంచి క్రిందికి జారి పడినట్ట యింది. "ఇంకా ఇవ్వలేదు" అని చెప్పింది.

"మొదట అతనికి ఇచ్చిరా" - అంటూ తన చేతిలోని పాలగ్లాసు ఆమెకు తిరిగి ఇవ్వబోయాడు శ్రీకాంతుడు.

సునీత మనస్సుకు కష్టం తోచింది. "నేనాయనకు ఇవ్వకుండా ఎప్పుడైనా మానేశానా?"

అప్పుడు శ్రీకాంతుడు తన పాలగ్లాసు తానే ఉంచుకున్నాడు. "సునీతా! హరిప్రసన్నుడిని ఎప్పుడూమరచిపోకు."

"అయితే ఇప్పుడే వెళ్ళి ఇచ్చి వస్తాను ఉండండి" అన్నది కించిత్తు కోపంగా.

"అలాగైతే సునీతా! అతన్ని ఎక్కడైనా వేరుగా ఉంచి, ఏమీ లోటు జరక్కుండా, అన్నియేర్పాట్లూ చెయ్యాల్సే వస్తుంది." శ్రీకాంతుని కంఠస్వరం కరుణాన్వితంగా ధ్వనించింది.

"ఔను, అలా చెయ్యటమే మంచిది" - వెడుతూ వెడుతూ సునీత అన్నది.

"సునీతా!" కోపంగా శ్రీకాంతుడు.

సునీత వెళ్ళిపోయింది.

## 33

సునీత పాలగ్లాసు తీసుకుని పఠనమందిరంలోకి వచ్చింది. సత్య అంతకుముందే అక్కడినుంచి వెళ్ళిపోయింది, కాసేపు చదువుకుని. హరిప్రసన్నుడు ఒక్కడే ఉన్నాడు... తాను తయారుచేస్తున్న చిత్రాన్ని ఎత్తిపట్టుకుని చూస్తూ. చూస్తున్నాడు, అంతే - అందులో యేమీ గీయటంలేదు.

ఈసారి సునీత మామూలుకుమల్లే పలుకరిస్తూ రాలేదు. పలుకరించాల్సిన అవసరంకూడా లేకపోయింది. ఆమె రావటంతోనే అతడు స్వయంగానే తిరిగి చూచాడు.

"పాలు తెచ్చావా వదినా! ఇలా తే. నాకు రోజూ పాలుతాగే అలవాటు ఉందని నువు ఎలా అనుకున్నావు? చీకటి కూపంలో దయారసం చిలికినట్టుగా ఉంది ఈ నీ పని."

గ్లాసు అక్కడ పెట్టేసి సునీత ఏమీ మాటాడ లేదు. వెళ్ళిపోడానికి ఉద్యుక్త అయింది.

"ఇవాళ నా పక్క పైన వేశారా?" హరిప్రసన్నుడు అడిగాడు.

"ఏమో మరి."

"వెయ్యలేదన్నమాట!"

"ఏమో మరి."

"ఏమో మరి! ఇవాళ బొమ్మగీయటం పెట్టుకోకుండా శ్రీకాంతునితో బాతాఖానీ వేస్తూ నిద్రపోదామనుకున్నానే."

"అయితే సరే."

"అదేమిటి వదినా! అలా మాటాడుతున్నావేం?"

"పైన పక్క వేసి ఉంటే సరే సరి. లేకపోతే నేను వేస్తాను. మీరు పదండి."

ఈ సునీత అనబడే వదినెగారి తత్వం ఏమిటో హరిప్రసన్నుని బుద్ధికి అందకుండానే ఉంటోంది. "ఏమిటి, అలా ఉన్నావేం? సరిగా మాటాడవేం? నే నేమైనా తప్పుచేసి ఉంటే క్షమించు."

సునీత మాటాడలేదు.

"నే నిక్కడనుంచి వెళ్ళిపోవాలనే అనుకుంటున్నాను—" అని పలికి హరిప్రసన్నుడు కాసేపు ఊరుకుని చివరకు "బహుశా ఎల్లుండి వెళ్ళిపోతాను—" అన్నాడు.

"మీకిక్కడ కష్టంగా ఉందా?"

"కష్టం! — ఔను కష్టంగాకూడా ఉంది."

"ఎల్లుండా? - వెళ్ళిపోవటం ?"

"ఎల్లుండే పోదామని చూస్తున్నా. రేపటికిగాని చిత్రం బాగా పూర్తి అవదు. పూర్తయిన తర్వాత ఇది నూరురూపాయలకన్నా ఎక్కువ ధరకే అమ్ముడుపోవాలి."

"అయితే చిత్రం మీరు మీతోనే తీసుకువెళ్ళండి! మేం వడ్డీకి అప్పులు ఇచ్చేవాళ్ళంకాదు. ఆసంగతి మీరు గుర్తించాలి."

"చిత్రం నేనే తీసుకుపోనా!" అని పలికి హరిప్రసన్నుడు కాసేపు ఆగాడు. మళ్ళీ ఇలా ఆరంభించాడు: "చిత్రం మెడలో కట్టుకుని ఊరేగటానికికాదు. ఎక్కడో దూరంగా విడిచిపెట్టి వెళ్ళడానికే. దాన్ని నా దగ్గరే ఉంచుకొనేటట్లయితే, ఇంత శ్రమపడి దాన్ని బయటి లాగవలసిన పనేముంది ? అది ముందునుంచీ నాలో ఉన్నదేగా ? మనసులోనుంచి కొంత సామగ్రిని లాగి బయట పడేయాలంటే సుఖకరమైన పనికాదు. అది అలా ఉండగా... వదినగారూ! మీ రీ చిత్రాన్ని అమ్మివేయండని నే నెప్పుడన్నాను? పోనీ, ఈ చిత్రాన్ని నేను అమ్ముకుంటే నూరు రూపాయలకు పైగానే వస్తాయనుకోండి. ఆ డబ్బు అయిపోయాక మళ్ళీ పైకం అవసరం పడితే మీ దగ్గరకు వచ్చి అడగటం మానేస్తాననా మీ రనుకోటం ? అదీగాక... దీనిలో ఆ విలువ ఉంది, ఆ విలువయిచ్చే దీన్ని తీసుకున్నాం అని భావిస్తే మాత్రం అంతమాత్రంచేత తప్పేముంది ? మీరు దీన్ని విసిరి అవతల పారెయ్యరనుకుంటాను."

"మీరు వెళ్ళకుండా ఆగిపోకూడదూ ?"

సునీత అక్కడ ఒక కుర్చీలో కూర్చుంది. హరిప్రసన్నుడు క్రింద తివాచీమీద కూర్చున్నాడు. ఆమె ప్రశ్నకు ఈ విధంగా జవాబు చెప్పాడు: "సర్వం విధి ప్రకారం నడుస్తూ ఉంటుంది. ఆగిపోవటం శ్రేయస్కరం కాదు. ఊపిరి ఆగిపోతే మృత్యువే. నడక ఆగిపోయిందంటే... అదీ మృత్యువే. గాలి ఆగిపోతుంది; అదీ మృత్యువే. ఆగిపోవటం అంటే మృత్యువన్నమాటే. బ్రతుకంటేనే చలనం."

"అవతల ఏమంత మహాకార్యం పడిఉన్నదనీ, మీరు వెడతాననటం? అదీ నే నడిగేది."

"ఇక్కడ ఏమంత గొప్పపని ఏడిసిందనీ, నే నిక్కడే పడి ఉండాలి? అదీ నే నడిగేది?"

"వారికి కోపం వస్తుంది."

"శ్రీకాంతునికా?" నవ్వాడు హరి.

"సత్యకు పాఠాలు ఆరంభంచేశారాయెను. మరి..."

"మరి... ఆ సంగతి మీకు తెలియాలి. అది మీ బాధ్యత. ఆవిషయమైన చింత నా కనవసరం."

సునీత గంభీరముద్ర తాల్చింది. "పారిపోతేపారిపో. కాని నీనుంచి నువ్వే ఎక్కడకని పారిపోతావు. నిన్నెవరూ అడ్డగించలేకపోవచ్చు, నిజమే; కాని నిన్ను నీవే అడ్డగించుకుంటావేమో!"

"వదినా!"

"సరే, వెళ్ళిపో. వెళ్ళి వెళ్ళి ఎక్కడికి చేరుకుంటావు? ప్రపంచమే లేని తావుకా? ఎలా ఉంటుందేమిటి అక్కడ?

మేము ఎవరమూ లేకుండా నువ్వు ఒక్కడివే ఉండే చోటు - అది ఎక్కడ ఉంది? ఎలా ఉంటుంది?... అటువంటి చోటు ఎక్కడా లేదు; నీకు తెలుసునా? ప్రాణం కుదుటబడి హాయిగా ఒకచోట ఉండదేం? అలా కొట్టుకులాడుతుందేం? ఎందుకో నీకు తెలుసా?... అందుకనే చెబుతున్నాను: ఇంకెవరూ ఉండని ఆచోట కూడా మేము ఉన్నాం. లేమని మీరు అనగలరా? కాబట్టి హరిబాబూ! వెళ్ళిపోకండి. నరకంనుంచైనా సరే, పారిపోవటం మంచిదికాదు. పారిపోతే మాత్రం నరకభీతి వొదులుతుందా? అది వెంటాడి వేధిస్తూనే ఉంటుంది. కాబట్టి హరిబాబూ, వచ్చెయ్యి. పరమాత్మునిపై విశ్వాసం నిలుపుకుందాం; అతన్ని ప్రార్థించి బలం చేకూర్చుకుందాం.''

"వదినా!''

"నేను నిజం చెప్తున్నాను హరిబాబూ! భగవత్ప్రార్థనవల్ల శక్తి చేకూరుతుంది. మన దుర్బలత్వాన్ని అంగీకరించి, పారిపోకుండా నిల్చి ఉండటమే మంచిదిగాని, బలవంతుడనన్న బడాయి చూపించి వెనక్కు తిరిగి పారిపోవటం మంచిదా? దుర్బలుడికైనా రామభక్తివల్ల ఎక్కడ లేని బలం వస్తుంది. అటువంటి బలానికి ఓటమి అంటూ ఉండనే ఉండదు... ఇంతకూ ఏదైనా కర్మక్షేత్రంనుంచి శంఖారావం వినిపించి... అందుకోసమని వెడుతున్నావా? ఐతే వెళ్ళు. నా అభ్యంతరం లేదు. నాదే పొరపాటని ఊరుకుంటాను. అలాంటి పిలుపు ఏదీ లేకుండా వెడుతుంటే మాత్రం... అది తప్పే. నాదేం పొరపాటులేదు. నువు వెళ్ళద్దు.

పరమాత్మునిపై విశ్వాసం ఉంచుకో. ఆయన మనల్ని సర్వ భయాలనుంచీ తరింపజేస్తాడు—''

హరిప్రసన్నుడు ఇక ఆగలేకపోయాడు. అర్థోక్తిలోనే అందుకున్నాడు : "వదినా! ఇక నువు వెళ్ళిపోవచ్చు. వెళ్ళు-వెళ్ళు. ఇటువంటి మాటలు పలుకుతూ నువు ఇక్కడ ఉండవద్దు. అవి పవిత్రవాక్యాలే కావచ్చు. వాటిమీదికి నా బుద్ధి పోదు; పోయినా నిలువదు. అవన్నీ నాకు నిస్సారంగా కనిపిస్తాయి. తేలికపలుకుల్లాగానే వినిపిస్తాయి; కాని అవి నా బుద్ధికి అందవు. భగవంతుడనేవాడు ఉంటే ఉండవచ్చు. నే నతన్ని ఎందుకు అంటిపెట్టుకుని ఉండాలి? ఆయనకు నా కష్టా లన్నీ నేను చెప్పుకోను... చెప్పేం లాభం? నా ముందు రాతి విగ్రహం ఉంటుంది. నాకు రాతి విగ్రహం కాదు కావలసింది; జలప్రవాహం కావాలి. దాహం తీర్చుకునేందుకు మంచినీళ్ళు కావాలి. నా తల తీసుకుపోయి ఆ రాతిచట్టుకు కొట్టుకున్నాను; అది పగలలేదు. కొట్టుకుంటూనే ఉంటా; అయినా పగలదు అది. అది పగిలినాసరే, పగలకపోయినా సరే, నా తల పగిలిపోయేంతవరకూమాత్రం కొట్టుకుంటూ ఉండాల్సిందే. కాని నా తల పగిలిపోవటం నాకిష్టంలేదు. రాతిచట్టు రాతిచట్టుగానే ఉంటుంది. నా తల మాత్రం దానికివేసి పగులగొట్టుకోతగింది కాదు. అంతకన్నా వేరే మంచిపనులున్నాయి ఈ తలకు. ఈ తలను రక్షించుకో టానికి ఏవిధమైన ఆలోచనా చెయ్యకుండా... అది పగిలి పోతూంటే గుడ్లు ఒప్పజెప్పి చూస్తూ ఊరుకోటానికి తగినంత

శక్తి భగవంతుడు ప్రసాదించగలడనేనా నువు చెప్పేది వదినా ?''

''ఔను, ఆమాటకూడా చెప్పాలనే నా ఉద్దేశం.'' చాల గంభీరంగా పలికింది సునీత.

''విరుగని, కరుగని రాతిచట్టుకు ఎదురుగా నిల్చి దానితో పోరాడి పోరాడి నువు తుత్తునియలై పోవటానికేనా సిద్ధమౌతున్నావు వదినా ?''

సునీత కాసేపు ఆగి... తన్ను తాను సంబాళించుకుని ప్రతి శబ్దమూ సుస్పష్టంగా ఉచ్చరిస్తూ ఇలా పలికింది : "అహంకారంచేత కఠోరంగా తయారైన శక్తి ఏదైనా ఉంటే... అది మాత్రం నిజంగా తుత్తునియలే అయితీరుతుంది. కేవలం భగవంతునిమీద విశ్వాసంవల్ల ఏర్పడిన శక్తి ముక్కలు ముక్కలై పోవటానికి వీల్లేదు. ఎందుచేతనంటే అది కఠోరమైంది కాదు. దానిలో కాఠిన్యం లేదు. ప్రాణవాయువులాగ అది శూన్యవస్తువు. రాళ్ళు రప్పలు పగిలి ముక్కలై పోతాయిగాని తుపానుగాలి చెక్కు చెదరదు."

"వదినా ! ఇక నువు మాటాడబోకు. ఇక్కడినుంచి వెళ్ళిపోతావా, లేదా ? పోనంటావా ?"

"పోననటం లేదు. నే ననేది ఏమంటే—వెడితే సీదాగా వెళ్ళు. పారిపోబోకు... ...నిజంచెప్పు; నన్ను చూచేనా పారిపోవటం నువు ?"

"నిన్ను చూచా ?—ఔను—"

సునీత రవంత మందహాసం చేసింది. ''ఐతే నేనూ నిన్ను చూచి పారిపోవలసిందేనా ?"

"నువ్వేగా చెబుతున్నావు? పారిపోవద్దని! నేను మాత్రం పారిపొమ్మనే అంటాను. వీలున్నంతవరకూ పారిపో. నువుకూడా నన్ను పారిపొమ్మనే చెప్పు వదినా, లేక పోతే——"

"లేకపోతే ప్రళయం వచ్చేస్తుంది. అంతేనా? సరే పారిపోతున్నాలే!" వ్యగ్యంగా, పరిహాసంగా పలుకుతూ సునీత కుర్చీలోనుంచి లేచింది. ఇంతలో "హరీ!" అంటూ శ్రీకాంతుని పిలుపు బయటనుంచి వినిపించింది.

లేచి నిల్చున్న సునీత మళ్ళీ కూర్చుండిపోయింది. "చూచావా! నేను పారిపోదామనే లేచాను; కాని ద్వార రక్షకుడు అడ్డగించి పోనీయలేదు."

శ్రీకాంతుడు గదిలోకి వచ్చి చూచాడు. సునీత కుర్చీలో కూర్చుంది. హరిప్రసన్నుడు క్రింద తివాచీమీద కూర్చున్నాడు. శ్రీకాంతుడు రాగానే సునీత మేలిముసుగు సవరించుకుంటూ లేచి నిల్చుంది.

"హరీ! ఏమిటిది? ఎప్పుడూ చిత్రం! చిత్రం! అంతేనా! లే-లే!"అన్నాడు శ్రీకాంతుడు. "నువు కూర్చో" అన్నాడు సునీతవైపు తిరిగి.

సునీత కుర్చీలో కూర్చుంది. శ్రీకాంతుడు వచ్చి హరిప్రసన్నుని దగ్గరే క్రింద తివాచీమీదనే కూలబడ్డాడు. అది చూచి సునీత సిగ్గుపడుతూ మళ్ళీ కుర్చీలోనుంచి లేచి నిల్చుంది.

"అరె, కూర్చో-కూర్చో; ఇక్కడ సిగ్గు, సంకోచం దేనికి?" - అన్నాడు శ్రీకాంతుడు. అయినా సునీత మళ్ళీ

కుర్చీలో కూర్చోలేదు. తటపటాయిస్తూ అక్కడే కాసేపు నిలుచుని చివరకు వెళ్ళిపోటానికి ఉద్యుక్త అయింది.

"కాసేపు ఉండు" అన్నాడు శ్రీకాంతుడు. వెంటనే హరిప్రసన్నునివైపు తిరిగి "ఇవాళ పైకి వచ్చి పడుకుంటావు కదూ! ఏం హరీ!" అన్నాడు. మళ్ళీ సునీతవైపు తిరిగి "ఇతనికికూడా పక్క పైనే వేయించు" అన్నాడు. మళ్ళీ హరిప్రసన్నునితో "ఏమంటావ్" అని అడిగాడు.

"నే నిక్కడే పడుకుంటాను" అన్నాడు హరి.

"ఏం? ఇంకా చిత్రంలో మార్పులు చేర్పులు పూర్తికాలేదా?"

"ఔను, ఇంకా పనిఉంది."

"చూడు హరీ! ఇవాళకూడా నిద్రపోవు; రేపుకూడా నిద్రపోవన్నమాటే. ఎల్లుండేమో నేను లాహోరు వెడుతున్నాను. హైకోర్టులో అప్పీలు ఒకటి ఉంది. నువు మాయింటికి చిత్రంకోసం వచ్చినట్టుందిగాని నాకోసం వచ్చినట్టు లేదే!"

ఈలోగా సునీత కాసేపు అక్కడే నిల్చిఉండి చివరకు వెళ్ళిపోయింది.

"నువు ఎల్లుండి ప్రయాణం పెట్టుకున్నావా? నేను కూడా ఎల్లుండే వెళ్ళిపోదామని చూస్తున్నాను. ఆమాటే ఇందాక ఆవిడగారితో చెప్పానుకూడా." అన్నాడుహరి.

" నువు వెడతావా?" - హఠాత్తుగా ప్రశ్నించాడు శ్రీకాంతుడు.

"ఎందుకు వెళ్ళకూడదో, కాస్త చెప్పు వింటాను."

"ఎందుకా? మేం వెళ్ళవద్దంటున్నాం కాబట్టి"

శ్రీకాంతుడు ఎంత అమాయకుడు? తేలిగ్గా మోసం చెయ్యటానికి వీలైనంత అమాయకుడు! కాని మనిషి అంత ఎక్కువ పారదర్శి కాకపోయినా, శ్రీకాంతునిపట్ల మోసం అనేది తలపెట్టటం ఎవరికైనా అసంభవం.

"నువు వెళ్ళవద్దంటావు కాబట్టా? ఎందుకు వెళ్ళవద్దంటావు?"

"వెళ్ళవద్దనటానికి నాకు అధికారం ఉంది కాబట్టి."

హరిప్రసన్నుడు శ్రీకాంతుని ముఖంలోకి ససంభ్రమంగా చూచాడు. శ్రీకాంతుడు చాల సరళస్వభావంకల మనిషి. ఈ సరళస్వభావం అతనికి సాధనద్వారా సిద్ధించినదే; అందులో సందేహంలేదు. ఇటువంటి సరళమైన నడత తపస్సుకాదనగలమా? ఈ సరళస్వభావాన్ని అర్థంలేని అమాయకత్వంగా భావించవచ్చా? హరిప్రసన్నుడు శ్రీకాంతుని ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు. ఏమీ మాటాడలేదు.

"ఈచిత్రం రేపటికీ పూర్తికాదా? ఎల్లుండన్నా పూర్తిఔతుందా? దానితోపాటు నువు ఎంతసేపుకూర్చున్నా కూర్చోవచ్చు; అది నీ యిష్టం. ఆవిషయంలో మాకేం ప్రసక్తిలేదు... ఇంతకూ పైకివచ్చి పడుకోవన్నమాట. సరే అయితే. నేను ఇక వెళ్ళనా? నువు ఉండిపోతావు కదూ! ఉంటావులే. నేను మళ్ళీ మూడురోజుల్లో వచ్చేస్తాను. చూడు హరీ! నువు ఇక్కడేం భయపడనవసరంలేదు."

భయపడనవసరంలేదు! అదేంమాట! అలా అంటా డేమిటి?

శ్రీకాంతుడు మళ్ళీ చాల సౌమ్యంగా, ప్రేమగా ఇలా చెప్పాడు: "మీ వదిన నీకేవిధమైన ఇబ్బందీ కలగనీదు. నే నామెతో చెప్పానుకూడా. మేము జీవితంలో దుర్గమమైన మార్గాన్ని విడిచి, మామూలు సుగమమైన మార్గాన్నే అంటి పెట్టుకుని వెడుతున్నాం. అయినా ఆ దుర్గమమార్గంలో వెళ్ళే యాత్రికుని మేము అర్థంచేసుకోగలం. నువ్వేం భయపడకు హరీ! మా మార్గంలో మేము అలసి విశీర్ణులమై పోతే పోతాం. నువు మాత్రం తలవంచకు; నిర్మముడివిగానే ఉండు: ముందుకు సాగి పోతూనే ఉండు."

శ్రీకాంతుడు లేచాడు. హరిప్రసన్నుడుకూడా తమ్ముడు వలె తానూ లేచి నిల్చున్నాడు. అన్నాడు: "శ్రీకాంత్! మీరు నన్నిక్కడ హాయిగా విశ్రాంతిగా ఉంచాలని ప్రయత్నిస్తే మాత్రం... అది నాకు చాల దుస్సహంగా ఉంటుంది. నాపట్ల మీరు నిర్లక్ష్యంగా ఉండండి; నా గొడవలో నన్ను పడి ఉండనీయండి—అలాగైతే ఉంటా; లేకపోతే..."

"సరే-సరే, ఆమాట అలా వుండనీ, ఇక్కడ నువు బాగా కష్టాలే పడుతూ ఉండు. కాని ఒక మాట: నే నిక్కడ లేకపోయినా, మీవదినెకూడా నీకు ఆత్మీయురాలే అనుకో. ఆమెను నేను అర్థంచేసుకున్నాను; కాని పూర్తిగా అర్థం చేసుకోలేదు. ఆమెను నేను పొందాను; కాని పూర్తిగా పొందలేకపోయాను. నువు కారణంగా ఆమె నాకు మరింత సన్నిహితురాలు కాగలదని నే ననుకుంటున్నాను."

హరిప్రసన్నుడు ఈమాటలు వింటూ ఊరుకున్నాడు. వాటి అర్థం అవగాహన చేసుకుందామని తీవ్రంగా ఆలోచిస్తూ నిలుచున్నాడు. ధీరంగా మెల్లిమెల్లిగా అడుగులు వేసుకుంటూ శ్రీకాంతుడు గదివిడిచి వెళ్ళిపోతున్నాడు. హరిప్రసన్నుని మనస్సు తీవ్రంగా కంపించింది. అందులో ఒక భావవీచిక సందడించింది. శ్రీకాంతునిపట్ల అతనికెంతో కరుణ, శ్రద్ధ పుట్టుకొచ్చాయి. మనిషి కొయ్యబారిపోయి అలాగే నిలుచున్నాడు.

మరి కాసేపటికి దీపం ఆర్పుకుని పడకకుర్చీలో వాలాడు. పదిహేను ఇరవై నిమిషాలు అలాగే పడి ఉన్నాడు, చివరకు లేచివచ్చి దీపం వెలిగించుకున్నాడు; చిత్రంముందు వెళ్ళి కూర్చున్నాడు.

# 34

శ్రీకాంతుడు లాహోరు వెళ్ళిపోయాడు. హరిప్రసన్నుడు గదిలోనుంచి బయటికే రావటంలేదు. అస్తమానం చిత్రలేఖనంలోనే ఉంటున్నాడు. సాయంత్రమప్పుడు సత్య వస్తుంది. ఆమెకు కాసేపు పాఠాలు చెబుతాడు. జీవితంలో యీ నాలుగురోజులూ గడవాలి; కాబట్టి ఎలాగో గడిపెయ్యాలి. అంతకంటే వేరే అపేక్ష అతనికేమీ ఉన్నట్టు లేదు. ఉదయం, సాయంత్రం భోజనమప్పుడుమాత్రం వంటింట్లోకి వస్తాడు. తలవంచుకునే భోజనం చేస్తాడు. ఒక్కమాట కూడా పలకడు. మళ్ళీ వచ్చేసి చిత్రం ముందుపెట్టుకుని కూర్చుంటాడు.

సునీతకుకూడా ఇంటిపనులు చాలానే ఉన్నాయి. అయినా ఇంట్లో ఉన్న అతిథికి ఏవిధమైన లోటు జరక్కుండా చూస్తూనే ఉంది. భోజనానంతరం ఆకులువక్కలు తెచ్చి ఇస్తుంది; పడుకోబోయేముందు పాలు తెచ్చి ఇస్తుంది; ఇంకేమైనా అవసరమైతేకూడా తెచ్చి ఇచ్చి వెంటనే అక్కడినుంచి వెళ్ళిపోతుంది; అంతే.

చివరకు ఒకనాడు చిత్రం పూర్తి అయింది. తాను ప్రసవించిన శిశువు కాళ్ళు చేతులు ఆడిస్తూ ఆడుకుంటూ ఉండటం చూచినప్పుడు తల్లి భావాలు ఎలా ఉంటాయి? చిత్రాన్ని ఎదురుగా పట్టుకుని ఈ వైపునుంచీ, ఆ వైపునుంచీ అనేక రకాలుగా చూచుకున్నాడు హరిప్రసన్నుడు; సంభ్రాంత చిత్తుడైనాడు. చూచిచూచి, హఠాత్తుగా లేచి పైకి వెళ్ళాడు.

పైన ఒక గది ఉంది. దానిముందు వసారా. పైన కప్పులేదు. ఆ గదిని అంటుకునే స్నానాలగది ఉంది. స్నానాలగదిలోకి వెళ్ళాలంటే బైటినుంచే వెళ్ళాలి. గదిలో నుంచి దోవలేదు.

సాయంత్రం అయిదుగంటలైంది. అది స్నానంచేసే సమయమా? కాని సునీత అప్పుడే స్నానంచేసి స్నానాల గదిలోనుంచి బయటికి వస్తోంది. సోగలై తలవెంట్రుకలు పిరుదులవరకూ చెదరిపడుతున్నాయి. ఇంకా చీర సరిగా కట్టుకోలేదు; ఊరికే పైన కప్పుకుని వచ్చేస్తోంది. క్రింద కాళ్ళు పిక్కలవరకూ ఆచ్ఛాదన లేకుండానే ఉన్నాయి. పైన

చీర వక్షోభాగంవరకూ మాత్రమే వచ్చింది. ఆపైన ఏమీ లేదు; ఖాళీ.

చిత్రం పూర్తి అయిందన్న సంతోషం పట్టలేక హరి ప్రసన్నుడు మెట్లమీదినుంచే 'వదినా, వదినా' అని పిలుస్తూ వచ్చాడు. వచ్చి ఆమెను చూడ్డంతోనే ఎక్కడి వాడక్కడే తలవంచుకుని నిలబడిపోయాడు. సిగ్గుతో సునీతముఖం ఎరుపు వర్ణానికి తిరిగింది. ఆమె గబగబా గదిలోకి వెళ్ళిపోయింది. హరిప్రసన్నుడు మొద్దులా నిలబడి ఉన్నాడు. కదల్లేదు; మెదల్లేదు; అతనిలో అసలు ప్రాణం ఉందో లేదో అన్నట్టుగా ఉన్నాడు.

" మీరు కూర్చోండి " - గదిలోనుంచి మాట వినిపించింది.

కాని ఎక్కడ కుర్చోవాలో హరిప్రసన్నుడికి బోధపడలేదు. ఏకాయెకి గదిలోకి వెళ్ళి కూర్చోవచ్చా? లేకపోతే మరి బయట కూర్చోటానికి చోటేదీ? తిరిగి వెళ్ళిపోదామనుకున్నాడు హరిప్రసన్నుడు.

" వెళ్ళిపోకండి ; కూర్చోండి " అని లోపలనుంచి మళ్ళీ వినిపించింది. హరిప్రసన్నుడు వెళ్ళిపోలేదు. అక్కడే నిల్చున్నాడు.

కాసేపటికి సునీత బయటికి వచ్చింది. ఆమెస్థితిలో ఎక్కువ మార్పేమీ లేదు. చీరమాత్రం శుభ్రంగా కట్టుకుంది. తల పూర్వంలాగే విరబోసుకునే ఉంది ; ముడీ వేసుకోలేదు.

"కూర్చోండి ; నిల్చున్నారేం? రండి, ఇక్కడ మంచం ఉంది, కూర్చుందురుగాని" - అన్నదామె.

హరిప్రసన్నుడికి ఇదంతా ఏమీ అర్థంకావటంలేదు. తన హృదయంలో ఏముందో తనకే బోధపడటంలేదు. ఏం మాట్లాడాలి? ఎలా ప్రవర్తించాలి? తన ఉల్లాసమంతా హరించుకుపోయింది. సంభ్రాంతచిత్తుడై నిల్చి ఉన్నాడు. లజ్జ అనేది ఏమాత్రమూ లేకుండా ఈ శోభావతి 'రండి, కూర్చోండి' అంటోంది. తా నిదంతా ఎలా సహించగలడు?

ఇలా ఏర్పడిన ఈ పరిస్థితిలో తన దోషమేమీలేదు; అయినా తాను దోషికాదు - అన్న సమాధానం అతనికి కలగటంలేదు.

హరిప్రసన్నుడు మౌనంగానే ఉండటం చూసి సునీత ఇలా అన్నది : ఇన్నాళ్ళకు మీరు ఇవాళ ఈ అసమయంలో ఇలా వచ్చారే. చిత్రం అయిపోయిందా యేమిటి? లేకపోతే మీకు ఈ తీరిక లభించిఉండదు."

"పూర్తి అయింది చిత్రం."

"పూర్తి అయిందా? అయితే ఇప్పుడు చూడ్డానికి రానా? ఇందాక మూడుగంటలప్పుడు ఫలహారం తీసుకొచ్చాను జ్ఞాపకం ఉందా? అప్పుడు మీరు పూర్తిగా చిత్రంలో లీనులై ఉన్నారు. అందుచేత తిరిగి తీసుకొచ్చేశాను. కూర్చోండి; ఇప్పుడు తీసుకొచ్చి ఇస్తాను."

"వద్దు-వద్దు."

"ఇక్కడ కాకపోతే పోనీయండి. మీగదిలోకే పట్టుకొస్తాను."

అంటూ సునీత ముందుకు సాగింది. ఈలోగానే హరిప్రసన్నుడు వెనక్కు తిరిగి వచ్చేశాడు.

హరిప్రసన్నుడి హృదయంలో ఒక కొత్త భావం ఉదయించింది ఇవాళ. ఈ భావం అతనిలో కొన్నాళ్ళ నుంచీ అస్పష్టంగా ఉండిఉండవచ్చు. కాని ఇవాళ అది సుస్పష్టంగా కళ్ళముందు సాక్షాత్కరించింది. ఇప్పుడు సునీత గృహిణి, గృహంలో ఉంటోంది. ఈమె రణరంగంలో వీరవిహారిణి ఎందుకు కాకూడాదు ? పురుషులకు సాహసం ఎక్కడినుంచి లభిస్తుంది? యువకులకు స్ఫూర్తి ఎక్కడినుంచి సంప్రాప్తమాతుంది ? ఉన్మాదం ఎక్కడినుంచి లభ్యపడుతుంది ? జీవితాశ అతనిలో ఎలా మేల్కొంటుంది ? వీటన్నింటికోసం ఒక యువతి ఆవశ్యకత ఉంది. ఆమె దేవి, చండి, మాయ - ఎవరైనా కావచ్చు. కేవలం కర్తవ్య దీక్షలోనే ఉత్సాహం లేదు, ఉత్సాహం ఆ మాయాదేవి ఆకర్షణచేత జాగృతమాతుంది. మాయ భోగ్యవస్తువుకాదు. మాయ మరీచిక. మాయామయియైన స్త్రీ ఇంట్లోనే పడివుండటం దేనికి ? బృహత్ క్షేత్రంలోకి ఎందుకు దూకి రాకూడదూ ? వదినగానే ఎందుకు ఉండాలి ? జండా పుచ్చుకుని పురోగామి ఎందుకు కాకూడదు ?

విధవశాన తాను ఇక్కడికి రావటం, సునీతతో పరిచయం ఏర్పడటం... తటస్థించింది. ఆమె తత్వం బాగా అర్థంచేసుకుని, ఆమెను ఒక ఉపయోగకరమైన మార్గంలో

పెట్టాలి తాను. అందుకే తనకీ అవకాశం లభించిందేమో! తన దశానికి ఒక ద్యాత్రి ఇప్పుడవసరం. యువకులకు నిండు స్ఫూర్తిని ప్రసాదించే స్త్రీమూర్తి అవసరంగా కావాలి. "ఆ మూర్తి ఈవిడే" అని స్ఫురించింది హరిప్రసన్నుడికి ఇవాళ, సునీతను చూచాక.

గదిలోకి వచ్చి కూర్చున్నతరువాత అతని హృదయంలో ఈభావమే చిత్రవిచిత్రంగా, చిగిర్చింది, మొగ్గ దొడిగింది, వికసించింది. సునీత ఒకయింట్లో నాలుగుగోడల మధ్య పడియుండవలసిన వ్యక్తి కాదు. అతడు ఇన్నాళ్ళనుంచీ కలలు కంటోన్న స్త్రీమూర్తి ఈవిడే. సజీవమైన లేత మొక్క మట్టి అడుసు క్రింద, రాళ్ళరప్పలక్రింద అణిగి పడిఉండాల్సిందేనా? ఏనాటికైనా అది పైకిలేచి శాఖోపశాఖలుగా విస్తరించి స్వయం వ్యక్తిత్వాన్ని పొందనక్కర్లేదా? పరిశీలనాశక్తి ఏర్పడనంతవరకు వ్యక్తి అణిగిమణిగి పడి ఉండాల్సిందే. వ్యక్తి తన స్వీయవికాసాన్ని పెంపొందించుకోటంలో తన బాధ్యతను గుర్తించలేకపోతే పరిశీలనాశక్తి ఏర్పడలేదన్న మాట! అలా అణిగి పడిఉండకూడదు. ఆమె తన ధర్మాన్ని గుర్తించాలి; వెనుకపడి ఉండకూడదు.

సునీత ఫలహారపు పళ్ళెం తీసుకుని వచ్చింది. చీర, రవిక, జుట్టుముడి, ముఖాన బొట్టు...ఇప్పుడు మనిషి మామూలుగా ఉంది.

హరిప్రపన్నుడు స్వయంగా లేచివచ్చి, ఆమె చేతిలో నుంచి పళ్ళెం అందుకున్నాడు. "కూర్చోవదినా! పళ్ళెం నేను అవతలపెట్టి ఉంచుతాను. ఇప్పుడాకలి ఏమీ లేదు నాకు.

నువు కూర్చో. చిత్రం గీయటం పూర్తి అయిపోయింది. ఇంకా నేనెందుకూ ఇక్కడ ఉండటం?" అన్నాడు.

"చిత్రం పూర్తి అయినట్టు కనిపిస్తూనే ఉంది. కాని అదేమిటీ?"

సునీత కుర్చీలో కూలబడి చిత్రాన్ని చూస్తోంది. చూస్తోన్నకొద్దీ ఆమెకు అయోమయంగా ఉంది. ఏదో పెద్ద గుహ. దానిముఖద్వారం తెరిచే ఉంది...రండి రండి అని పిలుస్తున్నట్టుగా. కాని అందులోకి జొరబడ్డతర్వాత మళ్ళీ బయటికి రావటమంటూ ఉంటుందా? ఏమో! ఆ గుహకు అంతం ఉన్నట్టులేదు. ఆ గుహాముఖద్వారంలో తాను నిల్చి చూస్తున్నట్టుగా అనిపించింది సునీతకు. 'ఏమిటిదీ?' అని అడగాలని ఆమె కోరిక. ముందుకు సాగిపోయే సాహసం లేదామెకు. ముందునుంచి పిలుపు మాత్రం వినిపిస్తోంది - 'ముందుకురా; ముందుకురా' అని. ఆ పిలుపేమిటో, ఎక్కడిదో తెలుసుకోవాలని ఆమె కోరిక. ఇలా ఉంది - ఆమె స్థితి - ఆ క్షణాన.

చిత్రం ఆమెను ఆకర్షించినమాట వాస్తవమే. ముఖం తిప్పకుండా అటువైపే చూస్తోంది. కాని ఆమెకు అదేమీ అర్థం కావటంలేదు. అర్థంచేసుకోవాలని ఎంత ప్రయత్నించినా అదొక నిగూఢ రహస్యంగానే ఉండిపోయింది.

హరిప్రసన్నుడు ఆమెస్థితిని గమనించాడు. చేతిలోని పళ్ళేన్ని అవతల పెట్టేశాడు. ఆమె కూర్చున్న కుర్చీకి వెను వచ్చి నిల్చున్నాడు. తనకుడిచేయి ఆమె బుజంమీదవేసి "వదినా!" అన్నాడు.

"ఏమిటిది?" సునీత అడిగింది-చిత్రం చూసి తానేమో భయపడిపోయినట్టు.

"అదా? అది జీవితం. దాని క్రూసిఫిక్షన్!"

ఇంతవరకూ అతనిచేయి ఆమె భుజంమీదే ఉంది - ఆ సంగతి ఆ భుజానికి తెలియనేలేదనట్టు. కాని ఇప్పుడు, "అదికాదు-అదికాదు" అని ఆ భుజం పలుకుతున్నట్టు తోచి హరిప్రసన్నుడు అక్కడనుంచి చెయి తీసివేశాడు.

సునీత కుర్చీ పక్కకు తిప్పుకుని కూర్చుంది. "ఈ చిత్రంలోని భావం ఏమిటో చెప్పగలరా?" అని అడిగింది.

"పూర్తిగా నాకూ తెలియదు. ఏం చెప్పేది?"

"ఇలాంటి చిత్రాలు గీస్తుంటే మీకు సుఖంగా ఉంటుంది కాబోలేం?"

దీనికి హరిప్రసన్నుడు వెంటనే జవాబు చెప్పలేదు. ధ్యానపూర్వకంగా ఆమెవైపు చూచాడు కాసేపు. చివరకు తానూ ఒక కుర్చీలో కూర్చుని ఇలా అన్నాడు : "నా సుఖంమాట అలా ఉంచు. ఏదో అనుభవిస్తూనే ఉన్నాను. కాని నా కొక్క సంగతి తెలుసుకోవాలని ఉంది. వివాహమంటే ఏమిటని నీ ఉద్దేశం? వివాహం చేసుకోటం కంటే మరి వేరే కర్తవ్యం ఏమీ లేదంటావా? పెళ్ళిచేసుకున్నంత మాత్రాన జీవితం కృతార్థమైనట్టేనా? నువు అలాగే భావిస్తుంటే మాత్రం... అది చాల పొరపాటు సుమీ అని చెప్ప దలచుకున్నాను."

సునీత ఏమీ మాటాడలేదు. వింటూ కూర్చుంది.

"నువ్వు నిజంగా పొరపాటులోనే ఉన్నావు. బయట ప్రపంచంలో ఏమి జరుగుతున్నదో తెలుసా? లక్షలాది పేద ప్రజలు నానా బాధలు పడుతున్నారు. వాళ్ళ అవస్థకు అంతులేకుండా ఉంది. వాళ్ళ దుస్థితి ఇంట్లో కూర్చుంటే మనకేం కనిపిస్తుంది? వాళ్ళ దుఃఖం అంతా వాళ్ళదేనా? మనకేం బాధ్యత లేదూ? ఇందులో మనదోషం ఏమీ లేనట్టు నిశ్చింతగా ఉండగలమా? 'వాళ్ళ తాపం మనకేమీ అంటటం లేదుకదా! మనకేం?' – అని నిర్లక్ష్యంగా మనకేమీ పట్టనట్టు ఉండవచ్చా? ఉండకూడదు. అదే పొరపాటు. బయట ఇంత ఆకలిమంట రేగుతూఉంటే ఇంట్లో మనం దుప్పటి కప్పుకుని, కళ్ళుమూసుకుని పడుకోటాని వీల్లేదు."

సునీత విషణ్ణచిత్త అయింది. "అయితే నన్నేం చెయ్యమంటావు?"

"నేను ఏం చెయ్యాలనుకుంటున్నానో అదే. నేను నడుము బిగించి బయలుదేరాలనుకుంటున్నాను. ఈ విశాల విశ్వంలో దైన్యాన్ని, దారిద్ర్యాన్ని రూపుమాపుతాను. ఆకలితో అల్లాడిపోతున్నవారికి అన్నం లభించేట్టు చేస్తాను. భయభీతులకు ధైర్యాన్ని ప్రసాదిస్తాను. గర్వపోతుల మదాన్ని అణగిస్తాను. సమాజంలో స్వార్థపరులు నిర్మించిన అడ్డుగోడల్ని పునాదులతో పెకలించివేస్తాను. ఆర్తుల హాహాకారాలు వినిపిస్తోంటే నీ దృష్టి అటువైపు మరలాలి; నీ అడుగులు అటువైపు సాగాలి. నేను కోరేది అదీ! ఈ పనులన్నీ చేయగల అధికారం అందరికీ ఉండకపోవచ్చు. కాని ఆర్త

జనుల పిలుపు చెవిని పడినతర్వాత... అది వినపడనట్టు, మన కేమీ పట్టనట్టు మెదలకుండా ఊరుకోటం వట్టి కృతఘ్నత వదినా—"

"విశదంగా చెప్పు. నే నేం చెయ్యాలని నీ కోరిక?"

"వదినా, కొంతమంది ఉన్నా రక్కడ. అనుభవం ఎక్కువ లేనివాళ్ళే! పిడికెడుమంది మాత్రమే; అయినా యువకులు, కృతనిశ్చయులు. చిన్నవాళ్ళయినా ప్రాణభీతి మెరగరు. వదినా! వాళ్ళకు ఒక ప్రతిమ కావాలి, ఒక స్త్రీ, ఒక మాత, ఒక మాయామూర్తి వాళ్ళకు కావాలి. ఆమె తోటి స్నేహం, ఆమెవల్ల స్ఫూర్తి వాళ్ళకు లభ్యం కావాలి. ఆమె ముందు వాళ్ళు శపథంపూని ముందడుగువేసి సాగి పోతారు. ఆమూర్తి నువ్వే కాకూడదా? ఆ శక్తి నువ్వే నని నాకు తోస్తున్నది."

సునీత చాల ఖిన్నురాలైంది. "మీరు నన్ను గురించి చాల పొరపాటు పడుతున్నారు. నేను ఇంట్లో ఉండి ఇల్లు చక్కపెట్టుకోవలసినదాన్ని. అంతకుమించి నాకేమీ తెలియదు."

తలవంచుకుని క్రిందికి చూస్తున్న సునీత ముఖం పరికిస్తూ హరిప్రసన్నుడు అన్నాడు: "నువు ఎటువంటిదానివో నాకు తెలుసు వదినా! ఎట్టయెదుట వచ్చి నిల్చిన కర్తవ్యం నుంచి నువు ముఖం తప్పించలేవు. నువు నీ శక్తిని తప్పకుండా తెలుసుకోగలుగుతావు. నీలో అన్ని సామర్థ్యాలూ ఉన్నాయి. నువు యిల్లు విడిచిపెట్టలేనంటావా; ఎదురొౌకున్న కర్తవ్యం

విషయంలో నువ్వు చేయగలిగింది చెయ్యకుండామాత్రం ఎలా ఉండగలవు ?"

"ఇంతకూ చెయ్యవలసిందేమిటి ?" - సునీత కంఠ స్వరంలాగా లేనేలేదు. ఎవరో మాటాడినట్టుగా ఉంది.

హరిప్రసన్నుడు స్థిరంగా ఆమె ముఖంలోకి చూస్తూ "రేపురాత్రి నాతోకూడా వస్తావా ?" అని అడిగాడు.

"ఎక్కడికీ ?"

"తెల్లవారేలోగా తిరిగి రావచ్చు. అడవిలో కొంత దూరం వెళ్ళాలి."

"వస్తాను."

"వస్తావు కదూ ?"

"వస్తాను" అని ఒక సారి పలికి రెప్పవాల్చకుండా అలానే చూస్తూ ఉండిపోయింది.

"వస్తావుకదూ ! వదినా ! ఇప్పటికైనాసరే, ఇష్టం లేకపోతే రానని చెప్పేసెయ్యి."

సునీత మాటాడలేదు.

"వదినా !" అంటూ హరిప్రసన్నుడు ముందుకు సాగి వచ్చి... ...స్థిరంగా కూర్చునిఉన్న సునీత కుడిచేయి తన చేతిలోకి తీసుకున్నాడు.

సునీత తన చేయి వెనక్కు తీసుకోలేదు. స్థిరంగా అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది.

హరిప్రసన్నుడు మిక్కిలి ప్రార్థనాపూర్వకంగా ఆమె హస్తానిఎత్తి తలపై పెట్టుకున్నాడు.

"వదినా ! నీపేరు మాయారాణి" అన్నాడు.

వదిన ఏమీ మాటాడలేదు.

# 35

ఆనాడు సునీతకు లాహోరునుంచి ఉత్తరం వచ్చింది. ఉత్తరాన్ని ఆమె చాలసార్లు చదువుకుంది. మళ్ళీ ఇప్పుడు పడుకోబోయేముందుకూడా చదువుకోటానికి తీసింది. ఆ ఉత్తరమే తనకిప్పుడు ఓదార్పు కలిగించే తోడునీడ. కాని అందులో ఒక రహస్యంకూడా వుంది. అదిలా వుండగా... "రాత్రికి నీతో వచ్చేస్తాను" అని తన చెయ్యి హరిప్రసన్నని చేతుల్లోకి తీసుకోనిచ్చి... తాను మాట యిచ్చింది కదూ !

ఇంటి పనులన్నీ అయిపోయాయి. ఇక పడుకుని నిద్రపోవటమే పని. నాలుగువైపులా విశ్రాంతి ఆవరించి వుంది. ఆమె కన్నులు ఉత్తరంమీద పడ్డాయి. వెంటనే తీసి అందుకుంది. తనకది మంగళపాఠం; కవచం. విప్పి మరొకసారి చదువుకుంది.

అది శ్రీకాంతుడు రాసిన వుత్తరం—

"ప్రియా, సునీ !

"నేనింకా ఇక్కడ నాలుగైదు రోజులు వుంటాను. కోర్టుపని మాత్రం ముగిసింది. అయినా నాలుగైదు రోజులు ఇక్కడే వుంటాను.

"హరిప్రసన్నుడు అక్కడే వున్నా డనుకుంటాను. అతని కేవిధమైన కష్టమూ కలగకుండా చూస్తూవుండు.

పారిపోనీయవద్దు. అతనివిషయమై నాలో కలిగే ఆలోచనలన్నీ వివరించటం కష్టం. అతడెందుకలాగ ఏకాంతంగా, బంధితుడులాగా, చీకటిలో వుంటాడో నాకు బోధపడటం లేదు. నిజానికి అతడు మనందరికన్నా స్వతంత్రుడు. కాని ఆ స్వేచ్ఛ అతని ముఖంలో కనిపించదేం? మనిషిలో ఉల్లాసమనేదే లేదేం? ఏదో లోటుతో బాధపడుతున్నవాడులాగే వుంటాడేం?

"అతడు ఏవిషయమై ఎట్టి భావాలు ప్రకటించినా నువు కోపం తెచ్చుకోకు. సునీ! నువు నన్ను బాగా ఎరుగుదువుకదా! నువు ఏమిచేసినా నే నెప్పుడూ అపార్థం చేసుకోను. నేను ఒక్క విషయం కోరుతున్నాను. కొద్దిరోజులపాటు నువు నన్ను పూర్తిగా మరచిపో. నా విషయమైన ఆలోచనే పెట్టుకోకు. అందుకోసమనే నే నిక్కడ ఇంకా కొన్నాళ్ళు ఉండదలచిందికూడా. హరిప్రసన్నునిలో మంచి శక్తిసామర్థ్యాలు ఉన్నాయి. కాని వాటివల్ల ప్రపంచానికి ఏమిలాభం ఒనగూడుతోంది? అదీ నాకు కావాలి. అతని శక్తిసామర్థ్యాలు వ్యర్థంకాకూడదు. అతన్ని సమాజానికి ఉపయోగించే వ్యక్తిగా తయారుచెయ్యడానికి మనం ప్రయత్నించాలి.

"సునీ! అతని ఆంతరంగిక ప్రకృతి ఎలాంటిదో నాకు తెలియదు. అయినాగానీ నువు పూర్తిగా అతని ఇచ్ఛానుసారమే నడచుకుంటూ ఉండు. నేను లేననే అనుకో. నీకు కామ్యకర్మగాని, నిషిద్ధకర్మగాని - ఏదీ లేదనే భావించు. కర్మలయందు నీకు అనాసక్తి ప్రాప్తించినా నాకిష్టమే.

అందుకు నిజంగా ఎంతో సాధన అవసరం. కాని నువ్వు ఆ పని చెయ్యగలవు. ఒక గడ్డిపోచ ప్రవాహంలో కొట్టుకుపోతూ ఉంటుంది. ప్రవాహంతోపాటు తానూ పోతుంది; కష్టమేం లేదు. దైన్యపడిమాత్రం తా నేం చెయ్యగలదు? మనిషికి లాగ దానికీ అహంకారం ఉన్నదంటే......ప్రవాహంలో కొట్టుకుపోక మానదు......కాని ఏడుస్తూ, కేకలుపెడుతూ కొట్టుకుపోతుంది. ఈ నాలుగు రోజులూ నన్ను నీవు పూర్తిగా మరచిపొమ్మని కోరుతున్నా. నాలుగైదురోజులు నే నిక్కడ విశ్రాంతిగా కాలక్షేపం చేస్తాను. చూడదగిన విశేషాలన్నీ చూచివస్తాను. నువ్వు మాత్రం నీ మనస్సులోనుంచి నన్ను పూర్తిగా చెరిపివెయ్యి. ఈ కొద్దిరోజులూ నేను లేననే అనుకుని కాలం గడుపు.

"రోజూ సత్య మనింటికి చదువుకునేందుకు వస్తూన్న దనే అనుకుంటాను. హరిప్రసన్నుడామెకు పాఠాలు చెబు తున్నాడనే అనుకుంటాను. హరిప్రసన్నుడు మనింట్లో ఎందు కున్నాడు? ఎన్నాళ్ళుంటాడు? - అన్న ప్రశ్నలు మన కన వసరం. అది అతని యిష్టం. మన యిల్లతనికి కొన్నాళ్ళ పాటు ధర్మశాల వంటిది. నువుమాత్రం అతని వైరాగ్యాన్ని ఏకొంచెమైనా తగ్గించగలిగితే......అతనిలో ఎక్కడో నిద్రాణమైయున్న స్పృహను మేల్కొల్పగలిగితే...ఎంతో శుభం చేకూరిందన్నమాట. హరిప్రసన్నుని విషయంలో అది అసంభవమని నేను అనుకోను. అతడేం మహాత్ముడు కాడు. అతడు కళాకారుడు. కళాకారులను నే నెరక్కపోలేదు. అంతకు మించినవాడేమీ కాదు. కళాకారుడు కేవలం దేశ

ద్రిమ్మరిగా, ఉద్భ్రాంతుడుగా ఉండకూడదు. ఒక ప్రయోజనకరమైన కార్యంలో నియుక్తుడై వుండాలి. అప్పుడే అతడొక పెద్ద శక్తిగా తయారౌతాడు. లేకపోతే తన్ను తానే తినివేసుకుంటాడు.

"సునీతా! నువు నా హృదయం అర్థంచేసుకుంటావని ఆశిస్తున్నా. అన్యథా భావించవనికూడా తలుస్తాను. హరిప్రసన్నుడు ప్రయోజనకరమైన కార్యకలాపంలో నడుము బిగించి ముందుకు రావాలి; అతడొక 'ఐడియా' ప్రసాదించాలి; ఆ ఐడియా సమాజంలో మొలకెత్తి ఫలవంతం కావాలి. అటువంటి సుదినంకోసం నేను ఎదురుచూస్తున్నా. హరిప్రసన్నుని ప్రతిభలో అటువంటి బీజం ఉంది. కాని అది సహానుభూతిచేత ఆర్ద్రమైగాని అంకురితం కాదు.

"ఇందుతో జతచేసిన మరో ఉత్తరం హరిప్రసన్నునికి ఇవ్వు.

సీ,

శ్రీకాంత్."

నిద్రపోయేలోపల ఈ ఉత్తరం సునీత మరోసారి చదివింది... అందులోని భావం సరిగా బోధపడలేదేమోఅన్నట్టు. హరిప్రసన్నునికి రాసిన ఉత్తరం ఇంకా అతనికి ఇవ్వలేదు. 'ఇద్దాంలే, తొందరేమిటి' అనుకుంది. ఇక ఇప్పుడు అతని ఉత్తరంకూడా చదవకుండా ఉండలేకపోయింది. చదివేసింది.

"ప్రియ హరీ!

"నేనింకా కొన్నాళ్ళు లాహోరులోనే ఉంటాను; పని ఉంది. నువు ఈలోగా వెళ్ళిపోయేవుసుమీ! చిత్రం

బాగా తయారౌతున్నదా? అది మంచి ప్రముఖమైన కళా ఖండంగానే తయారౌతుందని నా నమ్మకం. నేను వచ్చేంత వరకూకూడా నువు ఆ చిత్రంలోనే మునిగివుంటా వనుకుంటా. ఉంటే ఉండు. నా అభ్యంతరం ఏమీ లేదు. అనేకసార్లు నీతో కొన్ని విషయాలు మాటాడదామను కున్నాను. కాని నువు ఎప్పుడూ చిత్రలేఖనంలో లీను డవై ఉండటంవల్ల ఏమీ ప్రసంగించటానికి వీలైందికాదు. ప్రపంచం ఉండవలసిన రీతిలో లేదు. ఆ సంగతి నీకూ తెలుసు. దాన్ని సవరించాల్సిన, సంస్కరించాల్సిన అవసరం ఉంది. అందుకుగాను సముచితమైన కార్యక్రమం నువు నిర్ణయించ గలవని నా ఆశ. ఆపని చెయ్యవలసిందిగా నిన్ను చాలా చాలా కోరుతున్నాను. రివాల్వరును అవతల పారేసెయ్యి. రివాల్వరు రోగిని చంపేస్తుంది; కాని రోగాన్ని నిర్మూలించ లేదు. రోగం వ్యక్తిని పీడిస్తుంది. రోగం సంఘంలో వ్యాపించిపోతుంది, నిల్చిపోతుంది. పిరికితనపు పరిణామమే రివాల్వరు. అధైర్యంవల్ల రోగనిదానం సాధ్యమా? రోగం నయమౌతుందా? వర్తమాన పరిస్థితులు విషమంగా ఉన్న ప్పుడు అసంతృప్తి కలుగుతుంది. ఆ అసంతృప్తినుంచి తేలిగ్గా సెలవు పుచ్చుకోటానికి రివాల్వరు ఒక సాధన. కాని ఎంత మింగుడుపడని పరిస్థితియైనా కంఠందగ్గరే ఆపేసి, ధైర్యంగా బ్రతికిఉండాలి. ఈ అసంతృప్తిని అనుభవిస్తూనే పనిపాటలు సాగించుకుంటూ ఉండాలి. తేలిగ్గా సెలవు కావాలంటే ఎలా దొరుకుతుంది?

"హరీ! నువు రివాల్వరు అవతల పారేశావని వింటేనే నేను సంతోషిస్తాను. అప్పుడు నువు నీ కర్తవ్యాన్ని గుర్తించావని భావిస్తాను; నీలో మిగిలిఉన్న మమతను త్యజించావని అనుకుంటాను.

"సత్య రోజూ చదువుకోటానికి వస్తోందికదూ? నువు ఆమెకు పాఠాలు చెబుతున్నావుకదూ?"

"మీ వదినెదగ్గర నువు ఏమీ సంకోచపడనవసరం లేదు. ఏవిధంగానూ యిబ్బంది పడవద్దు. ఆమె నిన్ను యిబ్బంది పడనీదని నాకు తెలుసు—

భవదీయుడు

శ్రీకాంత్."

ఉత్తరంచదివాక దాన్ని తీసుకుపోయి హరిప్రసన్నుడికి ఇద్దామని ఆమె హఠాత్తుగా లేచి బయలుదేరింది.

హరిప్రసన్నుడు గదిలో మంచంవేసుకుని పడుకున్నాడు. ఇంకా నిద్ర పట్టలేదు. ఒక్కొక్కప్పుడు అవసరమని తోస్తే మంచం తెచ్చి వేసుకుంటాడు; ఉదయాన్నే లేచి తానే మంచం ఎత్తి బయట పెట్టేస్తాడు. ఇంకా నిద్ర పట్టలేదు. కాని లైటు వేసుకోకుండానే పడుకున్నాడు. గది బయట వరండాలో వెన్నెల వెలుగు పడింది. అది చూస్తూ ఏమాలోచించుకుంటున్నాడో మరి!

సునీత గదివరకూ వచ్చింది. లోపల చీకటిగా ఉండటం చూచింది. "ఓహో, నిద్రపోయారు కాబోలు"— అని పలికి తిరిగి వెళ్ళిపోతోంది. ఒకవేళ హరిప్రసన్నుడు

నిద్రపోకుండా ఉన్నట్టయితే ఆమాటలు అతనిచెవిని బడే లాగే సునీత పలికింది.

వదినగారి కంఠస్వరం వినగానే హరిప్రసన్నుడికి గుండె ఉబికింది. "రా, వదినా!" అన్నాడు అప్రయత్నంగా.

సునీత సంకోచిస్తూ అలానే నిల్చుంది.

హరిప్రసన్నుడు మంచంమీద లేచి కూర్చున్నాడు. "రా, వదినా! నే నింకా నిద్రపోలేదు" అన్నాడు.

గదిలో కొంచెం కొంచెంగా కనిపిస్తోంది. అతడు లేచి లైటు వెయ్యలేదు. లైటు వేసినతర్వాత వెడదామా? లేక చీకటిగా ఉంటేమాత్రం వెడితేయేం? ఇలా కాసేపు ఆలోచిస్తూ నిల్చుని చివరకు ముందుకు సాగి వచ్చేసింది. లోపలికి వస్తూ తానే లైటు వేసింది. ఆమె యేమీ మాటాడలేదు. మంచంమీద కూర్చున్న హరిప్రసన్నుడికి ఉత్తరం ఇచ్చి, అక్కడే మంచంకోడుదగ్గర నిల్చుంది.

హరిప్రసన్నుడు ఉత్తరం విప్పలేదు. ఆమెవైపే చూస్తున్నాడు. "కూర్చో వదినా!" అన్నాడు.

కూర్చోటానికి ఇష్టంలేకనో యేమో సునీత వెళ్ళిపోటానికి ఉద్యుక్త అయింది.

వదిన కూర్చుంటుందనే అతడనుకున్నాడు; తన మంచంమీదే వచ్చి కూర్చుంటుందని అనుకున్నాడు. కాని ఆమె వెళ్ళిపోటానికి ఉద్యుక్త అయేసరికి "కుర్చీ తెస్తాను, కూర్చో వదినా!" అన్నాడు.

"నేను కూర్చోనులెండి. ఆ వుత్తరం నిన్న మధ్యాహ్నం రెండుగంటలకు వచ్చింది. మీకు ఇవ్వటానికి జ్ఞాపకం లేకపోయింది. చదువుకోండి. నేను ఇక్కడే నిల్చుంటాను."

"కూర్చోవా?" అంటూ అతడు ఆమె ముఖంలోకి చూచాడు. ఆ వుత్తరం ఆమె చదివి వున్నట్టే అతనికి అర్థం అయింది. ఆమెను అలా నిల్చుని వుండనీయటమే మంచి దనుకున్నాడు.

ఉత్తరం చదువుకున్నతరువాత హరిప్రసన్నుడికి కోపం వచ్చేసింది. ఆపత్సమయాల్లో అతను నవ్వగలడు. కాని ఎవరైనా అతనిపట్ల సానుభూతి చూపిస్తూంటే అతనికి భయం వేస్తుంది. ఎవరైనా సలహా చెబితే కోపం వస్తుంది. నిజానికి తనలోని ద్వేషభావమే తన రివాల్వర్‌లో మూర్తిగట్టి ఉంది. గమ్యం చాల దూరమాయెను; అందుచేత రివాల్వరు ద్వారా దగ్గరదారి ఏర్పరచుకుందామని అతని ఉద్దేశం. ఈ రహస్యాన్ని శ్రీకాంతుడు పట్టేశాడు. గుట్టు బయటపడినప్పుడు ఎవరికి కోపం రాకుండా ఉంటుంది? ప్రతివాడికీ ఏదో గుట్టు ఉండనేఉంటుంది. ఎవడిగుట్టు వాడు కాపాడుకోటానికే చూస్తాడు. ఒకసారి ఉత్తరమంతా చదివాక, మళ్ళీ అతని దృష్టి ఆ మాటలమీదే పడ్డది. పదం పదం పట్టిపట్టి చదువుకుంటున్నాడు. ఇంతలో వినిపించింది సునీత కంఠస్వరం— "రివాల్వరు మీ దగ్గర వుందా?"

హరిప్రసన్నుడు చకితుడై ఆమెవైపు చూచాడు.

"ఉన్నదా?"

హరిప్రసన్నుడు అలాగే చూస్తూ ఉన్నాడు.

"మీదగ్గర రివాల్వరు ఉందా?"

"ఉన్నదని నేను చెప్పేట్టయితే—"

"ఉంటే మరి ఉన్నదని చెప్పరేం?"

"ఉన్నది."

"ఎక్కడుందీ?"

"ఇక్కడే."

"రివాల్వరు పేల్చటం మీకు తెలుసా?"

"తెలుసు—"

"తోటాలుకూడా ఉన్నాయా?"

"ఉన్నాయి."

సునీత తనంతట తానే కుర్చీ లాక్కుని కూర్చుంది. "ఏదీ, నాకు చూపించండి."

హరిప్రసన్నుడు మంచం మీదనుంచి లేచి నిల్చున్నాడు. "ఏమి టీ కథంతా వదినా! ఉత్తరం నువు యిదివరకే చదివినట్టున్నావే!"

"ఔను, చదివాను. ఇంతకూ రివాల్వరు ఎలా ఉంటుందో, ఏమిటో చూపిస్తారా లేదా?"

"రేపు రాత్రి నువు నాతో వస్తున్నావుగా వదినా! ఒకటేమిటి? పిస్తోళ్ళు చాలా చూద్దువుగాని. అవన్నీ నీ పాదాలముందు ఉంచుతాం. అవన్నీ నీవే ఔతాయి. ఈ ఒక్కదానికే అంత తహతహలాడతావేం వదినా? అయినా అందులో ఏముంది? ఏమీలేదని శ్రీకాంతుడు రాసిన మాట సరైనదే. దానికోసం నీకెందు కంత ఉత్సుకత? అది

లోహంతో తయారైన యంత్రం. తేలులాంటిదికూడా కాదు. తేలుకున్నంత పరిజ్ఞానంకూడా దానికుండదు. అటు వంటిదానికోసం నీకంత కోరిక ఎందుకు ?"

ఏమావేశించిందో మరి సునీతను! గబగబా లేచింది కుర్చీలోనుంచి. మంచందగ్గరకు వచ్చింది. వంగి అతని కుడి చేతి వేలు పుచ్చుకుని లాగుతూ "ఏదేదీ, నాకు చూపించు; ఎక్కడుందీ ? నేను చూడాల్సిందే, తప్పదు" అన్నది.

వదిన సునీతలో బాలిక సునీతకూడా ఉంది. ఆ బాలిక బయటపడి మారాము చేస్తూండటం హరిప్రసన్నుడు చూచి ముగ్ధుడైనాడు. ఆసమయాన సునీత అతనికి అతిమనోహరంగా కనిపించింది.

"నేను తప్పకుండా చూడాల్సిందే. ఎక్కడుందో చెప్పు."

హరిప్రసన్నుడు బిగ్గరగా పకపకా నవ్వాలనుకున్నాడు; కాని నవ్వలేకపోయాడు. "ఏమో, నాకు తెలీదు; నా కసలు తెలీదు." అన్నాడు...ఎంతో ఉత్సుకురాలై తనముందు నిల్చిన ఒక బాలికయెదుట తానూ ఒక బాలకుడై.

"చూపించవా అయితే ?"

"తప్పకుండా చూపించాల్సిందేనా ?"

"చూపించకుండా ఎందుకు తప్పించుకోవాలి ?"

'చూపించకుండా ఎందుకు తప్పించుకోవాలి ?' అని పలుకుతూన్న సునీతవైపు తనివితీరని చూపులు చూచాడు హరిప్రసన్నుడు. ఆ సమయాన ఆమె ముఖంలో ఒక విచిత్ర మైన శోభ ఒలికింది. చూచిచూచి హరిప్రసన్నుడు ఆమె

భుజాల్ని రెండు గుప్పెట్లలో అదిమిపెట్టి ఊపి "కూర్చో, వెళ్ళి తీసుకొస్తాను" అన్నాడు.

బుజాలుపట్టి లాగి మంచంమీద కూర్చోబెట్టి రొప్పు కుంటూ వెళ్ళి అలమారులో పెట్టిన పిస్తోలు, తోటాలు తీసుకువచ్చాడు.

సునీత ప్రక్కన మంచంపట్టె నానుకుని హరిప్రస న్నుడు ససంభ్రమంగా నిల్చుని పిస్తోలు పెట్టిన సంచీ, తోటాల పొట్లం ఆమెముందు పెట్టాడు.

సునీత మెల్లగా సంచిలోనుంచి పిస్తోలు బయటికి తీసింది. దానిరూపం, ఆకారం, ప్రయోగం ఆమెకేమీ బోధపడ్డంలేదు. జానెడుకంటే లేదు, ఇదొక ఆటవస్తువు కాదన్న భావం ఆమెకు కలగటంలేదు. అయినా లోపల ఒకవిధమైన భయంగానే ఉంది. తోటాలపొట్లం కూడా విప్పి వాటిని అదేపనిగా చాలసేపు చూచింది. పిస్తోలును కూడా అటూ ఇటూ పలుసార్లు తిప్పి పరిశీలించింది.

కాసేపు నిశ్శబ్దం. ఈలోగా హరిప్రసన్నుడు తన మనస్సునుని గ్రహించుకున్నాడు... జోరుగాపోయే గుర్రాన్ని కళ్ళెం పట్టుకు లాగి ఆపినట్టు. సునీతవైపు చూస్తూ నిల్చు న్నాడు. ఆమె వొళ్ళు తెలిసిన స్థితిలో ఉన్నట్టు లేదు. తన్ను తాను మరచిపోయినట్టుంది. ఇటువంటి మరపు ఈ స్థితిలో మంచిదికాదు. చాల అపాయకరం కూడాను.

ఉండి ఉండి సునీత అడిగింది: "ఈ తోటాలు పిస్తో లులో ఎలా నింపటం?"

హరిప్రసన్నుడు చూస్తూ మౌనంగానే ఉండిపోయాడు.

"ఎలా నింపటం ?" అంటూ సునీత పిస్తోలును ఇవ్వ బోయింది. హరిప్రసన్నుడు దాన్ని అందుకున్నాడు. సునీత అలాగే తోటాలూ తీసి అందించింది. హరిప్రసన్నుడు వాటినీ తీసుకున్నాడు. పిస్తోలు తెరచి లోపలికి తోటాలు జొనుపుతూ "ఇలా నింపుతారు" అని చూపించాడు.

"ఏదీ చూస్తాను."

"వద్దు—"

"చూస్తాను."

హరిప్రసన్నుడు తోటాలు బైటికి తీసేసి "ఊఁ చూడు" అని పిస్తోలు ఆమె కిచ్చాడు.

తెరచిఉన్న పిస్తోలు చేతిలో పుచ్చుకుని సునీత స్వయంగా తోటాలు అందులోకి జొనపటం తనకు చాత నౌనో కాదో ప్రయత్నించి చూచుకుంది.

హరిప్రసన్నుడు చిత్రపుబొమ్మలా నిల్చుని చూస్తు న్నాడు. ఆమెకు చాల ఎడంగానే ఉన్నాడు. తాను ఎందుకు సంకోచించాలో తనకే అర్థం కావటం లేదు. ఒంటరిగ త్తె; నిస్సహాయురాలు; రాత్రివేళ; తనమంచంమీదే వచ్చి కూర్చుంది; అయినాకూడా ఎంతో మనోజ్ఞంగా, నిశ్చింతగా తన పిస్తోలుతో ఆడుకుంటూ కూర్చుంది. ఎలాంటి మనిషి !

సునీత పిస్తోలులో తోటాలు పెట్టింది. "ఏదీ, పేల్చి చూపించు" అని అడిగింది.

హరిప్రసన్నుడు పిస్తోలును చటుక్కున అందిపుచ్చు కుని. "వదినా !" అన్నాడు.

సునీత కొద్దిగా నవ్వింది. "నామీద పేల్చమనటం లేదు లే."

ఆమెను చూస్తూంటే, ఆమె మాటలు వింటోంటే హరి ప్రసన్నడికి ఒకరకమైన మత్తెక్కినట్టుగా ఉంటోంది. ఆమెకు దగ్గరగా వచ్చాడు. ఆమె చెయి తీసి తన ఎడమచేతిలో గట్టిగా పుచ్చుకొని "ఏమిటి వదినా! ఏమంటున్నావు?" అన్నాడు.

"పేల్చి చూపించు."

"పేల్చి చూపించనా?"

"ఊఁ, పేల్చి చూపించు" పసిపిల్లలా అడిగింది సునీత. హరిప్రసన్నడు పిస్తోలు గొట్టాన్ని తన కణతకు సూటిగా ఆనించి ఆమె చేయి తన ఎడమచేతిలో ఉంచుకునే "పేల్చి చూపించమంటావా, వదినా! చెప్పు, పేల్చి చూపించనా?—" అన్నాడు.

సునీత ముఖంలో చీకటి కమ్మినట్టయింది. ఆమె భయపడ్డది. హరిప్రసన్నడిది గమనించాడు. "పేల్చి చూపించనా? వదినా!" అని మళ్ళీ రెట్టించి అడిగాడు.

భయంతో సునీత ముఖం తెల్లబారింది.

"నాకు చావాలని లేదు. అయినా పేల్చి చూపించమంటే చూపిస్తాను, అభ్యంతరం లేదు. నా జీవితానికి అర్థంలేదు; అందులో రసమూ లేదు... ...ఇది పేల్చటం పెద్ద పనేమీ కాదు. ఇదిగో గుర్రం; దీన్ని నొక్కేస్తే చాలు, 'ఢాం' మని పేలుతుంది. చెప్పు, వదినా! పేల్చమంటావా?"

సునీత హరిప్రసన్నుని ముఖంలోకి చూచింది. ఆ ముఖం భయంకరంగా ఉంది; నిశ్చయబద్ధంగానూ ఉంది. "ఇది నవ్వులాటే అనుకో. అయినాసరే; నువు ఊఁ అంటే చాలు, క్షణంలో ముగిసిపోతుంది. అయితేమాత్రం, తప్పేమిటి వదినా?" అని పలుకుతున్నట్టుంది అతని ముఖం.

సునీత వొణికిపోయింది. భయవిహ్వలయై "హరీ, హరీ" అంటూ వచ్చి తన రెండుచేతులతో అతని కుడి చెయ్యి కరచి పట్టుకుంది. ప్రార్థనాపూర్వకంగా "హరీ! హరీ!" అన్నది.

అప్పుడు హరిప్రసన్నుడు గదిబయట వరండాలోనుంచి ఆకాశంవైపు గురిపెట్టి, "ఇదిగో చూడు; ఇలా పేలుస్తారు" అంటూ గుర్రం నొక్కాడు.

పిస్తోలు పేలిన శబ్దం కొంతసేపటివరకూ సునీత హృదయంలో ధ్వనిస్తూనే ఉంది. తన రెండుచేతులతో అతని భుజాల్ని కరచి పట్టుకుని అలానే నిల్చుండిపోయింది.

ఆ నాలుగు నిమిషాల్లో హరిప్రసన్నునికి... తా నిదివర కెన్నడూ అనుభవించనిది... అనుభూతం అయింది. అతనికి సుఖం అంటే ఏమిటో రవంత తెలిసింది. కరుణ ఒలుకబోస్తూ అడిగాడు : "భయపడిపోయావా, వదినా!"

"ఆఁ, భయపడ్డాను. అది ఇలా ఇచ్చెయ్యి" అన్నది సునీత మెల్లిగా.

హరిప్రసన్నుడు నిట్టూర్పు విడిచాడు. "నువు అడగటమూ, నేను నిరాకరించటమూనా? అదెప్పుడూ జరగకూడదు. కాని ఇదిమాత్రం నేను ఇవ్వను."

సునీత అతని బుజాలు విడిచి ఇవతలకు వచ్చింది. తన చూపులు అతని కన్నుల్లోకి జొప్పించుతూ "సరేగాని, ఇక నెప్పుడూ ఈ ఆట ఆడవుకదా !"

C. P. BROWN
MEMORIAL LIBRARY
Acc. No 1220
Date
CUDDAPAH.

హరిప్రసన్నుడు మాటాడలేదు.

"ఇక ఆడవుకదా !"

హరిప్రసన్నుడికి నవ్వాలనిపించింది. కాని నవ్వటానికి ప్రయత్నించేసరికి ముఖం వికృతంగా వచ్చేసింది. నవ్వలేక పోయాడు. ఏదో గొణిగాడు.

"హరీ! నామాట విను. ఈ పిస్తోలుతో ఎప్పుడూ ఆడబోకు."

"ఆడను."

కాసేపు నిశ్శబ్దం. ఎవరూ మాటాడలేదు. ఎక్కడి వాళ్ళక్కడే నిల్చుండిపోయారు. సునీత నేలచూపులు చూస్తోంది. హరిప్రసన్నుడు ఆమెచూపులవైపు చూస్తున్నాడు. మరికాసేపటికి—

"సునీతా! ఆలస్యం అయింది. ఇక వెళ్ళిపో" అన్నాడు.

సునీతకు అప్పుడే నిద్రనుంచి మెలకువ వచ్చినట్టయింది. "ఇప్పు డెన్నిగంట లౌతుందీ ?"

"ఒంటిగంట ఔతుంది."

"ఒంటిగంటే?" అంటూ సునీత వెళ్ళిపోయింది. వెడుతూ వెడుతూ "హరీ! నువుకూడా నిద్రపో" అన్నది.

"ఆఁ, నిద్రపోతాను." వెడుతోన్న సునీతమీాదనుంచి చూపులు మరోవైపు తిప్పుకుని...ఆ మరోవైపుకే అదే పనిగా చూస్తూ కూర్చున్నాడు హరిప్రసన్నుడు.

# 36

రాత్రి చాల ప్రొద్దుపోయింది. అయినా సునీతకు నిద్ర పట్టలేదు. శ్రీకాంతుడు లేకపోయె. ఇప్పుడు శ్రీకాంతుడు తన ప్రక్కన ఉండవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అతడు తన భర్త; తనకు ఏడుగడ. భర్త ద్వారానే స్త్రీ జీవితానికి కృతార్థత. ఆ భర్తే ఎక్కడో దూరాన ఉండి పోయి ఎలాంటి ఉత్తరం రాశాడు?—'నేను లేననే అనుకో; నన్ను పూర్తిగా మరచిపో... ...' భర్తకు ప్రతినిధియైన ఈ ఉత్తరాన్ని విశ్వసించి తా నతన్ని పూర్తిగా మరచిపోవలసిందేనా? అతడు లేడనే అనుకోవాలా?

ఆమె ఆలోచనలు తెగటంలేదు. రేపురాత్రివరకే తన యీా జన్మ. రేపురాత్రికి పునర్జన్మ గైకోవలసిందేనా? ... ...ఆ యువకులు ఎవరు? వాళ్ళకేం కావాలి? ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని వాళ్ళ తాపత్రయం దేనికోసం?... వ్యక్తిత్వానికి పరిధి కుటుంబ పరివారమేనా? నేను అందులో పడి ఉండవలసిందేనా? దాన్ని అతిక్రమించి దాటిపోయి, యింతకన్నా ఒక విశాలాశయం లక్ష్యంగా ముందడుగు వెయ్యకూడదా? ఆ విశాలాశయం కోసమే బ్రతికి, తత్సాధనలో ప్రాణాలర్పించటం అయుక్తమా? అధర్మమా...ఓ నా దేవుడా! ఎక్కడున్నావు నువు? ఇలాంటి ఉత్తరం ఎందుకు రాశారండీ మీారు?...నన్ను పరీక్షించటానికా?

రేపురాత్రికి... వాళ్ళది ఎలాంటి జీవితం? అక్కడ ఆత్మత్యాగమే వ్యక్తి లక్ష్యం. స్వార్థచింత వాళ్ళకు ఏ కోశానా లేదు. అటువంటి మహదాశయాన్ని నేను నిరాకరించగలనా? ఎలా నిరాకరించగలను? - ఇంతకూ రేపు రాత్రి నేను వెళ్ళవలసింది ఎక్కడికి? ఓ నా దేవుడా! మీ రెక్కడున్నారండీ! చెప్పరేం? నా వ్యక్తిత్వాన్ని విడిచి పెట్టేసి, ధర్మాధర్మవిచారణ ఏమాత్రమూ లేకుండా, విధి ఎలా తీసుకుపోతే అలా - ఆ ప్రవాహంలో - నేను కిమ్మనకుండా కొట్టుకుపోవాలనేనా మీ ఉత్తరంలో అభిప్రాయం?

సునీత జీవితంలో ఎప్పుడూ ఇంత వివశురాలు కాలేదు. ఇదివరకెల్లా తానొక ప్రవాహమై శ్రీకాంతునికి అభిముఖంగా ప్రవహించి అతని పాదప్రక్షాళనం చేస్తూ ఉండేది.

ఈస్థితిలో ఆమె పక్కమీదనుంచి లేచి హరిప్రసన్నుడి దగ్గరకు పోవాలని ఉద్యుక్త అయింది. వెళ్ళి అతనితో ఈ విధంగా చెప్పేయాలని ఆమె ఉద్దేశం - "ఉహుం, నేను రాను. నేను ఈ యిల్లు విడిచి వచ్చేస్తినా ఇక బ్రతుకలేను. నేనంత యోగ్యురాల్నికాదు. మీ ఉద్యమం గొప్పదే; కాని నేనొక క్షుద్రవ్యక్తిని. ఈ యింటి నాలుగు గోడలమధ్యనే నాకు స్థానం. ఇల్లు ఒక జైలే కావచ్చు; కాని నాకు మోక్షంకూడా ఇక్కడే. దేశసమస్యలు నాకేం తెలుస్తాయి? నా భర్తనుమాత్రం నే నెరుగుదును; ఆయన నన్ను ఎంతగానో ప్రేమిస్తారు. వారిని నేను వివాహం చేసుకున్నాను. భగవంతుడు అందుకు సాక్షి. అగ్నిదేవుడు

అందుకు సాక్షి. సంఘంలో ఇంకా కొందరు పెద్దలుకూడా అందుకు సాక్షులు. ఆ వివాహబంధనం అరిగిపోయేదికాదు, విరిగిపోయేదికాదు, మాసిపోయేదికాదు. ధర్మం విరిగిపోయే దా? మేమంతా అల్పప్రాణులం, మాది క్షుద్రజీవితం అని నువ్వు అంటావు; అంటే అను. నాకు మాత్రం అదే గొప్పబ్రతుకు. నా స్వత్వాన్ని దేశంకోసం దానం ఇవ్వమని నువ్వు అడుగు తున్నావు. అది ప్రమాదం అని నేననను. కాని నా స్వత్వాన్ని నేను నా భర్తృసేవకే అర్పణచేస్తాను. తేడా ఏముంది? నా స్వత్వాన్ని నాదగ్గరే అట్టిపెట్టుకోను. అంతవరకే నాకు సాధ్యం. కాని దాన్ని ప్రజల చరణధూళిలో కలిపి వేయమనీ, దేశసేవలో విలీనంచేయమనీ కదూ హరి బాబూ! - నువ్వు అడుగుతున్నావు? దేశం విరాట్‌శక్తి, వ్యక్తి అల్పుడు - అని నువ్వు అంటావు. ఔను నిజమే. కాని నాకు దేశం అప్రాప్యం; వ్యక్తి నా యెదుట ప్రాప్యుడు. అతడు నా భర్త, నా దైవం. దేశం, సమాజం—సర్వం నాకు నా భర్తే. అతనిపాదాలు సోకిన నేలమీది ధూళిలో నేను లీనమైపోతాను. ఇంకా నా దగ్గర స్వత్వశేషం ఏ ముందని - నీ దేశంకోసం యిచ్చేందుకు? కాబట్టి అన్నా, హరీ! నేను రేపు రాను. ఇక్కడే ఉండిపోతా. పూర్వ వీరాంగ నలకు, వర్తమానకాలంలోని వీరాంగనలకు, ఇంకా ముందు అవతరించనున్న వీరాంగనలకు నేను నమస్కారం చేస్తాను. వాళ్ళను భగవంతుడే మనకు ప్రసాదించాడు. కాని నా యింటిమీదే నేను అసంతృప్తి పడతానా? నేను పరి పూర్ణత్వం యిక్కడే పొందలేనా? హరిబాబూ! నువ్వు

వెయ్యేళ్ళు బ్రతుకు. నీ సేవాధర్మం చాల గొప్పది; కఠోర మైనది. ముళ్ళదారి ఎన్నుకున్నావు. నువు వీరపురుషుడివి. కాని నా మార్గం ముళ్ళదారి కాదుకాబట్టి ఏవగించుకోనా? నా మార్గం విడిచిపెట్టి వచ్చేసేదా? నీ ధర్మం చాల దుష్కరమైంది; నన్ను ఆశ్చర్యపెడుతోంది. దాని ఆకర్షణ తట్టుకోలేకుండానే ఉన్నాను. నా ధర్మం చాల సరళ మైంది; అయినా అది నా ధర్మం. సరళమైనదే; అయినా అదే నాకు కఠినమైనదికూడా. ఈ నా ధర్మాన్ని విడిచి పెట్టేసి, వీరాంగనల మార్గంలోకి రమ్మని ఎందుకూ పిలు స్తావు? హరిబాబూ! నన్ను వదిలెయ్యి. రేపు రాత్రికి నేను రాను. అలా రాలేను."

ఇలా సాగిపోయాయి ఆమె ఆలోచనలు. మర్నాడు పగటిపూట వెళ్ళి, హరిప్రసన్ననితో 'నేను రా'నని చెబుదా మనుకుంది మొదట. కాని ఇప్పుడు ఈ విధమైన ఆలోచనలు హృదయంలో తీవ్రంగా సందడించేసరికి... అప్పటికి రాత్రి మూడుగంటలైన సంగతికూడా మరచిపోయింది... అప్పటి కప్పుడు లేచి హరిప్రసన్నని గదికి బయలుదేరింది.

కాని గదిలో ఎవరున్నారు? అంతా చీకటిమయంగా ఉంది. సునీత స్విచ్ వేసి దీపం వెలిగించి చూచింది. గది అంతా వెతికింది; పిల్చింది. కాని హరిప్రసన్న డెక్కడా లేనేలేడు. ఇంత రాత్రప్పుడు ఎక్కడికి వెళ్ళాడబ్బా! ఆమెకు ఆశ్చర్యం కలిగింది. వెంటనే మెట్లదగ్గరకు పోయింది. మెట్ల తలుపు తెరచి ఉంది. అది రోజూ రాత్రిళ్ళు తాళంవేసే ఉంటుందిమరి! హరిప్రసన్న డెక్కడికైనా బయటికి వెళ్ళా-

డేమో! ఎక్కడికి వెడతాడు?... ...సునీత పఠన మంది రంలోకి తిరిగి వచ్చింది. అలమారలో రివాల్వర్‌కోసం వెతికింది. కాని రివాల్వర్ అక్కడలేదు. తోటాలుకూడా ... ... ...ఒక్కటైనా లేదక్కడ. అతని సామానంతా ఉన్నదో లేదోననికూడా కలయజూచింది. అతని నార దుప్పటి అక్కడే కనిపించింది...చిత్రం గీస్తున్న కాగితం బోర్డుమీద తగిలించి ఉంది. బోర్డు గోడకానించి ఉంది. ఆ బొమ్మలో...అంధకార బంధురమైన ఆ స్థూపానికి ఎదురుగా రెండు బాహువులూ చాచి, ఎవరినో పిలుస్తున్నట్టుగా ఒక నగ్నపురుషుడు నిస్తబ్ధుడై నిల్చి ఉన్నాడు. వెడల్పయిన ఛాతి, బలిష్ఠమైన దేహం, కాని మిక్కిలిగా పిరికివాడై, దీనంగా ఉన్నాడు. సిలువలాగ చేతులు చాచి నిల్చిన ఆ పురుషుడు సునీత దృష్టుల్ని ఆకర్షించాడు. ఆమె అతన్నే చూస్తూ నిల్చుంది. ఆమెకు ఏమీ స్పష్టంగా అర్థం కావటంలేదు. అయినా ఆ చిత్రంలో ఒక రకమైన భయంకర ప్రతీక్ష ద్యోతకమౌతున్నట్టుగా ఉంది. అదొక అంధకార మయమైన స్థూపం. ఆ స్థూపంలో ఏముంది? ఏమన్నా ఒక ఆకారం ఉందా? బహుశః ఉన్నదేమో? ఉన్నదనుకున్నా అదేమిటో విశదం కావటంలేదు. అటువంటి తెలియరాని, గోచరంకాని, అంతుతెలియని ఆ స్థూపంముందు సిలువముద్ర వేసుకుని ఆ ప్రాణి ఏదో అడిగి తెలుకోవాలన్నట్టుగా, ఒక రకంగా నిల్చి ఉన్నాడు. అతడు నిల్చిన ఆ తీరు చూస్తోంటే అతడడగదలచిన ప్రశ్న, అతని ప్రతీక్ష కాలాంతంవరకూ అలాగే ఉండేట్టు కనిపిస్తుంది. దురధిగమ్యమైన ఆ నిగూఢ

రహస్యం సునీతను దెప్పిపొడుస్తున్నట్టుగా కనిపిస్తోంది. ఆమె మనస్సంతా చీకాకుపడిపోయింది. వెళ్ళి చిత్రాన్ని వెనక్కి తిప్పి గోడకు ఆనించింది... ఇక తన కది కనిపించకుండా. ఆ తరువాత గదిలోనుంచి గబగబా వెనక్కు తిరిగివచ్చేసింది. మెట్లతలుపు తాళం పెట్టేసింది. ఏకాయెకి పైన తనగదిలోకి వెళ్ళిపోయి మంచంమీద పడుకుంది.

ఇక బుర్రలోకి ఏమీ ఆలోచనలు రానీయకూడదు. తక్షణం నిద్రపోవాల్సిందే. తెల్లవారితే సూర్యుడు పొడుస్తాడు. వెలుగు దానంతట అదే వస్తుంది. అంతా చక్కబడుతుంది. తాను కళ్ళు మూసుకుని ఈ రాత్రి నిద్రపోవాల్సిందే. తాను మళ్ళీ నిద్రలేచి కళ్ళు తెరిచేసరికి అంధకారమంతా పోయి వెలుగు వచ్చేస్తుంది. ఇక తానేమీ ఆలోచించదు. అసలు ఏ ఆలోచనా రానీయదు. తక్షణం నిద్రపోవాల్సిందే.

అనుకున్నట్టే దుప్పటి ముసుగుపెట్టుకుని నిద్రపోయింది.

## 37

నిద్రఅయితే పోయింది. కాని—

గాఢనిద్రలో ఉండగా తలుపు కొట్టిన చప్పుడు వినిపించింది. ఆమె లేచి మంచంమీద కూర్చుంది. ఎవరో క్రింద మెట్లతలుపు తపతప చప్పుడు చేస్తున్నారు. సునీత ఏమీ పాలుపోక కాసేపు అలాగే కూర్చుంది. ఉలకలేదు; పలుకలేదు.

తలుపుకొడుతున్న చప్పుడుతోపాటు 'వదినా వదినా!' అన్న పిలుపుకూడా వినిపించింది. అప్పుడు సునీత లేచి,

క్రిందికి దిగివచ్చి, దీపం వెలిగించి, మెట్లతలుపు తెరిచింది. సునీత, హరిప్రసన్నుడు ఒకరికొకరు ఎదురుపడ్డారు. ఇద్దరూ విస్మయావస్థలో ఉన్నారు. సంకోచిస్తూ నిలబడ్డారు. ఒకరి నొకరు ప్రశ్నించుకోవల్సింది చాలాఉంది. తెలుసుకోవలసిన రహస్యం చాలాఉంది. కాని ఇద్దరూ చాలసేపు అలాగే నిశ్శబ్దంగా ఒకరికెదురుగా ఒకరు నిలబడి ఉన్నారు.

హరిప్రసన్నుడు చీకటిలోకి చూస్తూ నిల్చున్నాడు. అతని ఆకృతిలో ఏభావమూ వ్యక్తం కావటంలేదు. తాను వచ్చేసరికి దరవాజా తాళంపెట్టి ఉండటంవల్ల చిన్నబుచ్చు కున్నట్టుగా కనిపిస్తున్నాడు; అంతే. అదీగాక తాను రాత్రి పూట ఎక్కడికో వెళ్ళినట్టు బయటపడిపోయింది.

సునీత ఎన్నో ప్రశ్నలడగాలనుకుంది. ఎన్నో చివాట్లు పెట్టాలనుకుంది. ఎన్నో సుద్దులు చెప్పాలనుకుంది. కాని అవన్నీ హృదయంలోనే ఆగిపోయాయి. ఆమె ఏమీ పలుక లేదు. గమ్మున ఊరుకుండిపోయింది. మరికాసేపటికి అతని ముందునుంచి మరలి వెళ్ళిపోబోయింది.

ఆక్షణాన హరిప్రసన్నుడు ముందుకు వచ్చి ఆమె పాదాలమీద పడిపోయి, “ వదినా ! నన్ను క్షమించు ” అన్నాడు.

సునీత ఉలికిపాటుగా “అరే, ఇదేమిటి!” అంటూ అతన్ని తన పాదాలమీదనుంచి లేవదీసి కూర్చోబెట్టింది. తన కుడిచేత్తో అతని తల నిమిరింది. ఆ చేతిని తన రెండు చేతుల్లో అదిమిపుచ్చుకుని అతడు ఒక పసిపిల్లవాడులాగా

రెండుసార్లు ముద్దుపెట్టుకున్నాడు. "నేను వెళ్ళిపోయాను వదినా! నన్ను క్షమించు. నువ్వు నిద్రపోనేలేదా యేమిటి?"

ఆమాట వినిపించుకోనట్టుగా "ఇప్పుడు వేళ ఎంతౌతుందీ?" అని అడిగింది సునీత. మాట ఎంతో దూరంనుంచి వినిపిస్తున్నట్టుగా ఉంది.

"నాలు గౌతుంది."

"నువు ఇంతవరకు నిద్రపోలేదుగా. పోయిపడుకో."

"వదినా!" అంటూ హరిప్రసన్నని గద్గదస్వరం.

"ఏదీ! అది ఇలా తే దాచిపెడతాను."

ఆశ్చర్యంగా హరిప్రసన్నుడు ఆమె ముఖంలోకి చూచాడు.

సునీత అతనివైపు చూడకుండానే గబగబా వెళ్ళి మెట్లతలుపు తాళంపెట్టి వచ్చింది. "ఏదీ, అది ఇలా తే."

హరిప్రసన్నుడు ఏం జవాబు చెబుతాడు? ఆమె అడుగుతున్న వస్తువేమిటో అతనికి తెలియకపోలేదు. ధైర్యం తెచ్చుకుని ఇలా అన్నాడు: "అది నీకు తగిన వస్తువుకాదు వదినా! నువు ముట్టుకోటానికికూడా పనికిరాదు. పైగా అందులో తోటాలు ఉన్నాయి కూడాను.

"ఇలా ఇచ్చెయ్యి. జాగ్రతగా ఒకచోట దాచేస్తాను. తోటాలు తీసేసి ఇలా ఇవ్వు." స్థిరంగా పలికిం దామె.

హరిప్రసన్నుడు అప్పుడు జేబులోనుంచి పిస్తోలు బయటికి తీశాడు. అందులోనుంచి తోటాలు తీసేసి, వట్టి పిస్తోలు మాత్రం ఆమెకిచ్చాడు.

"తోటాలో?" సునీత అడిగింది.

"నా దగ్గర ఉంచుకుంటాలే."

"నీ దగ్గరా? సరే అయితే! ఎన్ని ఉన్నాయి?"

హరిప్రసన్నుడు మాటాడలేదు.

"అసలు ఎన్ని ఉండాలి?" - సునీత ప్రశ్న.

"పదిహారు."

"ఇప్పుడు ఎన్ని ఉన్నాయి?"

హరిప్రసన్నుడు చాలసేపు జవాబు చెప్పలేదు. చివరకు అన్నాడు: "వదినా! నువు వెళ్ళి పడుకో. ఈ గొడవలో పడకు" అన్నాడు.

"ఎన్ని ఉన్నాయి?" - రెట్టించి అడిగింది సునీత.

"నాకు తెలియదు. ఎన్నో ఉంటాయి" అంటూ హరిప్రసన్నుడు వెళ్ళిపోవటానికి ఉద్యుక్తుడైనాడు. సునీత నిర్విరోధంగానే ఇలా అన్నది. "సరే, వెళ్ళి పడుకో, మేల్కొని ఉండేవు సుమీ! మళ్ళీ వెళ్ళిపోకేం? మెట్లతలుపు తాళం వేసేస్తాను—"

"తాళమా?"

"ఊఁ, ఏం?"

"ఏంలేదు, వేస్తే వెయ్యి."

"సరే, తాళం నేను వేస్తాను; నువు వెళ్ళి పడుకో; పైన పక్క వేసి ఉంది."

"పైనా? నేనిక్కడే పడుకుంటాను."

"సరే అయితే" అని సహజంగా అనేసి సునీత వెళ్ళిపోయింది; హరిప్రసన్నుడూ ఇక అక్కడ ఉండలేదు. పఠనమందిరంలోకి వెళ్ళాడు.

హరిప్రసన్నుడు నిద్రపోతాడా? ఎలా నిద్రపడుతుందీ? తన దగ్గర ఉన్న తోటాలు తీసి తివాచీక్రింద పెట్టాడు. ఇక తాను గీసిన చిత్రాన్ని చూడాలనిపించింది. ఆ చిత్రంలో తన ప్రాణాల తహతహ, ఆకలి, జిజ్ఞాస—పొగలేని అగ్ని జ్వాలలవలె నిరంతరం ప్రజ్వలిస్తూ ఉంటాయి. ఆ చిత్రాన్ని చూడాలనిపించింది. కాని అది కనిపించకుండా తిప్పిపెట్టి ఉంది. దాన్ని సరిగ్గా కనిపించేట్టు గోడకు పెట్టుకున్నాడు. చూచాడు. ఇంకా చూచాడు. అతనిలో ఏమేమి భావాలు లేచాయో, కళ్ళు చెమ్మగిలాయి, కంఠం అశ్రురుద్ధమైంది - "ఓ మాయామయీ!" "అరె, నువు వదినవా? నువు వదినవే కాకపోతే నేను... నేను..." అని యేదో అనబోతున్న వాడులా ఉంది అతని ముఖకవళిక.

...ఏంచేసేవాడో అతనికేం తెలుసు?

## 38

వచ్చి పడుకున్న దేగాని సునీతకు సరిగా నిద్రపట్టలేదు. రివాల్వరు దిండుక్రింద పెట్టింది. పిస్తోలుచూచి ఆమె యేమీ భయపడటంలేదు. కాని ఆ రాత్రి చాల విచిత్రంగా గడిచింది. అటువంటి రాత్రి తానెప్పుడూ ఇదివరకు గడిపి ఉండలేదు. ఎలాగో ఒక కునుకుతీసి తెల్లవారేసరికి లేచింది.

ప్రభాతసమయం. ప్రకృతి చాల ప్రశాంతంగా, సుందరంగా ఉంది. సునీతమాత్రం ఏదో పోగొట్టుకొని వెతుక్కుంటున్న మనిషిలా ఉంది. ఏడీ తన పడవ నడిపే సరంగు! జీవనప్రవాహపు సుడిగుండంలో తగులుకుని మునిగిపోయే

ట్టుగా ఉండే తాను. అరె, ఈ అవస్థలో తనను ఒక్కదాన్నీ దిగవిడిచి ఎక్కడికిపోయి కూర్చున్నారాయన? ప్రశాంత సుందరమైన ఆసమయంలో సునీత ఏదో పోగొట్టుకున్న మనిషిలా దిగాలు పడి ఉంది. స్తబ్ధచిత్తయై శూన్యంలోకి చూస్తూ ఉంది. ఎక్కడ-ఎక్కడున్నారు? ఏదీ, ఎక్కడుంది-నా రక్షాకవచం?

నిద్రలేచాక చాలసేపు ఆమె మనస్సు చంచలంగానే ఉంది. తననూ, తన పరిసరాలనూ గుర్తించే స్థితిలో లేదు. క్రమేణా చీకటి మాయమైంది. వెలుతురు ప్రసరిస్తూ వచ్చింది. గోడమీద తగిలించి ఉంది శ్రీకాంతుని ఫోటో. వివశురాలై ఆమె ఆ ఫోటోముందు వచ్చి నిల్చుంది. ఫోటోను చూచింది, చూస్తూ నిలబడింది. చివరకు దాన్ని గోడమీదినుంచి తీసి, ఎదురుగా పెట్టుకుని కూర్చుంది.

నేడు ఆమె పక్కమీదనుంచి లేచి ప్రప్రథమంగా చేసిన పని ఇదీ: తన సర్వస్వమూ శ్రీకాంతునికి సమర్పణ చేసుకుంది. తన్ను తాను సంపూర్ణంగా ఎవరికి సమర్పణ చేసుకుందో ఆ శ్రీకాంతుడు ఇక్కడ కంటికి కనిపించక పోతేనేం? ఆ ఫోటోయే తనకు శ్రీకాంతుడు. ఆయన తన దృష్టికి ఎక్కడ లేడుగనక? ఎక్కడపడితే అక్కడే ఉన్నాడు. సర్వదా తనకు సంప్రాప్యుడు.

ఈవిధమైన భావనలతో ఆమెలోని అణువణువూ పరిపూతమైంది. ఈవిధమైన ఆత్మార్పణద్వారా తాను స్వతంత్రురాలైనట్టు భావం కలిగింది. ఇప్పుడు అహంకారం

అనేది ఆమెలో ఎక్కడుందీ? ఇప్పుడు తాను పరిపూర్ణ విముక్తురాలు.

ఆమె సర్వాంగపులకిత అయింది. సంకోచాలు, సందేహాలు పటాపంచలై పోయాయి. ఫొటోముందు చాలసేపు అలాగే కూర్చునికూరున్ని చివరకు కళ్ళు తెరిచింది. అప్పుడామెకు ప్రపంచం పదివైపులా ప్రీతికరంగా కనిపించింది. సర్వం తన భగవంతునిమయంగా కనిపించింది. తరువాత ఆమె పరమశాంతచిత్తయై తన నిత్య కార్యకలాపంలో జొరబడ్డది.

చాల ప్రొద్దెక్కింది. హరిప్రసన్నుడు నిద్రనుంచి లేచే ఉండవచ్చు. సునీత రివాల్వరు తీసుకుని అతని దగ్గరకు బయలుదేరింది. "ఇదిగో నీవస్తువు నువు తీసుకో" అని పిస్తోలు అతని కిచ్చేసి "రాత్రి బాగా నిద్ర పట్టిందా?" అని అడుగుదామని ఆమె ఉద్దేశం.

కాని తీరా వచ్చి చూచేసరికి హరిప్రసన్నుడు క్రింద తివాచీమీదే ఒళ్ళుమరచి నిద్రపోతున్నాడు. తోటాలన్నీ అక్కడే చెదరి పడిఉన్నాయి. సునీత అవన్నీ ఏరి ఒకచోట చక్కగా పెట్టింది. వాటి పక్కనే పిస్తోలుకూడా పెట్టింది. హరిప్రసన్నుడికి నిద్రాభంగం ఔతుందేమోనని భయం భయంగా నెమ్మదిగా చప్పుడుకాకుండా ఇంకా విడివిడిగా పడివున్న వస్తువులన్నీకూడా సర్ది పెట్టింది.

హరిప్రసన్నుడు ఒళ్ళు మరచి నిద్రపోతూనే ఉన్నాడు. నిద్రాముద్రితమైన అతని ముఖంలో యేమి ద్యోతకమౌతోంది? ఏమీ లేదు. వేదనగాని, ఆకాంక్షగాని, పౌరుషం

గాని - ఏదీ కనిపించటంలేదు. ఒక అసహాయుడైనబాలుని ముఖంలా ఉంది. మానవదర్పం, దంభం ఏమీ లేవక్కడ. నిద్రాసమయంలో అహంకారమంతా ఏమైపోతుందో మరి! —మనుష్యప్రాణి చాల దయనీయంగా, దోషరహితంగా, అమాయకంగా కనిపిస్తుంది.

అక్కడొక దుప్పటి పడిఉంది. సునీత దాన్ని తీసి చక్కగా మడతపెట్టింది. అది అతని తలకింద ఎత్తుగా పెడదామని ఆమె ఉద్దేశం. కాని అతడు ఒళ్ళు మరచి నిద్రపోతున్నాడు.

నిద్రపోతున్నాడు. కాని మేల్కొనికూడా ఉన్నాడు. నిజం చెప్పాలంటే అతడు మేల్కొనే నిద్రపోతున్నాడు. సునీత గదిలోకి వచ్చిన సంగతి అతనికి తెలియకపోలేదు. అయినా తాను మేలుకునే ఉన్నట్టు కనిపించటం అతనికిష్టంలేకపోయింది. మేలుకునే ఉన్నట్టు కనిపిస్తేమాత్రం ప్రయోజనం ఏమిటీ? సునీత దుప్పటి మడతపెట్టి తిన్నగా అతని తలకింద ఎత్తుగా ఉంచింది. అప్పటికీ అతడు కళ్ళు తెరవలేదు. మత్తుగానే పడుకుని ఉన్నాడు... మెత్తగా ఒదిసగారి తొడ తలాడగా పడుకునే భాగ్యం లభిస్తుందా తనకు! — అని తలపోస్తూ. కాని ఈ తలపోత మరుక్షణమే అసహ్యాకరంగా తోచింది. పక్కకు పార్లి అలాగే పడుకున్నాడు.

ఈవ్యక్తిపట్ల సునీతకు ప్రేమలేదని చెప్పలేం. "ఇంత ప్రొద్దెక్కికూడా నిద్రపోతున్నాడంటే... తెల్లవారుఝామున ఎప్పుడో పాపం నిద్రపట్టి ఉంటుంది. మనిషి ఇంత బేపరవాగా

ఉండటం మంచిది కాదు. ఇలా ఉంటే మనిషిలో శక్తి పెరుగుతుందా? - నా బొంద పెరుగుతుంది! - ఉన్న శక్తి కూడా తరిగిపోతుంది.

...ఇలా అనుకుంటూ అతని తలదగ్గర కూర్చుని సునీత అప్రయత్నంగా "హరిబాబూ!" అని పిల్చింది.

హరి మాటాడలేదు.

"లేవవా యేమిటి హరిబాబూ! చూడు, ఎంత పొద్దెక్కిందోనూ!"

హరి పక్కకు పొర్లినట్టుగా పొర్లి పడుకున్నాడు. మాటాడలేదు.

హరికి పట్టక పట్టక ఎప్పుడో నిద్రపట్టి ఉంటుంది. అటువంటివాడికి నిద్రాభంగం చేయటం సునీతకుమాత్రం ఇష్టమా? కాని తనకు అత్యంత సమీపంలో కనిపిస్తున్న అతనిముఖం చూస్తోంటే ఆమెకు ఏమనిపించిందో మరి! తన రెండు చేతులతో అతని తల పట్టుకుని ఊపుతూ "లే, లే, బాగా తెల్లవారిపోయింది" అన్నది.

ఇంకా మెలకువ రానట్టు కళ్ళుమూసుకుని పడిఉండటానికి వీల్లేకపోయింది. అప్పుడే మెలకువ వచ్చినట్టు ఉలికిపాటుగా కళ్ళు తెరచి చూచాడు. తన రెండు చేతులతో ఆమె కుడిచెయ్యి పట్టుకుని లాగి తన కణతలకు క్రిందిభాగాన అదిమిపట్టి ఉంచాడు.

అందువల్ల సునీతశరీరం అతని ముఖంమీదికి దగ్గరగా వాలవలసి వచ్చింది. ఆమె నవ్వుకుంటూ "లే, లే" అన్నది.

హరిబాబు కళ్ళెత్తి ఆమె ముఖంలోకి చూస్తూ "వదినా! నువు వెళ్ళిపోబోకు. నన్ను లేపబోకు. ఇలాగే నిద్ర పోతూ పడిఉండనీ. ఇంకా రెండుగంటలిలాగే నిద్రపోనీ. రాత్రి నాకు నిద్ర ఎప్పుడు పట్టిందో తెలుసా? కళ్ళు తెరిపిళ్ళు పడటంలేదు వదినా, ఎందుకూ లేపుతావు?'' అన్నాడు.

"చాలుచాలు. ఇక లేద్దూ! నీ రివాల్వర్ తీసు కొచ్చాను, చూచుకో."

"వదినా!'' అంటూ ఆమె హస్తాన్ని తన కణతకు క్రిందిభాగాన గట్టిగా అదుముకున్నాడు.

సునీత ఇప్పుడుకూడా నవ్వుకుంది. చెయి తీసుకున్నట్టు లేదు. "సరే, మెలకువ రాకపోతే పడుకునే ఉండు. కాని ప్రపంచమంతా మేలుకుంది. నువ్వుమాత్రం సోమరిలాగా పడుకునే ఉన్నావు, లే - లే, లేచి ముఖం కడుక్కో. కాఫీ, ఫలహారం ఇస్తాను" - అన్నది.

హరిప్రసన్నుడు ఆమె చెయి వొదిలిపెట్టాడు. ఆమె ముఖంలోకిచూస్తూ "ఇంకాసేపు నన్ను నిద్రపోనీ వదినా! నువు వెళ్ళిపో'' అన్నాడు.

"సరే, నేను వెడుతున్నా. కాని కాఫీ చల్లారిపోతుంది సుమా!'' అంటూ లేచింది సునీత.

"చల్లారితే చల్లారనీ, నాకు నిద్రవస్తోంది'' అంటూ హరిప్రసన్నుడు మరోప్రక్కకు పొర్లి కళ్ళు మూసుకున్నాడు. తాను చూచిన, అనుభవించిన శోభ తన కన్నుల్లోనుంచి దాటిపోకుండా, రెప్పలమాటునే ఒదిగి పడిఉండాలని కాబోలు అతని కోరిక!

"నేను రాత్రికి తప్పకుండా రావల్సిందేనా?" వెడుతూ వెడుతూ అడిగిందామె.

హరిప్రసన్నుడు జవాబేమీ చెప్పలేదు. ఈవిషయంలో అతనికీ ద్వైధీభావంగానే ఉంది. స్నేహమయియైన ఈ సద్గృహిణిని ఆ భయంకరమైన గుహలోకి... ఆ నెత్తురు కక్కే విచ్చుకత్తుల విస్ఫులింగాల మధ్యకు... కఠోర కర్మిష్ఠులైన ఆ యువకులకు నాయకత్వం వహించటానికిగాను తీసుకుపోతే హాస్యాస్పదంగా ఉంటుందేమో! పలువురి కళ్ళబడకుండా సురక్షితంగా కాపాడుకోవలసిన నిధిలాంటిది కదా యీమె! తొడిమ వీడకుండా అలాగే చెట్టుమీదే వికసించి ఉండాల్సిన పువ్వులాంటిదికదా యీమె! ఈమె నెందుకు బయటపడేయాలి? అయినా... స్నేహాన్ని వర్షించి, స్ఫూర్తిని ప్రసాదించాల్సిన నేతృత్వపదవికి పురుషునికన్నా స్త్రీయే అవసరం కాదా! పురుషుల్లో మదవిజృంభణం కావాలంటే... అందుకు స్త్రీయే కదా - మిక్కిలి ఉపయుక్తమైన సాధన!

అతనేమీ మాటాడలేదు. కళ్ళుమూసుకుని పడుకున్నాడు.

"బాగా ఆలోచించు హరిబాబూ! రమ్మంటే వస్తాను. ఎందుకు రానూ? నీ మాట కాదంటానా? కాని... నేను రావటం అవసరమంటావా?... సరేలే, నిద్రపో, మళ్ళీవస్తాలే."

హరిప్రసన్నుడు తన్ను తాను నిందించుకుంటూ గమ్మున పడుకుని ఉండిపోయాడు.

# 39

ఆనాడు హరిప్రసన్నుడికి ప్రాణం ఏం బాగాలేదు. ఏమేమో ఆకాంక్షలు, ఆశంకలు బాధింపసాగాయి. మనస్సు మనస్సులోలేదు.

సునీతమీద అతనికి మంచి విశ్వాసం ఉంది. ఆమె ఎందునా జారిపోయే మనిషి కాదు; వెనుకడుగు వేసే మనిషీ కాదు. ఆమెనుంచి తా నాశించేదీ, ప్రార్థించేదీ ఇవ్వటానికి ఆమె సంకోచించదు. ఈ విషయాలన్నీ హరిప్రసన్నుడికి బాగా తెలుసు. శ్రీకాంతుడు తనను తా నామెకు ఏనాడో అప్పు యిచ్చేసుకున్నాడు. శ్రీకాంతుడుగాని, ఆ అప్పుగాని ఆమెకు ఆటంకాలు కావు - అని హరిప్రసన్నుని నమ్మకం. ఆమె తనకు తానే యజమానురాలు. ఏ విషయంలోనూ ఆమెకు యింకొకరి అడుపాజ్ఞలతో పనిలేదు.

సమయంచూచి వచ్చి సునీత అడిగింది—"నన్ను ఈ గృహస్థధర్మంలోనే ఎందుకు పడి ఉండనీయవు? నేనొక సుప్రసిద్ధ వీరాంగన నైపోతే చూడాలని నువు ఎందుకంత పట్టుదల పట్టావు?" అని. అప్పుడు హరిప్రసన్నుడు స్థిరంగా ఆమెవైపు చూస్తూ "చూడు వదినా! నీకు యిష్టం లేక పోతే రాబోకు. నీకు భయంవేస్తుందంటే నేను ఒప్పుకోను. నీకు సామర్థ్యం లేదని అన్నా నేను ఒప్పుకోను. అవి అబద్ధాలు. నువు ఎందుకు ఈ మార్గంనుంచి తప్పుకోటానికి చూస్తున్నావో నాకు అర్థంకావటంలేదు. కాని, వింటున్నావా!—అదే సుమీ నిజమైన మోక్షమార్గం."

"నేను తప్పుకోవాలని చూడ్డంలేదు—"

"ఎందుకు తప్పుకోవాలి? బాధలన్నీ మగవాడు భరిస్తుంటే తాను హాయిగా సుఖపడటానికేనా స్త్రీ ఉన్నది? వదినా, కాదని నీకు తెలుసు; అలాంటిమాట అనటంగాని, విశ్వసించటం గాని స్త్రీజాతికంతకూ అవమానకరమనీ నీకు తెలుసు. మృత్యువుతోనైనా పోరాడి గెల్చేందుకు కావలసిన ఉత్సాహాన్ని పురుషుడికి నీనుంచి... అంటే స్త్రీనుంచి లభ్యంకావాలి. అది నువు ఇవ్వాల్సిందే. నిరాకరించేందుకు వీల్లేదు. నీనుంచి అది అతనికి లభ్యంకాకపోతే... కేవలం కన్నీళ్ళే అతనికి గతి అయితే... అతడు సహించలేడు. స్త్రీని మన్నించలేడు. నువు పురుషుడికి అధీశ్వరివి కాలేకపోతే, అతడు నిన్ను తన దాసీదాన్నిగా చేసుకుంటాడు. అంతే కాదు, కాలి చెప్పుకన్నా హీనంగా చూస్తాడు. అతని అధీశ్వరివి కాదగిన అధికారం విడిచి నువు పారిపోతావా? 'నువు నాకు స్నేహాన్నీ, స్ఫూర్తిని ప్రసాదించు అని నిన్ను అడిగే హక్కు నాకు ఉంది. లేదా? లేకపోతె ఇక పో, దూరంగా నాముందునుంచి', అని ఒక స్త్రీని విదలించికొట్టే అధికారం ప్రతిపురుషుడికీ ఉంది."

"పో, దూరంగా నాముందునుంచి" అన్న మాటలు తాను ఉచ్చరించిన తీరుకు తనకే ఆశ్చర్యమైంది. సునీతకు కూడా నవ్వు వచ్చింది; కాని ఆపుకుంది. "అయితే ఒక మాట అడగనా? నిన్నరాత్రి నువు ఎక్కడికి వెళ్ళినట్టు?"

"ఇవాళ రాత్రికి దళంలోని సభ్యులంతా సమావేశం కావాలనీ, రాణీమాత రానున్నదనీ ముందుగా చెప్పి రావ

టానికి వెళ్ళాను. ఇవాళ రాత్రికి నేను ఒక్కడినే వెళ్ళి 'ఆమెగారు రాణీమాత కాదు. కేవలం పతివ్రతయైన గేస్తురాలు' అని చెప్పమంటావా?''

'పతివ్రత,' 'గేస్తురాలు' అన్న పదాలలో అతడు ధ్వనింపజేసిన వ్యంగ్యానికి ఆమె యేమాత్రమూ చలించలేదు, నవ్వింది. "హరిబాబూ! నేను దేవీమాత నెలాగౌతాను. అదంతా నాకేం తెలుసు? వంటిల్లు సర్దగలను. రొట్టెలు చేసి నీచేత తినిపించగలను. సామాన్యగృహిణుల ఈ కార్యభారం నే నెలా విడిచిపెట్టగలను?''

"విడిచిపెట్టు వదినా! విడిచిపెట్టు! విధి ఎప్పుడు ఎలా ఉంటుందో ఎవరు చెప్పగలరు? భారతదేశానికి స్వాతంత్ర్యం రావాల్సిందే. భగవంతుడుకూడా అడ్డుపడటానికి వీల్లేదు. అటువంటప్పుడు మీ గేస్తుల, గేస్తురాండ్ర బలంవల్లనేనా స్వాతంత్ర్యం వచ్చేది? వాళ్ళను చూచి ఆ పరమార్థం ఊడిపడుతుందా? ఎబ్బె! అది కల్ల. కొంతమంది ఉన్నారు: ఇల్లు విడిచి బయటికి వచ్చి ముందడుగు వేసేవారు; వాళ్ళు ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకుని సాగివస్తారు; సిగ్గుబిడియాల్ని నెట్టి అవతలకు తోసేస్తారు. వాళ్ళు ఇళ్ళలో ఉండరు. విశాల విశ్వమే వాళ్ళ నివాసస్థానం. వాళ్ళకు సుఖాలు అక్కర్లేదు; కష్టాల్నే ఎదుర్కుంటారు. అటువంటివాళ్ళు ఉన్నారనీ, బయలుదేరి వస్తారనీ, నాకు తెలుసు. ఎందువల్ల అంటావు? భారతదేశం స్వతంత్రం కావాలిమరి! ప్రపంచంలో చాలమంది స్వార్థపరులు అదీ ఇదీ ఆర్జించి కూడబెట్టుకుంటూనే ఉంటారు. కాని భవిష్యదభ్యుదయం ఎవరిమీద ఆధారపడి

ఉంటుందో వాళ్ళుమాత్రం అనుక్షణం తమ కున్నవి దానం చేస్తూనే వెడుతుంటారు. ఇదొక బుర్రల వ్యాపారం వదినా! అగ్నిగుండంలో దూకగలవాళ్ళు రానేవస్తారు. తాపంనుంచి తప్పించుకో దలచినవాళ్ళు దూరంగానే ఉంటారు. ఇప్పుడు నువ్వు—"

"సునీత మంత్రముగ్ధ అయింది. నేను తప్పించుకోవా లనుకోటం లేదు."

హరిప్రసన్నుడామె ముఖంలోకి స్థిరంగా చూస్తూ అన్నాడు: "కాని మరి శ్రీకాంతుడు—"

"నేను వచ్చేస్తాను."

"ఇదంతా వొదిలిపెట్టేసి? నీ నావ అంతా తగల పెట్టేసి?"

సునీత ఉలికిపడ్డది.

"అక్కడ నీకు పని ఉంటుంది. ఆ పనికి నీ యావచ్ఛక్తీ వినియోగించాల్సి ఉంటుంది. అందుకు సిద్ధమేనా మరి నువు? గార్హస్థ్యం పూర్తిగా విడిచిపెట్టేయమని నేను చెప్పటంలేదు. ఇవాళ కాకపోతే రేపైనా దేశసేవాకర్మ నీ పాల పడవలసిందే. కాదని తోసివేస్తావా? నీ సర్వస్వం... నీ ప్రాణం దానికే అర్పణ కావలసి ఉంటుంది. శరీరం గృహస్థధర్మంలో ఉంటే ఉండవచ్చు. ఏమంటావు మరి? చెప్పు."

సునీత ఆశ్చర్యపడుతూ నిలుచుంది. తన స్వాధికారం అంతా క్రమేణా అంతర్హితమౌతున్నట్టు తోచింది: "ఐతే రేపు ఉదయానికి మళ్ళీ తిరిగి రామా?" అని అడిగింది.

"కావలిస్తే వద్దాం. నీకు శక్తిసామర్థ్యాలు ఉంటే మాత్రం రాకుండా అక్కడే ఉండిపోదాం."

తాను అబలే అన్న భావంతో సునీత "రాను రాను; నేను రాను" అన్నది.

హరిప్రసన్నుడు కనుబొమలు ముడిచి వ్యంగ్యసూచకంగా ఇలా అన్నాడు: "నువు రావద్దులే. రాకపోవటమే ఉత్తమం. నువు ఇక్కడ ఉండాల్సిన దానివేలే. నేను పొరపాటు పడ్డాను. నువు అంతదానివి కాదు. ఇక్కడే ఉండులే; సుఖంగాఉండు."

ఆమాటలతో సునీతకు తనపై తనకే చిన్నచూపు కలిగింది. సిగ్గుపడిపోయింది. అయినా "నేను రాలేనులే, రాలేను" అన్నది.

"పోనీలే, రావద్దులే, అంతమాత్రాన దేశసేవా కార్యక్రమంఆగిపోదులే,చప్పబడిపోదులే. సరే,నేను మాత్రం ఇవాళ వెళ్ళిపోతాను, ఇక మళ్ళీ తిరిగి రావడంకూడా ఉండదు." హరిప్రసన్నుని కంఠస్వరంలో తిరస్కృతి వ్యక్తమౌతున్నది.

సునీతముఖంలో దీనత్వం వచ్చింది. "ఎక్కడుంటావు మరి?"

"విశాలమైన ప్రపంచం ఉంది. ఎక్కడైనాఉండచ్చు."

"అప్పుడే వెళ్ళద్దు. వారిని రానీయండి."

వారు! - ఎవరా వారు? తనకూ, సునీతకూ మధ్య ఆ 'వారి' ప్రసక్తి ఎందుకు రావాలి? వారి జోక్యం దేనికి ఇందులో? ఆ 'వారి' మాట తాను శిరసావహించాల్సిన

పనేమిటి? "నే నెందుకు ఉండిపోవాలో చెప్పు, వింటాను. వారికోసం నే నెందుకు ఆగాలి?" – అన్నాడు హరి ప్రసన్నుడు.

కాని సునీత పాలిటికి సర్వస్వమూ 'వారే'. వారి ఆజ్ఞ లేకుండా తాను ఒక్క అడుగైనా వెయ్యటానికి వీల్లేదు. 'వారిని' తన హృదయంలో సంస్మరించి ఆమె యిలా గబగబా అన్నది: "మీరు వెళ్ళటం ఎందుకూ? వెళ్ళకండి. నేనుకూడా వస్తాను. నేనేం అభ్యంతరం చెప్పను. నాకేం భయంలేదు. తెల్లవారేసరికి తిరిగి వచ్చేటట్టయితే నేను వస్తాను. తెల్లవారేసరికి నేను తిరిగి రావచ్చు కదూ! దేశసేవ అంటే నాకు తెలిసినవిషయం కాదు? నే నందుకు తగిన మనిషినీ కాదు. అయినా వస్తాను. ఎక్కడికి రమ్మంటే అక్కడికే వస్తాను. కాని తెల్లవారేసరికి నేను మళ్ళీ తిరిగి వచ్చెయ్యాల్సిందే. తెల్లవారేసరికి తిరిగి రావచ్చునని చెప్పరేం? – నేను ఎక్కడికి కావలిస్తే అక్కడికే వస్తానని అంటూంటే! నేను వస్తానని మాట యిచ్చేశాను. ఇక వెనక్కు తగ్గేదిలేదు."

ఆమాటలు పలుకుతోన్నప్పటి సునీత రూపం హరి ప్రసన్నుడిదివరకెన్నడూ చూచియుండలేదు. తాకితే విరుచుకు పడేలా ఉంది మనిషి. అతడన్నాడు: "ఓ, కావలిస్తే తెల్లవారేసరికి తిరిగి రావచ్చు. వస్తావా మరి?"

"వస్తాను. మీరుమాత్రం వెళ్ళిపోరుకదా?"

"వెళ్ళను."

ఆతరువాత సునీత అక్కడ ఎక్కువసేపు ఉండలేదు. తనగదిలోకి వెళ్ళింది. శ్రీకాంతుని ఫోటో దగ్గరపెట్టుకుని మనస్థిమితం చేకూర్చుకుంది. ఆత్మవిశ్వాసం పూర్తిగా పొందగలిగింది. ఆ విశ్వాసంలో ఏమాత్రమూ సంకోచస్థితి ఏర్పడకూడదు. శ్రీకాంతుని ఆదేశం అతడు రాసిన ఉత్తరం ద్వారా తనకు అందనే అందింది. ఆ యాదేశాన్ని పాలించటంలో తన కింకా సంకోచం దేనికి? ఒక మనోనిశ్చయానికి రావటంలో తటపటాయింపు ఎందుకు? హరిప్రసన్నుడు తన్ను ఎక్కడికో... అతని యిష్టం... తీసుకుపోతాడు. తన ధర్మవిశ్వాసం తనకు ఉన్నప్పుడు భయపడాల్సిన పనేముంది? తాను నిర్భయురాలు.

ఆమె ఒకని భార్య, అయినా సహజంగా స్త్రీ. ఏవ్యక్తీ తనకు తాను పరిపూర్ణత బడయటం అరుదు. పరిపూర్ణమైన విముఖత్వం, నిరపేక్ష లభించటం కష్టం. ఇంతకూ తన వయస్సు ఎంత? ప్రపంచపు వింతలయెడ తనకుగల ఉత్సుకత చల్లారిపోలేదు. వైలక్షిణ్యాల్నీ, వైచిత్ర్యాల్నీ తెలుసుకోవాలని తన కెప్పుడూ కుతూహలంగానే ఉంటుంది. అందుకు కావలసిన సామర్థ్యాన్ని, ప్రజ్ఞనూ కోరుకుంటూనే ఉంటుంది. తనలోమాత్రం ఎముకలూ, మాంసం లేవూ? తాను ఒకని భార్య. అయినా సహజంగా స్త్రీ. భర్తకు అధీనురాలై ఉండాలి; కాని కొంత స్వయంవ్యక్తిత్వంకూడా ఉంది. అయినాకూడా తరచు శ్రీకాంతుని పట్టుదలగా సంస్మరించుకుంటూ ఉంటుంది; అది మానదు. ఇప్పుడీ హరిప్రసన్నుని ద్వారా తనకొక పిలుపువచ్చింది. ఇందులో ఏదో రహస్యం

ఉంది. కాగా స్త్రీహృదయం అటువైపు ఆకర్షితంకావటంలో ఆశ్చర్యం ఏముందీ? హరిప్రసన్నుడే ఒక చిత్రమైన నిగూఢ వ్యక్తి. ఆ రహస్యంలోకి జొరబడి దాని అంతు తెలుసుకోవాలని స్త్రీహృదయం ఎందుకు కోరదు?

ఆ పిలుపును అంగీకరించి సునీత అతని దిక్కుకే వెళ్ళ దలచింది. పడవచుక్కాని తన చేతిలో ఉన్నంతకాలం ఎటువైపు పయనించినా ఏమీ పరవాలేదు. నిరంతరం మిక్కిలి జాగరూకతతో ఉంటే... ఏకోన్ముఖము, స్నేహపూరితము అయిన దీపశిఖ తన హృదయంలో ప్రజ్వలిస్తూఉంటే... తన కిక అనుమానాలతో పనిలేదు; భయపడాల్సిన అవసరం లేదు. కాబట్టి ఎందుకు వెళ్ళకూడదు. తప్పకుండా వెడుతుంది.

రోజూ సత్య చదువుకునేందుకు వస్తూనే ఉంది. మంచి పిల్లలా చదువుకుంటూనే ఉంది. హరిప్రసన్నుడూ మంచి గురువులా చదువు చెబుతూనే ఉన్నాడు. గురువుగారిముందు ఆమె యెప్పుడూ ఏవిధమైన చాంచల్యమూ ప్రదర్శించలేదు. అల్లరి చెయ్యటం ఆమెకు చాతకాదేమో అసలు! వస్తుంది; చదువుకుంటుంది; వెళ్ళిపోతుంది. మరింకే విషయమూ అంటించుకోదు; పట్టించుకోదు.

పద్ధెనిమిదేళ్ళ అమ్మాయిని పట్టి అమాయకురాలి క్రింద కట్టేసి ఊరుకోకూడదు. దానివల్ల చాల ఇబ్బంది ఉంది. ఆమె కళ్ళు చూడవలసినదంతా చూస్తాయి. ఆమె మనస్సు ఆ చూచినదానిలో ... లేనిదాన్నిగూడా చదువ గలుగుతుంది. ఆ చిక్కిరిబిక్కిరి మనస్సు చూచిందీ,

చదివిందీ అంతా తనలోనే కుప్పగా అట్టిపెట్టుకుంటుంది; పైకి పొంగదు.

సత్య మంచి పిల్లే కావచ్చు. కాని ఆమెమీద ఏవిధమైన భరోసా పెట్టుకోకూడదు. హరిప్రసన్నుడు వచ్చి ఈ యింట్లో ఉంటున్నాడూ అంటే... అది కేవలం ఒక మామూలు సంఘటనగానే ఆమె భావిస్తున్నదా? అంత మరీ అమాయకురాలు కా దా పిల్ల. అందులో ఆమె కొక అంతరార్థం స్ఫురించక పోలేదు. దానితోపాటు కొంత లేనిదీ, అసందిగ్ధమైనదీ కలిపి చిలవలు పలవలు చేసుకుంటూనే ఉంది మనసులో.

సత్య గమనించింది: మామూలుకంటే ఆనాడు మాస్టరుగారు మందంగా ఉన్నారు. ఎక్కువ అన్యమనస్కుడుగా ఉన్నారు. ఆమె ఒకపక్క చదువుకుంటూనూ ఉంది; మరోపక్క మాస్టరుగారి వాలకం పరీక్షిస్తూనూ ఉంది. దేన్ని పురస్కరించుకుని అతడంత ఆత్మవిలీనుడై ఉన్నాడో ఆమె కాశ్చర్యం కలిగింది. అతడు ఛలోక్తులుకూడా పలుకటంలేదు. ఛలోక్తులకు అవకాశం లభించినా అతడు గమనించటంలేదు. అతన్ని పరీక్షించాలన్న ఉద్దేశంతో ఆమె అనేకసార్లు తన శిష్యత్వపు హద్దులు దాటి ఏవేవో రుచికరమైన ప్రసంగాలు తెచ్చేది మధ్యమధ్య. కాని పరీక్షలో ప్రతిసారీ ఆ వ్యక్తి తప్పుతూనే వచ్చాడు. ఇంతకన్నా చాల శోచనీయమైన విషయం ఏమంటే... జీవితంలో ఇటువంటి మహత్వపూర్ణమైన పరీక్షలో తాను పూర్తిగా తప్పిపోయిన సంగతి అతనికి తెలియనే తెలియదు. మాస్టరుగారు చెప్పే

చదువునేగాక, మాస్టర్నికూడా చదివేస్తోంది ఆ పిల్ల. ఉండి ఉండి చివరకు ఇలా అంది: "ఇక నేను వెళ్ళిపోనా? నిన్నటి నుంచీ మీకు ఒంట్లో బాగుండటం లేనట్టుందే!"

"ఏం - ఏం, బాగుండకేం?"

నిజానికి హరిప్రసన్నుడామెకు పాఠాలు చెబుతున్నప్పుడు చాల మెళుకువగా ఉంటాడు. సత్య పద్ధెనిమిదేళ్ళ యువతి. ఎవరికీ ఏవిధంగానూ మిరుమిట్లుగొలిపే రూపంకాదామెది. ఆమె అందం మెల్లమెల్లగా మన మనస్సుల్లోకి జొరబారి వ్యాపిస్తుంది. ఒక్కసారిగా మిరుమిట్లు గొలిపే సౌందర్యానికి లోతు ఉండదు. అది కేవలం పైపైనే మెరిసి తేలిపోతుంది. కాని మాటిమాటికీ మన మనస్సుల లోతుల్లోకి ఒక్కొక్కఅడుగే మనకు తెలియకుండానే దిగిపోతూ ఉంటుంది ఒకరకమైన సౌందర్యం. అలా అది మనస్సులో లోతుల్లోకి దిగిపోకుండా అడ్డగించాలన్న భావం మనకు పొడమదు. అటువంటి సౌందర్యాన్ని కాపాడుకోటం చాల కష్టం. సత్య తన సింగారింపుతో ఎవరినీ మిరుమిట్లు గొలపదు. మామూలు చీర కట్టుకుంటుంది. పక్కపాపట కాదు. అమాయకంగా మాటాడుతుంది. నడతలో ఎక్కడా కృత్రిమంలేదు. ఏళ్ళు పైబడుతున్నా ఆమె అలాగే ఉంటోంది. లేనిపోని సింగారింపులతో ఆమె ఎవరినీ ఉద్విగ్నపరచదు. అవి లేకుండా ఏమి చెయ్యాలనీ ఆమె ఉద్దేశం? ఆమెకే తెలియదు. ఏమైనా ఆమె ఎప్పటికైనా ఒక పరాయివాని చేతుల్లో పడాల్సిందేగా పోయి?

తన మనస్థితిని సత్య గమనిస్తున్నదని హరిప్రసన్నుడు తెలుసుకున్నతర్వాత తలవంచుకుని నేల చూస్తూ కూర్చు న్నాడు. తాను చాల మెళుకువగా ఉండాల్సిన ఆవశ్యకత గుర్తించాడు. కొంతవరకు సత్య చిన్నపిల్లే నని అతని భావం. పద్దెనిమిది సంవత్సరాల కన్యనుగాని, ఇరవై సంవత్సరాల యువకునిగాని చిన్నపిల్లలుగా పరిగణించి వ్యవహరిస్తే వాళ్ళకు చాల బాధగా ఉంటుంది; సహించలేరు. వాళ్ళ హృదయానికి అంతకు మించిన గాయం మరొకటి ఉండదు.

అటువంటి గాయాన్నే సత్య హృదయంలో కలిగిం చాడు హరిప్రసన్నుడు తనకు తెలియకుండానే. అందుకు ప్రతీకారంగా సత్య అతన్ని ... అవకాశం దొరికితే చాలు ... ఎంతగానైనా చీకాకు పెట్టగలదు; గలభా చేయగలదు. కాని ... ఆమె మంచిపిల్లలాగానే వచ్చి చదువుకుని వెళ్ళి పోతూఉంది.

"పోనీండి; మిగతాపాఠం రేపు చదువుతా లెండి" అన్నది సత్య.

"రేపా ?" హఠాత్తుగా తలపైకెత్తి చూస్తూ అడి గాడు హరి.

ఏదో వ్యవహారం ఉన్నదనుకుంది సత్య. "ఏం? రే పెక్కడికేనా వెడుతున్నారా ?"

మనసులో అనుమానమేమీ లేనివాడువలె ఆమె ముఖంలోకి చూస్తూ అన్నాడు హరి: "లేదే—!"

"ఎక్కడికీ వెళ్ళటం లేదా ?"

"చదువుకోవేం సత్యా! నేనెక్కడికైనా వెళ్ళిపోతున్నానని నీతో చెప్పానా?"

సత్యకు ఇంకా కూర్చుని చదువుకోవాలని లేదు. అక్కయ్యదగ్గరకు పోయి సంగతిసందర్భాలు తెలుసుకోవాలని ఉబలాటంగా ఉంది. "ఇంటికి పాఠం ఇవ్వండి; చదువుకొంటాను. నాకూ ఇవాళ సెలవు తీసుకోవాలనిపిస్తోంది" అన్నది.

"సరే అయితే, వెళ్ళు. షేక్స్పియర్ మీద డాక్టరు జాన్సన్ రాసిన వ్యాఖ్యానం చదువుకురా, నీదగ్గర ఉందా పుస్తకం?"

"నే నిదివరకెప్పుడూ చదవలేదు."

"తప్పకుండా చదువు. నీదగ్గర ఉందా?"

"లేదు."

"లేదా? అయితే ఆ అలమారలో చూడు."

చెప్పినమాట వినే మంచిపిల్లలాగ సత్య కూర్చున్న చోటునుంచి లేచింది. హరిప్రసన్నుడు... ఆమెను చూస్తూ పైకి ఎత్తిన ముఖం మళ్ళీ దించుకున్నాడు.

సత్య అలమార తెరిచింది. తెరవగానే పిస్తోలు కనిపించింది. దాన్ని చూడగానే జడుసుకుంది. కాని ఏమీ మాటాడలేదు. కాసేపు పుస్తకాల్ని అటూ ఇటూ కదిలించి చూచినట్టుగా చూచి ఉత్తచేతులలోనే తిరిగి వచ్చింది.

"దొరికిందా?" అడిగాడు హరి.

"దొరకలేదు."

"ఎందుకు దొరకలేదూ? అక్కడే ఉండాలే!" అంటూ హరిప్రసన్నుడు స్వయంగా లేచి వెళ్ళాడు. అలమారతెరిచాడో లేదో మొట్టమొదటే రివాల్వర్ కనిపించింది. అది అక్కడ ఉన్న సంగతి అతనికి జ్ఞాపకంలేదు. వెంటనే అలమర మూసేసి తిరిగి వచ్చేశాడు. "పుస్తకం మరొకసారి వెతికి తీసుకుందువుగానిలే. ఎక్కడో పెట్టి ఉంటాను దాన్ని. ఈపూటకు పోలే."

సత్య పుస్తకాలు సర్దుకుని గప్‌చిప్‌గా బయలుదేరి వెళ్ళిపోతున్నది. ఎంతోదూరం వెళ్ళలేదు. ఇంతలో హరిప్రసన్నుడు కేకవేసి పిల్చాడు: "సత్యా! సత్యా! ఒక మాట!"

మెల్లిగా అనునయంగా హరిప్రసన్నుడు ఇలా అన్నాడు: "బహుశా నీకు అలమారలో పిస్తోలు అనబడే వస్తువొకటి కనిపించి ఉంటుంది. ఆసంగతి ఎవరికీ చెప్పకు సుమా! సత్యా! నువు మంచి అమ్మాయివి కదూ!"

"అది ఎవరిదీ? మీదేనా?"

"ఔను, నాదే."

"ధనవంతులు తమనూ, తమ సిరిసంపదల్ని రక్షించుకునేందుకు దాన్ని అట్టిపెట్టుకుంటారు. మీరు సిరిసంపదలకు విముఖులని అనుకుంటున్నాను. ఇదేమిటి మరీ!"

"సత్యా! నీకు తెలియదులే. మాలాంటివాళ్ళకున్నూ దాని అవసరం ఉంది."

'నీకు తెలియదులే' అని అతడు పలికేసరికి ఆమె మనస్సు చాల నొచ్చుకుంది. కాని పైకి ఏమీమాటాడలేదు.

"సత్యా ఈవిషయం ఎవరికీ చెప్పకు సుమా! ఎవరైనా వచ్చి ఎత్తుకుపోతారని భయపడేందుకు మా దగ్గరే ముందీ! ఇదిగో ఈ ప్రాణం మాత్రమే. ఈ ప్రాణానికి పెద్ద విలువేమీ లేదు. కాని ఈవిషయం బయటపడితే మాత్రం మీకు చాల ప్రమాదం ఉంది."

సత్య అలాగే కాసేపుఊరుకుని చివర కడిగింది: "మీ దగ్గర పిస్తోలు ఉన్నట్లు మా అక్కయ్యకు తెలుసా?"

హరిప్రసన్నుడు ఓడిపోయినవాని కంఠస్వరంతో "తెలుసు, కాని సత్యా—" అన్నాడు.

"మా అక్కయ్యకు తెలుసా?"

"తెలుసు."

కాసేపు ఎవరూ మాటాడలేదు. చివరకు సత్య పసిపిల్ల కంఠస్వరంతో "ప్రాణాలు తీసేందుకు పనికివచ్చే వస్తువు కదూ అది! మీరెందుకు ఉంచుకోవాలి దగ్గర?"

"నువు ఇంకా చదువుకుంటున్నావు; నీకేం తెలుస్తుంది సత్యా! పోనీలే, ఆవిషయం అలా ఉండనీ."

తనకేం తెలియదుగాని అక్కయ్యకు తెలుసునేం? సత్య క్రింది పెదవిని పళ్ళసందున కరచిపట్టి నిలబడింది; ఏమీ మాటాడలేదు. కాసేపు అయాక "వెడుతున్నాను" అని చెప్పి వెళ్ళిపోయింది.

ఇవాళ సత్య హృదయంలో చీకట్లు క్రమ్ముకొస్తున్నట్లుగా ఉంది. "ఈరాత్రి ఇక్కడే ఉండిపోతాను. బావ ఎప్పుడు వస్తాడో తెలియదు.. ఆయన లేడుకదా అని ఏమి ప్రమాదం వచ్చిపడుతుందో!" అనుకుంది తనలో తాను.

ఆమె హృదయం ఏరకమైన ప్రమాదాన్ని శంకించిందో ఆమెకే తెలియాలి.

సత్య అక్కయ్యదగ్గరకు వెళ్ళింది. అప్పుడు అక్కయ్య వ్యాకులచిత్తయై ఉంది. చెల్లెల్ని చూడగానే ఆమె "రా, సత్యా! ఇప్పుడే నిన్ను పిలుద్దామనే అనుకుంటున్నాను" అన్నది.

అక్కగారి వ్యాకులపాటును సత్య గమనించింది. "అక్కా! రేపు తెల్లవారుఝామునే లేచి యమునకు స్నానానికి వెడదామా? ఈ రాత్రికి నేనిక్కడే ఉండిపోతాను. ఉదయాన్నే లేచి పోదాం."

సునీత ఏదో భయపడిన మనిషిలా అయిపోయింది. "రేపు ఉదయమా? వచ్చేసోమవారం వెడదాంలే."

"అలాకాదు అక్కా! రేపే పోదాం. నేను అమ్మతో చెప్పివచ్చాకూడా."

"అమ్మతో ఏం చెప్పివచ్చావు?"

"ఏం చెప్పిరాలేదులే, 'ఈరాత్రికి అక్కయ్యగారింట్లోనే ఉండిపోనా?' అని అడిగి వచ్చాను."

సునీత ముఖంలో గాంభీర్యం వచ్చింది. "ఇదిగో, సత్యా! ఇలా రా" అంటూ సత్యను తనదగ్గర కూర్చో బెట్టుకుని "అయితే సత్యా! నువ్వు ఈరాత్రికి ఒక్కతెవే ఇక్కడ ఉంటావా?" అని అడిగింది.

సత్య సునీతముఖంలోకి ప్రశ్నార్థకంగా చూచింది.

"నేను ఈరాత్రికి వెళ్ళితీరాలి" అన్నది సునీత.

"ఎక్కడికి వెళ్ళాలి?"

"సినీమాకు - 'సెకండ్ షో'కు. మొదటి ఆటకే వెడదా మంటే... అప్పటికి పనులన్నీ కావుగా!"

"నేనూ వస్తాను."

"నువు వస్తావా? రెండో ఆటకా? అమ్మ కోపం చెయ్యదూ?"

"ఎందుకు కోపం చేస్తుందీ? నీతోనే వస్తున్నాగా!"

"సత్యా!" అంటూ సునీత చెల్లెలి ముఖంలోకి చాల ప్రేమగా చూచింది. ఆమె తల నిమిరి తన గుండెకు హత్తు కుంటూ "సత్యా! నేను సినీమాకు కాదు - మరోచోటికి వెడుతున్నాను" అన్నది.

సత్య అక్కగారి ప్రేమకౌగిలిలో కాసేపు అలాగే మౌనంగా - కృతజ్ఞురాలుగా ఉండిపోయింది. చివరకు "ఎక్క డికి వెడుతున్నావు అక్కా!" అని అడిగింది.

సత్యను చూస్తున్నకొద్దీ సునీత కన్నులు చెమ్మగిలి పోయినాయి. "సత్యా! చెల్లీ! ఎక్కడికి వెడుతున్నానని చెప్పను?"

సునీతపట్ల సత్య హృదయం కరుణాన్వితం అయింది. కాని ఆమెకేదో అనుమానంకూడా కలిగింది. "ఆయన కూడా వస్తున్నాడా?" అని అడిగింది.

"అతనితోనే నే నీ రాత్రి వెడతా నంటున్నది. ఎక్కడికంటావా? ఆమాట అడగబోకు. ఎక్కడికో నాకూ సరిగా తెలియదు."

సత్య సందిగ్ధావస్థలో పడ్డది. "అదేమిటి అక్కా! వెడుతున్నావా? మళ్ళీ వస్తావా? ఎప్పుడొస్తావు?"

కళ్ళు అశ్రురుద్ధమైనాయి. అయినా సునీత నవ్వింది. "పోవే, పిచ్చిదానా! తెల్లవారేసరికి రానూ! పిచ్చి ఊహలు పోబోకు."

సత్యకేమీ అర్థం కాలేదు. ఏమర్థమౌతుంది? దూరస్థుడైయున్న బావగారిపట్ల చాల జాలి కలిగిం దామెకు. అక్కకేసి చూస్తున్న చూపుల్లో ప్రేమ ఉంది; ఏదో అనుమానంకూడా ఉంది.

"మరోసారి చెబుతున్నాను సత్యా! పిచ్చి ఊహలు పోబోకు. ఈసంగతి ఎక్కడేనా చెప్పేవు సుమీ!"

"అక్కా!"

"పోవే, పిచ్చిదానా!"

"అక్కా! నాకు అలమారలో పిస్తోలు కనిపించింది. నీకూ తెలుసా ఆ సంగతి?"

"సత్యా!" సునీత సత్యకేసి గుడ్లు ఒప్పజెప్పి చూస్తోంది.

"అక్కా! నా కంతా బాగా అర్థమయ్యేట్టు చెప్పు. నామనస్సులో చాల కంగారుగా ఉంది."

"అంతా నాకుమాత్రం ఏం తెలుసు సత్యా! 'విప్లవకారులు' అనే పదం నువు వినే ఉంటావు. నాకూ ఆ శబ్దం మాత్రమే తెలుసు. అంతకుమించి నాకూ ఏమీ తెలియదు. వాళ్ళదగ్గరికే నన్నీ రాత్రికి తీసుకుపోతా నంటున్నాడు అతను."

"ఎవరూ? మాష్టరుగారా?"

"ఔను."

"అక్కా!"

"ఈసంగతి నీ మనస్సులోనే ఉంచుకో."

"నువు ఒక్కతెవే వెడతావా? ఎక్కడికనీ? అడవుల్లోకా? ఎంతదూరమో ఏమో నీకు తెలుసా?"

"తెలీదు."

"అయినా వెడతా వన్నమాట!"

"ఔను సత్యా! అయినా వెడుతున్నాను."

సత్య అక్కయ్య ముఖంలోకి చూస్తూ చూస్తూ ఆమె మస్తకాన్ని తన హృదయానికి హత్తుకుంది. వాలిన ఆమె తలమీద అశ్రుబిందువులు చిలకరించాలని ఆమె తహతహ.

# 40

సత్య మనస్థితి ఒక తీరుగా ఉండదు. పరిపరివిధాల మారుతూ ఉంటుంది. ఒకప్పుడు పుస్తకాలు ముందు వేసుకుని గొణుగుతూ ఉంటుంది. మరొకప్పుడు ఎవరిమీదనో ఇల్లెగిరిపోయేట్టు కేకలువేస్తూ ఉంటుంది. పనేమీ లేకపోతే ఇంట్లోఉన్న పెంపుడుచిలకలతో గంటల తరబడి ఆడుకుంటూ ఉంటుంది; లేదా ఇంట్లో ఉన్న వస్తువులన్నీ చెల్లాచెదరుగా పారజిమ్మి గడబిడ చేస్తుంది. ఇంకొకప్పుడు అమ్మ దగ్గర కూర్చుని ఒకటే వాగుడు మొదలుపెడుతుంది. ఒక్కొక్కప్పుడు అదికావాలనీ, ఇది కావాలనీ తండ్రి దగ్గర మారాం పెడుతుంది. చిత్రమైన ప్రకృతి ఆమెది.

అక్కగారి యింటినుంచి తిరిగివచ్చాక ఆమె వ్యవహారం చాల విచిత్రంగా కనిపించింది అందరికీని. ఊరికేనే

పకపకా నవ్వుతుంది. చాల ఉల్లాసంగా ప్రవర్తించింది. తండ్రి దగ్గరకుపోయి, "నే నివాళ బండిమెక్కి షికారు వెడ తాను నాన్నా! చాలమంది స్నేహితురాళ్ళను కలుసుకో వాలి" అని చెప్పింది. అన్నయ్య దగ్గరకు పోయి "వస్తావా అన్నయ్యా! సినీమాకు? సినీమాకు కాదులే. అలా షికారు వెళ్ళి చల్లగాలిలో తిరిగి వచ్చేద్దాం" అన్నది. పెద్దక్కయ్య వద్దకు పోయి "ఏం అక్కా! నువుకూడా వస్తావు కదూ?" అంది. ఆమాట విని పెద్దక్కయ్య చాల ఆశ్చర్యపోయింది. ఆమె పేరు మాధవి. ఆమెతో సత్య ఇదివరకెప్పుడూ ఇంత ఆప్యాయంగా మాటాడింది లేదు. మాధవి చదువుకోలేదు, వితంతువు. ఆమెకు పిల్లలు లేరు. ఇంగ్లీషు పుస్తకాలు, ఆంగ్లదినపత్రికలూ చదువనేర్చిన సత్య మాధవి వేష భాషల్ని చూచి నవ్వుతూ, పరిహాసం చేస్తూఉంటుంది ఎప్పుడూ. మాధవి ఆయింట్లో వారి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి బ్రతుకుతున్న దీనురాలు. సత్య ఆయింటికి గారాబు కూచి. అటువంటి సత్య తనకు తానై వచ్చి "వస్తావా అక్కా!" అని ప్రేమగా పలికేసరికి మాధవి హృదయం కృతజ్ఞతాపూర్ణమైపోయింది. "నువు వెళ్ళు సత్యా! నేను రావటం ఏమంత బాగుంటుందమ్మా!" అన్నది.

కృతజ్ఞతాపూరితమైన ఆమె కంఠస్వరం వినగానే సత్య తటాలున ఆమె కంఠం కావిలించుకుని "రా అక్కా! కాస్త గాలి మేసి వద్దాం! నువు మంచిదానివి కదూ" అన్నది.

మెత్తని హృదయంగల మాధవి కన్నుల్లో గ్రరున నీళ్ళు తిరిగాయి. సత్య తన కూతురుకాదు; చెల్లెలు. కూతురే అయితే ఇలాగే మాటాడేదేగా! జుగుప్సలతో సగం పిచ్చెత్తి నట్టుగా ఉన్న ఆ దీనురాలి మనస్సులో అసంభవములైన కోరికలు లేచి వచ్చాయి. ఆమె అన్నది: "సత్యా! చెల్లీ! నన్ను వొదిలెయ్యి తల్లీ! నువు వెళ్ళి తిరిగి రా!"

సత్య ఆమెను విడిచి ఇవతలకు వచ్చింది. కాని ఒక చిక్కు వచ్చి పడింది, బండి సిద్ధంగా లేదు. ఇంట్లో పసిపిల్ల వాడికి సుస్తీచేస్తే డాక్టరు దగ్గర మందు తీసుకురావటానికి వెళ్ళింది. బండి తిరిగి వచ్చేవరకూ సత్య ఊరికే కూర్చో వాలి. బయటికి షికారు వెళ్ళిపోవడానికి వీల్లేకుండా వచ్చింది. ఆమెకు చాల చీకాకుగా, విసుగ్గా ఉంది.

"ఏమే సత్యా! సునీత కులాసాగా ఉంటోందా?" - తల్లి అడిగింది.

"ఆ" సంక్షిప్తంగా జవాబు పలికింది సత్య.

"శ్రీకాంతుని స్నేహితుడు ఎవరే ఆయన? ఇంకా అక్కడే ఉంటున్నాడా?"

"ఆ, ఉంటున్నాడు."

ఇంతలో తల్లిగారికేదో జ్ఞాపకం వచ్చి "రామ దయాళ్! ఓ రామదయాళ్!" అని కేకవేసి పిల్చింది. మళ్ళీ సత్యవైపు తిరిగి "అరె, లక్నోనుంచి కరుబూజాపళ్ళు వచ్చాయే. సునీతకు పంపిద్దామనుకున్నాను, పంపించలేదు" అని చెబుతూ మరోసారి రామదయాళుని కేకవేసి పిల్చింది.

"రేపు ఉదయం పంపించవచ్చులే అమ్మా! ఇదేనా సమయం దొరికింది నీకు!" అన్నది సత్య.

"రేపటిదాకా ఎందుకూ ఆగటం? పిలు, రామ దయాళుని ఇలా పిలు."

ఏమిచెప్పాలో సత్యకు తోచటంలేదు. తన మనస్సులో ఏముందో తనకే తెలియటం లేదు. ఈ సమయంలో సునీతగారింటికి ఎవరినీ పంపించకూడదా? లేక తప్పకుండా పంపించాల్సిందేనా? ఆమెకేమీ పాలుపోవటంలేదు. సునీత మాటల్నిబట్టి తనకు తెలిసినంతవరకూ... అది స్వల్పవిషయమేమీ కాదు. తాను సహించలేనంత ఘోరమైన సమాచారం అది. దాన్ని తాను బయట పెట్టవచ్చా? ఛీ-ఛీ, బాగుంటుందా ఆ పని? తనంతట తాను బయట పెట్టకపోతే మాత్రం... ఇప్పుడెవరేనా సునీతగారింటికి వెడితే బయట పడిపోదూ? అలా బయటపడితే ... తన దోషం ఏమీ ఉండదు. కేవలం ఒక్క సునీతబాగు మాత్రమే తాను ఎందుకు కోరాలి? బావ ఇంట్లో లేకపోవటంచూచి అక్కయ్య ఎటువంటి దుస్సాహసానికి పూనుకుందో! అటువంటి మనిషికి కొంచెం శిక్ష లభిస్తేమాత్రం ఏం? అయ్యో! అక్క ఇలా చేస్తున్నదే - అని సత్యమనస్సులో కష్టంగానూ ఉంది; కోపంగానూ ఉంది. అందుచేత "రామదయాళ్! ఓ రామదయాళ్" అని బిగ్గరగానే పిల్చింది.

"సత్యా! పదిపన్నెండు కరుబూజాలు ఒకబుట్టలో పెట్టి తీసుకురా. రామదయాళ్ పట్టుకుపోతాడు... ఏడీ! అతనింకా రాలేదేం?" అన్నది తల్లి.

"అదుగో, వస్తున్నాడు" అన్నది మెల్లిగా సత్య.

"అయితే చప్పున పట్టుకురా. తీసుకుపోయి ఇచ్చి వస్తాడు. మళ్ళీ అతడికి చాల పనులున్నా యిక్కడ."

"నాకిప్పుడు తీరుబాటులేదు. చాల పని ఉంది. రామదయాళ్ నే తీసుకురమ్మను. లేకపోతే మాధవి అక్కయ్యతో చెప్పు. నేను చదువుకోవాలంటావా, అక్కర్లేదంటావా?" కోపంగా అన్నది సత్య.

తల్లికూడ సత్యమీద కోపగించుకుంది. కాని సత్య వినిపించుకోకుండా వెళ్ళిపోయింది.

సత్యకు మనస్సంతా వికలంగా ఉంది. ఏదో పని కల్పించుకుందా మనుకుంటుంది. కాని ఏపనిలోనూ జొరబడలేకుండా ఉంది... రామదయాళ్ వెళ్ళేసరికి వాళ్ళిద్దరూ ఇంటికి తాళంపెట్టి దాటిపోయి వుంటే?...ఏమో, ఏమీ తోచటంలేదు; అగమ్యగోచరంగా ఉంది. కాసేపు అలాగే ఆమె చాల వ్యాకులంగా అటూ ఇటూ తిరిగింది. చివరకు మళ్ళీ తల్లిదగ్గరకు వచ్చింది. "అమ్మా! కరుబూజాలు నాకివ్వు. ఇప్పుడు నేను బండిమీద షికారు పోతున్నాగా! అక్కడ ఇచ్చేస్తాలే. రామదయాళ్ అప్పుడే తీసుకు వెళ్ళాడేమిటి?"

"నీకోసం ఆగుతామా అయితే? ఇందాకనే పట్టికెళ్ళాడు."

అప్పటికప్పుడే సత్య గబగబా వీధిలోకిపోయి "రామదయాళ్! ఓ రామదయాళ్" అంటూ పిల్చింది. బిగ్గరగా పిల్చింది. అయిదు నిమిషాలవరకూ అలా పిలుస్తూనే ఉంది.

చివరకు కోపంగా లోపలికి వచ్చి "ఏమిటే అమ్మా! ఎందుకూ నీకంత తొందర? అడగవు, పెట్టవు. నే నిప్పు డక్కడినించేగా వస్తున్నాను! రామ రామ! ఇప్పుడు రామ దయాళ్‌కు ఎవరు కనిపిస్తా రక్కడ?" అని విసురుగా మాటాడింది.

తల్లి నవ్వుతూ ఆ ముద్దులకూతురికేసి చూస్తూ ఉండి పోయింది.

"ఇప్పుడేనా ధున్నూనుకూడా పంపించు, రామదయాళును వెనక్కి పిల్చుకు రమ్మని; ఈపాటికి ఎంతో దూరం పోయిఉండడు" అంటూ తొందరచేసింది సత్య.

తల్లి అలా నవ్వుతూనే ఉంది. "నీకిప్పుడు రామదయాళుతో పనేమన్నా ఉందా? ఆ సంగతి చెప్పరాదూ?"

నిప్పులో నెయ్యి చిలికినట్టయింది. "నాకేం పని ఉంటుందీ. నీకే ఆలోచన లేకుండా ఉంది. కరుబూజాలు నాతోపాటు బండిమీద తీసుకుపోతా నన్నాగా! అయినా ఇప్పు డేమంత తొందర వచ్చిందీ? రేపు ఉదయం పంపించ కూడదూ? నేనేదో మంచిమాట చెబితే నాకేదో పని ఉండి అలా అంటున్నానని భావిస్తావా? నాకేం పని ఉంటుందీ! పోనీలే. నే నసలే మాటాడను. నాకేం; ఏదో మంచికోసం చెప్పాను. లేకపోతే నోరు తెరవనే తెరవను. ఇంతకూ నేనన్నది మాత్రం ఏముందీ? ధున్నూను పంపించి రామ దయాళ్‌ను వెనక్కి పిలిపించమంటున్నాను. అతనింకా ఎంతో దూరం పోయి ఉండడు."

"అయితే నువ్వే వెళ్ళి ధున్నూను పంపించరాదూ! కాని కరిబూజాలు రేపటిదాకా అట్టిపెడితే పాడైపోవూ?"

సత్య వెంటనే అక్కడినుంచి పరిగెత్తిపోయింది. ధున్నూకోసం కేకలు పెట్టింది. కాని వాడెంత సేపటికీ రాలేదు. సత్యకూడా అతన్ని వెదకి చిక్కించుకోటానికి ప్రయత్నం చెయ్యలేదు. తాను చెయ్యవలసినంతవరకు చేసింది. తరువాత అదృష్టం. రామదయాళ్ వెడతాడు; ఇల్లు తాళం బెట్టి ఉంటుంది; తిరిగి వస్తాడు. 'ఇందులో నా అపరాధం ఏమీ లేదుగదా!' అనుకుని తృప్తిపడి ఊరుకుంది సత్య.

డాక్టరుగారింటికి వెళ్ళిన బండి తిరిగివచ్చింది. "నాకు అవసరమైనప్పుడే బండి ఎక్కడికో తోలుకుపోతావేం?" అని సత్య బండివాడిని చివాట్లువేసింది. "బండి అలాగే ఉండనీ, గుర్రం విప్పెయ్యబోకు"అని ఆజ్ఞాపించింది. గబగబా దుస్తులు మార్చుకుని, తయారై బండిలో ఎక్కికూర్చుని బయలు దేరింది.

సత్య ఇలా ఒక్కతే బయలుదేరి వెళ్ళటం అరుదు. ఈసారికూడా ఒక్కతే బయలుదేరింది. బండి అక్కగారింటి వైపే పోతోంది. కాని తాను అక్కగారింటికి వెళ్ళదు. దూరంనుంచే ఇల్లు తాళంబెట్టి ఉన్నదో లేదో చూచి, తిరిగి వచ్చెయ్యాలని ఆమె సంకల్పం.

కాని బండి వీధిమలుపు తిరిగేసరికి పండ్లదుకాణం దగ్గర బావగారు కనిపించాడు. సత్య బండి ఆపించింది. దిగి శ్రీకాంతుని దగ్గరకు వెళ్ళింది. శ్రీకాంతుడు రకరకాల పళ్ళు ఫలాలు కొని బుట్టల్లో సర్దుతున్నాడు. మనిషి చాల

ఉల్లాసంగా ఉన్నాడు. సత్య వచ్చి తన పక్కన నిల్చున్న సంగతే అతనికి తెలియదు.

"బావా!"

శ్రీకాంతుడు తిరిగి చూచాడు. "ఓ - సత్యా!"

అతడప్పుడే ఊరినుంచి వస్తున్నాడన్న విషయం కనిపిస్తూనేఉంది. అయినా తెలియనట్టు అడిగింది సత్య: "ఎప్పుడొచ్చావు బావా?"

"స్టేషనులో దిగి ఇప్పుడే వస్తున్నాను. ఇదేం టాంగా. (కొట్టువానికేసి తిరిగి) అంజూర్ శేరు ఇవ్వు."

శ్రీకాంతుడు చాల ఆనందంగా ఉత్సాహంగా ఉన్నాడు. "ఈ పండ్లన్నీ ఎవరికోసం బావా?" - సత్య అడిగింది.

"లాహోరునుంచి నాకేమీ తీసుకురావాలని తోచలేదు. కాని ఆవిడ 'ఏం తెచ్చారు?' అని అడుగుతుందేమో! అందుకోసం ఇక్కడే కొనుక్కుపోదా మనుకున్నాను. నీకోసంకూడా ఒకటి తెచ్చాలే. (కొట్టువానివైపు తిరిగి) ఊఁ, చాలు, చాలు."

"ఆపీచ్ పండ్లు తీసుకోరూ! తాజాపళ్ళు బాబూ!

"అయితే అవికూడా ఒక అర్ధశేరు ఇవ్వు."

"శేరు తీసుకోండి బాబూ!"

"శేరా? సరే ఇవ్వు! (పక్కకుతిరిగి) రా, సత్యా! నాతోకూడా ఇంటికి రా. ఇవాళ నీ చదువు అయిందా!"

"అలాకాదు బావా! మాయింటికే పోదాం రా. ఇవాళ నువు మా యింట్లోనే ఉండాలి. ఇన్నాళ్ళనుంచీ మా

మాట కాదంటూ వచ్చావు. ఇవాళ అలా వీల్లేదు. మరి నాకోసం ఏం తెచ్చావో చూపించవేం?" అంటూ సత్య తన బండివాడిని కేకవేసి పిల్చింది. "ఈ పండ్లబుట్టలన్నీ మన బండిలో పెట్టు. అదిగో ఆ టాంగాలో వున్న సామా నంతా మన బండిలో పడెయ్యి"అని ఆజ్ఞాపించింది. "బావా! టాంగావాడికెంత యివ్వాలి?" అని అడిగింది.

ఇన్నిమాటలూ ఒక్కక్షణంలో మాటాడేసింది సత్య.

"నీకేమన్నా పిచ్చెత్తిందా సత్యా!" అని పలికి శ్రీకాంతుడు దుకాణదారుతో డబ్బు ఎంత ఇవ్వాలో తేల్చుకోటంలో పడ్డాడు.

బండివాడు అనుమానిస్తూ నిల్చున్నాడు. సత్య అతన్ని తొందరచేసి, పండ్లబుట్టలన్నీ బండిలో పెట్టించింది. టాంగాలోని సామానంతా తీయించి తన బండిలో పెట్టించింది.

శ్రీకాంతుడు కొట్టువాడికి డబ్బు ఇచ్చేసి ఇవతలకు రాగానే "టాంగావాడికి బాడుగ ఎంత ఇవ్వాలి బావా?" అని అడిగింది.

"నీకేమన్నా పిచ్చెత్తిందా, సత్యా!"

సత్య టాంగావాడిదగ్గరకు వచ్చి "నీ కెంత ఇవ్వాలి అబ్బాయి!...అయిదణాలా? ఇవిగో తీసుకో" అని డబ్బు ఇచ్చేసి, "రా, బావా! నిల్చున్నావేం?" అంటూ అతని చెయి పుచ్చుకుని లాగింది.

ఆపిల్ల ప్రవర్తనకు శ్రీకాంతుడు ఆశ్చర్యపోతూ అలాగే నిల్చున్నాడు కాసేపు. "సరే పద! నువు ఎక్కడికి

తీసుకుపోవాలనుకున్నావో అక్కడికే తీసుకుపో. నువ్వయినా ఆ అక్కకు చెల్లెలివేగా!'' అన్నాడు చివరకు.

దారిపొడుగునా సత్య రకరకాల విషయాలు మాటాడుతూనే ఉంది. తాను ఊరుకోలేదు; అతన్నీ ఊరుకోనీలేదు. లాహోరు ఎక్కడుంది? ఎలా ఉంటుంది? ఇన్నాళ్ళు ఏం జేస్తున్నావక్కడ? ఏవేం తెచ్చావు? రాత్రికి మా యింట్లోనే ఉండు. మా మాధవి అక్కయ్య చాల మంచిది. మాఅమ్మకు మహాచెడ్డ కోపం వస్తూంటుంది. మా గుర్రం నాడాలు అరిగిపోయాయి - ఇలా చాల విషయాలు మాటాడింది. ఇంత దీర్ఘప్రసంగంలోకూడా సునీత ప్రసక్తి మాత్రం ఎక్కడా రాలేదు. హరిప్రసన్నుడి విషయంకూడా రాలేదు. అడిగి తెలుసుకుందామన్న అవసరమూ శ్రీకాంతునికి కనిపించ లేదు.

''ఈ పళ్ళన్నీ మనం తినేద్దాం. రేపు మళ్ళీ కొనుక్కుపోవచ్చులే. ఈరాత్రికి, బావా! నువు వెళ్ళటానికి వీల్లేదు.''

''అలాగేలే.''

ఇంటికి వచ్చాక ... తనకోసం తెచ్చిన వస్తువులేమిటో తీసి చూపించమని సత్య మారాం చేసింది. శ్రీకాంతుడు ఒక చీర, 'బ్లౌజ్' తీసి యిచ్చాడు. వాటి అంద చందాల్ని గురించిన చర్చలతో చాలసేపు గడిచింది. తరువాత తనదగ్గరున్న చీరలన్నీకూడా తెచ్చింది, వాటితో ... శ్రీకాంతుడు తెచ్చిన చీరను పోల్చి చూడ్డానికి. ఈలోగా శ్రీకాంతునికి మంచం, పక్క వేయవలసిందిగా నౌకర్లకు పురమాయించింది. ఇంకా తన పుస్తకాలూ, వ్రాసిన కాంపోజిషన్లూ ఏవేవో తెచ్చి

C. P. BROWN
MEMORIAL LIBRARY
Acc. No - 1220 -
Date
CUDDAPAH



చూపించింది. ఇంతకూ ఇంటికి పోవాలన్న ఆలోచనే శ్రీకాంతునకు తట్టకుండా చెయ్యాలని ఆమె ఆశయం.

ఒక జాము గడిచింది; ఇంకా చాల రాత్రి ఉంది. ఇప్పుడు కాకపోతే ఇంకో పదినిమిషాలకైనా ఇంటికి వెడదాం గదా అన్న ఉద్దేశంతోనే ఉన్నాడు శ్రీకాంతుడు. ఆ ఆశతోనే ఆమెమాటలు వింటూ కూర్చున్నాడు. కాని చివరకు సత్య అతని చెయిపుచ్చుకుని "పద బావా! పక్క వేయించాను; పడుకుందువుగాని; నేను వయొలిన్ వినిపిస్తాను" అని పలికేసరికి "ఇప్పటికే చాల ఆలస్యం అయిపోయింది; ఇంటికి వెడతాను మరి" అన్నాడు శ్రీకాంతుడు.

"వద్దు బావా! వద్దు. ఇవాళ నువ్వు ఇక్కడే ఉండు; నేను చెబుతున్నాగా!"

శ్రీకాంతుడు నవ్వాడు: "నువ్వు చెబుతూనే ఉంటావు. ఇప్పటికి పదిగంటలైపోయింది. ఇకనైనా విడిచిపెట్టు."

"నేను అంత అసహ్యంగా ఉన్నానా బావా నీకు?"

శ్రీకాంతుడు ఆశ్చర్యపోతూ ఆమె ముఖంలోకి చూస్తూనిల్చున్నాడు. సత్యకూడా ... ఇదేమిటి? ఇలా అన్నానేమిటి? అని తానూ ఆశ్చర్యపోయింది.

"ఇంతకూ నన్నిక్కడ ఎంతసేపు ఉండమంటావో చెప్పు."

"ఈరాత్రికి ఇక్కడే ఉండిపో. రేపు ఉదయం వెళ్ళిపోదువుగాని. ఊళ్ళోకి వచ్చాక తొందర పుట్టిందేం? లాహోరులో ఉన్నన్నాళ్ళూ ఏం లేదే! ఇప్పుడొక్క నిమిషం యుగంగా ఉందికాబోలు!"

"వయొలిన్ వినిపిస్తానన్నావు కదూ! సరే వినిపించు. ఆతరువాత వెడతాలే."

సత్యకోపం తెచ్చుకుంది. "అయితే ఇప్పుడే వెళ్ళిపో. ఇంతసేపు అనవసరంగా ఆపాను పాపం! నాకేం తెలుసూ—"

శ్రీకాంతుడు మెల్లగా ఆమె చెంపమీద కొట్టి "పో - పో, పిచ్చిపిల్లా!" అన్నాడు.

"వెళ్ళిపోలే, నేనేమీ అనను."

"సరే కానీ! పక్క ఎక్కడా వేయించానన్నావు? నీకెందుకు కోపం తెప్పించాలి!"

"అయితే నువు వెళ్ళవుకద!"

"ఒట్టుకూడా వేసుకోమంటావా?"

"వెడితే వెళ్ళిపో. నేనేం అడ్డగించను."

ఇన్నాళ్ళు ప్రవాసంలో ఉండి, చివరకు ఊళ్ళోకివచ్చి కూడా భార్యదగ్గరకు పోలేకపోతున్నాడు; ఇది అసహజంగానే ఉంది. తనకు కావలసినవాళ్ళు ఎవరున్నారు? సునీత ఉంది. హరిప్రసన్నుడూ ఉన్నాడు. సత్యకుకూడా అతని హృదయంలో మెత్తని స్థానం ఉంది. సత్య కోమలమైన ప్రవర్తనకలది; అమాయకురాలు. ఆపిల్ల హృదయానికి నొప్పికలిగించటం అతనికి ఇష్టంలేదు ఆపిల్ల ఇంతవరకూ పుస్తకాల్లో, స్వప్నాల్లో విహరిస్తూ ఉంది. ఆమె స్వప్నాల్ని వ్యర్థంచెయ్యని వరుడు దొరకాలని శ్రీకాంతుని కోరిక. అటువంటప్పుడు ఈ తరుణంలో ఆమె కోరిన చిన్నకోరిక వృధాపుచ్చుతాడా! "నేను ఒట్టుమాత్రం పెట్టుకో నమ్మాయ్!" అన్నాడు.

"సరే అయితే, మరీ ఆగలేకపోతే వెదుదువుగానిలే; ముందు పడుకో, పద."

"ఊఁ, పద."

శ్రీకాంతుని మంచంమీద కూర్చొబెట్టి "వయొలిన్ తీసుకురమ్మంటావా? ఇప్పుడే తెస్తానుండు" అని సత్య అక్కడి నుంచి బయలుదేరి వెళ్ళింది. వయొలిన్ కోసమే కాదు; రామదయాళ్‌ను వెదకి పట్టుకుని "కరుబూజాలు ఇచ్చి వచ్చావా?" అని దబాయింపుగా అడిగింది.

"ఇచ్చి వచ్చాను."

"అక్కయ్య ఉందా?"

"ఉంది."

"ఏమన్నది?"

"ఏమనలేదు."

"సరే, ఇక పో."

ఆతరువాత సత్య వయోలిన్ తీసుకుని వచ్చింది. ఆమె వయొలిన్ చాల బాగా వాయిస్తుంది. వాయిస్తున్నప్పుడు ఆమె వేళ్ళు తీగలమీద పువ్వులు దొర్లుతున్నట్టుగా ఉంటాయి. శ్రీకాంతుడు వింటూ కూర్చున్నాడు. వాయించటం ఆపివేసి చాలసేపటికి సత్య "చాల పొద్దుపోయింది; బావా, ఇక పడుకో" అన్నది.

"కొంచెం అలా వెడతాను" అన్నాడు శ్రీకాంతుడు.

"ఎక్కడికి వెడతావు?"

"ఎక్కడికీ లేదు. క్రిందకే."

ఏ అవసరంమీద వెడతానంటున్నాడో సత్యకు అర్థమయింది. "ఇక్కడ పడుకోవా?"

"ఇంత పొద్దుపోయాక ఇక్కడే పడుకోకపోతే ఇంకెక్కడికి పోతాను?"

సత్య మరేమీ మాటాడలేదు. తన పడకగదిలోకి వెళ్ళిపోయింది. మనసు నిశ్చింతగా లేదు. ఇంకా తాను చేయవలసిం దేమిటి? ఆందోళనగానే ఉంది హృదయం.

శ్రీకాంతుడు క్రిందికి దిగివచ్చి గేటుదగ్గర బంట్రోతుతో "నే నలా బజారుదాకా వెళ్ళి పదిహేను, ఇరవై నిమిషాల్లో తిరిగి వచ్చేస్తాను. ఒకవేళ నేను రాకపోతే... ఒక అరగంటసేపు చూచి గేటు మూసేసుకో" అని చెప్పి బయటికి వెళ్ళాడు.

అంతవరకు వెళ్ళి ఇంట్లో ఇంకా దీపాలు వెలుగుతూ ఉంటే ఇంటికే వెళ్ళిపోదామనీ ... దీపాలు ఆర్పేసుకుని అందరూ నిద్రపోతూ ఉంటే, వెళ్ళి వాళ్ళకు నిద్రాభంగం చేయటం ఎందుకూ? — తిరిగివచ్చేసి ఇక్కడే పడుకుని తెల్లవారినతర్వాత వెడదామనీ శ్రీకాంతుడు అనుకున్నాడు.

కాని తీరా ఇంటివరకు వెళ్ళి చూచేసరికి మెట్లతలుపు బయట తాళంపెట్టి ఉంది. చిన్నతాళంకూడా కాదు; పెద్ద తాళమే వేశారు. అతనికేమీ అర్థంకాలేదు. తలమీద పెద్ద ఆఘాతం తగిలి, గాయంపడి, స్పృహతప్పినవాడులా రెండు నిమిషాలు అక్కడే నిలబడ్డాడు. చివరకుగాయం తగలినచోట ఎడమచేత్తో తడువుకుంటూ తిరుగుముఖం పెట్టాడు.

దారిలో ఒక మోటారు చాలవేగంగా ఎదురుగా వస్తోంది. అతడు దాన్నిక్రింద పడిపోయేటంత పనైంది. కాని ఏవిధమైన అపాయమూ జరుగలేదు అదృష్టశాత్తు. తిరిగి మోటారుకేసి చూచాడు. అది దాటి పోనేపోయింది.

అప్పటికి రాత్రి పన్నెండుగంటలైంది. పట్నమంతా నిద్రాముద్రితమై ఉంది. శ్రీకాంతుడు గప్‌చిప్‌గా వచ్చి తన మంచంమీద పడుకుని నిద్రపోయాడు.

# 41

సునీత తన స్వాధికారాన్ని పూర్తిగా విస్మరించేసింది.

"వదినా! మొదట మనం సినీమాకు పోదాం; మళ్ళీ ఇక్కడికి రానక్కర్లేదు. ఇక తెల్లవారిన తర్వాతనే ఇక్కడికి రావటం" అని హరిప్రసన్నుడు పలికినప్పుడు ఆమె ఉత్సాహమూ చూపలేదు; ఉపేక్షాభావమూ చూపలేదు.

" మనల్ని తీసుకుపోటానికి సరిగ్గా సమయానికి మోటారు వస్తుంది. నువ్వు ఈలోగా సిద్ధంగా ఉండు" అన్నాడు హరిప్రసన్నుడు.

"సరే" అన్నది సునీత. అంటే సిద్ధంగా ఉంటాననే ఆమె అభిప్రాయం. ఇప్పుడే కాదు; ఇక ముందెప్పుడూకూడా సంసిద్ధంగానే ఉంటానని ఆమె భావం. హరిప్రసన్నుని మనస్సుమాత్రం శంకాన్వితంగానే ఉంది. సునీత మనస్సులోమాత్రం ఏమీలేదు. ఆమె పూర్తిగా తన స్వయం వ్యక్తిత్వాన్ని మరిచిపోయింది. ఎక్కడికిపడితే అక్కడికి వెళ్ళటానికి సిద్ధంగానే ఉంది.

సరిగ్గా సమయానికి మోటారు వచ్చి వీధిలో ఆగింది. హారన్ మోగింది. సునీతకు కబురు తెలిపేందుకు హరి ప్రసన్నుడామె గదిలోకి వెళ్ళాడు. సునీత ఇంకా ప్రయాణానికి సిద్ధమైలేదు. ఒక గోడకెదురుగా కళ్ళుమూసుకుని కూర్చుంది. "వదినా! బయలుదేరు" అన్నాడు హరి ప్రసన్నుడు. అంటూనే ఆమె దగ్గరకు వచ్చాడు. ఆమె కెదురుగా గోడకు శ్రీకాంతుని ఫొటో ఆనించి ఉంది; అతడు చూచాడు.

హరిప్రసన్నుని కంఠస్వరం చెవిని పడటంతోనే సునీత లేచింది. "ఊఁ వచ్చేస్తున్నాను" అన్నది.

"ఇలాగే వచ్చేస్తావా, వదినా! దుస్తులు మార్చుకోవూ?"

"ఇలా రాకూడదూ?, దుస్తులు మార్చుకోవాలా?"

హరిప్రసన్నుడు ఆశ్చర్యం సూచించాడు. "రోజూ కట్టుకునే మామూలు బట్టలతోనే వస్తావా వదినా? ఈ దినం ఇదివరకటి అన్నిరోజులకన్నా భిన్నమైనది. ఆరోజుల్లాంటిది కాదిది. ఇది వేరు. కాబట్టి అన్నింటిలోకీ మంచి చీర కట్టుకో."

"పట్టుచీరా?"

"ఆఁ, కనీసం పట్టుచీరైనా సరే."

"సరే అయితే" అన్నది సునీత ప్రశాంతంగా.

"చప్పున కానీ, మోటారు వచ్చి ఉంది" అని పట్టుదలగా పలికి హరిప్రసన్నుడు గోడవైపు నడచి

శ్రీకాంతుని ఫొటో తీశాడు. "దీన్ని వెంట తీసుకురావటం లేదుగా! గోడకు తగిలించనా?" అని అడిగాడు.

"ఊఁ, తగిలించు" అంటూ సునీత తనే వచ్చి పటం అందుకుని గోడకు తగిలించింది.

"నేను ఈలోగా క్రింద ఉంటాను. నువు చీర మార్చుకుని వచ్చెయ్యి వదినా! నువు మా దళానికి నాయకురాలివే కాదు, సౌందర్యదేవతవుకూడానని మాకందరికీ స్ఫురించాలి. ఈశ్వరుని ఐశ్వర్యంయొక్క ఒకానొకరూపమే సౌందర్యం. అదొక శక్తి; అదొక ఆదర్శం. అది స్ఫూర్తినీ, పవిత్రతనూ ప్రసాదించగలదు. సౌందర్యముకానిది సత్యమూ కాజాలదు."

అంటూ హరిప్రసన్నుడు క్రిందికి వెళ్ళాడు. మరికొంత సేపటికి సునీతకూడా వచ్చింది. అప్పటి ఆమె రూపం చూచి హరిప్రసన్నుడు ముగ్ధుడైపోయాడు. ఊహాప్రపంచంలోకూడా అతడెప్పుడూ అటువంటి సౌందర్యాన్ని భావించియుండలేదు. చీర మనిషికి ఇంత చక్కదనాన్ని తెచ్చిపెట్టగలదా? వదినగారి ఈమూర్తిని చూచి అతడు భయగ్రస్తుడులా అయినాడు.

"ఊఁ, ఇక పద!" అన్నది వదిన.

హరిప్రసన్నుడు ఇలా అందామనుకున్నాడు "వదినా! ఇలాటి దుస్తులు ధరించబోకు. అవి నన్ను కొట్టవస్తున్నాయి" అని. కాని ఏమీ మాటాడలేకపోయాడు.

"ఊఁ, పద" అన్నది మళ్ళీ సునీత. బయటినుంచి హారన్ చప్పుడుకూడా వినిపించింది. అప్పుడు హరిప్రసన్నుడికి నిద్రనుంచి మెలకువ వచ్చినట్టయింది. "ఆఁ, పద, పద!" అన్నాడు.

సునీత మెట్లతలుపు తాళం పెట్టేసి మోటారులో వచ్చి కూర్చుంది. వెనుకసీటులో తన పక్కనే హరిప్రస న్నుడు వచ్చి కూర్చున్నాడు. చంద్రసేన్ మోటారు నడుపుతున్నాడు.

సినీమాహాలు దగ్గరకు వచ్చారు. హరిప్రసన్నుడు చంద్రసేన్‌తో ఏమో మాట్లాడాడు. చంద్రసేన్ ఎక్కడికో వెళ్ళిపోయాడు. హరిప్రసన్నుడు, సునీత సినీమాలోకి వెళ్ళారు.

అర్ధరాత్రివేళ హఠాత్తుగా ఇల్లుబయలుదేరి వెళ్ళటం మంచిదికాదని హరిప్రసన్నుడు ముందే ఆలోచించాడు. ఇటు వంటి పరిస్థితిలో చాల జాగ్రతగా వ్యవహరించాలి. అర్ధ రాత్రివేళ సినీమా హాలునుంచి చాలమంది వెడుతూ ఉంటారు. వాళ్ళందరితోపాటు తాను, సునీతాకూడా వెళ్ళ వచ్చు. తాము వెళ్ళే మోటారు చూచి ఎవరికీ ఏవిధమైన అనుమానంగాని, కుతూహలంగాని కలగదు. అందుకనే ఈ సినీమా ప్రోగ్రాం ఏర్పాటుచేశాడు. ఇప్పుడు సునీతను వెంట బెట్టుకుని సినీమాకు రావటమనేది ఒక మధురమైన విచిత్ర అనుభవంగా అతనికి స్ఫురించింది. హృదయానికి ఆహ్లాదం కలిగింది. కమనీయమైన, మనోజ్ఞమైన విగ్రహం ఆమెది. ఆమె తన ప్రక్కనే సినీమాలో కూర్చునిఉంటే... హరి ప్రక్కన ఎవరామె? అని అందరూ చూడరూ? సునీత సన్ని ధిలో అతని హృదయానికీ, ఇంద్రియాలకూ ఒక అద్భుత మైన ఉల్లాసం, పరితృప్తి చేకూరాయి. ఈవిధంగా ఆమె లోని దుర్నివారమైనశక్తి నిరూపితమాతున్నట్టు అతనికి

తోచింది. దుర్జయమైంది ఆమె ఆకర్షణ. అది అతనికి సుఖ కరంగా ఉంది. "ఇంతకన్నా ఇంకా కావల్సిందేమిటి?" అనుకుంటూ కూర్చున్నాడు.

ఇద్దరూ మౌనంగానే కూర్చున్నారు. సునీత హృదయం ఖాళీగా, నిశ్చింతగా ఉంది. హరిప్రసన్నుడు మాత్రం ఊహాప్రపంచంలో విచిత్ర దృశ్యం ఏదో చూస్తు న్నాడు. దానితోపాటు తెరమీద ఆడుతున్న సినీమాకూడా చూస్తూనే ఉన్నాడు. తన ఆదర్శవాదపు ముసుగులో నుంచి పైపై చిత్తప్రవృత్తులను రెచ్చగొడుతున్నవి తెర మీది దృశ్యాలు. ఒకరకమైన సుఖానుభూతి కలుగుతున్న దతనికి. కాని ఒకవంక మనస్సు దాన్ని అంగీకరించటంలేదు కూడాను.

ఇంటర్వల్ వచ్చింది. "ఏమన్నా కావాలా వదినా?"

"ఏమీ అక్కర్లేదు."

"పన్నెండుగంటల రాత్రప్పుడు హఠాత్తుగా ఇంటి నుంచి బయలుదేరితే బాగుండదు. అందుకని సినీమాకు వచ్చాం. అంతేగాని మరేంలేదు."

"ఔను, మరేంలేదు."

"నాకు సినీమా పిచ్చి లేదు వదినా! సినీమాకు పెట్టేది వ్యర్థమైన ఖర్చే. సినీమా మనల్ని ఇంద్రియ దాసు లను చేస్తుంది. మన ఆశయాల్ని నీరస పరుస్తుంది; ప్రేమ అంటే కేవలం శారీరిక సంబంధమైనదన్నట్టు నిరూపిస్తుంది. ఇంద్రియ పరాయణత్వంవల్ల లాభం ఏముంది? మన ఆశయం సముజ్జ్వలంగా ప్రజ్వలిస్తూ ఉండాలిగాని—"

"సముజ్జ్వలంగా ప్రజ్వలిస్తూ ఉండాలి. ఔను."

"గాలి ఎక్కువగా ఉందా? తల నొప్పిగా ఉందా? పంకా ఆపు చెయ్యనా?"

"ఆపుచెయ్యి."

హరిప్రసన్నుడు వ్యస్తచిత్తుడై లేచి పంకా ఆపు చేశాడు. ఈలోగా హాల్లో దీపాలు ఆరిపోయాయి; సినీమా మళ్ళీ ఆరంభమైంది. ఇద్దరూ తెరకేసి చూస్తూ కూర్చున్నారు.

ఆట ముగిసింది. ఇద్దరూ బైటికి వచ్చారు. హరిప్రసన్నుడు డ్రయివరు కూర్చునేచోట కూర్చున్నాడు. తన పక్కసీటు దగ్గర తలుపు తెరచి, వచ్చి కూర్చోమన్నాడు సునీతను.

సునీత అవతల తలుపు తెరచుకుని వెనుకసీటులో వెళ్ళి కూర్చుంది. హరిప్రసన్నుడు చెయి చాచి తన పక్క సీటు దగ్గర తాను తెరచిన తలుపు మూసేసుకున్నాడు. ఏమీ మాటాడలేదు. మోటారు స్టార్టుచేశాడు. నడిపాడు. చాల వేగంగా పోనిచ్చాడు.

దారిలో ఒక వ్యక్తి ఎవరో మోటారుక్రింద పడి పోయేంత పనైంది. కాని ప్రమాదం ఏమీ జరగలేదు అదృష్టవశాత్తు. మరికొంతదూరం పోయాక హరిప్రసన్నుడన్నాడు: "ఒకవేళ మా అన్నయ్యగారు ఊరునుంచి ఈ రాత్రికే వచ్చేసి ఉంటే?"

"ఆయన ఇప్పుడే మృత్యువు వాత తప్పించుకున్నారు." మెల్లగా అన్నది సునీత.

మోటారుక్రింద పడకుండా బ్రతికిపోయిన ఆ వ్యక్తి శ్రీకాంతుడే నన్న అనుమానం హరిప్రసన్నుడికి కలక్కపోలేదు. కాని సునీతకూడా అదేమాట అనేసరికి... అది విశ్వసించటానికి మనస్సు ఒప్పుకోలేదు. "ఏమిటీ-ఈ?" అని దీర్ఘంతీస్తూ అడిగాడు.

"ఇల్లు తాళంపెట్టి ఉండటం చూచి తిరిగి వస్తున్నారు కాబోలు! మనం వారిని బ్రతికించి విడిచిపెట్టాం."

"ఎవరినీ?" హరిప్రసన్నుడడిగాడు భయగ్రస్తమైన కంఠస్వరాన.

"మనకు ఇప్పుడు దారిలో కలిశారే, వారినే."

"అతడు శ్రీకాంతుడా? నువు చూచావా బాగా?"

"పరమాత్ముడు రక్షించి, వారు కాకపోతే సరే. కాని వారే, రానూవచ్చారు; మనం ఇంట్లో లేకపోవటం తెలుసుకోనూ తెలుసుకున్నారు."

"అదేమిటి? అలా అంటున్నావేం?"

"ఉన్నమాటే అంటున్నాను. అయినా నువ్వేం విచారపడకు. నాకుమాత్రం విచారం ఎందుకూ? విచారపడి లాభం ఏమిటీ?"

"అయితే తిరిగిపోదామా వదినా? కావలిస్తే నిన్ను ఇంటిదగ్గర దిగబెట్టేస్తాను."

"వద్దు, అక్కర్లేదు." - క్లుప్తమైన జవాబు.

"వదినా! నేను సరిగా చూడలేదతన్ని. నువు కావలిస్తే తిరిగి ఇంటికి వెళ్ళచ్చు."

"ఔను. వారే. కాని ఆవిషయమై చర్చ అనవసరం. మనం తిరిగి ఇంటికి పోవటానికి వీల్లేదు."

"నేనైతే తిరిగి రాలే ననుకో. నేను ఏనాటికైనా ఒంటరిగాడినే. నేను తిరిగి వెళ్ళాలంటే ఎక్కడికి వెళ్ళ గలనూ? నీకు తిరిగి వెళ్ళటానికి చోటు ఉంది."

"ఆయన్ను నువు ఎరగవు—"

"నేను ఆయన్ను ఎరగను. నువు ఎరుగుదువు... తిరిగి వెళ్ళనంటున్నావు కదూ! అయితే వదినా! పద" అంటూ హరిప్రసన్నుడు మోటారును ఇంకా వేగంగా నడపసాగాడు.

మరికొంతసేపయాక అన్నాడు: "నువు తిరిగి వెళ్ళి పోతానన్నట్టయితే నే నేం చేసేవాడినో తెలుసా?"

"ఏం చేసేవాడివేం?"

"వెళ్ళనిచ్చేవాడిని కాదు."

"వెళ్ళనీయక ఏం చేసేవాడివి?"

"ఏం చేసేవాడినో నాకూ సరిగా తెలియదు. యువకుల విశ్వాసంతో చెర్లాటమాత్రం సాగనిచ్చేవాడిని కాదు."

" బలవంతాన లాక్కుపోయేవాడి వన్నమాట! అంతేనా?"

"ఏమో! ఏం చేసేవాడినో నాకే సరిగా తెలియదు. మొత్తానికి నిన్ను జారిపోనిచ్చేవాడిని మాత్రం కాదు. వదినా! నువు మాదళానికి రాణి వయాక రాణివిగా ఉండి పోవాల్సిందే. మేము దయతలచి జారిపోనీయం."

"అంటే మీ ఉద్దేశం—"

"ఊఁ-ఊఁ, నువు ఏమనుకుంటున్నావో చెప్పు?"

"నువు అనుకోటం: నీలో దయ లేదనా? అది అబద్ధం.''

"కొంచెం ఉందేమోలే వదినా! కాని మా దళంలో వాళ్ళందరూ ఇవాళ నిన్నుచూడాల్సిందే. వాళ్ళంతా యువకులు. ఆశయబద్ధులు. వాళ్ళకు ఉన్మాదం కావాలి. జీవితం వాళ్ళకు రుచి పచి లేనిదిగా కనిపించకుండా ఎదురుగా నువు కనిపిస్తూ ఉండాలి.''

"ఆఁ. ఎదురుగానే కనిపిస్తాను. అందుకేగా వస్తున్నాను. ఎదురుగా నిల్చి చెబుతాను: 'నాపేరు సునీత. నేను రాణిని కాదు. రాణిని కావటం నాకిష్టం లేదు. మీరైనా ఒక రాణికోసం కోరుకోకండి. నన్ను సునీతనుగానే స్వీకరించండి. నేను ఇంటికే రాణిని; అంటే ఇంటికే దాసిని' అని. – హరీ! ఉన్మాదం కాదు కావల్సింది; అమృతం కోరుకోవాలి."

"అందుకనే చెబుతున్నాను సునీతా! నువు రాణివే ఔతావు. ఆ యువకులు నిన్ను చూడగానే నీలో తమ రాణిని గుర్తించేస్తారు. ఇంకా నీ చెప్పేమాట లేమిటో వినేదాకా ఊరుకుంటారా? నువు ఏమి చెప్పినా సరే, వాళ్ళకు నువు రాణివే అయిపోతావు. నేను వాళ్ళను ఎరుగుదును; నిన్నూ ఎరుగుదును; వాళ్ళు ఒక రాణికోసం వాంఛిస్తున్నారనీ నాకు తెలుసు. నువు స్థయిర్యం కల వ్యక్తివి; అదే కావల్సింది.''

సునీత మరేమీ మాటాడలేదు. జరుగబోయేదాన్ని గురించి అనవసరంగా తర్కించుకోటం ఎందుకు? జరగాల్సిం

దేదో జరుగుతుంది; జరగనీ. తానెవరో, ఏమి కానున్నదో చూస్తూ ఉంటుంది...

రాత్రి పన్నెండు దాటిపోయింది. మోటారు సాగి పోతోంది. హరిప్రసన్నుడు మంచి నేర్పుగల డ్రయివరు. చాల వేగంగా నడుపుకు పోతున్నాడు. చలిగాలి వీస్తోంది. రోడ్డుపక్కల చెట్లు భూతాల్లా వెనక్కు దూసుకుపోతు న్నాయి. పట్నం ఎప్పుడో వెనకబడిపోయింది. మోటారు ఎక్కడికి వెడుతున్నట్టు? ఏమో, ఎవడికి తెలుసు ? వేగంగా మాత్రం దాటిపోతోంది. ఇప్పటికి ఎంత దూరం వచ్చి నట్టు? ఇది ఎక్కడికి పోయే రోడ్డు... ఉండి ఉండి మోటారు వేగం తగ్గింది. ఒక పక్కకు తిరిగి అడ్డంగా వెడుతున్నట్టుంది. కాని అటువైపు దారి, డొంక ఉన్నట్టు లేదు. మోటారు లైట్లు ఆర్పివేయబడ్డాయి. ఆ చీకటిలో మోటారు తిన్నగా సాగిపోయింది. పోయి పోయి ఒకచోట ఆగింది. ఇంజన్ మోత ఆగిపోయింది. హరిప్రసన్నుడు దిగాడు ; నాలుగు వైపులా చూచాడు. తలుపు తెరచి "రా, వదినా!" అని పిల్చాడు.

...నిర్మానుష్యమైనఅడవి. చీకటి రాత్రి. ఒంటిగంట ఔతుంది.

"రా, వదినా!" అన్నమాట వినిపించగా సునీత మోటారులోనుంచి దిగింది. ఏమీ పలుకలేదు.

"నా చెయి పట్టుకుని నడు."

సునీత అతని వెనకాలే నడిచివస్తున్నది గాని అతని చెయి పట్టుకోలేదు.

"నా చెయి పుచ్చుకుని నడు; చాల చీకటిగా ఉంది." అని పలుకుతూనే ఒక చేయి సాగివచ్చి, తడివి ఆమె చేతిని పట్టేసింది.

ఒక మగవాని బలిష్ఠమైన చేతిలో తన చేయి ఇరికించి తేలిగ్గా నడవగలిగింది సునీత. అక్కడే ఉంది పురుషుని దయ. అందుకామె కృతజ్ఞురాలు.

హరిప్రసన్నుని చేతిలో టార్చిలైటు ఉంది. పిస్తోలూ ఉంది. చలిగాలి వీస్తోంది. పొదలు, పుట్టలూ నిద్రపోతున్నాయి. నాలుగువైపులా ఎక్కడా సడీ, చప్పుడూ లేదు... వాళ్ళ పదధ్వనులు తప్ప.

పోతూపోతూ హఠాత్తుగా సునీతను తన బాహువుల్లో పొదువుకుని హరిప్రసన్నుడు - "అరెరె, చాలప్రమాదమే వచ్చింది" అన్నాడు.

అతని కంఠస్వరంలో వ్యక్తమాతున్న భయం ఆమెకు కూడా సంక్రమించింది. అమె గాభరాపడుతూ "ఏమిటి? ఏమైందీ?" అని అడిగింది.

అతడు సునీతను తనబాహువుల్లో ఇంకా గట్టిగా పొదువుకుంటూ "అదిగో అటు చూడు. ఏమన్నా కనిపించిందా? కనిపించలేదా? కాస్త ఆగు. మళ్ళీ కనిపిస్తుంది" అన్నాడు.

కొన్ని సెకండ్ల తరువాత ఒక ఎర్రని దీపం క్షణమాత్రమే తళుక్కున మెరిసి మళ్ళీ మాయమైపోయింది.

"ఏమిటదీ?" భయవిచలితమై సునీత అడిగింది.

"ఏదో ప్రమాదం అన్నమాట. అది ఎర్రదీపం కదూ! మనం ఆ ఛాయలకు వెళ్ళకూడదు. అక్కడ—"

"ఏం? ఏముందీ అక్కడ?"

హరిప్రసన్నుడు ఇంకా అటువైపే చూస్తున్నాడు. "బహుశా అక్కడ మృత్యువు ఉంది—"

సునీత అతని బాహువుల్లో ఒరిగిపోయి ఆ చీకటిలో అతని ముఖంలోకి చూస్తూ అడిగింది: "ఏమిటది? ఏం జరిగినట్టు?"

హరిప్రసన్నుడు తన బాహుబంధంలోనుంచి సునీతను విడిచిపెట్టేశాడు. "ఇటువంటి సమయంలో నేను ఒక్కడినే ఇక్కడ ఉన్నట్టయితే ఏం చేసేవాడినో తెలుసా? అక్కడ ప్రమాదం ఉంది. ఏకాయెకి అక్కడికే పరిగెత్తి దాని ముక్కుపట్టుకునేవాడిని. ఇవాళ చూస్తూ దూరంగా ఉండిపోవలసివచ్చింది. ఏమీ చెయ్యలేకపోతున్నాను." అని పలికి వెంటనే వంగి ఆమె గడ్డం పుచ్చుకుని ముఖం పైకెత్తి అన్నాడు: "ఎందువల్ల నంటావు? నేను ఒంటరిగాడిని కాదు కాబట్టి. ప్రేమ మనిషిని దుర్బలునిగా చేస్తుంది కాబట్టి."

ఈ ఒక్కక్షణంలో సునీతకు సర్వం మరపు తగిలింది. హరిప్రసన్నుడు ఇలా చెప్పసాగాడు: "అక్కడ ఏమిజరిగి ఉంటుందో నీకు తెలుసా? దళంలోని సభ్యుడొకడు శత్రువుల చేతిలో చిక్కాడేమో! లేదా శత్రువు లతన్ని చంపేశారేమో! ఏదో జరిగిఉండాలి. కాని నీకోసం నేనిక్కడే నిల్చిపోవలసివచ్చింది. నువు ఏమంటావు మరి?

చెప్పు, నన్ను వెళ్ళమంటావా? వెళ్ళి ... ఆ ప్రమాదం ఎటు వంటిదైనా సరే ఎదుర్కోమంటావా?"

ఆసమయాన సునీతకు బాగా అనుభవపూర్వకంగా తెలిసివచ్చింది : భగవంతుడు స్త్రీని అబలనుగా, ఎల్లప్పుడూ పురుషునికి అపేక్షణీయమూర్తినిగా ఎందుకు సృష్టించాడో. ఆమె యేమీ మాటాడలేదు. అతని శరీరం ఆలంబనంగా ఉండిపోయింది.

"వదినా! నిన్ను విడిచిపెట్టి చచ్చిపోయేందుకుగాను నేను ముందుకు దూసుకుపోను. నే నంత మూర్ఖుడిని కాదు. మృత్యువంటే నాకేమన్నా భయమా—తొందరగా చచ్చి పోవాలని కోరుకోటానికి? కాని వదినా! నీతో చెబుతున్నాను; నేను ఈ దళానికి నాయకుడిని. నాయకుడు వెనకడుగు వేస్తాడా? ఉహుఁ. నే నటువంటివాడిని కాదు. అందువల్లనే ముందుజరగాల్సిందేమిటో నాకు తెలుసు ... రా, వదినా! ఈ చేరువలో ఎక్కడేనా కూర్చోటానికి యోగ్యమైన స్థలం కనిపిస్తే కాసేపు విశ్రమిద్దాం. ఇప్పుడే బయలుదేరి వెడితే ప్రమాదం. రెండు మూడు గంటలు ఇక్కడే గడిపి తరువాత వెడదాం."

ఆపదలు తలమీద వ్రేలాడుతూ ఉన్నా హరిప్రసన్నుడు నిశ్చలంగా ఉంటాడు. బుద్ధిసూక్ష్మత కోల్పోడు. సచేతనుడై ఉంటాడు. సంకోచాలేమీ ఉండవు. అతనియీ సామర్థ్యాన్ని సునీత ఇప్పుడు కళ్ళారా చూచింది. అతని బాహువుచే పరివేష్టితయై అనుగృహీతవలె అతని

పక్కనే నడుస్తోంది. ఈవిధంగా కొంతవరకు తన జీవితం కృతార్థమైనట్టు ఆమె భావించుకుంది.

కొంచెం దూరం పోయాక చెట్లపొదలు కొన్ని కనిపించాయి. వాటిమధ్యన కూర్చోటానికి చోటు బాగుంది. "ఇక్కడ కొంతసేపు కాలక్షేపం చేద్దాం, రా" అన్నాడు హరి.

సునీత కూర్చుంది.

అదొక బాగా అరిగి నున్నగా ఉన్న బండరాయి. ముట్టుకుంటే చల్లగా ఉంది. ఆకాశాన నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. గాలి మెల్లగా వీస్తోంది. చుట్టుపక్కల అంతా నిర్మానుష్యం. అక్కడికి పట్నం చాల దూరం. అదంతా అడివి, చెట్లు. చీకటిలో అడివి నిద్రపోతున్నది. చెట్లూ నిద్రపోతున్నాయి. కొమ్మల చివరలు మాత్రం కొంచెంగా గాలికి కదులుతున్నాయి.

"నువు కాసేపు పడుకో సునీతా!" అన్నాడు హరి.

సునీత పడుకుంది.

హరి ప్రసన్నుడు తన చేతులతో ఆమె తల ఎత్తి తన తొడమీద పెట్టుకుని కూర్చున్నాడు. అందు కామె కృతజ్ఞురాలే.

"సునీతా!... నిన్నిక వదినా అని పిలవను. మా అన్నగారిద్వారా నేను నిన్ను చేరుకోటం నా కిష్టంలేదు. నిన్ను సునీతా అనే పిలుస్తాను. మనిద్దరం ఇప్పుడు ఎదురెదురుగా ఉన్నాం. మనిద్దరిమధ్య మరొకరి ప్రసక్తి ఏమాత్రమూ లేదు. శ్రీకాంతుడు నీకు భర్త, నాకు మిత్రుడు. భర్తఒక్కడే

ఉంటాడు; మిత్రుడూ ఒక్కడే ఉంటాడు. నామట్టుకు నాకు అతడొక్కడే మిత్రుడు... కాని మృత్యువుకంటే గొప్ప వస్తువు ఏముంది చెప్పు. ప్రభువూ, ఈశ్వరుడూ అని ఎవరేనా ఉంటే అతన్ని నేను మృత్యుముఖంలోనే చూడగలుగుతాను. మన తలలపై చాచి ఉన్న ఆ మృత్యుహస్తమే నాకు ఈశ్వరుని వరదహస్తం. సునీతా! ఇప్పుడు నేనూ, మృత్యువూ ఎదురెదురుగా ఉన్నాం. ఇక నేను మృత్యువుతో దాగుడుమూత లాడేది లేదు. వెన్ను విరిచి హృదయానికి హత్తుకుంటాను మృత్యువును. సమయం సమీపిస్తోంది. ఇంకా నేను బ్రతికిఉండే రోజులు వేళ్ళమీద లెక్కబెట్టవచ్చు. ఆమహాశక్తి మృత్యువు సమక్షంలో నేను అబద్ధం చెప్పటంలేదు ; సత్యం చెబుతున్నాను : సత్యమే చెబుతున్నాను : నా సునీతా!—'' అంటూ నిశ్చలంగా పడిఉన్న సునీత చెయి ఎత్తి తన కళ్ళకు హత్తుకున్నాడు. అతని కంఠం గద్గదికమైపోయింది; ఒళ్ళంతా కంపించింది. ''నేను నిన్ను ప్రేమిస్తున్నాను—ప్రేమ? అదేమిటో నాకూ ఏమీ బోధపడటం లేదు సునీతా!''

అని పలికి తనకు అత్యంత సమీపంలో ఉన్న ఆమె ముఖంలోకి రెప్పవాల్చకుండా చూడసాగాడు.

సునీత లేచి, సంభ్రమ చిత్తయై దూరంగా జరిగి కూర్చుంది. అతన్నిగురించి ఆమె హృదయం మిక్కిలి పీడాగ్రస్తమైంది. ఆమెకది దుస్సహ మనిపించింది. ఇలాంటి పరిస్థితి ఏర్పడుతుందని ఆమె అనుకోలేదు. వ్యవహారం చాల విస్మయకరంగా ఉంది; భయంకరంగానూ ఉంది.

"భయపడబోకు సునీతా! నాకు దయ అనేది తెలియదనుకో. అయినా నువ్వు భయపడనక్కర్లేదు. నేను వెళ్ళిపోతాను. దూరంగానే ఉంటాను. నువ్వు నిర్భయంగా ఉండు. నా కోరికేమిటో నాకే తెలియదు. ఏమైనా నీ హృదయాన్ని మాత్రం గాయపరచను. నాకూ, మృత్యువుకూ ఎక్కువ ఎడం ఏమీ లేదని ఇప్పుడే చెప్పానుగా! కాని ఆవిషయమై నువ్వు ఏమీ విచారించనక్కర్లేదు. నన్ను గురించిన విచారమే నువ్వు పెట్టుకోకు. నా మృత్యువు సంగతి నాకు సంబంధించిన గొప్ప విషయం మాత్రమే. అది నాకు మాత్రం ఎందుకు గొప్ప విషయం అయిందో నాకూ తెలియదు. సునీతా! నువ్వు విశ్రాంతి తీసుకో. ప్రమాదం ఏమీ లేకుండా ఉంటే నిన్ను ఇప్పుడే ఇంటికి తీసుకుపోయి దిగబెడతాను. కాసేపు నిద్రపో. నేను వెళ్ళిపోతున్నాను. వీలు చిక్కినప్పుడు మళ్ళీ వస్తాను."

అంటూ హరిప్రసన్నుడు వెళ్ళిపోటానికి ఉద్యుక్తుడైనాడు. సునీత భయంభయంగా అలాగే కూర్చుంది.

"వెళ్ళిపోనా?" - వెళుతూ వెళుతూ హరిప్రసన్నుడు అడిగాడు. సునీత మాటాడలేదు. హరిప్రసన్నుడు వెళ్ళిపోయాడు.

కాసేపటివరకూ సునీత అలాగే కూర్చుని ఉంది. తరువాత తలక్రింద చెయిపెట్టుకుని పడుకుంది. కొంతసేపటికి నిద్రపోయింది అలాగే.

రాత్రి రెండున్నర ఔతుంది. చంద్రోదయం అయింది. పాలనురుగులా వెన్నెల వ్యాపించింది. ఆకాశం నవ్వుతున్నట్టుంది. ప్రకృతి అంతా శోభావంతంగా ఉంది. ముగ్ధ

మోహనమైన వాతావరణం. మంద వాయుతరంగాల్లో గులాబీల శైతల్యం.

హరిప్రసన్నుడికి నిద్రపట్టటంలేదు; ఎంతప్రయత్నించినా నిద్రపట్టటంలేదు. మృత్యువును గురించిన ఆలోచనకూడా అతనిలో ఇప్పుడు ఉదయించటంలేదు. ఎంత అందమైన వెన్నెల! ఇది ఎందుకోసం? ఈ వెన్నెల కెందు కింత శోభ? ఇంత నిశ్శబ్దంగా ఉంది కదా—తనకు నిద్ర పట్టదేం? ఈ ప్రకృతి అంతా తన చెవిలో ఏదో రసప్లుతమైన సందేశాన్ని విని పిస్తున్నదేమిటి? ఏమిటా సందేశం? 'పోరా, పో' అని ఎవరది తన్ను ఆదేశిస్తున్నారు? తనలోనుంచే ఎవరది 'రావోయి, రా' అని పిలుస్తున్నారు?...హరిప్రసన్నుడు నిద్రపోలేకుండా ఉన్నాడు.

గడియ గడిచింది; రెండు గడియలు గడిచాయి; గడపటానికి సాధ్యమైనన్ని గడియలు గడిచాయి. అటు పొర్లాడు, ఇటు పొర్లాడు; చివరకు లేచాడు; లేచి బయలుదేరాడు. అతనికేమీ తెలియటం లేదు. వెడుతున్నాడు. ఎందుకూ? కాళ్ళు తీసుకుపోతున్నాయి కాబట్టి. ఎక్కడికి? హృదయంలోని దాహం ఎక్కడికి నెట్టుకుపోవాలో అక్కడికి. అటువైపు; ఎవరో పడుకుని నిద్రపోతున్న చోటికి; విశ్వానికంతకూ కేంద్రమైన చోటికి; అందరి జీవనప్రాప్తి హేతువైనచోటికి; అందరి మృత్యుప్రాప్తి హేతువైనచోటికి.

సునీత ఆ బండరాయిమీద పడుకుని నిద్రపోతోంది. తలక్రింద చెయి కూడా లేదు. ఆహా! ఆ పట్టుచీర వెన్నెల్లో

ఎలా మెరుస్తోందో! నిద్రాముద్రితమై ఆ ముఖం ఎంత ముద్దుగా ఉంది! ఏమి అందం? ఏమి విషం!

హరిప్రసన్నుడు చిత్రపుబొమ్మలా నిల్చుని ఆ మూర్తిని చూస్తున్నాడు. హృదయంలో తుపాను రేగుతోంది. ఆ పడుకుని ఉన్న మూర్తి అతనిలోని అణువణువునూ ఉద్రూతలూగిస్తోంది. అతని అహాన్ని చూర్ణం చేసేసింది. అతని హృదయంలో ఎలా ఉంది? క్రోధమా? స్పర్ధా? మోహమా? దైన్యమా? ఏం చెయ్యాలనీ అతని కోరిక? ఆమెను తన రెండుచేతుల్లో నలిపి—నలిపి—ముద్దచేసి, అందులోనుంచి—ఆమె ప్రాణాన్ని — ఒక్కొక్క——నెత్తురుచుక్క—పీల్చివేద్దామనా?— లేక తాను నిలువునా— అణువణువూ— కన్నీరుగా— కరిగిపోయి, విడువకుండా— ఆమెపాదాల్ని కడుగుతూ—ప్రవహించుకుపోదామనా?...

అసలు రావటం ... ఒక్కసారి ఆ నిద్రపోతూన్న మధురమూర్తిని చూచి, వెంటనే వచ్చినదారినే వెళ్ళిపోదామని వచ్చాడు. వచ్చినవాడు ఆ మాధుర్యాన్ని చూపులతో క్రోలటం సాగించాడు. క్రోలిక్రోలి అక్కడ కూలబడి ఆమె పాదాల వ్రేళ్ళను పెదవులు తాకకుండా మెల్లిగా ముద్దు పెట్టుకున్నాడు.

గుండెలో మంట మంటగానే ఉంది. ఇంకా దగ్గరగా జరిగాడు. మెల్లిగా ఆమె హస్తాన్ని ఎత్తి తన బుగ్గలకు హత్తుకున్నాడు. ఆమె శరీరంపై తన చేత్తో తడవసాగాడు. అతనిలో ఒకవిధమైన ఉన్మాదం అతిశయిస్తూ ఉంది.

సునీత నెమ్మదిగా కళ్ళు తెరిచింది. లేదులేదు; కళ్ళు తెరవలేదు. తనశరీరంపై తడువుతూన్న ఆ హస్తస్పర్శ అనుభవిస్తూ కాసేపు అలాగే పడుకుని ఉంది. చివరకు కళ్ళు తెరచి "హరిబాబూ!" అన్నది అవ్యక్త మధుర కంఠస్వరాన.

"సునీతా!" వివశమైన కంఠస్వరం. క్షమాపణ యాచిస్తున్నట్టుగా చూపు.

సునీత పడుకునే ఉంది. అత్యంత స్నిగ్ధ కంఠస్వరాన "హరిబాబూ! ఇకముందు నువు చెయ్యబోయేది ఏమిటి?" అని అడిగింది.

"నాకేం తెలియదు. నాకు తెలుసుకోవాలనీ లేదు సునీతా! ఇంకా రెండు మూడు రోజులు బ్రతుకుతానేమో! ఇక నేను ఎక్కడికి వెళ్ళేదీ, చేసేదీ ఏముంటుందో నాకేం తెలియదు. సునీతా!..."

"నీ కోరిక ఏమిటి హరిబాబూ!"

"నా కోరికా? నా కోరి కేమిటని అడుగుతున్నావా? నా కోరిక? చెప్పనా? నాకు నువు కావాలి. నువు పూర్తిగా నాకు కావాలి - ఆతరువాత—"

"ఇదిగో నేను, నీ యెదుటే ఉన్నానుగా! తీసుకోరాదూ?"

హరిప్రసన్నుని చెయి వచ్చివచ్చి ఆమె బుజంమీద ఆగిండి. అక్కడే ఆగింది. "వదినా!"

"నీకు సంకోచమెందుకూ చెప్పు. నే నెప్పుడేది కాదన్నాను? నువు చనిపోవటం ఎందుకు? నేను నీ యెదుటే

ఉన్నానుగా! ఎప్పుడన్నా నీ మాట కాదన్నానా? నిన్ను నువు చంపుకోవద్దు, హరిబాబూ! చనిపోకు. పనిచెయ్యి. నీకు కావాలంటే నన్ను తీసుకో.''

హరిప్రసన్నని చేయి అక్కడే ఆగి ఉంది.

"నేను కావాలా? హరిబాబూ! బాగా ఆలోచించు" అంటూ సునీత లేచి నిల్చుంది.

"నువ్వే కావాలి, సునీతా!"

లేస్తూ లేస్తూండగానే సునీత చీర కొంగు జారింది. భుజాలకిందివరకూ కూడా జారిపోయింది.

"నన్ను కోరుతున్నావా? ఇదిగో నేను—"

అంటూనే సునీత తన జంపర్ తీసి అవతల పారేసింది.

హరిప్రసన్నడు విస్తుపోయాడు. "వదినా!"

సునీత కంఠస్వరంలో కోపం ఏమీ లేదు, వ్యంగ్యమూ లేదు. "నన్ను కోరుతున్నావు కదూ! నన్నే తీసుకో" అన్నది.

అంటూనే మొలమీది చీర అటూ ఇటూ లాగి ఊడదీసే ప్రయత్నంలో ఉంది.

హరిప్రసన్నడు గాభరా పడ్డాడు. "వదినా!"

"ఏం కోరుతున్నావు హరిబాబూ! నేనే కావాలి కదూ! ఇది చీర; నేను కాదు. ఇదిగో నేను.''

—అంటూ పూర్తిగా చీర ఊడదీసేసింది.

హరిప్రసన్నడు నిశ్చేష్టుడైనాడు. ఆమె శరీరంమీద ఇక ఒక్క బాడీ మిగిలిఉంది. దాన్నికూడా ఊడదీసెయ్యా

లని పైకి లేస్తున్న ఆమె చేతుల్ని హఠాత్తుగా వచ్చి పట్టు కున్నాడు హరిప్రసన్నుడు. "వదినా! వదినా!" బిగ్గరగా అరిచాడు.

సునీత పెదవులచివర నవ్వింది. "ఇదొక అడ్డంకూడా ఎందుకు హరీ! ఇది ఉంటే అసలైన నన్ను ఎలా పొంద గలవు? దీన్నికూడా తీసివెయ్యనీ; అప్పుడు నన్ను తీసుకుం దువుగాని. అసలైన నన్నే తీసుకో. అక్కర్లేదా యేమిటి?"

—అంటూ తన చేతులు వొదిలించుకుని... ఛాతికి అంటుకుపోయి ఉన్న బాడీని చింపి లాగి అవతల పారేసింది. చివరకు మిగిలిన ఆ బాడీకూడా లేకుండా...

హరిప్రసన్నుడు రెండుచేతులూ ఎత్తి రెండు కళ్ళూ మూసుకున్నాడు. నోటివెంట మాట పెగల్లేదు. తాను ఓడిపోయాడు. సిగ్గుపడిపోయాడు. ముఖంలో కత్తివేసినా నెత్తురుచుక్క లేదు. అతడంత సిగ్గుతో కుమిలిపోతోంటే భూమి పగిలి పాయ ఇవ్వదేం పాతుకుపోడానికి?

"హరీ! తీసుకో ఇక నన్ను. ఈ చివరి ఆవరణకూడా తీసేశాను. నేను కావాలన్నావుకదూ! నీ కోరిక నేను కాదనను. ఊఁ, తీసుకో—"

"వదినా! వదినా!" అంటూ కళ్ళు రెండూ మూసు కుని, ముఖం తిప్పుకుని అక్కడినుంచి వెళ్ళిపోతూ "చాలు వదినా! చాలు! నన్ను చంపబోకు, చంపబోకు" అన్నాడు. అతడు వెళ్ళిపోయాడు. దగ్గర ఎక్కడా నిలువలేదు. దూరంగా వెళ్ళిపోయాడు.

సునీత దిగంబరంగా అలాగే అక్కడ కాసేపు కూర్చుండి పోయింది. చివరకు లేచి మళ్ళీ చీర కట్టుకుంది; జంపర్ తొడుక్కుంది. చినిగిపోయిన బాడీ తీసి దాచింది.

తెల్లవారబోతోంది. నాలుగైంది అప్పటికే. సునీత అక్కడినుంచి బయలుదేరింది. హరిప్రసన్నుడు దూరంగా ఒకచోట కూర్చుని ఉన్నాడు. ఓడిపోయినవాడులా దీనంగా ఉన్నాడు. ప్రశాంతంగా ఉన్నాడు. తొడలపై మోచేతులు ఆనించి, అరచేతుల్లో గడ్డం మోపుకుని కూర్చున్నాడు. ...ఈ విశ్వమనే అంతులేని మహాగ్రంథంలో తారుమారాతూ ఉండే సన్నివేశాలమధ్య, తల్కిందైన ఒక అర్ధ విరామ చిహ్నంవలె... నిరంతర కాలప్రవాహము మధ్యలో క్షణమాత్ర నిశ్శబ్దతను సూచిస్తున్న ఒక నల్లని బిందువువలె ...అంతకు మించి మరేమి కానట్టు.

"హరిబాబూ! తెల్లవారుతున్నట్టుంది. ఇక వెడదామా?" సునీత అడిగింది.

హరిప్రసన్నుడు సునీతవైపు తిరిగి చూడకుండానే "పద" అన్నాడు.

మోటారు చాల వేగంగా తోలాడు. సునీత ఇంటి ముందు కారు ఆపాడు. తాను గబగబా దిగి వచ్చి వెనుక సీటు దగ్గర తలుపు తెరిచాడు. ఏమీ మాటాడలేదు.

సునీత కారులోనుంచి దిగింది. "మీరు ఎప్పుడొస్తారు మళ్ళీ యింటికి? కొంచెం ఆలస్యం ఉందా?"

హరిప్రసన్నుడు ఉలికిపడినవాడులా "నేనా?" అన్నాడు.

సునీత గాభరాపడిన మనిషిలా "రారా యేమిటి?" అని అడిగింది.

హరిప్రసన్నుడు నీరసంగా నవ్వాడు. "ఏమో! విధి యెలా ఉందో మరి!"

సునీత అనుమానిస్తూ అడిగింది. "అయితే రారన్న మాట!"

"వదినగారూ! అంతా విధిచోదితం. విధి తీసుకొస్తే వస్తానేమో! కాని తీసుకొస్తుందా?"

సునీత మెట్ల తలుపు తాళం తీసింది. మళ్ళీ తిరిగివచ్చి అతని దక్షిణ హస్తాన్ని తన రెండు చేతుల్లోకీ తీసుకుని, అతని కన్నుల్లోకి అప్యాయంగా చూస్తూ ఇలా అన్నది: "హరి బాబూ! నీకు నామీద ప్రేమ లేదా? లేదని చెప్పగలవా? చెప్పు—"

హరిప్రసన్నుడు ఆ వదినెను అలాగే చూస్తూ నిల్చున్నాడు. ఏమీ మాటాడలేదు.

"నామీద నీకు ప్రేమ నిజంగా ఉన్నట్టయితే నువు ఆత్మహత్య చేసుకోవద్దు. నా మాట విను. నామీద ఒట్టు వేసుకుని 'ఆత్మహత్య చేసుకోను' అని చెప్పు. హరీ! నా ప్రేమమీద ఒట్టు. నువు ఆత్మహత్య చేసుకోవద్దు" అన్నది సునీత.

"వదినా!"

"చెప్పలేవా ఆ మాట? అంత అసమర్థుడివని నేను అనుకోలేదే!—"

"వదినా!"

"అయితే నిన్ను అర్థంచేసుకోటంలో నేనే పొర పాటు పడ్డానా?"

"వదినా! అంటాను—"

"అను. 'నేను ఆత్మహత్య చేసుకోను' అని అను."

"నేను ఆత్మహత్య చేసుకోను."

"అయితే హరిబాబూ! ఇటు నా ముఖంలోకి చూడు. నాకు ప్రేమ తెలియదనేగా నువు అనుకోటం? అలా ఎప్పటికీ కాదు." సునీత కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "హరిబాబూ! ఇంకొక్కమాట! నేను చెప్పిన పిల్లను పెళ్ళిచేసుకోటానికి, నాముఖం చూచైనా ఒప్పుకో.

ఆమాట వినగానే హరిప్రసన్నుడు మోటారు తలుపుపై చెయి వేశాడు. చప్పున లోపలకు వెళ్ళి కూర్చోటానికి ఉద్యుక్తుడౌతున్నాడు.

"ఒప్పుకోవా?"

"ఊహుం, ఒప్పుకోను వదినా! ఒప్పుకోను!" అన్నాడు హరిప్రసన్నుడు ఆమె కన్నుల్లోకే చూస్తూ. వెంటనేసీటులో ఎక్కి కూర్చోబోతున్నాడు. సునీత చప్పున వచ్చి అతనికి పాదాభివందనం చేసింది.

ఇక ఒక్క క్షణంకూడా హరిప్రసన్నుడక్కడ నిలువలేకపోయాడు. ఇంజన్ స్టార్టు చేశాడు. బడబడ మోతతో మోటారు కదిలింది. మరికాసేపటికి అదృశ్యమైపోయింది.

మోటారు ఎటు వెడుతున్నదీ సునీత చూడేలేదు. వెనక్కు తిరిగి, మెట్లతలుపు తెరచుకుని లోపలికి పోయింది. అదే తన గృహం! ... అదే తన స్థానం!

శ్రీకాంతుడు తిరిగి వచ్చేసరికి సత్య ఇంకా నిద్రపో లేదు. మళ్ళీ కొద్దిసేపటిలోనే శ్రీకాంతుడు తిరిగి రావటం వల్ల... అతడు ఇంటికి వెళ్ళి ఉంటాడనీ, ఇల్లు తాళంపెట్టి ఉండటం చూచి తిరిగి వచ్చాడనీ - సత్య గ్రహించింది; కాని దగ్గరకు వచ్చి శ్రీకాంతుని తానేమీ పలుకరించ లేదు, పెట్టలేదు.

తెల్లవారింది. ఇక శ్రీకాంతుడు ఇంటికి బయలుదేర బోతున్నాడు. అతని ముఖంలో ఏవిధమైన భావమూ ద్యోతకం కావటంలేదు. "నీకు రాత్రి బాగా నిద్ర పట్టిందా బావా?" అని అడిగింది సత్య వచ్చి.

"ఓ, చక్కని నిద్ర పట్టిందిలే."

"మన బండి సిద్ధంచేసి తీసుకురమ్మని చెప్పాను. కాసేపటిలో వచ్చేస్తుంది."

"అదేమిటి? బండి ఎందుకూ?"

"ఇంటికి వెళ్ళవూ మరి?"

"పిచ్చిదానా! టాంగాలో వెడతాగాని, బండి ఎందుకూ? రాత్రి ఇక్కడ ఉన్నట్లు అందరికీ తెలియాలా ఏమిటి? ఊరినుంచి వచ్చి ఎకాఎకి ఇంటి కెందుకు రాలేదూ అని ప్రశ్న రాదూ? మీ అక్కయ్యను ఎరగవూ నువ్వు? బండి చూడగానే అడగదూ: "రాత్రి అక్కడ ఉన్నారా యేమిటి?" అని. పైగా చాల కోపం తెచ్చుకుంటుంది కూడాను. నీకు అంతమాత్రం తెలియదేమే పిచ్చిదానా?"

ఆ మాటలకు సత్య చాల ఆశ్చర్యపోయింది. బావకు మనసులో నమస్కారం చెప్పుకుంది.

"అయితే టాంగాకోసం కబురుచేస్తాను."

"ఆఁ, చెయ్యి."

బావ అంటే సత్యకు జాలి, ప్రేమ పుట్టుకొచ్చాయి. దానితోపాటు అక్కయ్య అంటే కోపం, అసహ్యంకూడా కలిగాయి. "నన్నుకూడా రమ్మంటావా?" అని అడిగింది.

శ్రీకాంతుడు ఆమె ముఖంలోకి చూచాడు. "ఇప్పుడెందుకూ? సాయంత్రానికి రా."

"ఔను, ఎలాగా సాయంత్రం చదువుకునేందుకు వస్తాగా!" – అమాయకంగా అన్నది సత్య.

ఆమాట వినగానే శ్రీకాంతుడు ఆమె ముఖంలోకి చూచాడు. అక్కయ్య ఇల్లు తాళంపెట్టి పోయిన విషయాన్ని కప్పిపుచ్చేందుకేగా ఈపిల్ల గతరాత్రి తన్ను... అనేక వేషాలు వేసి... ఇక్కడే నిలిపివేసింది! ఈవిషయం శ్రీకాంతుడు గ్రహించకుండా ఉన్నాడా? అయినా అలా మాటాడుతుందేం ఈ పిల్ల ?

"చదువుకోటానికా ? ఔను, చదువుకోటానికి వస్తావుగా!" అన్నాడు తానున్నూ.

ఈరకమైన సంభాషణద్వారా ఒకరి హృదయం ఒకరికి బాగానే తెలిసిపోయింది. కాని వాస్తవిక విషయం మాత్రం ఎవరికీ తెలియనట్టుగానే ప్రవర్తించారు ఇద్దరూ కూడా.

శ్రీకాంతుడు ఇంటికి వచ్చాడు. సునీత చీపురుపుచ్చుకుని వరండా ఊడుస్తోంది. అతన్ని చూడగానే, చీపురు అవతల పెట్టకుండానే, "వచ్చారా? ఎప్పుడొచ్చారు?" అని అడిగింది.

"ఇదేం, ఇప్పుడే."

"చాలరోజులు మకాం వేశారు."

"ఔనౌను."

"ఇదేనా రావటం?"

"చూస్తూన్నావుగా! ఇప్పుడే వస్తున్నా."

"ఇంకానయం రాత్రి వచ్చినట్టయితే అవస్థ అయేది."

"ఏం?"

"ఇల్లు తాళంపెట్టి ఉండేది. నేను వెళ్ళిపోయాను."

"ఎక్కడికి వెళ్ళిపోయావు?"

సునీత ఆమాటకు జవాబు చెప్పలేదు. యథాపూర్వంగా వరండా ఊడుస్తోంది.

"ఎక్కడికి వెడతావేమిటి? బహుశా సినీమాకు వెళ్ళావు కాబోలు" అని తనకు తానుగా అనుకుంటూ తన గదిలోకి వెళ్ళాడు శ్రీకాంతుడు.

సునీత వరండా ఊడుస్తోంది.

మరికాసేపటికి మళ్ళీ శ్రీకాంతుడు వచ్చాడు. "హరిప్రసన్నుడేడీ?" అని అడిగాడు.

"ఏమో తెలియదు."

"వెళ్ళిపోయాడా?"

"ఆఁ, వెళ్ళిపోయాడు."

"ఎక్కడికి వెళ్ళాడు? ఎందుకు వెళ్ళాడు? నీ కేమన్నా తెలుసా? అయినా పోనీయవద్దని నీకు చెప్పిపోతినిగా!"

"అతను ఉండలేదు. నేను ఆపలేకపోయాను. ఎక్కడికి వెళ్ళాడో నాకు తెలియదు. ఎందుకు వెళ్ళిపోయాడో అదికూడా నాకు సరిగా తెలియదు. అతనైనా ఏమీ చెప్పలేదు."

"ఎప్పుడు వెళ్ళాడు?"

"నిన్న రాత్రి."

"నిన్న రాత్రా?"

"అంటే ఇవాళ తెల్లవారుఝామున అన్నమాట" అన్నది సునీత మెల్లిగా.

శ్రీకాంతుడు ఆ వరండాలోనే అటూ ఇటూ అడుగులు వేస్తున్నాడు... తనతో తాను పోట్లాడుకుంటున్నవాడు లాగ... తనపై తనకు కోపం వచ్చినవాడులాగ. పచార్లు చేస్తూనే ఉన్నాడు. సునీత ఊడుస్తూ ఊడుస్తూ చాల సమీపంగా వచ్చింది.

హఠాత్తుగా శ్రీకాంతుడు ఆగిపోయాడు; ఏమీ అనుమానించలేదు; గభాలున ముందుకు వచ్చి సునీతను రెండు చేతులా పట్టుకుని కావిలించుకోబోయాడు.

"అదేమిటి, అబ్బ! పోదురూ!" అంటూ సునీత పట్టువదిలించుకుని మళ్ళీ వరండా ఊడ్చుకుంటోంది.

ఆ నిమిషంలో ఆమె కొత్త పెళ్ళికూతురులా అయిపోయింది. "నేను ఎల్లప్పుడూ మీదాన్నే. కాని, ఛీ-ఛీ, నా

కోసం మీకింత హృదయావేగం దేనికి? అలా బిగువు కోల్పోతారేం? కాస్త నన్ను సంబాళించుకోనీయండి" అని పలుకుతున్నట్టుగా ఉంది ఆమె ముఖకవళిక.

పులకితమూ, లజ్జారుణమూ అయిన ఆమెముఖంలోని విమల శోభ చూచాడు శ్రీకాంతుడు. ఆక్షణాన... అతనిలో ఏమూలనైనా ఏద్దైనా సందేహం అనేది ఉండియున్న ట్టయితే... అది కాస్తా అంతర్హితమైపోయింది. ఆక్షణాన అతని హృదయానికి ఒక అద్భుతమైన స్వాస్థ్యం చేకూరింది.

"రాణీ! హరిప్రసన్నుడు శాశ్వతంగా వెళ్ళిపోయాడా? మళ్ళీ రాడా?" అని అడిగాడు.

"నాకు తెలియదు. నిజంగా నాకు తెలియదు."

శ్రీకాంతుడు మాటాడలేదు.

మరికాసేపటికి సునీత అన్నది: "బొమ్మమాత్రం ఇక్కడే విడిచివెళ్ళాడు, దాన్ని ఏం చేద్దాం?"

"ఏం చేద్దాం ఏమిటి? ఫ్రేము కట్టించి గోడకు తగిలిద్దాం. ఏ గదిలో పెడితే బాగుంటుందీ?"

"ఇన్నాళ్ళూ అతడుండిపోయిన గదిలోనే ఉంచటం బాగుంటుంది. అది మన పఠనమందిరంకూడాను."

ఆనాడే శ్రీకాంతుడు ఆ చిత్రానికి చక్కని ఫ్రేము కట్టించాడు. పఠనమందిరంలోకి రాగానే మొట్టమొదటగా అదే దృష్టికి తగిలేలాగ ఎదురుగా ఉన్న గోడకు ఎత్తుగా తగిలించాడు. ఆ చిత్రాన్ని తలపై ధరించి ఆ గది ఆనాటి నుంచీ తనకు నయనానందకరంగా ఉండగలదని శ్రీకాంతుని ఆశ.

ఒకనాడు సునీత చిత్రాన్ని చూస్తూ నిల్చుంది. చిత్రంలోని భావం చాలవరకు ఆమెకు అర్థం అయింది. ఇంకా నిగూఢంగా అందులో తెలుసుకోవలసిన అంశాలు ఉన్నట్టే తోస్తోంది. అవికూడా పూర్తిగా తెలుసుకోవాలని ఆమె అభిలాష. ఆసమయాన శ్రీకాంతుడు వెనుకనుంచి వచ్చి ఆమె భుజం మీద చేయివైచి "సునీ! నేను పందెం వేసి చెప్పగలను: ఈ చిత్రం విలువ చాల ఎక్కువే ఉంటుంది. ఒక వందే కాదు; కొన్ని వందలుంటుంది. మనం భగవంతునికీ హరిప్రసన్నడికీ కృతజ్ఞులం. చిత్రం విలువను పురస్కరించుకుని కాదు. చిత్రాన్ని పురస్కరించుకునే... ఒకానొకరకమైన లేడికి కడుపులో ఏదో కణుపులాంటిది ఉంటుంది. దాన్నే కస్తూరి అంటారు. ఆ కణుపు మూలాన ఆ మృగం ఒకచోట నిలకడగా ఉండదు; అశాంతితో పర్యటిస్తూ ఉంటుంది. ఆ కణుపు దానికి ఒక శాపం. మనకు మాత్రం అది కస్తూరి. అది దానికి నిత్యబాధ; మృత్యుహేతువుకూడాను. అయినా అది ఆ మృగానికి భగవంతుడిచ్చిన వరప్రసాదమే. దాన్నే అది ప్రపంచానికి ఇస్తోంది. అదే మనకు కస్తూరి ఔతోంది. ప్రపంచం ఆ కస్తూరి సౌరభానికి పరవశత్వంచెందుతుంది; ఆ కస్తూరికోసం ఆ మృగాన్ని చంపేస్తుంది...సునీతా! ఈచిత్రం హరిప్రసన్నుని హృదయబాధే! దీన్నే మనం 'కళ' అంటాం; దానికెంతో విలువ ఇస్తాం. హరిప్రసన్నుని నరనరాల్లో అనుక్షణమూ స్పందిస్తూ ...అతన్ని ఒకచోట నిలవనీక, పలుచోట్లకు త్రిప్పి గాసి పెట్టిన ఒక ప్రశ్న, ఒక ఆకాంక్ష, ఒక జిజ్ఞాస ఈ చిత్రంలో

అంకితమై ఉంది. అతనిలోని ఆ బాధను వెలికి తీసుకురావటానికి నువ్వు కారణభూతురాలివని నాకు తెలుసు. అందుకు నీకు నేను కృతజ్ఞుణ్ణి. ఈ సంగతి తెలుసుకున్నప్పుడు ప్రపంచమంతా నీకు కృతజ్ఞురాలై ఉండగలదు. ఈ కళాకృతిలో వ్యక్తమౌతున్న ఆ హృదయబాధను చూస్తోంటే... నిన్ను పెళ్ళాడిన నా భర్తృత్వం నిస్సారం కాదన్న భావన కలుగుతోంది నాకు.

సునీత తన భర్త వక్షంలో ముఖం దాచుకుంది.

"సునీతా! హరిప్రసన్నుని హృదయంలో ఇంకా ఆ కణుపు ఏమన్నా మిగిలి ఉందా ? మళ్ళీ అతన్ని పిలిపించే యేర్పాటు జరగాలా?"

"నేనతన్ని వెళ్ళిపోవద్దు, ఉండిపొమ్మనే చాల బ్రతిమాలాను. నిజం చెబుతున్నాను ; నా శాయశక్తులా ప్రయత్నించాను. ఎక్కడికి వెళ్ళిపోయాడో మరి! నా ఉద్దేశం—"

"కనుక్కుందాం ఎక్కడికి పోయాడో ! But our queen can do no wrong ( కాని మా రాణి తప్పు చెయ్యదు )."

సునీత ఆ మాట వినిపించుకున్నదో లేదో ! ఆమె ఇలా అన్నది : "కాని ఇక మీరు నన్ను విడిచిపెట్టి ఎక్కడికీ వెళ్ళకండి. భగవంతుడు మమ్మల్ని స్త్రీలనుగా సృష్టించటం నిరర్థకమా? 'నాథా! నన్ను విడిచిపెట్టి పోకండి' అని భర్తముందు నిల్చుని ప్రార్థించే అధికారం స్త్రీకి లేదా ? ఈ అధికారాన్ని పురస్కరించుకుని సర్వదా మీరు నావారే."

తనవక్షంలో తల జొనిపి, తాను ఆలంబనంగా నిల్చి ఉన్న సునీత వీపు దువ్వుతూ, నవ్వి శ్రీకాంతుడు ఇలా అన్నాడు : "ఆ బొమ్మలో నిరంతర జిజ్ఞాసాపూర్వకంగా హరిప్రసన్నుడు 'ఓసీ' అని పిలుస్తున్నది ఎవర్ని? స్థూపాన్ని కాదు; ఆ వెనుక ఒక స్త్రీ ఉంది! - ఆమెను! నేనుకూడా నిన్ను 'ఓ మాయామయీ! ఓసీ' అని పిలుస్తాను."

సునీత కపోలాలు లజ్జారుణములైనవి. ప్రణయకోపం తెచ్చుకుని "అబ్బ, చాల్లెద్దురూ మరీను" అన్నది.

* * *


C. P. BROWN MEMORIAL LIBRARY
Acc No 1322
Date
CUDDAPAH.

## మానవజీవితాన్ని ప్రతిబింబించే మహోత్కృష్టమైన
## మా యితర ప్రచురణలు

# ప్రేమ్‌చంద్ నిర్మల

( ఒక కరుణామయ జీవితగాథ )

ఇందులో వృద్ధవివాహాలవలని అనర్థాలను నిరూపిస్తూ, గృహజీవితంలో అకారణమైన అనుమానాలకు తావిచ్చేవారు సంసారాలను ఎలా నాశనంచేసుకొంటారో అతిరసవత్తంగా చిత్రించారు శ్రీ ప్రేమ్‌చంద్. బాలబాలికలు స్త్రీ పురుషులు వయోవృద్ధులు యావన్మంది చదివి గ్రహించవలసిన విషయాలెన్నో ఉన్నాయిందులో. చదవడం మొదలుపెడితే పుస్తకం పూర్తయేవరకు నిద్రాహారాలపైకి బుద్ధిపోదు. హిందీలో ఈ నవల లక్షలాది ప్రతులు నేటికీ ఖర్చవుతున్నవంటే దీని ప్రాముఖ్యతనుగురించి వేరే చెప్పనక్కరలేదు. నేడే మీ ప్రతి తీసుకొనండి.

ముచ్చటైన త్రివర్ణ ముఖ చిత్రంతో

వెల రు. **3-0-0** లు మాత్రమే. బైండు రు. **4-0-0** లు.

# ప్రేమ్‌చంద్ నారీజీవనము

ఇది ప్రేమ్‌చంద్ అమరలేఖినినుండి వెలువడిన మహోత్కృష్టమైన కథలసంపుటి. భారతదేశపు స్త్రీల సమస్యలను వివిధ దృక్పథాలతో పరిశీలిస్తూ ఒక్కొక్క దృక్పథంతో ఒక్కొక సర్వాంగసుందరమైన కథను రచించారు శ్రీ ప్రేమ్‌చంద్. ప్రతి ఒక కథ ఒక వజ్రపుతునక. ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలలో స్త్రీకి ఎటువంటి స్థానమున్నది?— ఎటువంటి స్థానముండాలి? సమాజంలో స్త్రీలకు జరిగే అన్యాయాలకు, అక్రమాలకు కారణమేమిటి? మొదలైన అనేక సమస్యలను సమీక్షిస్తూ వ్రాసిన ఉత్తమ కథల సంపుటి. ప్రతి తెలుగుబిడ్డ తప్పక చదివితీరవలసిన సద్గ్రంథం.

ప్రథమ భాగం రు. **1-0-0**, తృతీయ భాగం రు. **1-8-0**

ద్వితీయ భాగం రు. **1-0-0**, బైండు రు. **4-8-0**

## ప్రేమ్‌చంద్ సేవాసదనము

నూతన దాంపత్యజీవితంలో సంభవించే ఒడిదుడుకులు, వాటికిగల కారణాలు, తన్నివారణమార్గాలు సూచిస్తూ, వేశ్యాసమస్యమీద విపులమైన విమర్శను సాగించిన చక్కని నవల. పత్రికలచేత సమాలోచకులచేత వేనోళ్ళ ప్రశంసింపబడిన సర్వోత్తమ రచన.

వెల రు. **3-0-0**, బైండు రు. **4-0-0**

## ప్రేమ్‌చంద్ ప్రేమపీఠం

మతభేదాలు మానవజాతికి అనర్థదాయకమని ఋజువుచేస్తూ, నూతన దంపతులకు అమూల్యమైన గుణపాఠాల్ని నేర్పుతూ, సున్నితమైన హాస్యంతో పాఠకుల హృదయాలను కవ్వించే చక్కని నాటకం.

వెల రు. **1-0-0**

## విశ్వప్రసాద్ మిత్రద్వయం

మనోహరమైన అయిదు ఉత్తమనాటికల సంపుటి. ఇందులోని ప్రతి నాటిక విద్యార్థులూ - సమాజాలవారూకూడ ప్రదర్శించటానికీ, ఎవరైనా సరే చదువుకోటానికీకూడ అత్యంత ఉపయుక్తమైనవి - నీతిదాయకమైనవి. ప్రతినాటిక నిస్సందేహంగా పాఠకుని హృదయాన్ని చూరగొంటుంది. అతి సుందరమైన ఆర్టుపేపరు కవరుతో వెల రు. 1—4—0 మాత్రమే. ఈనాటికలను ఎవరైనా స్వేచ్ఛగా ప్రదర్శించుకోవచ్చు; కాని ప్రదర్శించిన విషయం మాత్రం మాకు, రచయితకు కూడ తెలియజేస్తుండ వలసినదిగా ప్రార్థన.

అతి త్వరలో!

శ్రీ ఇలాచంద్రజోషీగారి, మరొక మహోజ్జ్వలమైన నవల

## ప్రేతము - ఛాయ

1956 డిశంబరు నెలాఖరులోగా తప్పక ప్రచురింపబడుతుంది.

